శ్రీరస్తు.

శ్రీగురుదత్తాత్రేయాయనమః.

భక్తిసార

# నవనాథచరిత్రము

అను

మహాసిద్ధజనకథామృతంబు

నైజాం యిలాఖా సదాశివపేట-వాస్తవ్యుండగు

బచ్చు రామన్నగుప్తచే రచియింపఁబడి



చెన్నపురి:

వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారిచే

ప్రకటితము.

1924.

శ్రీరస్తు.

శ్రీగురుదత్తాత్రేయాయనమః.

భక్తిసార

# నవనాథచరిత్రము

అను

మహాసిద్ధజనకథామృతంబు

నైజాం యిలాఖా సదాశివపేట వాస్తవ్యుండగు

బచ్చురామన్నగుప్తచే రచియింపఁబడి.



చెన్నపురి:

వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్‌వారిచేఁ

ప్రకటితము.

1923.

# విషయసూచిక.

# విషయసూచిక.

# శుద్ధపత్రిక.

| పేజి. | పఙ్క్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 5 | 13 | బచ్చురామన్నగుప్త | బచ్చురామన్నగుప్త సదాశివపేట |
| 7 | 22 | సుఖదమగుయో | సుఖదమగుయియా |
| 9 | 3 | గోచరంబగు | గోచరంబులగు |
| 18 | 17 | బోవవీరులు | బావమవీరులు |
| 25 | 8 | కలువలిచూచి | కలువలిచూలి |
| 25 | 11 | మానినాథుడు | మీననాథుడు |
| 33 | 24 | మూర్ఛా | మూర్ఛా |
| 41 | 15 | ఆపోస్త్రము | అబస్త్రము |
| 67 | 29 | విపరీతక్షాణతంబెవ | విపరీతక్షోభంబెవ |
| 90 | 3 | ఙ | బు |
| 94 | 18 | దర్శననాపేక్ష | దర్శనాపేక్ష |
| 97 | 27 | భవదా‌యు | భవదాశ్రయ |
| 110 | 13 | పరితపించు | పరితపించుచు |
| 114 | 18 | దుష్టే | దుష్టై |
| 117 | 3 | సంచ్చాఛర్య | సచ్చాఛర్య |
| 118 | 1 | వగజగి | వగజిగి |
| ,, | 18 | కత్ర | కృత |
| 126 | 11 | పూరీత | పూరిత |
| 127 | 5 | సాయకేక్షణకుచధర | సాయకేక్షణాకుచకుధర |
| ,, | 27 | సుగుణజలఘుండగు | సుగుణజలధియగు |
| 145 | 4 | హరిగణంబేకతంబున | హరిణంబేకతంబున |
| 161 | 2 | నివసియించి | నివసించి |
| 162 | 15 | బంధులమని | బంధువులమని |
| 164 | 2 | కరికంభంబులపై | కరికుంభంబులపై |
| 167 | 26 | జేరెన్ను | జేరెను |
| ,, | 27 | శేరఅచి | శేర్పఅచి |
| 168 | 15 | మాక్తికమలై | మాక్తికమడై |
| 181 | 19 | నన్నిశంబు | నన్నునిశంబు |

# శు ద్ధ ప త్రి క.

| పేజీ. | పఙ్క్తి. | తప్పు. | ఒప్పు. |
| --- | --- | --- | --- |
| 191 | 7 | జన్మ్రి | జన్మ |
| 197 | 5 | మంత్రనుత్రార్థ | మంత్రమంత్రార్థ |
| 206 | 4 | బొర్చెను | బొనర్చెను |
| 210 | 1 | మంత్రాదిదేవత | మంత్రాధిదేవత |
| 212 | 29 | శరీంబు | శరీరంబు |
| 214 | 14 | శత్రుకులమర్థను | శత్రుకులమర్దను |
| ,, | 15 | కృతాంతుల | కృతాంతుని |
| ,, | 25 | బాణాసనాధ్యాయు | బాణాసనాద్యాయు |
| 215 | 19 | పిశితాశుల | పిశితాశనుల |
| ,, | 25 | నివహంబు | నివహంబులు |
| 229 | 15 | దత్తద్దర్శనో | దత్తదర్శనో |
| 237 | 25 | ఋతిక్సమూ | ఋత్విక్సమూ |
| 242 | 24 | ననుభుజియింప | నన్నుభుజియింప |
| 245 | 4 | ధాన్యభిక్షుం | ధాన్యభిక్షుం |
| ,, | 22 | నిగమనుతపదమల | నిగమనుతపదకమల |
| 246 | 24 | గరినారపర్వతము | గిరినారపర్వతము |
| 250 | 8 | సహిగర్భోద్భవుని | నహిగర్భోద్భవుని |
| 251 | 1 | మండసిక | మండపిక |
| 252 | 26 | గురిపించిరి | గురిపించెను |
| 253 | 21 | ప్రసన్నులై | ప్రసన్నంబై |
| ,, | 22 | యొసంగిరి | యొసంగెను |
| 254 | 2 | నుపేక్షిం | నపేక్షిం |
| 263 | 12 | యిలంబడుదురే | యిలంబడునే |
| ,, | 19 | భవద్వజాస్త్ర | భవద్వజ్రాస్త్ర |
| 265 | 17 | రుధిరవక్త్రులై | రుధిరనిర్గతవక్త్రులై |
| 267 | 11 | కెటింగించి | కెఱంగించి |
| 271 | 4 | రంధంబున | రంధ్రంబున |
| 274 | 30 | కాథాభాగంబు | కథాభాగంబు |
| 275 | 12 | లభియింతు | లభియించు |

# ఉపోద్ఘాతము.



సుధీమణులారా! నిఖిలచరాచరప్రపంచం బెవ్వనిచే నెవ్విధమున సృజియింపంబడియెనో తత్ప్రపంచాంతర్గత నరమృగపశు పక్షికీటకాద్యనేక ప్రాణిసముదయంబు లేకతంబున సుఖదుఃఖాస్పదంబులయ్యెనో యందు మనుజులకు బధిరత్వ అంధత్వ మూకత్వ పంగుత్వాది నానావిధ వికలాంగధర్మంబులును రక్తశ్వేత కృష్ణాదిరూపభేదంబులు నుచ్చనీచాదిదశాభేదంబులు నేకతంబున గలిగెనో తత్తత్కారణంబులు మనోగోచరంబులుగాక కొందఱు ప్రకృతిజన్యంబులనియు, నొకకొందఱు పరమేశ్వరలీలావినోదంబు లనియు, మఱికొందఱు పురాకృతకర్మజనితఫలంబు లనియు, మఱియు భగవంతుండు సగుణుండు ప్రకృతిసహితుం డనియు, దృశ్యమానప్రపంచం బీశ్వరకల్పితంబనియు,జీవులందఱు భగవద్గుణవర్ణనచే సామీప్యసాలోక్య సారూప్య ముక్తిత్రయమును గ్రమముగా పొందుదు రనియు, మఱికొందఱు ప్రకృతికల్పితం బనియు, బ్రహ్మవస్తువు నిర్గుణము నిరహంకారము కాలత్రయాబాధ్యము సమస్తదేశసంగతము కంఠగతచామీకరంబుగ ప్రాప్య మనియు పెక్కుభంగుల నిరూపించుచు పరతత్వావిర్భూత నిగమంబులనే ప్రమాణంబులుగా గొని నిగమవేత్తలగు ననేకమహర్షు లనేకభిన్నాభిప్రాయంబులు నిగమవిరుద్ధములు గాకుండ వెల్లడిపఱచినారు. ఇటుల భిన్నాభిప్రాయంబులుండినను యన్నియు స్వేశ్వరవాదములేగాన స్థూలారుంధతిన్యాయంబున ప్రాప్యవస్తువ యొక్కటియే గాన వారు శిష్యబుద్ధ్యనుసారముగా నాయాయభిప్రాయానుసారినుతంబుల నిరూపణజేసిరి. ఈయభిప్రాయమే మహిమ్నస్తోత్రమందు-శ్లో. "త్రయీసాంఖ్యం యోగః పశుపతిమతం వైష్ణవమితి, ప్రభిన్నే ప్రస్థానే పరమిద మదః పథ్యమితిచ, రుచీనాం వైచిత్ర్యా దృజుకుటిలనానాపథజుషాం, నృణా మేకోగమ్య స్త్వమసి పయసా మర్ణవఇవ"అను పుష్ప

దంతుఁడు నిరూపించిన యభిప్రాయమును వ్యాఖ్యాతయగు మధుసూదన సరస్వతీస్వాములవారు వ్యాఖ్యానమందు సర్వప్రస్థానములను అద్వైతబ్రహ్మమందు సాక్షాత్పరంపరగా తాత్పర్యమును విస్తరించి నిరూపించినారు. ఇటులుండ నంతకంతకు విపరీతార్థంబు లధికంబై కొందఱు నిరీశ్వరవాదులు నొకకొందఱు దేహాత్మవాదులు మఱికొందఱు నంతఃకరణాత్మవాదులునై జగత్తు స్వభావజమనియు దేహమె ఆత్మయనియు బుద్ధియె దైవంబనియు పలుతెఱంగుల పలవించుచు శ్రుతిస్మృతులకు తత్తదనుకూలముగా నర్థములు గల్పించుచుండ నయ్యవి శాఖోపశాఖలై మిన్నంది నిఖిలప్రపంచవ్యాపకంబులై ధర్మవిరుద్ధములగుచుండ నప్పుడప్పు డప్పరాత్పరుండగు శ్రీమన్నారాయణుండు శ్లో. "పరిత్రాణాయ సాధూనాం వినాశాయచదుష్కృతాం, ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే" అను వచనానుసారంబుగ వ్యాసాద్యనేకయవతారంబుల నవతరించి వేదవిరుద్ధమతంబుల ఖండించియు తనవి సనక లీలామానుషవిగ్రహంబున శ్రీకృష్ణరూపంబున ద్వాపరాంతంబున నవతరించి దుష్టులను శిక్షించి శిష్టులను రక్షించుచు నర్జునోపదేశవ్యాజంబున నద్వైతంబును సర్వజనులకు బాహాటంబుగా తెలియజేసి తదుపరి-శ్లో. "జితోధర్మో హ్యధర్మేణ సత్యంచైవానృతేనచ, జితాశ్చోరై స్తు రాజానః స్త్రీభి శ్చ పురుషాః కలౌ, సీదంతి చాగ్నిహోత్రాణి గురుపూజా ప్రణశ్యతి, కుమార్య శ్చ ప్రసూయంతే తస్మిన్ కలియుగే సతి" అనునట్లు అధర్మానృత చోరవ్యాప్తి గురుపూజాగ్నిహోత్రనాశరూపములు మొదలగు భావికాలకలియుగపాపకృత్యంబులచే జాతిమతభేదంబు లెఱుంగక నిషిద్ధపదార్థంబుల పరిగ్రహించుచు నొకరినొకరు నిందించుకొనుచు యుక్తాయుక్తవివేకశూన్యులై పరమేశ్వరతత్వజ్ఞానం బెఱుంగక ననేక నరకంబులపాలగుదురని యెదనెంచి పతితపావనుండను తనబిరుదును సార్థకపఱచదలంచి వ్యాసవాల్మీకిశుకముఖ్యమహర్షులతో నాలోచించి మీర లయ్యుగంబున పుణ్యప్రదేశంబులనవతరించి యనేకవేదార్థరహస్యంబుల వెల్లడిపఱచి మాయామయ సంసారబద్ధబుద్ధులగు దుర్జనుల నుద్ధరింపుఁడని యనుజ్ఞనొసఁగి యాపిదప నిజాంశజాతులగు నవనారాయణుల నుద్దేశించి వ్యాసాదిమహర్షులజన్మంబుల తెఱం గెఱుంగించి మీరున్న ఆయా పుణ్యప్రదేశంబుల జన్మం

బులు గైకొని భక్తిజ్ఞానవైరాగ్యపరిపూర్ణులై నానాదేశంబుల సంచరించుచు-శ్లో. "కృతే త్వస్థిగతాః ప్రాణాః త్రేతాయాం మాంస మాశ్రితాః, ద్వాపరేరుధిరంచైవ కలౌత్వన్నంసమాశ్రితాః" అనునట్లు కలియుగమానవులు జపతపాదిసాధనంబుల ముక్తింగాంచుట దుర్లభంబుగాన సులభాత్త్వానాత్మవిచారంబుచే మోక్షంబు గాంచుటకై యుష్మద్జ్ఞాన సూర్యోదయంబున మూఢజనాజ్ఞానతిమిరంబు బాగదోలి తత్తచ్ఛిష్య బుద్ధ్యనుసారంబుగ భక్తిజ్ఞానవైరాగ్యంబుల నెలకొల్పుడని యాజ్ఞనొసగ నమ్మహామహులత్యంతకుతుకంబున నల్లెయని కలిగతాబ్దంబులు రెండువేల యేడునూర్లు మొదలుకొని మూడువేలసంవత్సరంబులవరకుజన్మంబులు గైకొని నిఖిలలోకగీయమాన ఘనయోగపరిపూర్ణమహాసిద్ధులై సంచరించుచు జన్మస్థలంబులు వేరైనను గురుతపస్థానంబు లొకటిగా నొనర్చుకొని నిజనారాయణాంశజత్వముజనులకువ్యక్తపఱచుచుశిష్యజనవిశ్వాసముకొఱకైయణిమాద్యష్టైశ్వర్యంబులను వాతాకర్షణాద్యనేక మహాదస్త్రవిద్యలును మృతసంజీవిని మొదలగు మహామంత్రంబులును ప్రత్యక్షానుభవంబుగ సమయానుకూలంబుల బ్రకటించి తపోబలగుణాతిశయంబులు వెల్లడి యొనర్చుచును పూర్వకాలవైదిక మహామంత్రంబులు శాపహతంబులనియు తచ్ఛాపమోచనాదివిధు లీకలియుగజనులచే నాచరింపఁబడుట దుస్తరంబని యూహించి సర్వతంత్రస్వతంత్రులుగాన దయామయహృదయులై దమతమతపోయోగంబున నిఖిల మంత్రాధిదేవతల ప్రత్యక్షంబు బడసి స్వకల్పితమంత్రకోటి పఠనమాత్రంబున ఫలప్రదము లగునట్లు వరంబులు గ్రహించి యప్రతిహతశాబరీమంత్రరాజంబులు కలియుగజనానుకూలంబుగ గల్పించి సంసారార్ణవనిమగ్నుల నుద్ధరించుచు నిటుల సంప్రజ్ఞాతాసంప్రజ్ఞాత సమాధిద్వయవిశిష్టయోగాభ్యాస మహిమచే యోగీశ్వరేశ్వరులై విలసిల్లు వీరిజననాదిచరిత్రము పురుషార్థచతుష్టయప్రద మనుటకు సందియము లేదు. ఏమహామహుల పరిపూర్ణవైరాగ్యతపోబలాతిశయంబులు హరిహరబ్రహ్మేంద్రాగ్నియమవరుణకుబేరాది బృందారకబృందంబులు బొగడుచుండునో, ఏయోగి సార్వభౌముల కృపాకటాక్షవీక్షణంబులచే తత్క్షణంబున మర్త్యులమర్త్యులై విలసిల్లెదరో అయ్యమలాత్ముల జననాదిపవిత్రచరి

త్ర పారాయణంబుచే శత్రుకృతవశ్యాకర్షణప్రముఖషట్ప్రయోగంబులును భూతప్రేతపిశాచశాకినీడాకినీబ్రహ్మగ్రహాది నానావిధగ్రహాణోపద్రవంబులును సర్పవృశ్చిక చోరాగ్నిభయంబులును బ్రహ్మహత్యాది మహాపాతకంబులును వాతహతజీమూతంబుపగిది దొలంగి పుత్రపౌత్ర ధనధాన్యసంపత్సమృద్ధు లయ్యెదరనుట కొకవింత యగునే. పెక్కులేల? భవిష్యత్పురాణద్వితీయతృతీయఖండంబులలో జయదేవ నామదేవ కబీరదాసాది భక్తాగ్రేసరుల జన్మచరిత్రంబులును, శంకరాచార్య మధ్వాచార్య రామానుజాచార్య దుండిరాజ కాళిదాసప్రముఖ జ్ఞానఘనుల చరిత్రంబులును, మత్స్యేంద్రనాథ గోరక్షనాథ భర్తరీనాథాదిమహాసిద్ధుల జన్మచరిత్రంబులును, పిదప శంకరాచార్యగోరక్షనాథులకు వాగ్వివాదము జరిగి తుదకు మతైక్యము గలిగినటులున్ను వ్యాసమహర్షిచే నభివర్ణింపఁబడియె. అట్లు శంకరాచార్యులచే గొనియాడఁబడు గోరక్షసిద్ధుండీగ్రంథరాజంబు తొల్లి కీమ్యాగరభాషచే రచియించె ననంతరంబ దుండిరాజకుమారుండగు మాలూపండితుఁడు మహారాష్ట్రంబున నోవీబద్ధముగ విరచించి తద్భాషాభిజ్ఞుల యుల్లంబులు పల్లవింపంజేసెం గాని యింతవఱకీనవరసపూరితంబగు చరిత్ర శ్రేష్ఠంబు మనయాంధ్రదేశంబున మాతృభాషను లేమింజేసి యాంధ్రభాషాభిజ్ఞులీ యనుపమాన మహాసిద్ధుల యద్భుతకథామృతంబు గ్రోలకుండుట కడుంగొఱత యని దలంచి యీదృఙ్మహానుభావచరిత్ర రచనచే మజ్జన్మంబు పవిత్రంబగునని యోచించి యియ్యది యసాధ్యకార్యమైనను-శ్లో. "గురూణాం చరణద్వంద్వ స్మృతి శ్లేఖకరూపిణం, మాం కృత్వావ్యచీనోద్గ్రంథం నాహ నుత్ర ప్రభుస్మృతః" అనునట్లు శ్రీసీతారామచంద్రస్వరూపులగు నవనాథుల చరణసరసీరుహంబు లెద నమ్మి నిఖిలజనసాధారణంబుగ వచనశైలిని రచియింపనయ్యె తప్ప నాయందెట్టిసమర్థత్వంబును లేదు. ఈచత్వారింశత్యధ్యాయంబులు సక్రమంబుగ పారాయణం బొనర్చినను, భక్తిసహితులై శ్రవణం బొనర్చినను, లేక పఠనాశక్తులు దృఢమనస్కులై ఏతద్గ్రంథం బనుదినంబు మత్స్యేంద్రనాథ గోరక్షనాథ గహినీనాథ జాలంధరనాథ కానీపనాథ

భర్తరీనాథ వటసిద్ధనాగనాథ రేవణసిద్ధనాథ చర్పటనాథాభిధానం బులు ధ్యానింపుచు బూజించినను చత్వారింశత్యధ్యాయంబున నిగ్రహానుగ్రహసమర్థుండగు గోరక్షమహాసిద్ధునిచే లిఖియింపంబడిన తత్తత్ఫలప్రాప్తు లగుట నిస్సంశయంబు గాన ఆర్యవర్యు లీగ్రంథస్థకథా విశేషంబులు పఠియించి సంతసించెదరని ప్రార్థించెదను. మఱియు నీగ్రంథము భక్తియేప్రధానంబుగా గొని రచియించి పండితోత్తములచేఁ బరిష్కరింపఁబడియె. పదలాలిత్యము శబ్దసౌష్ఠవంబు అర్థగాంభీర్యంబులు కొఱవడైయున్నను గుణగ్రహణపారీణులు క్షీరనీరంబులకరణి భక్తి రసపూరితంబులగు కథాభిప్రాయంబులు గ్రహించెదరని కొనియాడెదను. హస్తదోషాదితప్పులుండిన నాయం దనుగ్రహించి తెలియపఱచెదరేని ద్వితీయముద్రణంబున సవరించగలను. ఇంతియ నాప్రార్థన.

ఇట్లు బుధజనకృపాభిలాషి,
బచ్చు రామన్నగుప్త.

శ్రీ గురువిఠ్ఠలాయ నమః.

---

శా. శ్రీశుండై మరి శ్రీగళాహ్వయుఁడునై శ్రీవాణిజీవేశుఁడై
కౌశల్యంబున సర్వభూతములఁ దాఁ గల్పించి రక్షించులో
కేశుండై ఘనలీలదోఁప మనుజాధీశత్వముం బూని మా
నీశానీకము నేలినట్టి క్షితిజానిం గొల్తు శ్రీరామునిన్.

చ. జలనిధి గోష్పదంబనుచు చయ్యన దాఁటి మహోన్నతాఖిలా
చలములు కందుకంబు లనఁ జాలెడి లీల నటింపఁ జేయుచుం
ఖలులగు సోకుమూకల నఖండపరాక్రమధుర్యుఁడై వడిం
వలఁగొని మన్నిగొన్న వరవాయుసుతుం భజియించి మ్రొక్కెదన్.

క. ముజ్జగముల బొగడొందిసు,హృజ్జన తాపత్రయాపహృతి జేయతగం
వెజ్జుండై విహరించిన, సజ్జనగడ రామదాసుస్వామిని దలఁతున్.

గురుపరంపరాభివర్ణన.

సీ. హంసరూపంబున నాదినారాయణుం
డజునకుఁ బరతత్వ మమర దెల్పె
బ్రహ్మ దెల్ప వసిష్ఠు పరమమౌనీంద్రుఁడై
దశరథాత్మజునకు విశదపఱచె
రాముని చే కపిధాముండు పూర్ణుఁడై
రామదాసుకు దెల్పె ప్రేమమీఱ
రామదాసుఁడు మేటిరాజయోగీశుఁడై
దేవదాసునకు దా దేటపఱచె

తే. దేవదాసుండు రఘునాథధీయుతునకు
నాత్మవిజ్ఞాన మెఱిఁగించె సతఁ డసంత

రాయునకు నయ్యనంతుఁడు రామచంద్రు
నకు నతండు వరుస కృష్ణునకును దెల్పె.

క. వరకృష్ణాహ్వయుకృపచే, పరతత్త్వవివేక మెఱిఁగి పరిపూర్ణయశః
కరుఁడై నాగాఖ్యుఁడు మ,ద్గురువిఠ్ఠలరాయఘనునకును బోధించెన్.

క. శ్రీగురువిఠ్ఠలరాయుని, యాగమనుతపదసరోజు నత్యంతదయా
సాగరుని మదీయహృదయ, భాగంబున నిల్పిగొల్తు భవ్యచరిత్రున్.

గ్రంథాధినాయకవర్ణన.

మ. త్రిగుణంబుల్ కమలాసనాచ్యుతకపర్దిస్వాకృతుల్బూనిము
జ్జగముల్ సృష్టినొనర్ప నేల లయముఁ జల్పంగ బల్ డస్సిమేఁ
నగమై సాగరశాయియై స్వనితమై సౌఖ్యంబు జింతించి ము
మ్మొగముల్ దాల్చి మెలంగునట్టి నిఖిలాత్ముఁ గొల్తు దత్తాహ్వయున్.

క. సురనరగరుడోరగకి, న్నరవరనుత విమలచరణనలినయుగళుఁడై
గిరినారకుధరమున సు,స్థిరముగ నివసించు దత్తదేవుని దలఁతున్.

సీ. మత్స్యేంద్రగోరక్షమానినాథులగొల్చి జాలంధరాఖ్యుని లీలబొగడి
కానీపభర్తరీ జ్ఞానుల వినుతించి గహినినాథుని మహోఘనత దలఁచి
రేవణసిద్ధప్రభావంబు గొనియాడి నాగనాథునకును నతి యొనర్చి
చర్పటనాథునిచరితంబుశ్లాఘించిహరభంగచౌరంగయతుల కెఱఁగి

తే. మీననాథాది మునిసంఘమునకు మ్రొక్కి
ముక్తిదాయక మగునట్టి భక్తిసార
గ్రంథరాజంబు రచియింతు నాంధ్రభాష
గద్యఫణితి నఖిలజనవేద్యముగను.

క. నిరవధికసుఖదమగు మో,పరమాద్భుతనాథచరితబ్రాశస్త్యముఁ
నరకీమ్యాగరభాషఁ, స్థిరమతిగోరక్షనాథసిద్ధుఁడు వ్రాసెన్.

క. దుండీసుతుఁడగు మాలూ,పండితుఁడు జగత్ప్రసిద్ధప్రాకృతమున బ్ర
హ్మాండోద్ధారకసిద్ధుల, దండిచరిత్రంబు పిదప దనరగ వ్రాసెన్.

క. కావున నక్కథలాంధ్రమ
హావిజ్ఞులు దెలసి మిగుల హర్షింపఁగ మ
ద్భావంబున దలఁచి దెనుఁగు
గా విరచించెదను వచనకావ్యముసరణిన్.

క. గజవదను సదయునిర్మలు
ద్రిజగన్నుతపాదకమలు ద్రిపురారిసుతున్
భుజగవిభూషణుని స్మది
భజియించెద నిష్టసిద్ధి బడయుటకెపుడున్.

ఇట్లు వైశ్యకుల బచ్చువంశసంజాతుండగు యల్లయాహ్వయు
ప్రపౌత్రుండును శివలింగయాభిధానుని పౌత్రుండును
క్రిష్టయాఖ్యునిపుత్రుండును నగు రామన్ననాముడు
యిష్టదేవతావందనంబు లాచరించి
యీగ్రంథరాజంబు
ప్రారంభించెను.

---

శ్రీ విఠ్ఠలాయగురవేనమః.

భక్తిసార

# నవనాథచరిత్రము

## ప్రథమాధ్యాయము.

-:o:-

### శ్రీకృష్ణుండు కలియుగజనోద్ధారమునకై యోచించుట.

శ్రీ కాంతామణి హృత్కమల విహారుండగు పుండరీకాక్షుండు
ద్వాపరంబున శ్రీకృష్ణుండై యవాఙ్మానసగోచరంబగు లీలావినోదం
బులు సల్పుచు శిష్టజనసంరక్షణార్థంబై పెక్కుభంగుల నుక్కేలుల
యుక్కడంచి ముదాన్వితహృదయుండై మెలంగుచు తద్యుగాంతంబు
న భవిష్యత్కలికాలపామరజనోద్ధరణంబుకై "ధర్మసంస్థాపనార్థాయ
సంభవామియుగేయుగే" అను గీతావచనానుసారంబుగ యోచించి
యయ్యఖిలాండకోటిబ్రహ్మాండనాయకుండు కలియుగంబున జ్ఞానదేవా
వతారమెత్తం దలంచి నిజాంశజాతులగు నవనారాయణు లచ్చటచ్చట
నవతరించెదరేని విశేషంబగునని మది వితర్కించి యొకానొకసమ
యంబున నుద్ధవాదిభక్తాగ్రేసరసమూహపరివృతుండై నవనారాయ
ణుల స్మరియించినంత కవినారాయణ హరినారాయణ అంతరిక్షనా
గాయణ ప్రబుద్ధనారాయణ పిప్పలాయననారాయణ అవిర్హోత్రనా
రాయణ ద్రుమిలనారాయణ చమసనారాయణ కరభంజననారా
యణు లరుదెంచిన నమ్మధుసూదనుం డెదుర్కొని హిరణ్మయసింహాస
నాసీనులం గావించి గొనియాడుచుండ నయ్యమలాత్ములు పరమానందభ
రితస్వాంతులై మమ్మేల దలంచితిరని విచారింప నగ్గోవిందుండు 'త్రిజగ
ద్వంద్యులారా! రాగలిగినకలికాలంబున మూఢజనదురితక్షయార్థంబై
యేనవతరించం దలంచితిని. తద్వత్తత్తత్ప్రదేశంబుల జగదుద్ధరణార్థం
బై తామవతరించి దుర్భరమోహాగ్రస్తజనాళిని యుష్మత్కీర్తనీయవై
రాగ్యమార్గంబుచే గడతేర్తురని దలంచెద' నన నమ్మహామహులు హ
ర్షించి 'హే కృష్ణా! మేమేస్థలంబున నేనానులక్షణంబులచే జగద్విఖ్యాతి

 

-ఃఃశ్రీకృష్ణుండును నారాయణులకుజన్మంబులు గైకొను తెఱంగెఱింగించుట.ఃః-

నొందవలయునో దెలుపవే' యన నమ్మురాంతకుండు 'కవినారాయ ణుండు మత్స్యేంద్రనాథనామంబున దేజరిల్లవలయును. తదుపరి హరి నారాయణుండు గోరక్షనాథనామంబున మత్స్యేంద్రనాథప్రియశిష్యుం డై విలసిల్లు నాపై యంతరిక్షనారాయణుండు జాలంధరనాథనామం బున బ్రకాశించుచుండ ప్రబుద్ధనారాయణుం డాతనిశిష్యుండై కానీ పనాథనామంబున విరాజమానుండగు ననంతరంబ పిప్పలాయననారా యణుండు చర్పటనాథనామంబున యవిర్హోత్రనారాయణుండు, నాగే శనాథనామంబున ద్రుమిలనారాయణుండు, భర్తరీనాథనామంబున చ మసనారాయణుండు, రేవణనాథనామంబునను మఱియు కరభంజననా రాయణుండు గహినీనాథనామంబున జగత్ప్రసిద్ధి నొందవలయును. పిదప ననేకులు మదాజ్ఞానుసారులై యవతరించెదరు. కవిశిరోమణి యగు వాల్మీకుండు తులసీదాసనామంబునను యోగాధిష్ఠానపరుం డగు శుకమహర్షి కబీరదాసనామధేయంబున సాత్యవతేయుండు జయ దేవాహ్వయంబున బుద్ధిదక్షుండగు యుద్ధవుండు నామదేవాభిధానం బున భక్తాగ్రేసరుండగుజాంబవంతుండు నరహరినామంబున బొగడొం దెదరు. మద్భ్రాతృండగు బలదేవుండు పుండరీకుండై కీర్తింజెందు నే జ్ఞానదేవుండనై విలసిల్లెదను.గిరిజాధవుండు నివృత్తినాథుండగును.చతు రాననుండు సోపానదేవుండగు. జగన్మోహనాకారియగు యోగమాయ ముక్తాబాయిగను జ్ఞానపూర్ణుండగు హనుమంతుండు రాజయోగీశ్వ రుండగు రామదాసాహ్వయంబున మఱియు కుబ్జాదాసి జనాబాయి పేరం బెంపొందు నివ్విధంబున జన్మంబులు గైకొని భవపాశనిబద్ధమాను రులను భక్తిశ్రద్ధావమాబోధప్రబోధలచే విముక్తులంజేయవలయు' నన నిగ్రహానుగ్రహసమర్థులగునవనారాయణు లవ్వాసుదేవునితో తత్ప్ర కారంబు విశదీకరింపుమని విచారించిన శ్రీకృష్ణుండు పూర్వంబున పరా శరాత్మజుండగువ్యాసుండు భవిష్యత్పురాణంబున భావికాలమహాపురు షులచరిత్రంబులు బ్రకటించినవిధం బెఱింగించెద వినుమని యిట్లనియె.

౧. ఒకనాఁ డూర్వశీ దృక్తీక్షణత్వంబున నుపరిచరవసుపుంగ వుండుపంచశరుశిలీముఖభిన్నహృదయుండై చలించిన నయ్యమలాత్ముని వీర్యంబు గళితంబై తెల్లునంబడి ముత్తునియలై భాగద్వయంబు

యమునానదీతటస్థ ద్రోణంబునం బడి యందు ద్రోణుండు జన్మించెను. తదితరభాగంబు తన్నదీప్రవాహతోయంబులం బడ నొకమత్స్యంబు గ్రసించెఁ గావున నమ్మత్స్యోదర వీర్యంబునఁ గవినారాయణుండు జన్మించి మత్స్యేంద్రనాథనామంబున జగత్ప్రతీతుండై దేజరిల్లవలయును.

౨. అనంతరంబ సర్వేశ్వరుండగు రుద్రుం డుగ్రుండై తృతీయనేత్రాగ్నిచే భావజుని భస్మంబుజేయ నయ్యనంగవీర్యంబు ద్విమూర్ధుండు నిజకుక్షిని ధరించియుండ భారతీయుండగు బృహద్రథుండు మహీతల క్షేమంబుకై జన్నంబు జేయండలంచి యప్పావకు నావాహనం బొనర్చిన నాద్విమూర్ధుండు యజ్ఞసంపూర్తి సల్పి స్వగర్భస్థకామవీర్యంబు తత్కుండంబునం బడవైచును గావున నందంతరిక్ష నారాయణుండు జన్మించి జాలంధరనాథుండై ప్రకాశింపవలయును.

౩. తొల్లి పరమేష్ఠివీర్యంబుచే నెనుబదివేలఋషులు జన్మింప తద్వీర్యశేషంబు రేవానదీతీరసైకతంబునంబడి సజీవంబై యున్నది గాన నందు చమసనారాయణుండు జన్మించి రేవణసిద్ధనామంబున జగద్విఖ్యాతి నొందవలయును.

౪. పై నుదహరించిన పరమేష్ఠివీర్యశేషభాగం బొకటి యహికులాగ్రగణ్యుండగు తక్షకునిదుహిత భక్షించియుండ జనమేజయకృత సర్పయాగంబున యాస్తికనామఋషివర్యుం డయ్యహిగర్భస్థవీర్య మాహాత్మ్యంబు గ్రహించి స్వాహాకారంబు మానుకొన నప్పన్నగాంగనామణి యొకవటవృక్షకోటరంబున నివసించి యందొక యండం బుంచి నిజేచ్ఛంజను నందవిర్హోత్రనారాయణుండు జన్మించి వటసిద్ధ నాగనాథనామంబున విరాజిల్లవలయును.

౫. తదుపరి తపోఘనుండగు మత్స్యేంద్రనాథుండు నానాదేశ పర్యటనంబు జేయుచు నొకయన్నువకు సంతానంబుకై జగముకన్నునుద్దేశించి భస్మప్రసాదం బొసంగిన నయ్యువిద ప్రమాదంబున తద్భస్మంబు కసువున వైచు నందు మత్స్యేంద్రనాథతపఃప్రభావావిర్భూత మిత్రవీర్యంబుననే హరినారాయణుండు జన్మించి గోరక్షనాథుండై కీర్తిం జెందవలయును.

౬. మఱియు పూర్వంబునఁ బర్వతరాట్దుహితృకల్యాణనిమిత్తం బై బ్రహ్మేంద్రాదిబృందారకులు దక్షసదనంబునకు విచ్చేసి యానవమోహనాంగి రూపలావణ్యసౌందర్యం బాలోకించుచుండ పితామహుండు కామాతిశయానల దహ్యమానమానసుండై చలించిన నింద్రియంబు గళితంబై భూస్థలిం బడ నచ్చతురాననుం డత్యంతలజ్జాయమానవదనుండై బుడమిం బడినవీర్యంబు నిజపాదాంగుష్ఠంబున నలిపిన తద్వీర్యం బరువదివేలరేణువలై ప్రకాశించుచుండ నందు వాలఖిల్యాది మహర్షు లుదయించిరి. అంత నొకపనిక త్రియ లాజాహోమభస్మసహితంబుగ నచ్చటికనువున తద్వీర్యశేషభాగంబుగొని భాగీరథీజలంబులం బడవైవ నయ్యమోఘవీర్యంబు శరస్తంభాశ్రయంబై ప్రభాసిల్లుచున్నది గావున నందు పిప్పలాయననారాయణుండు జన్మంబు గైకొని చర్పటనాథనామంబునఁ బొగడొందవలయును.

౭. మున్ను పంచశరు శరభగ్నహృదయుండగు నభోమణివీర్యం బుగళితంబై యొకభాగం బొకకుంభంబునం బడి యగస్త్యుం డుద్భవించెను. తద్ద్వితీయభాగంబు కైలికమహాముని కుటీరనైకటిక భర్తరీనాను భిక్షాపాత్రంబునం బడి యప్రతిహతప్రకాశంబుచే వెలుంగుచుండ నమ్మునిముఖ్యుండు భిక్షార్థంబై సమీపజనపదంబుల కేగం దలంచి జగచ్చక్షువీర్యపూరితపాత్రను వీక్షించి యియ్యది మహామహుండగు దివాకరునివీర్యంబు నిందొకసిద్ధుం డుదయించగలండని తన తపోయోగంబున గ్రహించి భద్రపఱచెం గావున నందు ద్రుమిలనారాయణుండు భర్తరీనాథనామంబున నవతరింపవలయును.

౮. ఒకానొకసమయంబున వాగ్దేవి వయోరూపలావణ్యాతిశయంబులు విలోకించి తమ్మిచూలి కామపీడితహృదయుండై చలించినంత భవిష్యత్కాలహేతుర్భూతంబున వీర్యంబు చ్యుతంబై హిమవత్పర్వత ప్రాంతంబున శయనించుమహాదిగ్గజకర్ణంబునంబడి బిందురూపంబు జెంది కొంతభాగంబు బుడమింబడ నొకవ్యాఘ్రపాదఘట్టనంబుచే నవ్వీర్యంబున తపఃపూర్ణుండగు యత్రిమహర్షి జన్మించెను తద్దిగ్గజకర్ణస్థ బిందురూప వీర్యంబున ప్రబుద్ధనారాయణుం డవతరించి కానీపనాథనామంబున ఖ్యాతిం జెందవలయును.

౯. పిదప నొకానొకసమయంబున గోరక్షుండు వినోదార్థంబుగ మృత్తికచే నొకపుత్తళిం జేయుచు నందు నిజతపః ప్రభావంబున శ్రీమహావిష్ణువీర్య మావాహనంబు జేయునట్టియెడ కరభంజననారాయణుండు తత్పుత్రికం బ్రవేశించి గహినీనాథనామంబున విభ్రాజమానుండై విలసిల్లవలయును.

ఇప్పగిది రమాధవుండు మృదుమధురసంభాషణంబుల నవనారాయణులకు దేటపఱిచిన నమ్మహామహులు వల్లెయని పరస్పరాలింగనంబులు జరుపుకొని సెలవునొంది మందరాచలంబున కరిగి యోగనిష్ఠాగరిష్ఠుండగు శ్రీశుకుండు కబీరుదాసుగా జన్మించందలంచి తన స్థూలశరీరం బగ్గిరిగుహయందుంచినది గనుంగొని తదవ్వ్యత్తమతము స్థూలశరీరంబులు మేరుభూధరగుహయందుంచి నాథజన్మంబు లెత్తుచుండిరి.

అట్టిసమయంబున బదరికాశ్రమంబున సోమబ్రాహ్మణుండు రంభోద్దేశ్యంబుచే స్ఖలితవీర్యుం డయ్యె తద్వీర్యంబున కబీరదాసుండు జన్మించె నిట్టి కబీర జయదేవ తులసీదాసాది భక్తాగ్రేసరుల చరిత్రంబులు జగన్నాథపండితులచే భక్తవిజయగ్రంథరాజంబున వర్ణింపం బడియెం గావున నిందు విస్తరింప నవసరంబు లేదు.

మత్స్యేంద్రనాథజన్మచరిత్ర ప్రారంభము.

ఒకానొకసమయంబున నుపరిచరవసువును సుపర్వలోకాంగనామణియగు యూర్వశి వీక్షింప నక్కుటిలాక్షీకటాక్షతీక్ష్ణధనుర్ముక్త తీక్ష్ణతర దృక్శరక్షతంబున వసుపుంగవువీర్యంబు చ్యుతంబై జగచ్ఛ్రుతుండు హితృప్రవాహంబునం బడిన తద్వీర్యంబు యొకఝుషంబు గ్రసించియుండె నందు కవినారాయణుండు ప్రవేశించి యండరూపంబున నర్ధిల్లుచుండ నామత్స్యం బండం బుంచగలందు కొక స్థలనిర్దేశంబు జేయందలంచి యయ్యమునానదీప్రవాహంబున గ్రుమ్మరుచుండఁ దత్కైలాసంబున పర్వతరాట్పుత్రియగు శర్వాణి శర్వునితో "హే ప్రభో! మీ రెల్లప్పుడే మంత్రరాజంబు జపియించెదరో తన్మంత్రార్థరహస్యంబులు కృపామతిచే నా కనుగ్రహింపవలయు" నన సర్వేశ్వరుండు సంతుష్టహృదయుండై "యో దేవీ! నీవడిగిన పరమరహస్యం బేకాంత

స్థలంబున దెలుపందగు ర"మ్మని రయమ్మున వృషభవాహనారూఢులై యమునానది జేరం జని తత్తటంబున వృషభేశ్వరునుంచి యొకరహస్య స్థలంబున కరిగి పరమేశ్వరుండు పార్వతికి మంత్రమంత్రార్థరహస్యంబు లుపదేశించుచుండ సమీపప్రవాహంబున విహరించుచున్న మత్స్యగర్భస్థ కవినారాయణుం డాకర్ణించి నిత్యానిత్యవస్తువివేకజ్ఞానపూర్ణత్వంబున బ్రహ్మానందాబ్ధినిమగ్నుండై యుండునెడ మృడుండు మృడాని నుద్దేశించి "నీవు మంత్రార్థరహస్యోపదేశంబున జ్ఞానపరిపూర్తి జెందితివే" యని ప్రశ్నింప నద్దేవి ప్రత్యుత్తరాత్పూర్వం బఝ్మానోదరాంతరకవినారాయణుండు "చరాచరాంతర్భూతపరమేశ్వరతత్త్వం బొకటేయనిజ్ఞానోదయం బయ్యె" నన శర్వుండు "యెవ్వరీ ప్రత్యుత్తరం బొసంగి" రని యచ్చెరువొంది జలంబులంజూచి మత్స్యోదరంబున కవినారాయణుండు గలండనియూహించి "కవినారాయణా! నీకొకకారణంబున మద్బోధలు ఘటియించె నీవుద్భవించిన పిదప పరతత్త్వస్వరూపుండగు దత్తాత్రేయులచే ననేకమంత్రార్థరహస్యంబు లుపదేశింపఁబడియెదవు. శీఘ్రంబున బదరికాశ్రమంబునకు విచ్చేయు" మని యాజ్ఞాపించి శివుం డుమాసమేతుండై నిజనివాసంబున కరిగె నపు డామత్స్యంబు నవమాససంపూర్తియైనకతంబున నండం బత్తీరంబున నుంచి నిజేచ్ఛం జనియె. పిమ్మట నచ్చో నొకబకపక్షిసమూహంబు మీనంబులకై ప్రవేశించి యండంబు గని తమముఖ్యాహారంబని దలంచి ముక్కులం బొడువ నయ్యది రెండుశకలంబులయ్యె నం దుదయకాలోష్ణాంశుపగిది ప్రభాసిల్లెడు డింభకుం డావిర్భవించి రోదనంబు జేయుచుండ నచ్చటికి విధిప్రేరితంబుగ కామికనామధీవరుం డరుదెంచి బాలార్కబింబంబుభంగి దేజరిల్లెడు బాలు నత్యంతాశ్చర్యంబుచే జూచుచుండ నంతరిక్షంబునుండి కుసుమంబులు వ్రాల్చుచు నభోవాణి "యోకామికా! ఈసుకుమారుండు కవినారాయణుం డితఁడు జగదుద్ధారనిమిత్తంబై యవతరించెను. నీవు సంతానహీనుండవు కరుణారసం బుప్పతిల్ల నిబ్బాలుం గొనిపోయి మత్స్యోదరశుక్తిముక్తుండుగాన మత్స్యేంద్రుండని నామకరణంబు జేసి బోషింపు మీతనిచే నీజన్మంబు పావనంబేగాక నీవంశోద్ధారం బగు" నని పలుక దరిద్రునకు పరుసంబు దొరికినభంగి మిత్రోదయంబున కుశేశయానందంబుపగిది మృత్యుభీతునకు పీయూ

షంబు లభించినవిధంబున తులితానందమయుండై యబ్బాలుంగొని నిజసదనంబున కరిగి ప్రియురాలగు శారద్వతికి నప్పగించి మిన్ను మ్రోసిన వృత్తాంతంబంతయు తేటపఱచి యీశ్వరదత్తప్రసాదంబని జెప్ప నాయువతి సూర్యపుత్రుండు రాధాతనయుండై కీర్తిజెందిన విధంబు కాబోలు నని దలంచి తేజోమయుండగు బాలుం జూచి మితి లేనిసంతసంబున బుచ్చుకొని వక్షంబున కదుముకొన సోమోదయంబున సోమకాంతంబులు ద్రవించుకై వడి మత్స్యేంద్రదర్శనంబున వక్షోజంబున క్షీరంబు లూరెను. తత్క్షీరంబుల కుక్షినింపుచు ప్రతిదినం బుష్ణోదకంబుల స్నానంబు లాడించుచు నఖండానందంబున బెంచుచుండ దినదినప్రవర్ధమానుండై బాలుండుపంచాబ్దంబుల పరిపూర్తిజెందిప్రకాశించుచుండ నొకనాఁ డా కామికుండు బాలుండగుమత్స్యేంద్రుని వెంటగొని మీనంబులకై కృతాంతభగినీతీరంబునకుపోయి తటంబున బాలునునిచి తా జలంబులం దిగి మత్స్యంబులంబట్టి పైకినైచుచు కుమారుని బిలిచి యివియన్నియు సమగూర్చి బుట్టను బెట్టుమనుచుండ బాలుం డిది యెంతటిఘోరకృత్యంబు మాతృవంశఘాతకపాతకంబని దలంచి యామత్స్యంబులం బట్టి నదీజలంబులం బడవేయుచుండ కామికుండాగ్రహంబున "నౌరా మత్స్యేంద్రా నే నతిప్రయాసంబున మీనంబులం దీయుచుండ నీ విట్టికపటంబులు చేయుచుంటివి యికముందేరీతి జీవించెదవో భిక్షమెత్తెదవో" యని కరపుటంబున ముఖతాడనంబు జేయ బాలుండగు నాథుం డిది మహాప్రసాదవాక్యంబు. భిక్షాన్నంబు పవిత్రంబని మదిం దలంచుచు కామికుండు తిరిగి వాలుగంబులకై వారిం దిగి వెదకుచున్నతఱి యచ్చోటు బాసి భ్రమియించుచు వైతవనంబు జేరి యచ్చట తపోయోగ్యంబగు స్థలంబుగానక యుత్తరదిశంజని బదరికాశ్రమంబు జేరి యొకస్థలనిర్దేశం బొనర్చుకొని లోహకంటకంబుల పాదంబులు నిలిపి యూర్ధ్వబాహూర్ధ్వముఖుండై ద్వితీయభూతంబునుభక్షింపుచు తనుమనోధనంబులీశ్వరార్పితంబు జేసి మహాకారణనిష్ఠితమానసుండై ద్వాదశవర్షంబులు ఘోరతరంబగు తపం బాచరింప స్థూలశరీరంబు తపోగ్ని వేడిమిచే మాంసరహితంబై యస్థియుతచర్మంబు శుష్కకాష్ఠంబుపగిది భాసమానం బగుచుండు సమయంబున ముమ్మొగంబులదేవర వనంబు సంచరించుచు శివాల

యంబుజేరి ముక్కంటిని దర్శించి హేత్రిపురదహనా! మన్మథహరణా! పరమదయాకరా! గౌరీమనోహరా! యని పలువిధంబుల బ్రస్తుతింప నప్పరమేశ్వరుండు ప్రసన్నుండై సరస్వరాలింగనంబుల సంతుష్టపఱచి మునిరాట్సుతుని యోగక్షేమంబులు విచారింప నతండు ప్రత్యుత్తరం బిచ్చి హరునుద్దేశించి "హేశంభో! నేనిపు డీబదరికాశ్రమకాననావ లోకనార్థంబై జనుదెంచితి గావున నిందలిస్థానవిశేషంబులు జూపవే" యన హరుండు హర్షించి రస్మని దత్తాత్రేయుని వెంటగొని పాదచారి యై జనుచు నచ్చటచ్చట వనవినోదంబులు చిత్రతరలతావితానంబులు నానావిధపక్షిసమూహాకీర్ణవిశాల శాఖోపశాఖ పరిశోభిత వృక్షరాజి విశేషంబులు దెలుపుచుం జనచన నికటంబున మహోత్తుంగతరంగ యుత మణికర్ణికాప్రవాహతోయంబు లగుపడ తత్తీరమార్గంబున నేగి మత్స్యేంద్రనాథుని భాగ్యోదయకారణంబుచే నమ్మహదరణ్యంబున విహరింపుచుండిరి.

ఇతి భక్తిసారనవనాథచరిత్రంబున మత్స్యేంద్రనాథ జన్మకథా విశేషంబు ప్రథమాధ్యాయము సంపూర్ణము.

---

## ద్వితీయాధ్యాయము.

---

-ఊఊ మత్స్యేంద్రునకు దత్తాత్రేయులవా రనుగ్రహం బొసగుట ఊఊ-

ఇవ్విధంబున వలిమలల్లుం డనసూయాసుతుని దోడ్కొని భాగీ రథీతటద్రుమ శృంగారంబులు జూపుచుండ సమీపంబున లోహకం టకంబులపై శుష్కపటంబుపగిది నగుపడుచున్న మత్స్యేంద్రుని పలల రహిత శరీరంబు గాంచి యోహో ఇదియేమి యెవ్వరిక్కాననంబున విశ్వామిత్రునిభంగి తపం బాచరించెద రిక్కలికాలంబున నీపూర్వవ యస్సున ఘోరంబగు తపోగ్నిం గ్రాగుట మహాకష్టతరంబు వీరికా కామ్యం బేమైయుండునో యని సంభాషింపుచు దత్తాత్రేయునితో "హేఅత్రిపుత్రా! నేనిచ్చో నిలిచెదను నీ వాతపోధనుని పజ్జంజేరి వా రేకతంబున తపం బాచరించెదరో విచారింపు" మన దత్తుం డట్ల కాక యని నాథుని జేరంజని "హేతపోనిధే! ఇట్టిఘోరతరతపం బేల సల్పెదవు? నీయభిమతం బెయ్యదియో దెలుపు" మన నాథుం డాశ

ద్దంబు లాకర్ణించి యున్మీలితలోచనుండై భ్రూసంకేతంబున నమస్కా-
రంబులు సల్పి "పరమేశ్వరదర్శనంబునకై గ్రాగుచున్నా"నని దెలు
పుచు "నేటికి ద్వాదశాబ్దంబులయ్యె నిష్ఠహాదరణ్యంబున మానవుల
గానలేనైతి దయాఘనా భవన్నామధేయం బెఱింగింపు"మన నతండు
"నే ననసూయాపుత్త్రుండను నీయభీష్టంబు తేటతెల్లంబుగ పలుకులం
దెలుపు" మన నుత్స్యేంద్రుండు దత్తాత్రేయుని పదకంజంబుల వ్రాలి
తన యభిమతంబంతయు తేటపఱచుచు "హేకరుణానిధే! ప్రత్యక్ష
త్రిమూర్తిస్వరూపంబున సర్వవ్యాపకుండవై నన్నింతవర కుపేక్షించుట
ధర్మంబగునే యోదీనశరణ్యా" యని మొఱలిడుచుండ దత్తుండు కరు
ణాంతరంగహృదయుండై మత్స్యేంద్రు నిశిరంబున శయకుశేశయంబుంచి
మంత్రమంత్రార్థరహస్యంబు లుపదేశింప నాథుండు జ్ఞానసూర్యోదయం
బున నజ్ఞానతిమిరంబు బాసి దృశ్యమానప్రపంచం బీశ్వరతత్వంబు తన
యందు సర్వభూతంబులు కలవు. తా సర్వభూతంబుల గలనని ద్వైత
భావంబు వదలి యద్వితీయపరబ్రహ్మంబు తానై వెలుంగుచున్నతఱి
యత్రిసూనుండు నాథుం దోడ్కొని శూలికడ కరుదెంచిన హరుం
డీతఁడు కవినారాయణుండని గ్రహించి సదయహృదయుండై కనుఁ
గొనుచుండుసమయంబున హరి విరించి ప్రభృతి నిఖిలదేవతానీకం
బచ్చటికిం జేర పంచాననుండు త్రిమూర్తును ద్దేశించి యీతఁడు భవ
త్ప్రియశిష్యుం డని తలంచి వేదసారంబులగు సకలమంత్రంబులు
లోకోపకారనిమిత్తంబుగ జారణమారణ స్తంభన మోహనోచ్చాట
నాది రహస్యంబులు శస్త్రాస్త్రాదిప్రయోగోపసంహారవిధానంబులు నణి
మాద్యష్టవిధసిద్ధులం దెలిపి ప్రసిద్ధుఁ జేయుమనుచుండు నెడ బ్రహ్మవి
ష్ణువరుణేంద్రాదిత్యాది సకలదేవతలు తమతమ యస్త్రశస్త్రమహాశక్తి
మంత్రరహస్యంబు లవ్వసుపుత్త్రున కుపదేశించి చనిరి. యాపిదప దత్తుం
డు ఐంద్రాస్త్ర వాయవ్యాస్త్ర కాలదండ నాగాస్త్ర గారుడాస్త్ర
సమ్మోహనాస్త్రాది నానావిధమహదస్త్రంబుల తెఱం గెఱింగించి శైలీ
సింగీ యను పరికరంబుల నొసంగి కర్ణంబు జించి యద్యాది యిది యొక
నాథ పంథీనూతన సాంప్రదాయకంబై త్రిజగత్ప్రకాశితం బగునని
మత్స్యేంద్రునకు సెలవొసంగి భూతేశునిసహితుండై నిజేచ్ఛం జని
యెను.

మత్స్యేంద్రనాథుండు తపంబుచే నంబికాప్రత్యక్షంబు వడసి శాబరీమంత్రశాస్త్రరచనానుకూలక్రమంబెఱుంగుట.

మత్స్యేంద్రనాథుం డచ్చోటుబాసి నానాతీర్థంబులు సేవిం పుచు సప్తశృంగపర్వతంబు జేరి యందుగల జగన్మాతయగు యంబికా దర్శనంబుగొని యద్దేవి ననేకవిధంబుల స్తోత్రంబులు జేయుచు కవిత్వ రచనాకుతూహలుండై కవిత్వంబు లోకోపకారి యై యుండవలయును. లేకున్న నిరర్థకంబని దలపోసి శాబరి యను నొకవిద్యను కల్పింపంద లంచి యయ్యది యిద్దేవి ప్రసాదంబున సులభసిద్ధి యగునని దృఢీకృ తమనస్కుండై యచ్చట నొకసప్తకం బనుష్ఠానంబు జేయ నమ్మహి షాసురమర్దని ప్రత్యక్షంబై "సమర్థా! నీ వేకారణంబున నన్నారాధిం చితి" వని యడుగ సిద్ధుండు "యోజగజ్జననీ! నేను శాబరీవిద్య జేయం దలంచితి నయ్యది సిద్ధించుసదుపాయంబు సెలవొసంగు" మన నద్దేవి హర్షించి రమ్మని సిద్ధుని కేలూని మార్తాండపర్వతాగ్రంబుపై గొని పోయి యచ్చట నాగాశ్వత్థవృక్షంబును జూప యది సిద్ధునకు దృశ్యా దృశ్యంబై యున్న తచ్ఛాంతికై హవనంబొనర్చి కనుపఱచి "యిమ్మ హావృక్షంబు శాఖోపశాఖంబుల మిన్నంది యున్నది. యిది దేవవృ క్షంబ దీనివిశాలతరశాఖలపై బోవ వీరులును జోటింగ్ మహామద వీరభద్ర కాళికా భేతాళ చండికా మారుతీ అయోధ్యాధీశ ద్వాదశాదిత్యులు అష్టభైరవులు జలదేవతలు చండ చాముండాది మహాశక్తులు ఏకాదశరుద్రులు శాకినీ ఢాకినీ యక్షిణీ ప్రముఖ ద్వాద శమహాభూతంబులు అణిమాద్యష్టసిద్ధులు సర్వదేవతలు మూర్తివం తంబు లయ్యుండు గనుంగొను"మని చూపి "మత్స్యేంద్రా! నీకొక సదుపాయం బెఱింగింతు విను"మని యిట్లనియె.

"ఋషిముఖపర్వతనైకటిక బ్రహ్మగిరిసమీపంబున నంజనపర్వ తంబను నొకభూధరంబు గలదు. దానికి దక్షిణంబున నొకనదీప్రవా హంబు గల దట్టిస్థానంబున మహాకాళీదేవత నివసించి యుండు నద్దే వికి నమస్కరించి దక్షిణమార్గంబున జనుచుండ నచ్చట హస్తిపదస మానంబగు శ్వేతకుండంబుల శ్రేణిశతంబుగా తోయపూరితంబులై యుండు నందొక్కొక్కకుండంబున శుష్కవల్లిం బడవైచుచుఁ జని తిరిగి జూచుచురాగా నేకుండంబున శుష్కవల్లి సజీవంబై యుండునో

యందలిజలంబులు పానంబు జేయుము. నీ వపుడు మూర్ఛం జెందెదవు. తత్సమయంబున నాదిత్యద్వాదశనామంబులు జపియించిన తమోాంతకుండు ప్రసన్నుండై మూర్ఛం దొలంగించును. పిదప తత్తోయంబు లోకకుప్పికచే గైకొని యానాగాశ్వత్థవృక్షమూలంబున బోయుచు నచ్చట ననుష్ఠానంబు జేసిన వృక్షస్థసర్వదేవతలు ప్రత్యక్షంబై నీమనోభీష్టపరిపూర్తిం జేసెద"రని చెప్పి యద్దేవి నిజనివాసంబున కేగెను.

మత్స్యేంద్రనాథుం డంబికచే ననుజ్ఞాతుండై మార్తాండమహీధరంబున కేగి నాగాశ్వత్థవృక్షస్థనిఖిలదేవతా ప్రత్యక్షంబు వడసి వరంబులు గొనుట.

అమ్మత్స్యేంద్రనాథుం డంజనాచలంబు జేరి యమ్మహాకాళికి నమస్కరించి శుష్కవల్లిని తోయంబులవైచుచు కుండంబుల పరీక్షింపుచుండ నం దాదిత్యకుండంబున శుష్కవల్లి సజీవంబయ్యుండుట బొడగాంచి యందలిజలంబుల స్నానంబులాడి పానంబుజేయ మూర్ఛాగతుండై యాదిత్యనామద్వాదశకంబు జపియింపుచుండ ప్రభాకరుండు ప్రత్యక్షంబై హస్తస్పర్శంబున మూర్ఛం దేల్చి మస్తకంబున నభయహస్తంబుంచి నీకోర్కులు ఫలియించునని పలికి యంతర్ధానంబు నొందెను. మత్స్యేంద్రుం డొకకుప్పికచే తజ్జీవనంబుల గైకొని మార్తాండమహీధరంబు జేరి యశ్వత్థరాజంబునకుం బోయ నాదిత్యుండు పునఃప్రసన్నుండై వరంబు వేడుమన సిద్ధుండు "నే శాబరీమంత్రవిద్య జేయందలంచితి నే నేమంత్రంబున నిన్నధిదైవతగా దలంచెదనో యామంత్రార్థంబు సిద్ధించగోరెద" నన తమోభంజనుం డవశ్యంబని వరంబొసంగి యంతర్ధానంబు నొందెను.

మత్స్యేంద్రనాథుండు చంద్రగిరిగ్రామంబున సరస్వతీదేవికి సంతానంబునకై భస్మప్రసాదం బిడుట.

ఇత్తెఱంగున మాసనస్తకంబు క్రమక్రమంబుగా వృక్షస్థసర్వదేవతలప్రత్యక్షం బొనర్చుకొని వరంబులుగొని పరిపూర్ణకాముండై శాబరీమంత్రగ్రంథంబు నిర్మించి బంగాళదేశపర్యటనంబు జేయుచు హేలాసముద్రప్రాంతంబున నరసింహమూర్తి జన్మప్రదేశంబగు చంద్రగిరిగ్రామంబుజేరి భిక్షార్థంబై సర్వధర్మవిదుండగు సర్వోపపదయాళుం

డను గౌడబ్రాహ్మణుని గృహంబునకేగి యాతనిభార్య సరస్వతి యను చిన్నది రూపయౌవనలావణ్యాతిశయంబుల తిరస్కృతరంభయై శీల గుణసంపన్నత్వంబులచే బెంపొందియు నయ్యింతి సంతానంబు లేమిం జేసి నానా దేవతల గొలిచి యనేకాయాసంబులం బడినను ఫలంబుగా నక దీపంబులేని శూన్యగృహంబుపగిది వృక్షంబులు లేని కాననంబు భంగి నాశికంబులేని వదనంబురీతి తోయంబులేని తటాకంబుకైవడి బాలురు లేని భవనంబు భవనంబా వనంబని తలపోయుచు నిస్పృహం జెందియుండు సమయంబున నాథుండు అలఖ్ నిరంజన భిక్షాప్రశ్న జేయుచుండ నాయువతి దిగ్గన లేచి యోగపూర్ణుండగు మత్స్యేంద్రుని పాదంబులకెఱఁగి యుచితాసనం బొసంగి ముకుళితహస్తయై హృదయ తాపంబు వెల్లడి జేయందలంచి పునఃపునః పాదకమలంబుల వ్రాలి నేత్ర బాష్పంబుల నడుగులం దడుపుచుండ నాథుండు ప్రేమపూరితుండై నీకోరిక దెలుపుమన నప్పడఁతి కొడుకులు లేని కడుదుఃఖంబు స్పష్టపఱి చెను. సిద్ధుండు ప్రసన్నహృదయుండై చిటికెడు భస్మంబు తమోంతకు నుద్దేశించి యభిమంత్రించి యాసతీతిలకంబున కొసంగి "యోశుభా ననీ! యీభస్మంబు కేవలభస్మంబుగా దలంపకుము. ఇయ్యది జగచ్చ క్షుని స్వరూపంబని తలంచి నిశాసమయంబున శయనించుతఱి మహా ప్రసాదంబని బుచ్చుకొనిన దివాకరాంశంబున తేజోమయుండగుకుమా రుండు గలుగు నాపికప నే నబ్బాలునకనేకమంత్రార్థరహస్యంబు లుప దేశించెద నయ్యమలుండు సర్వసిద్ధులం బడసి ముల్లోకంబుల కీర్తనీయ గుణసమాజుండై నక్షత్రమండలంబున క్షపాకరునిభంగి స్వప్రతాపం బున ప్రకాశిల్లును. సంశయంబు మాని భస్మంబు సేవింపు"మని యాజ్ఞా పించి భిక్షను గొని జనుచుండ యానారీమణి "సమర్థా!యుష్మత్పునరా గమనం బెన్న"డని విచారింప నతండు "ద్వాదశాబ్దంబుల కే నేతెం చెద" నని ప్రత్యుత్తరం బొసంగుచు తీర్థయాత్రోన్ముఖుండై గమనం బొనర్చెను.

తదుపరి యామందయాన మితిలేనియానందంబున పెల్లుబ్బి పొరు గింటి కరిగి యచ్చటియన్నులతో తనహృద్గతంబు తేటపఱచందలంచి "యోసఖీమణులారా! నేను నుత్సదనంబున కొకకర్ణచ్ఛేది యతీంద్రుం డరుదెంచి నాయం దత్యంతకృపాకటాక్షంబు గలవాఁడై సంతానా

ర్థంబై చిటికెడుభస్మం బభిమంత్రించి యనుగ్రహించె" నని విన్నవింప నాశూన్యజ్ఞానసుందరీమణులు "అయ్యయ్యో! యిదియేమిచిత్రం బది యెట్టిభస్మంబు నీవేల భ్రమజెందితివి. కర్ణచ్ఛేదిబైరాగు లసాధ్యులు. వారికాపత్యంబు లీవెఱుంగుదువే మే మేమని నుడువుదుము? వారివ్వి ధంబున నవయౌవననాంగనామణులకు భస్మం బొసంగి నిజమంత్ర ప్రతాపంబుచే దివంబున శ్వానంబుల జేయుచు వెంటగొని గ్రుమ్మరుచు నిశాసమయంబున నిజరూపంబు గల్పించి భోగంబు లనుభవించెద" రని చెప్ప నగ్గజగామిని భయభ్రాంతచిత్తయై నిజసదనంబున కేతెంచుచు శాటీబద్ధభస్మంబు విడిచి నిజభవనసమీపగర్తంబున బడ వైవ నయ్యది సమర్థదత్తప్రసాదంబుగాన నందు హరినారాయణుండు దేజరిల్లుచుండె నయ్యువతి మందభాగ్యయై యెప్పటియట్ల సంసారకృత్యంబుల కాలంబు గడుపుచుండెను.

ఇతి భక్తిసార నవనాథచరిత్రంబున మత్స్యేంద్రనాథచరిత్ర ద్వితీయాధ్యాయము సంపూర్ణము.

---

## తృతీయాధ్యాయము.

{ మత్స్యేంద్రనాథుండు రామేశ్వరంబున కరిగి యాంజనేయులతో యుద్ధం బొనర్చి జయంబుగొనుట. }

అపుడా సరస్వతి యను బ్రాహ్మణవనిత చేసోకిన తలపుమిన్నంబాఱవైచినచందంబున పీయూషంబు ఘటింప విషంబని త్యజించిన భంగి గృహంబు జొచ్చిన వేల్పుగిడ్డిని వెడలగొట్టినక్రియ దైవహతబుద్ధిచే నుండుసమయంబున మత్స్యేంద్రనాథుండు తీర్థయాత్రాపరతంత్రుండై విహరించుచు పూర్వసముద్రప్రాంతంబున జగన్నాయకుల సేవించి పిదప రామేశ్వరంబు జేరి రామలింగస్వామిని దర్శించి సేతుబంధస్థలంబున స్నానంబు జేయుచుండ వర్షంబు గురియుచుండె నచ్చట ధీమంతుండగు హనుమంతుండు వయోవృద్ధుండై నకతంబున వర్ష బాధ

కోర్వలేమింజేసి కొన్ని పాషాణంబులచే నొకగృహనిర్మాణంబు జేయు చుండ నది జూచి నాథుండు "యేమి యీవింత సదనంబున కనలం బంటినపుడు కూపఖననం బొనర్తురే యీమహావర్షంబున నీవృద్ధాప్యం బున గృహప్రయత్నం బూనుట కెట్టిమూర్ఖమో కావుననే మర్కట గుణం బనియెద" రన విని వాయునందనుండు "మహాచతురోక్తు లాడెదవు నీవెవ్వండ"వని యడిగెను. నాథుండు "నన్ను మత్స్యేంద్రజతి యనియెద" రన ననిలసూనుం "డౌరా! నీకీ లోకంబున జతి యను నామం బేలగలిగె దెలుపు" మన మత్స్యేంద్రుండు "మద్గురుప్రతాప శక్తివల్ల గలిగె"నని ప్రత్యుత్తరం బొసంగ వాయుసుతుండు "జతియను నామం బాంజనేయునకు దప్ప నితరుల కెట్లుచెల్లు నీయం దట్టిసామ ర్థ్యంబులు గలిగెనేని నిలువుము. నేజేయుపరాక్రమంబున కోర్వు"మని పలుక సిద్ధుండు నిర్భయహృదయుండై "ఔనౌను పూర్వంబునరఘుపుం గవుం డరణ్యంబున శయనించుటగాంచి గంధవహసుతుండు స్వపరా క్రమంబు జూపందలంచి యొకకొన్నిపర్వతంబులు వృక్షంబులు బెటికి యాతనిపైవైచుచుండ జానకీధవుండు తా శయనించియుండియు చా పాగ్రంబున నెగురగొట్టినక్రియ మద్గురుకటాక్షంబున నీయట్టి యః కశ్చిన్మర్కటచేష్టలన నేల నీబ్రహ్మాండంబు కొనగోట మీటుదు" నన కేసరీపుత్రుండు రోషావేశుండై యట్టహాసంబుచేసి యొకకొన్నిపర్వ తంబుల బెకలించి వియన్మార్గంబున నాథునిపై బడ వేయుచుండ యోగ పూర్ణుండగు నాథుం డవిచూచి నిలునిలు మని యంతరిక్షంబున నిలి పెను. ఇవ్విధంబున శతానుశతంబులగు భూధరంబు లంతరిక్షంబున కందుకంబులకరణి నిల్చియున్న సమీరనందనుండు బొడగాంచి ప్రళయ కాలకృశానునిపగిది క్రోధపూర్ణుండై యొక్కమహానగంబు శిరంబుపై నొకకొన్ని మహీధరంబులు హస్తద్వయంబునంబూని తీవ్రగమనుండై వచ్చుచున్న సన్నాథుండు వాతాకర్షణమహామంత్రప్రయోగంబున వాయుసూనుని హస్తపాదాద్యంగంబుల చలనవలనాదులు స్తంభనం బు జేయ సోకుదయ్యెముకొామరుం డపగతధైర్యుండైచిత్తరువుబొమ్మవలె నిలువంబడి తండ్రిని స్మరియింప నగ్గగనసూనుండు ప్రత్యక్షుండై విడు విడు మని నాథునితో బలుక నాథుం డుపసంహారంబు చేసెను. హరి సూనుండు పర్వతంబులంబడద్రోసి నాథునిసమీపంబుజేరి "మత్స్యేంద్ర

నాథా! ధన్యుండ"వని బలుకుచుండ ననిలుండు కుమారునితో "పుత్రా! యనేకమంత్ర మంత్రార్థరహస్యంబు లెఱింగిన ఇమ్మహాసిద్ధుండు నిజభక్తి గురుశక్తి ఈశ్వరీవాచా యని ప్రతాపంబు జూపుచుండ దేవదానవులు దాసులై సంచరింపుచుండెదరు. నన్ను బంధించు మహామహులుండు నిన్నేల్ల సరకుగొను"నని చెప్పుచున్నతఱి నాథుం డయ్యిరువురిపాదంబులకు నమస్కరించి 'క్షమియించి సఖ్యంబొసంగు'మని వేడుకొన నమ్మహాత్ములు "దానవులకై యుశనుండు, నలుమొగంబులవేల్పుకై నారాయణుండు సహాయంబైనట్లు భవత్కార్యార్థంబై మానిజశక్తినొసంగెద"మని వరంబొసంగిన మత్స్యేంద్రుండు వాయునందనునితో "నీవు సర్వజ్ఞమూర్తివై నన్నేల పరీక్షించితివి. నాగాశ్వత్థవృక్షంబున నాకు ప్రసన్నుండవై శాబరీవిద్యాపరిపూర్తికై వరం బనుగ్రహించితి" వన హనుమంతుండు "మత్స్యేంద్రా! నీవు ప్రత్యక్ష కవినారాయణుండవు. నేను నీ కశ్వత్థంబున ప్రసన్నంబై వరంబొసంగినది నిజంబు. నీవిద్యాప్రభావంబు చూడందలంచి నీవు సేతుస్నానంబు జేయుచుండ నచ్చటి కరుదెంచితిని. నీవు సమర్థుండవైతివి. నీ విటనుండి స్త్రీరాజ్యంబునకరుగవలయు నచ్చట నాకొకకార్యభారంబు గల దయ్యది నీ వుద్ధరించెద" వన విని నాథుం డదియేమి యనిప్రశ్నింప నంజనీసూనుండు తనపూర్వచరిత్రంబు సిద్ధునితో జెప్ప నారంభించెను.

హనుమంతుండు మత్స్యేంద్రనాథునకు స్త్రీరాజ్యాధిపత్యంబున కొడంబడుచుట.

"యోగిశ్రేష్ఠా! నేను పూర్వంబున రఘుకులోత్తముని దాస్యంబుజేయుచుండి రామునిసమేతంబుగ లంకానగరంబుజేరి రావణాదుల బరిమార్చి జగజ్జననియగు సీతంగొని యయోధ్యానగరంబు జేరితిని. పిదప మద్దాస్యత్వంబున కానందించి జానకీదేవి తనహృదయంబున నాకు వివాహంబొనర్చి సంసారసుఖభోగంబుల దేల్చందలంచియు నిగ్గాలిచూలి బ్రహ్మచర్యంబున ప్రకాశించుచుండును. మద్వచనం బంగీకరించునో లేదో యను సంశయంబుచే నన్నొకనాఁ డేకాంతంబునకు బిలిచి 'పుత్రా! ఆంజనేయా! నాకొకకోరికగల దయ్యది నీ వంగీకరించితేని జెప్పెద'నన్న నే నాతల్లిహృద్గతం బెఱుంగక 'భవచ్చరణార్పితప్రాణుండగు దాసుండు జేయనొల్లనిపని యొకటికలదే' యన నద్దేవి బాసగొని

'యోసమీరనందనా! సతీసమేతుండవై గృహస్థాశ్రమధర్మంబున సుఖంబు లనుభవింపు'మని జెప్పెను. నే నత్యంతకష్టంబని తలంచి నిరుత్తరుండనై రామభద్రునిపజ్జం జేరి విషణ్ణవదనుండనై కూర్చుండ రామచంద్రుండు విలోకించి నన్ను డగ్గరంజేరి 'పుత్రా! నీముఖం బేలగుందిన' దని విచారించెను. నే నపారదుఃఖావేశుండనై త్రిలోకజననిచే నిర్దిష్టంబగు సంగతిం దెలుప రఘుపుంగవుండు ఘనకరుణాన్వితుండై 'వాయుపుత్రా! స్త్రీరాజ్యనారీసంఘంబు యుష్మజ్జాయాసముదయంబని దలంపు మిప్పుడననేల నేటి కిట్టిచతుర్యుగకల్పంబు లేకోనశతంబయ్యె. ప్రతి కల్పంబున నేను రాముండనై నీ వాంజనేయుండవై జన్మించి ప్రతి కల్పంబున రావణాదుల వధియించి యయోధ్యానగర ప్రవేశానంతరంబున నీవా స్త్రీరాజ్యంబు ప్రవేశించినది నిజంబుగాన నీవిపుడా శైల్యదేశంబు జేరి సకౌపీనజన్ముండవై యూర్ధ్వరేతస్కుండవైన కతంబున భుభుఃకారనినదం బొనర్పుము. భవన్ముఖమాపతితజన్యవీర్యంబున నచ్చటి మచ్చెకంటులు గర్భంబులు ధరియించి సంతానంబు బడయుదు' రని యాజ్ఞాపించెను. తదాది నేనా దేశంబున నివసించితిని. మత్కృతభుభుఃకారంబున స్త్రీసమూహంబులు గర్భంబులు ధరియించి సంతానవంతులైరి కాని రతిసుఖం బెఱుంగరు. అంత నద్దేశాధిపతియగు మైనాకినీ నామమహారాణి మనోజభవుసుఖంబుల కపేక్షించియుపాయంబుగానక ద్వాదశాబ్దంబులు మదర్పితచిత్తయై ఘోరంబగుతపం బాచరించుచు స్వశరీరమాంసఖండంబులచే హవనంబుజేయ నేను ప్రత్యక్షంబై భవదీప్సితంబు దెలుపుమని విచారించితి నప్పు డాసుందరీమణి 'స్వామీ! మీభుభుఃకారమారుతంబున నేతద్రాజ్య స్త్రీసమూహంబులు సంతానంబు వడసెంగాని కామసుఖం బెఱుంగరైరి. నీవు మూప్రాణప్రియుండవు గావున నన్ను భావభవపుష్పభల్లంబులతాపంబు బాపి కడ తేల్చు'మన నేను 'సకౌపీనజన్ముండ నూర్ధ్వరేతస్కుండను నావలన నీకోర్కు లెట్లీడేరు నిక ముందు ప్రత్యక్షకవినారాయణుండు మత్స్యేంద్రనాథనామంబున దేజరిల్లుచు నిచ్చటికేతెంచు నతనిచే నీమనోరథంబు చేకూరు'నని వరంబొసంగితిని. మత్స్యేంద్రా! నీవచ్చటి కరిగి యాసుందరాంగిని కందర్పకదనంబున కడతేర్చి నాభారంబు దీర్పు"మని జెప్ప యోగపూర్ణుండగు నాథుండు "ఈమితిలేని పాతకం

బే నేవిధంబున సహింతు. నేను బ్రహ్మచర్యవ్రతస్థుండను. తపోభంగాను కూలదుష్కృతంబులు నరకపురముఖంబులు గావే. మున్న నేకు లన్ను లకారణంబున పదచ్యుతులు కారే. సీతకై రావణుండు నశించఁడే. గురుసతీగమనంబున కలాధరుండు కళంకిగాఁడే. క్షణమాత్రంబున నారదుండు ఁడఱువదిపుత్రులం గని కష్టంబులం బడఁడే. తపోఘనుండగు విశ్వామిత్రుండు మేనకచే భంగంబునొందఁడె. ఇట్టి నింద్యకార్యం బుచే నాథపథంబు ధిక్కృతంబుకాదే. ముందు గలుగబోయెడునా థులు నన్ను బహిష్కృతుం జేయరే'' యనిన కఱువలిచూచి ''నాథా! నీవు సిద్ధుండవు. నీకీ పాపం బాసాదించనేర దిది విధినిర్మితకార్యంబు ప్రతికల్పంబున నీవవతరించి యివ్విధంబున జరిపినవిషయంబే నిజంబు సంశయంబు దొలంగుము. నీకు మానినాథుండను కుమారుండు గలిగి ప్రతాపవంతుండై ప్రకాశించు'' ననిచెప్పి మత్స్యేంద్రుని సమాధాన పఱచి యన్యోన్యవందనంబు లాచరించుకొని యంజనీసూనుం డంత ర్ధానంబు నొందెను. నాథుం డచ్చోటుబాసి యనేకదేశంబు లధిగ మించి హింగళాదేవి దర్శనకుతూహలుండై చనిచని ప్రతిధ్వనులు బల్కు నిర్మనుష్యసంచారంబగు మహదరణ్యంబున కృతాంతుని తిర స్కరించు భయంకరాకారంబుల భాసమానులగు భైరవవర్గంబు భం డనోద్దండపరాక్రమాతిశయంబుల విలసిల్లు చండ చాముండాది మహా శక్తిశతంబు నజాండం బప్పళించు శాకినీ ఢాకిన్యాది మహాభూతసం ఘంబు ద్వారరక్షకులై యుండి భువనభయదాట్టహాసంబు జేయు చుండు హింగళాదేవ్యాలయసమీపంబు జేరెను

ఇతి భక్తిసార నవనాథచరిత్రంబున మత్స్యేంద్రవాయుసుత సందర్శన కథావిశేషంబు తృతీయాధ్యాయము సంపూర్ణము.

---

## చతుర్థాధ్యాయము.

మత్స్యేంద్రనాథుండు భైరవాదులజయించి హింగళాదేవినిదర్శించుట.

ఇవ్విధంబున హింగళాదేవి సార్థశతబాహుపరిమితౌన్నత్యం బగు మహాద్వారసమీపంబుజేరి చూచుచుండ నచ్చటిభైరవాదు లీసి

 

ద్ధుండు శాబరీవిద్యార్థియైనాగాశ్వత్థవృక్షంబున నస్మత్ ప్రత్యక్షంబుబడ
సె. వీనిబరీక్షించి తీరవలయునని తలంచి సన్న్యాసవేషంబులచే సాక్షా
త్కరించి 'యోగిపురుషా! నీవెక్కడి కరిగెద'వని మందలించిరి. నాథుం
డు 'నే నంబాదర్శనార్థంబై పోయెద'నన భైరవులు "జన్మప్రభృతి
భనదాచరిత సుకృతంబు లెయ్యవియో దెలుపుము. పుణ్యవిశేషం
బుచే నిద్దేవి దర్శనంబగును. మే మిచ్చటిద్వారపాలకులము. మాకీ
పుణ్యరహస్యంబు దెలుపకున్న మార్గావరోధనంబు జేయుదు" మన
నాథుండు "నేజేయుపాపపుణ్యంబులు పరమేశ్వరార్పితంబులై యుం
డును. నాయందే విశేషంబులే" దని ప్రత్యుత్తరం బొసంగెను. భైర
వులు "ఏమియీచమత్కారసంభాషణంబులు. పురుషుండు జన్మించిన
పిదప సుకృతదుష్కృతకార్యంబు లేలజేయఁడు. చేసిన తత్ఫలం బేల
ననుభవింపఁడు. చాలు నీకృత్రిమప్రసంగంబులు. నీవు దర్శనార్హుం
డవు కావు శీఘ్రంబున జనుము లేకున్న శిక్షించెద" మన యోగిశ్రే
ష్ఠుండు "దౌవారికులారా! మీకింతటి ధైర్యసాహసంబు లేలగలిగె?
కృతాంతుని లెక్కింపనివాఁడు మీబోటిమశకప్రాయుల గణుతించునే"
యన వా రత్యంతక్రోధావేశులై తమతమ గదాఖడ్గపరశు త్రిశూలాది
పరికరంబులు హస్తంబుల ధరియించి యుద్ధసన్నద్ధులైననాథుండు చిటి
కెడు భస్మం బభిమంత్రించి దశదిగ్బంధనం బాచరించి శ్రీగురుదత్తా
త్రేయాయనమః యని గురువందనంబు సల్పి మహాయుద్ధంబు జరుగ
బోవునని సర్వదేవతల నావాహనంబుజేసి వజ్రపంజరకవచంబు నిర్మిం
చి స్వస్థచిత్తుండై భీకరాకారులగు భైరవులదెసం జూచి తడవేల మీ
మీనిజశక్తిం జూపుమన భైరవవర్గం బేకీభవించి హుంకరించుచు తమ
తమ ఖడ్గ త్రిశూల పరశు ముసల భిండివాల చక్రాద్యాయుధంబులు
సిద్ధునిపై వైవ మహానగంబుపైఁ బడిన వర్షంబుక్రియ నిష్ఫలంబైన
ప్రళయకాల హుతాశనునిపగిది ప్రకాశించుచు గాండీవంబుల జ్యా
ఘోషంబు జేయుచు వాతాస్త్ర కామాస్త్ర వాసవాస్త్ర నాగాస్త్ర
బ్రహ్మాస్త్ర రుద్రాస్త్ర దానవాస్త్ర కృతాంతాస్త్రంబులు నారింజేర్చి ము
ల్లోకంబు లేకముహూర్తంబున భస్మంబు జేయువిధంబున ప్రయోగం
బులు జేయ నయ్యవి ప్రళయసమయంబని దేవదానవులు దలంచు

చుండ దిగ్గజంబులు గడగడవడంక శేషుండు శోషింప భూమి కంపింప నక్షత్రంబులు డుల్ల నవగ్రహంబులు గతులుదప్ప నభోమండలం బాక్రమించి నాథునిపై జనుదెంచుచుండ సిద్ధుండు గెరలి వాతాస్త్రంబునకు పర్వతాస్త్రంబు, కామాస్త్రంబునకు విరక్తాస్త్రంబు, వాసవాస్త్రంబునకు మోహనాస్త్రంబు, నాగాస్త్రంబునకు ఖగేంద్రాస్త్రంబు బ్రహ్మాస్త్రంబును శాంతివరుణసూక్తాశీర్వచనంబులచే సంతోషపఱచుచు రుద్రాస్త్రంబునకు కార్తికాస్త్రంబు, దానవాస్త్రంబునకు దేవాస్త్రంబు, కాలాస్త్రంబునకు సంజీవన్యస్త్రంబు భస్మం బభిమంత్రించి తపోబలంబున నన్నింటి నన్నిరూపంబుల నుపసంహరించి.వాసవశక్తి సంపుటి యొనర్చి వాతాకర్షణ దివ్యాస్త్రప్రయోగంబు జేయ నష్టభైరవులు చేష్టలుడిగి కష్టంబులం బడుచుండ సిద్ధనిర్మిత వాసవశక్తికృత ప్రళయకాల మహానినదంబు దిక్కులం బిక్కటిల్లి త్రిలోకజననియగు జ్వాలాముఖి శ్రోత్రంబుల సోకి యాకసంబు బగిలెనో సోకుమూకలు బలసిరో యేమి యీచిత్రంబు గనుంగొనుమని యాజ్ఞాపింప రయంబున శంఖినీ ఢంకినీ యోగినీ చండా చాముండా మండా వండాది మహాశక్తిసముదయసహస్రంబు లేతెంచి నాథునిపై తీవ్రతరశస్త్రాస్త్రంబులు బఱపిన, యోగిముఖ్యుండు లీలావినోదంబు జేయందలంచి సమ్మోహనాస్త్రంబు ప్రయోగింప నమ్మహాశక్తి మహాభూతగణంబులు చిత్తవిభ్రాంతినొంది కొందఱు కరతాళంబులు వాయించుచు నొకకొందఱు పాటలు బాడుచు మఱికొందఱు రోదనంబు జేయుచు కొందఱు నవ్వుచు కొందఱు నేలపై వ్రాలి పొర్లుచు నొకకొందఱ అన్యోన్యకలహంబులు జేయుచు కొందఱు విగతవస్త్రులై నటియించుచు నానావిధవికారంబులు జేయుచుండ సర్వకళావిశారదుండగు సిద్ధుండు తనవిద్యాప్రభావంబున నమ్మహాశక్తుల వస్త్రంబు లపహరించి మాయాస్త్రంబునననేకపురుషోత్పత్తి గలిగించి యమ్మహాశక్తుల మధ్యప్రదేశంబున ప్రవేశింపంజేసి మోహనాస్త్రం బుపసంహరింప దేహభ్రాంతులు గలిగి యొకరినొకరు జూచుకొనుచు నగ్నలై నకతంబున పరపురుషావలోకనంబుచే పరమలజ్జాయమానులై పరుగులిడుచు మార్గమధ్యంబున కంఠగతప్రాణులై పడియున్న భైరవుల విలోకింపుచు దేవికడ కరిగిన నద్దేవి

విగతవస్త్రిలగు మానినీనివహంబుజూచి యమితాశ్చర్యంబుచే నిది యేమికారణంబని విచారింప నమ్మహాశక్తులు భయభ్రాంతచిత్తలై "తల్లీ! యొకమహాసిద్ధుం డెచ్చటినుండియో భవదాలయద్వారసమీపంబు జేరి ముహూర్తమాత్రంబున ముల్లోకంబుల జయించు భైరవుల గీటడంచి మ మ్మనేకవిధంబుల భంగపఱచి పెక్కుమాయ లొనర్చెను. నిన్నేల సరకుగొనును. నీదురవస్థ నీకు లభియించును. మన మిందుండ తగదు తగ" దని నొక్కి వక్కాణించుచుండ నమ్మహాభగవతి యోగమార్గం బున నింతటితపోధనుం డెవడు కాబోలును? కవినారాయణుండు వసు వీర్యంబున జన్మించి మత్స్యేంద్రనాథనామంబున సంచరింపుచున్న వాడని గ్రహించి శక్తికోటికి వస్త్రంబు లొసంగి నాథుని జేరంజని 'వ త్సా! ధన్యుండ' వని బొగడుచుండ సిద్ధుండు లోకమాతకు వందనం బాచరించెను. దేవియు నాథుని కేలుబట్టి తనయంకంబున నుంచుకొని 'యోగిపురుషా! భైరవులదెసం జూడుము రక్షింపు' మని పలికిన మ హాప్రసాదం బని వాతాకర్షణమంత్రోపసంహారంబు జేయ నాభైరవులు చలనవలనాదులు గలిగి నలుదిక్కుల నిరీక్షించి భవానీయంకస్థ మ త్స్యేంద్రునికడ కేగుదెంచి నాథుని గొనియాడి నాగాశ్వత్థంబున జరి గినచరిత్రంబు ముల్లోకజననికి దెల్లంబుజేయ యుల్లంబున సంతసిల్లి నమ్మహాదేవి, 'మత్స్యేంద్రా! యుష్మత్ప్రితాపబలశౌర్యంబులచే నిప్ప ర్వతశ్రేష్ఠంబు నభోమండలంబున గ్రుమ్మరి పునస్స్వస్థానంబున విలసిల్ల నొనర్చెదవే'యన సమర్థుండు వల్లెయని చిటికెడుభస్మం బభిమంత్రించి మహావాతాస్త్రంబు ప్రయోగించి తత్సహాయంబుగ శేషాస్త్రంబు జేర్చిన నమ్మహానగం బంతరిక్షంబున కులాలచక్రంబు పగిది దిరుగు చుండ నద్దేవి నిజశక్తిచే పర్వతశ్రేష్ఠంబును బడవేయదలంచి యశేష బలసంపన్నుండగు పన్నగేంద్రుని సహాయత్వంబున బడలేకపోయిన నచ్చెరువొంది పొగడతరముగాని సిద్ధునిచరిత్రంబు శ్లాఘించి యెప్పటి యట్ల నగంబు స్వస్థానంబు జేర్చుమన సిద్ధుం డట్లజేసి పిదప సజ్జగదం బాలయంబున త్రిరాత్రంబులు నివాసంబు సల్పి యనుజ్ఞ వేడ నమ్మహా దేవి సంతుష్టాంతరంగహృదయయై స్పర్శాస్త్రం బొకటి యస్త్రభి న్నాస్త్రం బొకటి రెండస్త్రంబు లుపదేశించి యాశీర్వదించెను. వసుధ

త్రుం డనుజ్ఞ గొని స్వేచ్ఛావిహారంబున ద్వాదశమల్హార దేశంబు ప్రవేశించెను.

ఇతి భక్తిసార నవనాథచరిత్రంబున మత్స్యేంద్రపింగళాదేవి సందర్శన కథావిశేషంబు చతుర్థాధ్యాయము.

---

## పంచమాధ్యాయము.

మత్స్యేంద్రనాథుం డష్టభేతాళాదులతో యుద్ధంబొనర్చుట.

మత్స్యేంద్రనాథుండు ద్వాదశమల్హారకాననంబున సంచరించుచు నొకనాఁ డొకగ్రామసమీపదేవాలయంబున నివసించి యారాత్రి గడుపుచుండ నడిరేయిసమయంబున కొలివిదయ్యంబుల సముదాయం బొకటి యక్కాననంబున నలుదెసల దిరుగుచుండం గని వీటిని స్వాధీనపఱచుకొన్న మేలౌనని తలంచి యంబికాదత్తస్పర్శాస్త్రంబు ప్రయోగింప నవియన్నియు భారతరంగమధ్యస్థ సూతసూనుస్యందనంబుపగిది పుడమి గఱచుకొని నిలువంబడియె. ప్రతిదినం బీ భూతగణంబులు నిశాకాలంబున భేతాళునిదర్శనార్థంబై జనుచుండి యానాఁ డీదురవస్థ ఘటియించినకతంబున నరుగలేవయ్యెను. అన్యదేశంబుల భూతసంఘంబులు భూతాధిపతియగు భేతాళుని దర్శనార్థం బరుదెంచిన భేతాళుండు తద్భూతగణంబును నిరీక్షించి శరభతీరభూతంబులు రాకున్నకారణం బేమి వారేలరారైరి? విచారించి రమ్మని నొకకొండటిని బంప వారు శీఘ్రగమనంబున మల్హారదేశంబుజేరి పాదపంబులపగిది పదచలనంబులేక నిలుచున్నవారలం జూచి యాశ్చర్యంబుచే నేతత్కారణం బెయ్యదియని విచారింప వారలు మేము భేతాళునిసన్నిధి కేతెంచుచుండ నెవ్వఁడో యొకమాంత్రికుండు నుమ్మిాకష్టంబుల బడ వైచె నని విన్నవించిరి. యానూతనాగతభూతంబులు వాఁ డెట్టిసమర్థుండు కానోపునని యటునిటు వెదకుచు గ్రామసమీపదేవాలయంబున నుదయార్కబింబంబుబోలు శరీరకాంతిచే వటదుగ్ధనిర్మితజటా

జూటంబుచే ఫాలంబున బాలచంద్రునిగేరు రక్తచందనతిలకంబుచే తోయజంబులనేలు నయనంబులకల్మిచే భస్మలేపితసర్వాంగుండై శైలీ సింగీ యనునాథపంథీచిహ్నంబులు ధరియించి వీరాసనంబున విరాజమానుండై యున్న యోగధూర్జటిని గనుంగొని యొక్కభూతంబు 'మహాత్మా! నిరపరాధంబగు భూతగణంబు నేల నంటించితి రేల? విముక్తులం జేయు' మని వినయోక్తులు బలుక సిద్ధుండు 'సత్కృత ప్రయోగంబునకు మీ రేల బద్ధులుగాకుండితి రని విచారించెను. తద్భూతంబులు 'భేతాళుండు శరభతీరభూతనివహంబు నిత్యనియమప్రకారంబున రాకున్న కారణంబు గనుంగొని రమ్మని మమ్ముం బెను గావున భవత్ప్రితాపమహిమాతిశయంబుదలంచి గొనియాడంబూని జనుదెంచితిమి రయంబున విముక్తిజేయుము. లేకున్న కడుకష్టంబులనుభవించెదవు. త్రిలోకవిదితుండగు భేతాళుని నిరుపమానపరాక్రమంబు లభివర్ణింప నేల? దేవదానవగరుడగంధర్వకిన్నరకింపురుషాదులైన నోర్వగల రే? మిమ్మేల సరకుగొనును? బాలవద్విరోధంబు పనికిరా' దని నుడువుచుండ బుద్ధివతుండగు సిద్ధుండు 'సుద్దు లేల జెప్పెదరు. భేతాళుని రమ్మని యానతిచ్చెను వారతివేగంబున భేతాళునిసన్నిధి కేగి పాదంబులకెఱఁగి మత్స్యేంద్రునిచరిత్రంబు దేటపఱచిన నప్పిశాచరాట్టు క్రోధపూరితుండై నేత్రంబుల విస్ఫులింగంబులు రాల్పుచు కర్ణాట మరాట కైకాడ బంగాళ మళయాళ కుడ్డాళ నానాదేశస్థ యష్టకోటిమహాభూతంబులను, తద్భూతనాయకులగు జోటింగ్ బాబర్ నరసింగ్ మహామద మహాబీర మహాభద్రాది వీరాగ్రేసరుల కాజ్ఞాపింప వారు తమతమసైన్యంబులతో భేతాళుని కలియంజేరి వందనంబు లాచరించి విశేషం బేమి యని విచారింప భేతాళుండు గతవృత్తాంతంబు దేటపఱచి యేకముఖంబున నభోమండలం బాక్రమించు భూతమండలంబు నోడ్కొని శరభతీరంబు ప్రవేశించి ధారాధరంబులపగిది మహాధ్వానంబు జేయుచుండ నయోగీంద్రుండు భస్మం బభిమంత్రించి దశదిగ్బంధనం బొనర్చి వజ్రపంజరంబు నిర్మించి సుస్థిరుండై యున్నసమయంబున సమరకోవిదులగు పిశాచనాయకులు సిద్ధునిపై పర్జన్యునిచందంబున శరవర్షంబు గురిపించుచుండ నవియన్నియు పర్వతాగ్రంబున వ్రాలిన వర్షవర్ణంబులవిధంబు నిష్ఫలంబైనం గనుంగొని యష్టనా

యను లట్టహాసంబుజేసి భయంకరంబులగు వికృతాకారంబులు ధరి యించి సిద్ధుని మస్తకంబుపై నానాభూజంబులు శుష్కతృణకాష్ఠం బులు బఱనైచి యనలంబు సోకించిన నదియు నింగిముట్టి పెనుమంట లెగయుచుండెను. వసుపుత్త్రుండు జలదాస్త్రప్రయోగంబుచే ననలంబు రూపడంచి యాగ్నేయాస్త్రప్రయోగంబు గావించిన భూతసమూహం బులు దృశ్యాదృశ్యంబులై మెలంగుచుండెను. నాథుం డిదితగదని హు తాశను నుపసంహరించి భూతకోటిపై స్పర్శాస్త్రంబు వేయ నష్టకోటిభూ తంబులు పూర్వపిశాచంబులక్రియ నేలం గఱచుకొని నిశ్చేష్టితులై నిలువంబడెను. మహాబలసంపన్నులగు పిశాచాధిపతు లీయస్త్రంబుచే బద్ధులుగాక సిద్ధనిర్మితదశదిగ్బంధనవజ్రాస్త్రం బాక్రమించి నాథుని గబ ళింపనలంచి సమీపించిన సాహసుండగు సిద్ధుం డచ్చెరువొంది వాస వాస్త్రంబు విడచిన నయ్యది భేతాళుని ముట్టడించెను. భేతాళుండు నిర్భయహృదయుండై నయ్యస్త్రరాజంబుతో పెనఁగుచున్నతఱి యుభ యయుద్ధవిశారదత్వంబున పృథివి గంపింప శేషుండు శోషింప నక్ష త్రంబులు లతాంతంబులభంగి గళితంబు లౌచుండ తక్కనభూతాధినా యకసప్తకంబు నాథునిపై గవిసి చరణతలంబులు బట్టి బుడమిపై బొదునం దలంచెను. మత్స్యేంద్రుండు దృఢమనస్కుండై పునర్వజ్రా స్త్రంబున దశదిగ్బంధనం బాచరించి దానవాస్త్రంబున మధు కుంభక మరు మాలీమల ముచుకుంద త్రిపుర బలుండను సప్తదానవుల కల్పిం చిన జోటింగునితో మధుండు బాబరునితో కుంభకుండు మహోదు నితో మరుండు ముంజునితో మాలీమలుండు మహిషాసురునితో బలుండు పెనంగి యన్యోన్యవిజయాపేక్షలచే ద్వంద్వయుద్ధంబు జరు పుచు హుంకరించి సింహనాదంబులుజేసి యొకరినొకరు బొడుచుచు నఱుకుచు మొత్తుచు నొంచుచుండ సిద్ధనిర్మిత నిశాచరముష్టిప్రహారం బుల పిశాచనాయకులు డస్సి వికలాంగులై మూర్ఛిల్లినం జూచి దాన వాస్త్రం బదృశ్యంబయ్యె. తత్సమయంబున వాసవాస్త్రంబు భేతాళుని మూర్ఛిల్లంజేసి యంతర్ధానంబునొందె. తదుపరి మత్స్యేదరశుక్తిము క్తుండు వాతాకర్షణమంత్రప్రయోగంబున నయ్యష్టనాయకుల చలనవ లనాదులు బంధించెను. వారలు నిర్విణ్ణులై బ్రతుకలేమని నిశ్చయించి సదుపాయంబు గానక నాథుని యపారపరాక్రమంబు లుగ్గడించి రావ

ణానుజుండగు విభీషణునికై నడి భక్తాగ్రేసరుండగు ప్రహ్లాదునికీలి శర ణు వేఁడిన క్షమియించునని తలంచి "హేతపోనిధే! జ్ఞానమూర్తీ! నీవు కేవలనారాయణుండవు. ఎదురెఱుంగని కలహంబు బూనితి మిక క్షణ మాత్రంబుపేక్షించిన ప్రాణంబులు నిలువవు. సకలేంద్రియవ్యాపారంబు లుడిగెను మమ్మురక్షించి తేని భూతగణసమేతంబుగ దండధరునిదూతల చందంబున భవద్దాసులమై మెలంగెద" మని యనేకవిధంబుల స్తోత్రం బులు జేయు సిద్ధుండు "నేజేయు శాబరీవిద్యయం దేసమయంబున మి మ్మధిదైవతలగా దలంచెదనో తత్తత్సమయంబుల కార్యానుకూలురై వర్తింపవలయు" ననిన వారలు హర్షించి "భవదాజ్ఞానుసారులమయ్యెద" మని యొప్పుకొనిరి. నాథముఖ్యుండు కృపాకటాక్షంబుచే విభక్తాస్త్రం బున భూతకోటిని విముక్తింజేసి భూతనాయకులబాధలం దొలంగించి రక్షించెను. వారు సిద్ధునిసమీపంబున బద్ధాంజలులై బొగడుచుండ నక్షత్రమండలంబున క్షపాకరునిభంగి నిర్జరసమాజంబున నాకాధిపతి చందంబున ప్రకాశమానుండై వెలుంగుచున్న పరమయోగీశ్వరుని భూత గణంబులు జయజయశబ్దంబుల పాణివాదంబులు జేయుచు శ్లాఘించు చున్నన య్యోగినాయకుండు లోకోపకారనిమిత్తంబై "భూతగణంబు లారా! భేతాళప్రముఖనాయకముఖ్యులారా! ఇమ్మహాయుద్ధకథావిశేషం బెవ్వరేని పఠియించిన లిఖయించిననేగాక నీపొత్తం బేగృహంబున గౌరవంబుగ నుంచఁబడునో యట్టిగృహస్థులభాద్రపదశుక్లచతుర్థీచంద్రు ని జనులు జూడనొప్పనివిధంబున మీరలుజూడనేరక దూరస్థులై జనవ లయు నియ్యది శాసనవాక్యం బని డెందంబున దలంచి దొలంగవల యు" నని చెప్పిన నప్పిశాచంబు లవశ్యంబని వసుకుమారునిపాదకమలం బుల కెఱఁగి యనుమతి గొని తనుతమనిజనివాసంబుల కరిగెను. అనం తరం బా మత్స్యేంద్రనాథుండు తన్మళ్లార దేశంబున కాళికాభవానీ యాలయంబు జేరెను. తత్కథాసారంబు వినిన శ్రోత లత్యంతానం దంబు నొందగలరు. శ్రోతలారా! ఈగ్రంథరాజమహిమాతిశయం బభివర్ణింప నలువకైన నలవియగునే? ప్రథమాధ్యాయపఠనంబు సర్వ రోగనివారకంబు, ద్వితీయాధ్యాయధ్యానంబు విద్యాభివృద్ధికరంబు, తృతీయాధ్యాయకథనంబున సంజనీసూనుప్రసన్నత్వంబు, చతుర్థాధ్యా యపారాయణంబు సర్వసంకటనివారకంబు, పంచమాధ్యాయఫలం

బు మహాభూతాది భయనివారకంబు గావున భక్తియుక్తులై పఠియింపవలయును.

ఇతి భక్తిసార నవనాథచరిత్రంబున మత్స్యేంద్రభేతాళాదిసందర్శనకథావిశేషంబు పంచమాధ్యాయము సంపూర్ణము.

---

## షష్ఠాధ్యాయము.

### మత్స్యేంద్రుండు మహాకాళిచే యుద్ధం బొనర్చుట.

మత్స్యేంద్రనాథుండు ద్వాదశమల్హారదేశ కోంకణస్థానంబున కుమారస్వామిని సేవించి నానాతీర్థంబుల గ్రుంకులిడుచు కుడ్డాలదేశప్రాంతంబున నడూళగ్రామబాహ్యదుర్గాలయంబు జేరి పూర్వంబున గరళకంఠుండు సోమనూకల గీటడంచం దలంచి కాళికాస్త్రంబు నిర్మించి సురాసుల చీకాకుపఱచి యొకసమయంబున ముదితాత్ముండై స్వనిర్మితకాళికం జూచి వరంబు వేడుమన నద్దేవి బద్ధాంజలియై "నే ననుకులం ద్రుంచి ప్రయాసబహుళంబుచే డస్సితి నిక నన్ను గటాక్షించి క్షితిపై స్థాపింపు" మని వేడుకొన నుమాధవునిచే నద్దేవి యాయాలయంబున ప్రతిష్ఠింపఁబడి రౌద్రరసం బుప్పతిల్లుచుండుటఁ గాంచి నమస్కరించి యనేకవిధంబుల గొనియాడి "యో త్రిలోకజననీ! మత్కృతశాబరీకవిత్వరచనల వశ్యాకర్షణ ద్వేషణ మారణోచ్చాటనాది సహాయంబొసంగ కరుణింపు"మని బ్రస్తుతించిన నమ్మహాదేవి సిద్ధుని జూచి "యారా! బహుకాలం బీశ్వరకరకమలపీడితయై బడలిక జెంది విశ్రాంతిం బొందుచుండిన నన్ను నీహస్తంబున ప్రకాశించు మని వేడెదవు. జ్ఞానశూన్యా! నీకింతటి పొగరేలగలిగె నిద్రించుచున్నముచికుందుని కాలయవనుండు భంగపఱచి తత్ఫలం బనుభవించినచందం బీవెఱుంగవే" యనుచు బడబానలంబుమాడ్కి క్రోధపూరితహృదయయై "మూర్ఖా! వాయసంబునకు హంసంబు దాసురాలగునే? ధరాధిపుండు

దరిద్రుని గొల్చునే? పండితుండు మూర్ఖుని బొగడునే? వినతాసుతుండు గృధ్రంబును సేవించునే? దక్షాధ్వరధ్వంసి పాణితలంబున ప్రకాశించి తుదకు నీవశంబై యుండుట చిత్రంబుకాదె? భ్రష్టాత్మా! నీకు విచారంబులేదే? తిరిగిపొమ్ము శాసించెద” నన మత్స్యేంద్రుండు “ఓ దేవీ! నీకీ గర్వంబేల మత్ప్రతాపమిత్రోదయంబున నీయజ్ఞానతమంబు బాపి వశపఱచుకొనియెద జూడుము. పాండుసుతమధ్యముండు స్వప్రతాపంబున మారుతాత్మజుని రథధ్వజంబుపై నివసింపఁజేయుటెఱుంగవే?నన్నుదత్త శిష్యుండని దలంపవే”యని పరుషోక్తులు బలుక నమ్మహాశక్తి“మత్స్యేంద్రా! నీవు మత్స్యోదరంబున జన్మించి ధీవరునిచే రక్షింపఁబడి యోగివేషధారవై హస్తంబుల వీరకంకణంబులు ధరియించి ఫాలభాగంబున రక్తచందనతిలకంబు దిద్ది విఱ్ఱవీగుచు నాపై నస్త్రనైపుణ్యంబు జూపదలంచెదవో, భూతవ్రాతంబున ఖ్యాతిం జెందితి నని యహంకారంబుచే ప్రతాపంబు జూడు మనియెదవో, భ్రుకుటీకుటిలవీక్షణంబున భువనబ్రహ్మాండంబు భస్మంబు జేయఁజాలిన మత్సమీపంబున నీయట్టిమశకప్రాయుల ప్రశంసంబేల బుద్ధిహీనా! నన్నెఱుంగవా” యనుచుండ యోగపూర్ణుండు కుపితమనస్కుండై “నీ వంబికారనుణునికరంబున విలసిల్లి నిర్జగారాతుల నిర్జించితి నని దురభిమానంబు లేలబల్కెదవు? మిన్నందిన భూరుహంబు మారుతంబున పతనంబుగాదే” యని వైరారోహవాక్యంబులు బలుకు సిద్ధునిజూచి భద్రకాళి సింహనాదంబుచేసి యుప్పరవీథి కెగసి యశనిపాతంబులభంగి పెడబొబ్బ లిడుచుండ దిగ్గజంబులు దిగులుపడియె. భూతపంచకంబు భీతిల్లె. పాతాళాదిలోకంబులు ప్రళయసమయంబని భ్రమజెందె. గిరులు గూలె. వృక్షంబులు వ్రాలె. దిశలు బగిలె. సురాసురులసమరంబో యని లోకాధిపతు లంతరిక్షంబున విమానారూఢులై జూచుచుండ నమ్మహాకాళి “యోరా మత్స్యేంద్రా! నీప్రాణంబులు రక్షించుకొనుము. వ్యర్థకలహం బేలజేసితివి? నీగురువును ధ్యానించుకొనుము. నిన్ను దండించెద ఖండించెద శిక్షించెద భక్షించెద”నని బలుకుచుండ ధైర్యధుర్యుండగు నాథుండు వాచాశూరత్వం బేలనని కించిత్భస్మం బభిమంత్రించి వాసవాస్త్రంబు ప్రయోగింప నయ్యది సహస్రార్క తేజంబై కాళికానాసుతిమిరభంగంబుజేయం దలంచి జలధు లీడ్చు బడబాగ్నిచందంబున వ్యోమమార్గంబునం జని

కాళికాభవానిం దాఁకిన నయ్యిరువురు హరిహరులంబోలి మేరుమంద రంబులకై వడి భీమజరాసంధులపగిది యన్యోన్యజయకాంక్షులచే పోరుచు మహారవంబు జేయుతత్ర వజన్యసాధ్వసంబునవియచ్చరమూకలువిచ్చలవిడి పరుగెత్తుచుండుతఱి సిద్ధనిర్మితవాసవాస్త్రంబును కాళికాభవాని గ్రసించి మహాక్రూరరూపంబు దాల్చి నాథుని గబళింప జనుదెంచుచున్న నయ్యోగిసార్వభౌముండు భస్మయోగంబున నేకాదశమహారుద్రాస్త్రంబు కల్పించి బ్రయోగింప నద్దేవి యప్రతిహతంబని దలంచి రుద్రసూక్తంబులం బ్రస్తుతించిన నమ్మహాస్త్రం బంతర్ధానంబు నొందె. నాథుం డదిచూచి వజ్రాస్త్రప్రేరితంబు జేసి తత్సహాయంబున ధూమ్రాస్త్రంబు ప్రయోగించిన నద్ధూమ్రాస్త్రం బంబరంబు గప్పి ఘోరాంధకారంబు గ్రమ్ముచుండ వజ్రాస్త్రం బంబికను ముట్టడించెను. దేవియు వజ్రాస్త్రంబును సరకుగొనక పాదంబుల నదిమి పర్వతాగ్రంబుపైఁ బడవైచెను. (అమ్మహీధరంబు శిథిలంబై సహ్యపర్వతనామంబుచే ఘూర్జరదేశంబునం దిప్పటికి ప్రకాశించుచున్నది.) ఇత్తెఱంగున ప్రతిలేని పరాక్రమాతిశయంబు జూప నత్తపోధనుండు పశుపతి పాశుపతంబుకరణి చక్రి చక్రాయుధంబుమాడ్కి వజ్రి వజ్రాయుధంబురీతి శ్రీగురుదత్తాత్రేయ దత్తవాతాకర్షణమంత్రప్రయోగంబు సల్పిన నయ్యది యంబికాహృదయగతంబై పంచప్రాణవాయువుల ఠావుల్ దప్పించి నిజశక్తి జూపిన నమ్మహాదేవి చేతనంబు దప్పి కంఠగతప్రాణయై గతిదొలంగి భూతలంబుపైఁ బడ తద్దేహభారతాడనంబున భూధరంబులు నుగ్గె వ్రాలుచుండ సకలేంద్రియవ్యాపారంబు లుడిగి పరమేశ్వరార్పితచిత్తయై యఱపదిమోముల వేల్పు నుద్దేశించి "కరుణాసింధో! దీనశరణ్యా!" యని స్మరియించెను. త్రినయనుండు స్వనిర్మితకాళికాస్త్రప్రాణభంగసమయంబు మత్స్యేంద్రనాథకృతపరాక్రమంబు దలంచి వృషభారూఢుండై జనుదెంచుచుండ సిద్ధుం డెదురేగి త్రిపురారి పాదకమలంబుల వ్రాలి సమస్కరించిన నప్పరమేశ్వరుండు ప్రసన్నహృదయుండై వృషభంబు డిగ్గి దశహస్తంబుల ననుపుత్రు లేవనెత్తి ప్రేమాలింగనం బొసంగి 'వత్సా' యుత్కారంబున విరాజమానంబై నిశాచరమూకల రూపుమాపిన కాళికాస్త్రంబు నేఁడు నీచే నోటుబ

డివై. నీయవక్రపరాక్రమం బమితంబయ్యె” ననిన సిద్ధుండు “హేవ యాపరమూర్తీ! బదరికాశ్రమంబున భవత్కటాక్షంబుచే త్రిమూర్తుం డనేకమంత్రరహస్యంబు లుపదేశించిన దీవెఱుంగవే అయ్యది నీయను మతి గాదే” యని బొగడుచుండ హరుండు “నాథా! మంత్రోపసంహా రంబున కాళికం గావు” మని యాజ్ఞాపించెను. యోగిముఖ్యుండు “దేవా! భవత్కరకమలంబున దేజరిల్లిన కాళికాస్త్రంబు నేజేయు శాబరీ విద్యకు సహాయంబై కార్యానుకూలసమయంబున నస్మన్ముఖంబున మంత్రరూపంబున నివసింపం జేయవే” యని ప్రార్థింప హరుండు హర్షించి కాళికను రక్షింపు మని జెప్ప నంత సిద్ధుండు పినాకిపాదంబు లకు ప్రణమిల్లి భస్మం బభిమంత్రించి యుపసంహారంబు జేయ నద్దేవి తేలికగలిగి దననికటంబున సంకటహరుండగు శంకరుండు ప్రసన్నుండై యున్నంగాంచి యగ్గరళకంఠుని పదసరోజంబులమీఁద వ్రాలి“సర్వేశా! ప్రహ్లాదునికై పంకజాక్షుండు నృసింహుండై రక్షించినక్రియ సుమి త్రాసుతునికై యంజనీసూనుండు సంజీవిం దెచ్చి బ్రతికించినప గిది మీరు నాపాలిదైవం బైనకతంబున రక్షించితి” రని పొగడు చుండ నగ్గిరిపరనిలయుండు “యో దేవీ! మద్వచనం బాకర్ణించి మత్స్యేం ద్రనాథకృతశాబరీవిద్యకై సహాయంబగుము. ని న్నేమంత్రంబున దేనికై నుచ్చరించునో తత్కార్యపరిపూర్తి జేయకోరెద” నని విచారింప నజ్జగదంబ పరమేశ్వరాజ్ఞ పరిపాలించ నిశ్చయించి నాథుని బిలిచి “సిద్ధముఖ్యా! నీమనోరథం బీడేరె. నీ వేసమయంబున నేమంత్రంబున నన్ను దలంచెదవో తత్క్షణంబ భవత్సంకల్పసిద్ధి జేయు దు” నని కరతలంబున కరతలంబిడి సమాధానపఱచె ననంతరంబ యద్దేవి నిలయంబున శివుండు సిద్ధుండు త్రిరాత్రంబులు సుఖగోష్ఠిం గడపి కపాలి కైలాసంబుజేరె. మత్స్యేంద్రనాథుండు త్తరమార్గంబున గమనంబు జేయుచు గదాతీర్థంబున స్నానంబులాడి హరేశ్వరదర్శ నార్థంబై జనుదెంచుచుండ ప్రతాపరుద్రుండగు వీరభద్రుండు యోగ ప్రముఖుండగు మత్స్యేంద్రునితో యుద్ధవిశారదత్వంబు జూపిన కథా విశేషంబు ముందటియధ్యాయంబున జెప్పంబడు గాన శ్రోతలారా! ఈషష్ఠాధ్యాయ శ్రవణఫలంబున వశ్యాకర్షణద్వేషణమారణాదిప్ర యోగంబులు వాతాహతజీమూతంబుపగిది దొలంగుసని కీమ్యాగర

గ్రంథరాజంబున గోరక్షునిశాసనవాక్యంబులు గలవు గావున శ్రద్ధాత్ములై వినదలంచెదరుగాక.

ఇతి భక్తిసార నవనాథచరిత్రంబున మత్స్యేంద్రనాథ కాళికాదేవి యుద్ధవిషయకథావిశేష షష్ఠాధ్యాయము సంపూర్ణము.

---

## సప్తమాధ్యాయము.

మత్స్యేంద్రనాథుండు వీరభద్రునితో యుద్ధంబొనర్చి జయంబుగొనుట.

సచ్చరిత్రుండగు మత్స్యేంద్రనాథుండు గిదాతీర్థంబున స్నానంబులాడి మహేశ్వరదర్శనకుతూహలుండై చనుదెంచుచున్న సమయంబున ప్రతాపముఖ్యుండగు వీరభద్రుం డేత త్తీర్థరాజస్నాననిమిత్తం బరుగుచు మార్గమధ్యంబున నన్యోన్యదర్శనంబు ఘటియించినంత పరస్పరవందనంబు లాచరించుకొన్నపిదప వీరభద్రుండు మత్స్యేంద్రునితో "యోగిపురుషా! నీనామం బేమి నీయోగమార్గం బెయ్యది. నీచిహ్నంబులు దెల్పు"మని విచారింప నయ్యోగిపుంగవుండు "నానామంబు మత్స్యేంద్రుఁడందురు. నాయోగంబు నాథపంథీయోగం బనియెదరు. శైలీసింగి కంథా శ్రీగురుదత్తచిహ్నంబు" లని దెలియఁజెప్ప శివకుమారుండు వసుకుమారునితో "నీకు కర్ణఛేదనం బేలగలిగె" ననిన సిద్ధుం "డియ్యది మద్గురునిర్మిత నాథపంథీచిహ్నం" బని చెప్పెను. వీరభద్రుండు "శాస్త్రానుకూలంబగు చిహ్నంబు లనేకంబులుండ నిట్టి వేదవిరుద్ధ నూతననాథపంథీయోగం బెవఁడు కల్పించెనో నీగురు వెట్టి మూర్ఖుండో కర్ణఛేదనమార్గం బేశాస్త్రంబో యోగ్యాయోగ్యం బెఱుంగని మూఢమతులు నూతనమతంబుల కల్పించెదరు గాన నీ పేచిహ్నంబులు విడువుము. లేకున్న శిక్షించెద" ననవిని సిద్ధపురుషుండు తోకద్రొక్కిన త్రాచుచందంబున మండిపడి నిండుకోపంబుతో "శతమూర్ఖా! భావంబున సర్వసమత్వంబు లేక బరుల నిందించిన నీకు పాపం బాపాడించదే! నీగుణదోషం బీ వెఱుంగక మద్గురుమూర్తిని దిరస్క

రించెదవు. పాపాత్మా! నీముఖావలోకనపాపం బేదివ్యతీర్థస్నానంబున బాయునో భ్రష్టా నష్టా దుష్టా నీవు కేవల శిశ్నోర్ధ్వాండ" వని పలికిన నవ్వీరభద్రుండు ప్రచండకోపోద్దీపితమానసుండై మహోద్దండకోదండం బెత్తి యర్ధచంద్రసాయకంబు బూని జ్యాఘోషంబుజేసి "ప్రాణంబులు దీయుదు" ననుచుండ సిద్ధుండు వీరభద్రునితో "జ్ఞానహీనా! అజాగళస్తనంబులభంగి వృథాసల్లాపంబు లేల సలిపెదవు? బహురూపుల వేషభయంబు భండనంబున కనుకూలంబో నీబోటిశూరుల నెందరినో జూచితి" ననిన వీరుండు "మత్స్యేంద్రా! మత్కరవిముక్తసాయకంబుల ప్రాణంబుల బాయుదువు నీకాలంబు సమకూరెను. నీగురువును స్మరియించుకొను" మన నాథుండు "మశకంబునకై హస్తులు మలగవలునే? సురాసుర నరోరగాది వందితపదారవిందుండగు మద్గురుమూర్తి నీకేల ఖరకరుండు ఖద్యోతంబులపై నిజశక్తి జూపునే! నీగర్వనిర్వాపణంబు మత్స్యేంద్రుండు జేయంజాలండే" యని కఠినోక్తు లాడుచుండ శూలితనయుండు "దురాత్మా! నీమస్తకంబు భూస్థలింబడవేయుదు. రామమంత్రంబు దలంపు" మని పలికిన నయ్యోగిశేఖరుం "డౌరా! రామమంత్రం బనుంగళకరంబే? గరళకంఠుండు నిరతంబుస్మరియించుండే? త్రిలోకపావనంబగు రామమంత్రంబు నస్మద్ధరింపదే? గనుంగొను" మని భస్మం బభిమంత్రించి దశదిగ్బంధనం బాచరించి వజ్రపంజరకవచధారకుండైన, భద్రుం డేకనిర్వాణశరంబు సిద్ధునిపైం బఱపిన, నాథుండు తృణతుల్యం బని దలంచుచుండ నయ్యది వ్యోమమార్గంబున జనుదెంచి నాథనిర్మితవజ్రపంజరంబుచే భంగపడిన, వీరుండు క్షోభించి మహాశక్తిసాయకంబు బ్రయోగించి తత్సహాయంబుగ నాగాస్త్రం బడరించిన నయ్యవి గగనంబున కెగసి చరియించుచుండ నందు మహాశక్తికృత కోలాహలధ్వానంబుచే నుడుగణంబులగతులుదప్ప దిశాధిపతు లాశ లుడుగ దిగ్గజంబులు కంపింప కులచలయంబు చలింప నహికులాగ్రగణ్యుండు దిగులుజెంద మహాప్రళయ సమయంబని బృందారకు లరిపార ననేకార్కసంకాశంబై సిద్ధనిర్మిత వజ్రకవచంబు భేదించి నాథునిప్రాణహరణార్థంబై జనుదెంచిన నయ్యోగిధూర్జటి రుద్రాస్త్ర గారుడాస్త్రంబులు వఱపిన, తద్రుద్రా

స్త్రంబున నేకాదశరుద్రులుదయించి మహాశక్తినిముట్టడించిన నదియక్షీణించి మాయంబైన, రుద్రాస్త్రం బంతర్ధానంబునొందె. ఖగేంద్రాస్త్రంబు నాగాస్త్రంబును భక్షించి యదృశ్యంబయ్యె. రుద్రనందనుం డదిచూచి వాతాస్త్రంబు ప్రేరించెను. వసునందనుండు పర్వతాస్త్రంబు నేసె. శంభుసుతుండు వజ్రాస్త్రంబున పర్వతాస్త్రరూపంబు మాపి యాగ్నేయాస్త్రంబు బ్రయోగింప సిద్ధుండు జలదాస్త్రంబున జల్లార్చెను. వీరుండు కామాస్త్ర దానవాస్త్రంబులు బఱపిన, నాథుండు రత్యస్త్ర దేవాస్త్రంబులచే యుద్ధకౌశలంబు జూపుచుండ వీరముఖ్యుండు "మత్స్యేంద్రా! మత్సమక్షంబున యుద్ధదక్షుండగు శూరుండు గలఁడే? భవద్గురుప్రాజ్ఞత్వంబు యుష్మద్వైజ్ఞానికత్వం బమోఘం" బనిన మత్స్యేంద్రనాథుం "డియ్యది మద్గురుకటాక్షవీక్షణఫలితం" బనుచు సరసోక్తులు బలుకుచుండ భద్రుండు బ్రహ్మాస్త్రంబు ప్రయోగించెను. తపోధనుండు తత్ప్రతిహతం బొందు లేమిం జేసి బ్రహ్మాస్త్రంబు బ్రహ్మాస్త్రంబున నుపశమనం బొనర్చె ముక్కంటిబిడ్డఁడు తెల్లుచూల్కోలనేయ నజ్జడదారి పడతుల తూపు బఱపి రూపడంచినం గని వీరరసోద్రేకముద్రితుండగు వీరభద్రుండు కృతాంతాస్త్రంబు వేయ సిద్ధముఖ్యుండు ప్రళయకాలమాయాస్త్రంబు ప్రతిఘటింపంజేసిన నది కాలాస్త్రంబును గబళించి యాకసంబున పరిభ్రమించుచుండ జగంబులు మడియునని తలంచి త్రిదివేశులు నుపశమింపుమని సిద్ధుని గొనియాడుచుండుసమయంబున నంచగరుడి గిబ్బరౌతులు వేల్పుమూకలగొని యబ్బురంబుననచ్చోటికరుగుదెంచి 'మత్స్యేంద్రా! మన్నింపు'మన్న నతం డన్మహామాయాస్త్రంబుపసంహరించెను. రుద్రుండు భద్రునిబిలిచి మత్స్యేంద్రుండు కవినారాయణుండని యతనిచరిత్రంబు దెల్పి సఖ్యంబు గూర్చిన, వీరభద్రుండు సంతుష్టుండై "నాథా! అపారబలసంపన్నులగు సురాసురులు మద్బలపరాక్రమాతిశయంబుచే నోటుబడరే? యుద్ధవిశారదుండగు కల్పాంతకభైరవుండు మత్కరవిముక్తసాయకంబుల గ్రాగఁడే? నీయట్టి ధైర్యధుర్యుని గానవైతి. నీయభీష్టంబు వేఁడు" మని యడుగ నయ్యోగిశేఖరుండు "వీరమూర్తీ! సర్వజనోపకారంబగు నాచే రచియింపఁబడు శాబరీమంత్రకల్పంబున కనుకూలుండవై నిన్ను స్మరియించినమాత్రంబున సమయోచితకార్యంబులు జక్కం జేయగల

వని కోరెద" నన వీరభద్రుం డియ్యకొని కరతలం బొడ్డెను. నిఖిలసుర గణంబులు సిద్ధునకు వందనంబు లాచరించి తత్తత్సముయంబుల భవదాజ్ఞాధారకులమయ్యెద మనుచుండ శ్రీమన్నారాయణుండు నిర్వక్రవిక్రమంబున ధరణీచక్రంబుం గబళించు దనచేతి చక్రంబు, ఫాలనేత్రుండు ప్రళయకాలబడబానలంబుమాడ్కి ప్రజ్వరిల్లుచుండు తనచేతి త్రిశూలంబు నద్భుతచరిత్రుండగు "మత్స్యేంద్రున కొసంగ నవ్వాగ్వధూవల్లభుండు "నాథా! మదీయవరప్రభావవిశేషంబున నీవు శాపానుగ్రహసమర్థుండ వయ్యెదవు. నీవాక్యంబులు వేదవాక్యంబులం బోలు" నని యానతిచ్చెను. తాపసోత్తముండు హరిహరబ్రహ్మల పదసరోజంబుల కెఱఁగిన, నా రత్యంతప్రేమపూరితులై హృదయాలింగనంబు లొసంగి దీవించినంత నింద్రాగ్నియమ వరుణప్రముఖాఖిల దిశాధిపతులు తమతమ దివ్యాస్త్రంబులు ప్రయోగోపసంహారంబుల దెలిపి యనుగ్రహించి నిజనివాసంబుల కరుగుచుండ సిద్ధుండు వైకుంఠనాయకునితో "దయాసముద్రా! వైకుంఠమణికర్ణికాస్నానాపేక్ష గల"దని విన్నవించిన, భగవంతుండు హర్షించి దనవిమానంబుపై సమీచీనాసనంబున సుఖాసీనుం జేసి వైకుంఠంబు జేరి నాథునిమణికర్ణికాస్నానంబులాడించి షడ్రసోపేతభోజనంబుల స్వపక్తికి—తృప్తుని జేయుచుండ మత్స్యేంద్రుం డొకనాఁడు "కమలాక్షా! కృపాఘనా! మత్పూర్వశరీరంబు పర్వతరాడ్గుహాయం దుంచఁబడియుండెఁ గాన నే నద్దేహంబు జూడందలంచెద" నని కోర, నారాయణుండు వల్లె యని యోగిముఖ్యుని వెంటగొని యుదిరిమలగుహ జేరి యందు నవనారాయణుల తొమ్మిది స్థూలకాయంబులు వాసుదేవుని శరీరం బొకటి సమాధిం బొందియుండుట గనుపఱిచి పునర్వైకుంఠనగరంబు ప్రవేశించి యొకవర్షం బచ్చట గడపినంత మురహరమణుండు యోగిచంద్రుని కైలాసంబునకు దోడ్కొనిపోయి సుఖగోష్ఠి నుండె. నొకనాఁ డసురాధిపుండు వెలితిప్ప కరిగి మిత్తిగొంగపాదంబుల కెఱఁగి యమ్మేటితపసిని దోడ్కొని యమరావతీనగరంబు ప్రవేశించెను. మత్స్యేంద్రుండు తత్పురంబున మాసత్రయంబు నివసించియుండ బ్రహ్మాపంపున నారి వేరపు వపసి యరుదెంచి యతీంద్రుని దోడ్కొని సత్యలోకంబున కేగిన నప్పరమేష్ఠిసదనంబున షణ్మాసంబులు గడపి గరుడగంధర్వకిన్నరకింపురుషాదుల సంతుష్టపఱచి దేవ

విమానారూఢుండై యమృతాంధసులగూడుకొనిమర్త్యలోకంబు ప్రవేశించెను. పిదప సిద్ధుని యనుమతి బడసి సురలు నిజపురంబులకరిగిరి.

—మత్స్యేంద్రనాథుండు వజ్రభగవతీదేవిని సంతుష్టఁజేయుట.—

మత్స్యేంద్రుండు తీర్థయాత్రాపరతంత్రంబున నానాదేశంబులు సేవించుచు కైకాడ దేశాంతర్గత పశ్చిమదేశంబున వజ్రవనంబుజేరి యచ్చట వజ్రభగవతిని దర్శించి తద్దేవ్యాలయనికటంబున మున్నాటఁబువదికుండంబు లుష్ణోదకపూరితంబులై యున్న నాథుండాశ్చర్య హృదయుండై యన్నిట స్నానం బాచరించి యుష్ణతోయంబుల కారణంబు విచారించి నూతనకుండం బొకటి నిర్మించవలయు నని దేవళంబు జేరి యర్చకుల నడిగిన వారలు "పూర్వంబున తాపసోత్తముండగు వసిష్ఠుండు జన్నంబు చేయుచుండ తత్క్రతుసమారంభమునకై యరుదెంచిన సుపర్వులకొఱకు ఉష్ణోదకపూరితకుండంబులు కల్పించె. నందు సుపర్వాణులు స్నానంబు లాడుచు క్రతుసమాప్తిని తత్కుండంబులకు తమతమనామంబు లిడి యరిగి" రనిన విని మత్స్యేంద్రుం డొకపవిత్ర స్థలంబు గాంచి యాపోస్త్రంబు ప్రయోగించి వరుణమంత్రంబు జపియించిన తత్సమయంబున పాతాళభోగవతీనదీజలంబు పైకరుదెంచిన, శూలిదత్త త్రిశూలంబుచే కుండంబు నిర్మించి తత్తోయంబులు కుండంబున పూరితంబుజేసి యాగ్నేయాస్త్రంబున తప్తంబు కావించి యోగివరిష్ఠుం డాజీవనంబుల స్నానంబులాడి యద్దేవి కభిషేకించిన నమ్మహాదేవి ప్రత్యక్షంబై "యోగీంద్రా! భోగవతీతోయంబుల స్నానం బాడించితివి. నీయట్టి సమర్థుండు గలఁడే? నీ విచ్చట నొకమాసంబు నివసించు" మన సిద్ధుం డట్లజేయ నద్దేవి నాథుని సుభాషితంబులచే తోషింపుచుండ నొక నాఁడామత్స్యేంద్రుండు "యోజననీ! నీకు వజ్రభగవతీ యనునామం బేలగలిగె" నని విచారింప నమ్మహాభగవతి "తపోధనా! పూర్వకాలంబున వసిష్ఠుండు హవనంబుజేయుసమయంబున మహర్షులు సభదీరి కూర్చున్నస్థలంబున కమరేంద్రుం డరుదెంచి యాహ్వానంబు లేదని సక్రోధుండై వజ్రాస్త్రంబు ప్రయోగించెను. శ్రీరామచంద్రుండు కనలి తృణంబున నను గల్పించి యడరించిన నేనా వజ్రాస్త్రంబును గబళించితి నమరనాయకుండు హతగర్వుండై రఘుపుంగవుని గొనియాడి వజ్రాయుధంబు దయచేయు మన నద్దయాసము

 

ద్రుండగు రామభద్రుండు నాచే గ్రసితంబగు దివ్యాయుధం బిప్పించి క్షమించి యనంతరంబ నన్ను 'వజ్రభగవతీ' యనునామం బిడి యిచ్చట స్వకరకనులంబున స్థాపించెను. తదాది నన్ను వజ్రభగవతీ యని పూజించెద రనియు, అయ్యా నీచే భోగవతీతోయంబుల స్నానం బాడి సంతసించితి నియ్యది నీపుణ్యవిశేషంబునకాదే" యని పొగడు చుండ మాససంపూర్తి జెందినకతంబున నాథుం డద్దేవిచే ననుజ్ఞఁ గొని యుత్తరదేశంబున కేగి ద్వారకను సేవించి యయోధ్యానగ రంబు ప్రవేశించెను.

ఇతి భక్తిసార నవనాథచరిత్రంబున మత్స్యేంద్ర వీరభద్ర యుద్ధకథావిశేష సప్తమాధ్యాయము సంపూర్ణము.

---

## అష్టమాధ్యాయము.

{ మత్స్యేంద్రనాథుం డయోధ్యానగరంబున పాశుపతనామ పృథ్వీశునికై సూర్యునితో యుద్ధంబొనర్చి శ్రీరామచంద్రుని ప్రత్యక్షం బొనర్చుట. }

మత్స్యేంద్రనాథుండు గోముఖతీర్థంబుల స్నానం బాడి ద్వార కాధీశుని దర్శించి గమనంబు జేయుచు నయోధ్యానగరంబు ప్రవేశించి సరయూతీరంబున గ్రుంకులిడి యాశ్రితజనామరమహీరుహుండగు శ్రీరామభద్రునిదర్శనార్థంబై జనుచుండె నట్టియెడ దాశరథి వంశ జాతుండగు పాశుపతనామంబున బ్రకాశించు ధరాధిపుండు నుచ్చై శ్శ్రవంబుల దిరస్కరించు హయసహస్రంబులతో దిగ్గజంబుల తృణీక రించు మత్తమాతంగవ్రాతంబుతో హాటకాచలగంభీరులగు దళసము దాయంబుతో వేత్రపాణులుస్తోత్రంబులు జేయ వందిమాగధులుబొగడు చుండ దండధరు లిరుపార్శ్వంబుల నుపరక్షకులై యుండ దివ్యాంబ రంబులు ధరియించి మణిఖచితహిరణ్మయాభరణంబు లవయవంబు లలంకరింప పూర్వపశ్చిమభాగంబుల భటకోటి నడువ దివాకరసవర్ణం

బున దేజరిల్లెడు పాకారిభంగి వినోదవై భవంబులతో రథారూఢుండై యోగిజనహృదయకుశేశయాభిరాముండగు మేఘశ్యాముని దర్శనార్థంబై జనుదెంచి తదాలయంబు జేరినంత దండధరులు ద్వారరక్షకులై నిలుచున్నసమయంబుననగణితగుణవిశేషుండగు యోగిశ్రేష్ఠుండు ద్వారసమీపంబు జేరి లోపలికిం బోదలంచిన, సప్తజన్మంబుల తస్కరులై బ్రహ్మహత్యాద్యనేకపాతకంబులచే శునకంబులక్రియ ప్రతీహారులై యుచ్చనీచంబు లెఱుంగని మందమతులు సురలోకవందితుండగు నాథుని నిందించుచు "నౌరా! భిక్షుకుండవై భూమీశుఁ డున్న సమయం బెఱుంగక లోపలికిం బోయెదవే జ్ఞానహీనా! విచారంబు లేదే" యని మెడ నెట్టి ద్రోసిన సిద్ధుండు క్షోభించియు పాశుపతాజ్ఞానుసారప్రవర్తకులగు సేవకులపై కోపంబేల నని తలంచి సతులు దమపతులకు వశులగుపగిది స్వతంత్రహీనులగు సేవకులు నిపరాధులు. వీరి ననవేల? పుడమిపతి చిత్తోద్రేకం బడంచిన భటులు దడబడుదురని భస్మంబు గొని స్పర్శాస్త్రంబుబ్రేరించిననయ్యది యానరనాయకుండు దశరథాత్మజుని చరణారవిందంబుల కెఱుంగ ధరణిపై దండంబుకై వశీబడియున్న సమయంబున ముట్టడించెను. నృపుం డపుడు లేవఁ దలంచి యయ్యస్త్రరాజమహిమాతిశయంబుచే నేలం గఱచుకొని ఖిన్నుండై యుచితాలోచనపరుండగు సచివుని బిలిచి వృత్తాంతంబు దెలుపమంత్రిశేఖరుండు తనమంతనంబున సిద్ధపురుషుల మంత్రప్రయోగంబు గాఁబోలును. మూఢమతులగు భటు లేమహామహుని నిందించిరో లేకున్న నీదురవస్థ లేల ఘటియించును? భక్తాగ్రేసరుండగు ప్రహ్లాదునికై నక్తంచరుండు మడియఁడే? దూర్వాసుండు దురాగ్రహంబున నంబరీషునిచే భంగపడఁడే? దాసాభిమానియగు కేశవుండు ద్విరదంబుకై నక్రంబును చక్రంబున దునుమఁడే? యని దలంచుచు ద్వారసమీపంబుజేరి రక్షకులచే గతవృత్తాంతంబు దెలుసుకొని నలుదిశలు నిరీక్షించి యొక్కచో నిక్కమగు యోగిమూర్తిని గనుంగొని "సమర్థా! కామక్రోధాదిషట్కంబు కడకు ద్రోసి శాంతశమదమాదిగుణంబుల కాటపట్టై మాయట్టిభవసాగరనిమగ్నుల కడ తేర్చం దలంచి లీలామానుష వేషంబున మెలంగెడు దయాంఘునుండవు గావున పుడమీశున్ని

రక్షింపు" మని వేడుకొన నాథుండు ప్రసన్నుండై భస్మం బభిమం త్రించి విభక్తాస్త్రంబుబఱపిన భూనాయకుండు విముక్తుండై విశ్రమించి సుఖసమాచారంబుదూతచే సఖుండగు మంత్రిముఖ్యునికిదెలుప ప్రధా నిశేఖరుండుసంతసిల్లిమత్స్యేంద్రుసిహస్తంబుగొని శ్రీరామచంద్రాలయం బుజేరిమునుముందుగా నిరుపమానంబగు సిద్ధునిచరితంబు దేటపఱచిన నప్పాశుపదుండు భీతహృదయుండై యమ్మునిముఖ్యుని చరణకంజంబు ల శిరంబు మోపి "దయాపరమూర్తీ! తమనామధేయంబు దెలుపు" మనివిచారించె నవ్వసుపుత్రుండుకనికరంబుబూని "రాజోత్తమా! నన్ను మత్స్యేంద్రుం డనియెద" రని పలికిన నద్భుతచరిత్రుండగు సిద్ధముఖ్యుని సుద్దులంతకుమున్నెఱింగినకతంబున నేడు నేత్రంబులం జూడనయ్యెనని పరమానందభరితుండై సచ్చరిత్రుని సుగుణరాజిని బొగడుచు నిజనికేత నంబునకు దోడ్కొని చని సభాస్థానంబునరత్నమయసింహాసనంబుపై యలంకృతుం జేసి షోడశోపచారంబుల బూజలు సలిపి తనుమనోధ నంబు లర్పించి భక్తియుక్తుండై శయనభోజనాదుల నెడతెగక సేవ లొనర్చుచుండ నాథుం డక్కరచే "పాశుపతా! నీమనోభీష్టంబు దెలుపు" మన నరాధిపుండు నమ్రుండై "హేకరుణామయా! సచ్చిదా నంద పరబ్రహ్మమూర్తియగు శ్రీరామచంద్రుని దర్శనంబు జేయింపు" మని విన్నవించెను. నాథుం డంగీకరించి నరపాలుని దోడ్కొని కొలు వుకూటంబు గడచి యొక్కచో నిలువంబడి ధూమాస్త్రంబు కల్పించి పాశుపతవంశనాయకుండగు వేలుపుల యిక్కపై నిగుడించిన నయ్యది చదలుముట్టి మబ్బులంగప్పి యద్దినేశుని శతాంగంబు జుట్టుకొని వెతలం బెట్టుచుండ చండాంశుండు మత్స్యేంద్రునికృతంబని యెఱుంగక నొక క్షితీశుని ప్రయోగనైపుణ్యం బని తలంచి మహావాతాస్త్రంబు బఱ పిన నది ప్రళయకాలజంఝానిలంబుపగిది భాసిల్లి దిక్కులం బిక్కటి ల్లిన నగంబులు కందుకంబులకరిణి నెగయుచుండ వృక్షంబులు సమూ లంబులై పక్షుల పగిది యంతరిక్షంబున గ్రుమ్మరుచుండ నపగతధూ మ్రజీమూతుండై వెలుంగుచున్న కమలమిత్రుని జూచి సిద్ధుండు పర్వ తాస్త్రంబుచే మార్గంబును బంధించి తే రరికట్టెను. సహస్రకరుండు వజ్రాస్త్రప్రయోగంబున భూధరంబుల బొడిసేయ యోగిపుంగవుండు భ్రమణాస్త్రం బడరించిన ప్రభాకరుని స్యందనంబు కులాలచక్రంబు

పగిది భ్రమణంబు జేయుచున్నంత నాశ్చర్యంబున తమోంతకుండు జ్ఞానాస్త్రప్రయోగంబుచే తద్భ్రమణశరభంజనంబు గావించి నభోమార్గంబున నేగుచుండ నమరలోకవందితుండగు మత్స్యేంద్రుండు వాతాకర్షణమంత్రప్రయోగంబుచే ఖద్యోతుని చేతనంబు దప్పించి రథహయంబులగతి యడంచి దశవాయువుల నాకర్షింప స్యందనంబు విష్ణుపదంబు దొలంగి యుర్విపైఁ బడ తపనుని కిరణజ్వాలానలంబుచే ధరణి దహించుచుండుతఱి యయ్యనఘుండు జలదాస్త్రంబుచే శాంతపఱచిన నాదిత్యుండు నిశ్చేష్టితుండై పడియుండెను. తత్సమయంబున హరిహరబ్రహ్మేంద్రాగ్నియమవరుణకుబేరప్రముఖ నిఖిలామరులు నతలవితలసుతలాది లోకనాయకులు వృక్షశాఖాగ్రంబులపై బక్షిసమాజంబు ప్రవేశించుచందంబున మత్స్యేంద్రునిసన్నిధికి విచ్చేసిరి. రమాధవుండు "మత్స్యేంద్రా! నైర్ఘృణ్యంబున సుధాకరమిత్రునిచే వృథా ప్రథనం బొనర్చుట తగునే" యన నాథుండు కమలాక్షుని చరణకమలంబులకు బ్రణమిల్లి "దామోదరా! ఇనవంశజాతుండగు పాశుపతుని యోగక్షేమలాభంబులు వంశనాయకుండగు దినేశుండు విచారింపఁ గూడదే? సేవకుని గాపాడనిస్వామి స్వామియౌనే? బాలకుల బోషింపని తల్లి తల్లియౌనే" యని పలుకుచు "వైకుంఠనాయకా! మత్కృతశాబరీవిద్యకై యీవేయిచేతులదిట్ట సహాయంబొనగూర్చి యిప్పాశుపతనామపృథ్వీశునకు దివ్యమంగళవిగ్రహుండగు శ్రీరామచంద్రునిదర్శనం బొసంగవే" యని ప్రార్థింప లక్ష్మీనాయకుండు "సిద్ధముఖ్యా! నీమనోరథంబు లీడేరు. నీవాక్స్థానంబున త్రిలోకపావనుండగు భాస్కరుండు ప్రత్యక్షంబై నిలుచు. మున్నునాగాశ్వత్థవృక్షంబున నాదిత్యాది దేవతలు ప్రసన్నులై వరంబు లొసంగిన దెఱుంగవో శీఘ్రంబున తపనుని తాపోపశమనంబు జేయు"మనుచు పాశుపతపుడమిఱేనకై విశ్వోద్భవస్థితిలయాది హేతుభూతుండగు రామభద్రుని దర్శనంబు జేయించిన శివుండు హర్షించుచుండ పాశుపతుండు ముదాన్వితహృదయపంకేరుహుండై తాపత్రయాగ్నిశమనుండగు శ్రీరాముని పదకమలంబులపై విన్యస్తమస్తకుండయ్యెను. రఘుపుంగవుండు పాశుపతుని దనహస్తంబుల నెత్తి "పాశుపతా! వంశపావనచరిత్రుండవైతి" వని పలుకుచుండ మత్స్యేంద్రుండయ్యినకులాబ్ధిచంద్రుండగు జానకీపతిచరణసరోజంబుల కెఱఁగి

కృతాంజలిపుటుండై వికసితోత్పలదళశ్యామ త్రిలోకాభిరామా! యని యనేకవిధంబుల స్తోత్రంబులు జేయుచుండ పరంధాముండు వసుకుమారు నెద నదుముకొని "నాథా! వరంబు వేఁడు" మనెను. సిద్ధుండు "నీయనంతనామంబులలో నక్షత్రమండలంబున సుధాకరు నిభంగి బ్రకాశించెడు త్రిలోకపావనంబగు రామనామంబు మన్నిర్మిత శాబరీకల్పంబున కల్పద్రుమంబుకై వడి కామ్యపరిపూర్తి జేయం దలంచెద" నని కొనియాడ రాముండు "సిద్ధముఖ్యా! బ్రహ్మవిష్ణు మహేశ్వరస్వరూపుండగు దత్తాత్రేయుని వరదహస్తంబు నీమస్తకంబుపై యుండ నృసింహాదులు సహాయంబై వరంబు లొసంగ నేను నీమనోభీష్టంబు దీర్పకుందునే? నానామం బేమంత్రంబున స్మరియించెదో అయ్యది కార్యానుకూలం బగును. నీవు కేవల కవినారాయణుండవు మనయుభయులకు భేదంబేల! నాదిత్యుండు నభంబున లేమిం జేసి యంధకారబంధురంబగు వసుంధరను జూడుము. జగద్వ్యాపారంబు లుడిగెను. తడవేల నుపశమింపు" మని చెప్ప యోగిసార్వభౌముండు వాతాకర్షణం బుపసంహరించిన నద్దివాకరుండు లేచి చూచుచుండ సురసముదాయంబు వందనంబు లాచరించినం గైకొని నికటంబున నిల్చియున్న హరిహరబ్రహ్మలం గని "న న్నేక్షత్రియుండు పరిభవించె నింతటిమహాశూరుం డెవండు కాఁబోలును? శ్యామకర్ణహరణార్థంబై పరాక్రమంబు గనబఱచెనో మీరలేగు దెంచునంతటికాగ్యం బెవండు దలపెట్టెనో యట్టి దుర్జయపరాక్రముని జూపు" మన్నంత శ్రీమన్నారాయణుండు కరం బెత్తి మత్స్యేంద్రుని బిలువ నాప్రాజ్ఞుండు చంద్రాస్త్ర జలదాస్త్రంబుల నుష్ణాంశునికిరణజ్వాల లడంచి సమీపంబు జేరి నమస్కారంబు గావించిన నక్కమలాప్తుండు సురసంఘంబు బొగడుచుండ సిద్ధుని యపారనైపుణ్యం బుగ్గడించి "యోగిపురుషా! నీనామధేయంబు దెల్పు" మన విష్ణుండు నాథుని జన్మవృత్తాంతచరిత్రం బెఱుంగించి "యీతనినామంబు మత్స్యేంద్రనాథుం డనియెదరు. కవినారాయణుం" డని తెలియబలికెను. మిత్రుండు మున్నీసిద్ధుని యెఱుంగుదు ననుచు సంతసిల్లి "మత్స్యేంద్రా! నీయభీష్టంబు వేఁడు" మని పలికిన నతండు "మత్కృతశాబరీవిద్యసహాయం బొసంగుము. ఏమంత్రంబున నీనామం బుచ్చరించెదనో ప్రత్యక్షస్వరూపుండవై కోరికల నెరవేర్చెద" వని విన్న

వింప ఛాయానాయకుం డౌనని పూర్వవరనుగ్రహించి పిమ్మట పాశు
పతుని మనోరథంబు లీడేర్చి నిజస్యందననాయకుండై గగనంబున నెగసి
కాలనియమ ప్రకారం బరుగుచుండ శివకేశవాది సకలదేవతలు తమ
తమ విమానంబులపై నుపవేశించి నిజనివాసంబుల కరిగిరి. రఘువల్ల
భుండు పాశుపదుని కోరికలు దీర్చె ననంతరంబ మత్స్యేంద్రనాథుండు
పాశుపతభూవల్లభుని దీవించి యనుమతింగొని తీర్థయాత్రోన్ముఖుండై
జనుచుండెను.

ఇతి భక్తిసార నవనాథచరిత్రంబున పాశుపతనిమిత్త మత్స్యేం
ద్రభాస్కర యుద్ధకథావిశేషం బష్టమాధ్యాయము సంపూర్ణము.

---

## నవమాధ్యాయము.

మత్స్యేంద్రనాథుండు చంద్రగిరిగ్రామంబున గర్తంబునుండి గోరక్షనాథునిదీయుట.

తపోధనుండగు మత్స్యేంద్రనాథుండు మోక్షదాయకంబులగు
యయోధ్యా మథురా మాయా కాశీ కాంచీ యవంతికా ద్వారావతీ
తీర్థంబులు సేవించి గయాప్రయాగాదుల దర్శనంబు లాచరించి
బంగాళదేశంబున చంద్రగిరినగరంబు జేరి భిక్షార్థంబై గ్రామంబున
జరించుచు నొకవేదవిద్బ్రాహ్మణుని సదనంబున కేతెంచి యియ్యది
సర్వోపదయాళుని భవనంబు ము న్నీతనికాంతయగు సరస్వతీదేవికి
పుత్రునికై మిత్రు నుద్దేశించి భస్మప్రసాదంబిడి ద్వాదశవర్షంబులపై
విచ్చేయుదు నని పలికితి నని తలంచి తత్పుత్రుని నేత్రోత్సవంబుగ
జూచుటకై గృహంబు ప్రవేశించి సరస్వతీదేవీ! యని విప్రకాంతను
బిలువ నాశుభాంగి మత్స్యేంద్రుం డని యెఱుంగక నొకభిక్షుకుం
డని యూహించి పదార్థంబు దోసిటం గొని యోగిముఖ్యుని సమీ
పించె నతం "డో మందయానా! నీప్రాణనాయకుని నామంబు కులంబు
దెలుపు" మన నమ్ముగుద "మత్ప్రాణేశ్వరుని నామంబు సర్వోపదయా
ళుండు. గౌడబ్రాహ్మణకులం" బన విని నిస్సంశయుండై "నీపుత్రుం

డెక్కడ జూపు" మన నాద్విరదగామిని "నేను సంతానవతిని గా" నని పలికెను. నాథుండు బుడిబుడ్లుపోవుచు "నీకు పుత్రుండు లేఁడా! మున్ను పుత్రునికై భస్మప్రసాదం బే నిడలేదా? అయ్యది మిత్రమంత్ర ప్రభావ యోగంబున ప్రభాకరునిభంగి భాసిల్లెడుపుత్రుని నిర్మింపకుండునె? యజరామరుండగు తనయుని నా కేల జూప" వని యడిగిన నచ్చేడియ మున్ను భస్మం బిడిన జడదారి యని దిగులు జెంది గడగడ వడంకుచు తనడెందంబున సిద్ధుండు శపియించునో భస్మంబు బాఱవైచితి నన్ను భస్మంబు జేయునో యూహలగు పడఁతులచే మోసపోయితి నని మదిఁ గుందుచు తన్ను తా నిందించుకొనుచు తబ్బిబ్బుబడుచుండ యోగపూర్ణుండు "నోజననీ! సుతుని గనబఱచు మన్న నుతిదొలంగి వెతలం జెందు టేల" నన నాసతీతిలకంబు యతులితభయభ్రాంత చిత్తయై పలుకకున్న నలుగునని శంకించి సత్యంబు నిత్యంబని మత్స్యోదరసంభవుని పాదపద్మంబులపై వ్రాలి నేత్ర బాష్పంబుల దడుపుచు "దయాఘనా! క్షమాశీలా! భవత్ప్రసాదభస్మంబు పరమా హ్లాదంబున గైకొని భక్షించందలంచియు నుందమతులగు మత్సఖీమ ణులు 'భస్మంబున బాలు రౌదురే విచారంబు లేదే యపాయంబు బొ సంగు' నని పలువిధంబుల బోధింప దైవహతబుద్ధినై భయంబు జెంది తద్భస్మంబు కసువునం బడవైచితి" నని శోకించుచున్న తన్విం జూచి యోగీంద్రుండు హితాహితం బెఱుంగని సతీమణులు ప్రసాదార్హు లగుదురే? చపలాత్ములకు స్థిరచిత్తంబు లుండునే? సర్వమాయాకరండు లగు స్త్రీలు పాపజాతులు గారె? గతకార్యంబునకు విలపింపనేల? విధి కృతం బని తలపోసి "సూర్యమంత్రంబుచే వీర్యవంతంబగు భస్మంబు సంజీవినీయోగంబున సజీవంబై విలసిల్లుంగాక. పాఱవైచినస్థలంబు జూపు" మని విచారింప నమ్మేటిపడఁతి తాపసోత్తముని దోడ్కొని గృహానైకటికగర్తంబు కనుబఱచిన నయ్యది గోమయంబుచే పర్వతా కారసన్నిభంబై యున్నం గనుంగొని ద్వాదశవర్షంబుల బాలుండు హరినారాయణాంశంబున నిందు గలండని నాథుండు నిశ్చయించి గోమయాంతర్గతుండై ప్రకాశించుచున్నకతంబున గోరక్షనాథా! యని సంబోధించి పైకిరమ్మని పిలిచిన గోరక్షుండు "గోమయభారాతిశ యంబుచే బడియున్నా" నని ప్రత్యుత్తరంబిచ్చెను. తత్క్షణంబ సిద్ధుండు

ఖనిత్రంబులచే ఖననంబు జేయించి గోరక్షుని పైకిదీయ దీర్ఘబాహువిశాలవక్షంబుతో కమలాక్షుం డనజాలి సుందరతరతనుకాంతి తపనుని దిరస్కరించుచుండ ముఖచిహ్నంబున ప్రపంచనిస్పృహత్వంబు వాటిల్ల తోయపూరితకుంభంబుపగిది నిశ్చలుండై మూర్తివంతంబగు నిష్కళంకవైరాగ్యంబో యన పురోభాగంబున రూపసౌందర్యంబులచే ప్రకాశించుచున్న గోరక్షుని జూచి సరస్వతీదేవి "హా! ఈసుకుమారుండు మద్గర్భంబున యర్భకుండై యుద్భవింపం బడుచుండెను. సిద్ధుని యద్భుతచరిత్రం బెఱుంగనైతిని. మద్భాగ్యం బెంతని కృష్టంబు దుర్భరంబగు దుఃఖం బేవిధి సహింతు" నని పెల్లేడ్చుచున్న పల్లవాధరిని ముల్లోకపూజ్యుండగు మత్స్యేంద్రుం డాగ్రహించి చనుచనుమని శాపం బిడదలంచిన నక్కిసలయోష్ఠి భయవిహ్వలాంగియై నిజభవనంబున కరిగెను. తదుపరి మత్స్యేంద్రుండు గోరక్షునిమస్తకంబున వరదహస్తంబుంచి స్వస్వరూపజ్ఞానం బుపదేశింప తద్బోధామృతపానవిశేషంబున గోరక్షుండు నిత్యానిత్యవస్తువివేకజ్ఞానసంపన్నుండై దృశ్యమానప్రపంచంబు మాయంబో యని తృణతుల్యంబుగా దలంచుచు నిరస్తమోహుండై సకలచరాచరభూతాంతర్యామి యగు శ్రీమన్నారాయణస్వరూపుండు తానే యని హరినారాయణుండగు గోరక్షుండు వెలుంగుచుండ మత్స్యేంద్రనాథుండు "గోరక్షా! తీర్థసేవార్థంబై చనవలయు ర" మ్మన గోరక్షుండు గురుమూర్తిపదపద్మంబులకు

## మత్స్యేంద్రనాథుండు గోరక్షనాథసహితుండై కనకగిరి కేగుట.

నమస్కరించి వెంటనంటి జనుచుండెను. మత్స్యేంద్రుండు శిష్యసమేతుండై చంద్రగిరిస్థానంబు విసర్జించి జగన్నాథంబునకు గమనంబు జేయుచుండ మార్గమధ్యంబున శృంగారంబుచే పొంగారుచున్న కనకగిరిగ్రామంబు గాంచి నాథుండు క్షుధాతురుండై "గోరక్షా! గ్రామసంచారంబు గావించి భోజనపదార్థంబులు దె" మ్మని కక్షపాల నొసంగి యాజ్ఞాపింప నవశ్యం బని గ్రామంబు ప్రవేశించి భిక్షార్థంబై దిరుగుచు నొకభూసురుని సదనంబున కరుగ నానాఁ డామహీసురుని భవనంబున పితృకార్యం బున్నకతంబున నిమంత్రణబ్రాహ్మణభోజనానంతరం బా గృహాధిపతి భోజనము జేయందలంచు సమయంబున గోరక్షుం డలక్

భిక్షాప్రశ్న యొనర్చె నంత రూపలావణ్యగుణజాలంబుల పెంపెక్కిన
గృహకాంత బాలుండగు గోరక్షుని తనువిలాసంబు జూచి "యిబ్బా
లుండు బాలార్కతేజుండై ప్రకాశించుట కేమిహేతువో నరుండో
నరవేషధారియగు వియచ్చరుండో" యని మనంబున యభివర్ణిం
చుచు భక్ష్యభోజ్యలేహ్యచోష్యాదులు నానావిధ శ్రీఖండపాయసాది
మధురపదార్థంబులు వడాదితైలపక్వ ఘృతపక్వఖాద్యంబులు విచిత్రతర
చిత్రాన్నంబులు బాలుని ముందట నిడిన నబ్బాలుం డెన్నడెఱుంగని
కారణంబున నాయన్నున కుశలత్వ దయాపరత్వ గుణంబులు పదార్థ
వైచిత్ర్యంబులు మనంబున ఘనంబుజేయుచు బుచ్చుకొని ముదంబున
మందయానను దీవించి శీఘ్రగమనంబున నిడిదికిం జేరి గురుసమక్షం
బున సమర్పించె నయ్యోగిముఖ్యుండు పరిమళవంతంబులై నేత్రోత్స
వంబు జేయుచున్న బహువిధపదార్థంబులు భుజియించుచు పక్వశాక
చక్యంబులు బొగడుచు వడలయందపేక్ష బహుళంబు గలవాడై
దనివితీరక శిష్యుండగు గోరక్షునివదనం బాలోకింపుచుండ నబ్బాల
కుండు "తపోధనా! భవదీప్సితంబులు విశదపఱతు" రని నమ్రుండై
విచారించెను. మత్స్యేంద్రుండు "గోరక్షా! ఈరుచికరంబులగు
వడలు దెచ్చెదవా" యన శిష్యుం డవశ్యంబని తద్బ్రాహ్మణి భవనంబు
నకు పునరాగతుండై "యోజననీ! మద్గుర్వీప్సితంబు వడలయం దమి
తంబై యున్నది. కటాక్షించి కామ్యపరిపూర్తి జేయు" మని వేడు
కొనిన నాలోలాక్షి "యౌనౌను. నే నెఱుంగుదును. కుక్షింభరత్వం
బుకై గురునెపం జేలదెలిపెద వయ్యవిరిక్తవాక్యంబులచే లభియించు
నే" యన గోరక్షుండు "తల్లీ! యింతటికై యనృతంబు లాడుదునే?
నానృతాత్పరం పాపంబని యెఱుంగనే? నీకెయ్యది యభీష్టంబో
కోరు" మన నాశుభాంగి "నీవు గురుభక్తిపరాయణుండవు నిక్కమేని
నీనేత్రంబులిచ్చి పదార్థంబులు గొనిపో" మ్మనెను. తక్షణంబ గోరక్షుండు
చక్షులందీసి యక్కుటిలాక్షిసమక్షంబున నుంచ ధారాధర జలధార
లపగిది రుధిరంబుగారుచు వసుంధర నలంకరింపుచుండ గనుంగొని
యాకలభగామిని కడుభయంబుచే హాహాకారంబుజేయుచు లోపలికిం
జని "నాయట్టిదురాత్మలు గలరే? బాలుని నిరర్గళధైర్యసాహసంబు
లెఱుంగక కర్ణకఠోరంబగు ప్రశ్న జేసితిని. దృఢభక్తివిశేషుండగు సచ్ఛి

ష్యం డని దలంపనైతి. మూఢమతి" నని తన్నుతా నీసడించుకొనుచు నాబడుచు వానికి కడువడిం దడబడుచు వడలిడి "సమర్థా! నాదుడు కుతనంబులు మన్నింపు" మని దుఃఖించుచు పలువిధంబుల బ్రస్తుతించి చక్షులు దీసుకొన్నునెను. విరజస్తముండగు గోరక్షుండు "అమ్మా! భీతిల్లనేల? నీకతంబున సద్గురుమూర్తి తృప్తింబొందు తత్ఫలం బప రిమితంబై యుండు వెఱవకు" మని యాదరించి పటబద్ధాక్షుండై వామహ స్తంబున చక్షులం ధరియించి వేగంబున యోగిముఖ్యుని జేరం జని పడలు సమర్పించెను. మత్స్యేంద్రుండు "వత్సా! నయనంబులపై వస నం బేలగట్టితి" వని విచారింప శిష్యుండు ప్రకటించిన భుజియించు నో లేదో యని మనంబున సంశయంబు గలిగి "భోజనానంతరంబున దెలియపఱచెద" నన సిద్ధుం డనుమానించి "గోరక్షా! నీముఖవిలా సంబు గుందినది. నీపరితాపంబు తేటబఱుపుము. లేకున్న నే భుజియిం తునే? ఈపదార్థంబు గోమాంసతుల్యం బని దలంచెద" నని నిగ్రహించి పలికెను. శిష్యుండు "నాథా! తమయభీష్టంబు దీర్పందలంచి వడలకై యరిగినంత నావిప్రకాంత గురుభక్తిపరాయణుండవేని నీచక్షులుదీయు మని ప్రశ్నింప కార్యసాధనపరుండనై కరాంగుళీయోగంబున నయ నంబులు దీసితి" నని విన్నవించెను. సిద్ధుండు గోరక్షుని గురుభక్తికి సంతసిల్లి నిజహస్తంబుల బద్ధపటంబు విడచి యాచక్షులు తనతపోయో గప్రభావంబున స్వస్థానంబున నిలిపి శిష్యసమేతుండై భోజనంబు సల్పి పిదప తనయంకంబుపై నుంచుకొని "గోరక్షా! కృతకార్యుండవైతి" వని ప్రేమాతిశయంబుచే దత్తాత్రేయానుగ్రహమంత్రరహస్యంబు లన్నియు నొకమాసం బచ్చో నివసించి దేటపఱచి శాబరీవిద్యాకవిత్వరచ నానుర్థత్వం బుపదేశించెను.

ఇతి భక్తిసార నవనాథచరిత్రంబున మత్స్యేంద్ర గోరక్షనాథ కథావిశేషంబు నవమాధ్యాయము సంపూర్ణము.

---

# దశమాధ్యాయము.

{ గోరక్షనాథుండు సంజీవినీమంత్రయోగంబున మృత్పుత్త లిచే గహినీనాథునిజన్మం బొనర్చుట. }

గోరక్షుం డధ్యాత్మవిద్యాప్రభావయోగంబున నిత్యానిత్యవస్తు వివేకజ్ఞానంబుచే సచ్చిదానందపరబ్రహ్మస్వరూపుండై వెలుఁగొందుచుం డెను. మత్స్యేంద్రనాథుండుగోరక్షునకు వేదశాస్త్రపురాణేతిహాసంబులు నృత్తగీతవాద్యభేదంబులు స్వరశాస్త్రరసాయనశాస్త్రంబులు హ్రస్వదీర్ఘాది గణవిశేషంబులు నవరసాలంకారకవిత్వ రచనాకుశలత్వంబులు నానామంత్రప్రయోగోపసంహార సహితంబగు ధనుర్విద్యావిశారదత్వంబుగనపి బ్రహ్మాస్త్ర మారుతాస్త్ర జలదాస్త్రాది మహదస్త్రంబు లొసంగి చండ చాముండాది మహాశక్తిసంఘంబును కాల సిద్ధ బాల వీరప్రముఖ భైరవవర్గంబును నృసింహ జోటింగ బావనవీరాద్యుగ్రదేవతలను వీరాగ్రేసరులగు వీరభద్రమారుతులను ఇంద్రాగ్నియమవరుణకుబేరప్రముఖదిశాధినాయకుల నణిమాద్యష్టసిద్ధులను జలదేవత స్థలదేవతాది నానాదేవతలను ప్రత్యక్షంబు జేసి గోరక్షున కాశీర్వదించి వరంబు లొసంగుమని వేఁడిన నమ్మహామునులు గోరక్షుండు హరినారాయణుం డని తలంచి యబ్బాలుని శిరంబున వరదహస్తంబుంచి గాఁగిటం జేర్చి దీవించి యోగివర్యుండగు మత్స్యేంద్రునితో 'నిబ్బాలుండు తపం బాచరించెనేని నిరుపమాన తేజోవంతుండై ప్రకాశించు' నని చెప్పి యంతర్ధానంబు నొందిరి. పిదప నొకానొక దివసంబున గోరక్షుండు సంజీవినిమంత్రజపధ్యానతత్పరుండై రహస్యంబున నుపవేశించి యుండు నెడ గ్రామబాలురు శైశవక్రీడావినోదంబుచే మృత్తిక చేతం బూని మత్స్యేంద్రనాథుండు లేమిం జేసి గోరక్షుని సమీపించి "తమ ఖేలనంబునకై కర్దమంబుతో శకటంబు జేయు"మని విచారించుచుండ నాథసుతుండు "శకటరూపం బే నెఱుంగను. మీరలే జేయు" మని జెప్పిన నబ్బాలు రొకశకటంబు జేసి సారథియైన బాగుండునని తలంచి

గోరక్షునితో "శకటంబు మాచే నిర్మింపఁబడియె. సారథిని జేయువిధం బే మెఱుంగము. నీవు జ్యేష్ఠుండవు గావున జేయు" మని పలుక గోరక్షుండు భవిష్యత్కారణహేతుద్భూతహృదయుండై మృత్పిండంబును గైకొని సంజీవినీమంత్రంబు జపియించుచు పుత్తలిం జేయుచున్న తత్పుత్తలి యవయవంబు లేర్పడి శిరాస్థిమాంసచర్మాదులు గలిగి సజీవంబై రోదనంబు జేయుచుండ బాలు రదిజూచి భూతంబని భావించి "మనల భక్షించును. గోరక్షుని గబళించును. తడవేల" నని బరుగులిడుచుండ మార్గమధ్యంబున మత్స్యేంద్రనాథుండు భయభ్రాంతులై ప్రధావించుచున్న బడుగువారలం జూచి "బాలులారా! మీ రేల పరుగెత్తుచున్నా" రని విచారింప నబ్బాలురు తద్వృత్తాంతంబు చేట పఱచుచు "గోరక్షుండు గబళింపంబడి యుండనోపును. మీ రేల యరిగెదరు. మిమ్మైనను మ్రింగు"నని బలుకుచున్న బిన్నవారిమాటల కచ్చెరువొంది మత్స్యేంద్రుండు"నాకాభూతంబును జూపుడి నేనుండ మీకు భయంబేల" నని చెప్పుచు గొండికవారిం దోడ్కొని యరిగిన వారలదిగో భూతంబని జారచోరులు పార్థివునిజూచి భయస్థులగుభంగి రామమంత్రధ్యానతత్పరునకు భీతిల్లిన భూతంబులకైవడి దూరస్థులై గనుబఱచుసమయంబున గోరక్షుండు భూతంబు భూతంబని బాలురు పరుగెత్తినది చూచి భీతచిత్తుండై తచ్ఛిశువును బాఱవైచి యొకగృహంబు జేరియుండె నపుడా మత్స్యేంద్రనాథుండు బాలార్కతేజుండగు డింభకుండు కరభంజననారాయణుండని గ్రహించి హస్తంబుల నెత్తుకొని గోరక్షుం గానక ప్రతిగృహసమీపంబు జేరి "గోరక్షా" యని కేకలిడుచుండ బాలురందరు నాథుండు మాపై భూతంబు విడుచునని యల్లరిజేయుచు కంపాయమానశరీరులై పరుగెత్తుచుండి రంత నవ్వ లవ్వసుకుమారునితో "నాథా! మా బాలుర కేమిభయంబు జూపితిరి. యీశిశువెక్కడిది" యని విచారింప "గోరక్షుండగుపడినపిమ్మట దెలిపెద" నని పలుకుచు గోరక్షా! గోరక్షా! యని బిలచిన నతం డది నిజగురుశబ్దంబని తలంచి యొకగృహంబు వెలువడి మత్స్యేంద్రునిహస్తకమలంబుల తేజోవంతుండగు యర్భకునిజూచి భూతం బని భ్రమియించి తొలంగిపోయెను. నాథుండు గ్రామబాలుర పగిది గోరక్షుండు భీతిల్లెనని యుద్దేశించి శిశువు నచ్చోటడించి యొక

వస్త్రంబు గప్పి గోరక్షుని వెంబడించి భయపడకు మని గౌఁగిటంజేర్చి "వత్సా! భూతంబుగాదు. మనుష్యశరీరధారియగు కరభంజననారాయణుండు యీపాపం డెవ్విధి జన్మించెనో దెల్పు" మన గోరక్షుండు "గురుసమర్థా! సంజీవినీమంత్ర జపంబుచే బాలుర శైశవవినోదంబుకై మృత్పుత్తలిం జేయుచుండ నయ్యది సజీవంబై మృణ్మయాకారంబు వదలి రుధిరాస్థిమాంసచర్మయుతంబై ద్యుతిబూని రోదనంబు ప్రారంభించిన నబ్బాలురు భూతంబని విచ్చలవిడి నటమరించిరి. నిజంబ కాబోలునని తలంచి భీతిల్లితిని. మీరేల గొని తెచ్చితిరి. భూతంబు నన్నేమిజేయునో" యన నాథుండు బాలుండగు గోరక్షుని ముఖకమలచుంబనంబు గైకొని "పుత్రా! వెఱవనేల? మిత్రప్రభావయోగంబున నీవుద్భవించిన దీ వెలుంగవే? సంజీవినీమంత్రరాజజపధ్యానతత్పరత్వంబున పుత్తలింజేయుకతంబున కరభంజననామనారాయణుం డందు బ్రవేశించి శిశురూపంబున బ్రవర్తిల్లె" నని దేటపఱచెను. గోరక్షుండు విగతభయుండై నాథునివెంటనంటి యాకుఱ్ఱని జూచుచుండ మత్స్యేంద్రుండు చిఱుతని తనకరంబుల నెత్తుకొని కుటీరంబున కేగి గోదుగ్ధంబుల దృప్తుంజేసి వస్త్రడోలికయందుంచి సాకుచుండునంత తత్పురవాసులు సిద్ధునిదర్శనార్థంబై జనుదెంచి జోహారులిడి యప్పాపని వృత్తాంతంబు విచారింప యోగద్రుముండు గతంబెల్ల దెల్లంబుజేసెను. వార లసదృశగుణవిశేషుండగు మత్స్యేంద్రుని గొనియాడుచు "నుశనుండు సంజీవినీమంత్రయోగంబున శవాకారులగు పిశితాశనులం బ్రతికించెనుగాని కర్దమనిర్మితంబగు పుత్తళియందు ప్రాణంబులుంచెనే? మాణవకుండగు గోరక్షుని మహిమాతిశయంబు భోగికులాగ్రగణ్యుండైన బాగడునే? పితామహుండు నిజశక్తి ప్రతాపంబుచే ప్రజలనిర్మించుంగాని మత్స్యేంద్రయోగివర్యుండు శిష్యకృతమంత్రపునశ్చరణయోగంబుచే మృత్పుత్తిమను సజీవంబై వెలుంగంజేసె నిక్కలికాలంబున ప్రత్యక్షపరమేష్ఠియనందగు మత్స్యేంద్రయోగివర్యుని గొలువ నలువకైన యలవియగునే" యని యన్యోన్య సంభాషణంబులు జేయుచు (నాథునితో) "తాపసోత్తమా! పురుషులు శిశుపోషణం బెఱుంగరు. చేడియలచెయ్వులు చేడియ లెఱుంగుదురు. మాతృహీనంబగు శిశుపోషణం బతికష్టం" బని విన్నవింప నిక్కంబని

దలంచి మత్స్యేంద్రుండు "శాబకుని బోషించువారెవరైన నిప్పురం బున గలరా" యన నప్పురవాసులు "సిద్ధముఖ్యా! ఏతద్గ్రామంబున మధునామయుండగు నొకమహీసురుండు గలఁ డప్పుణ్యశమి వేల్పుప్రోయాలు గంగాదేవి యనునది రూపలావణ్య విశేషంబుల బెంపొంది యతులితప తిభక్తిగలిగి సుతులు లేనికతంబున ననేకవ్రతంబులు సలిపి తత్ఫలంబు గానక వ్యర్థజీవనంబని నిస్పృహాత్వంబుచే విలపించుచున్న" దని మధువి ప్రునిభాగ్యోదయకారణంబున బలుక నాథుం డాసతీతిలకంబునకు పాప నివ్వం దలంచి పతిసమేతంబుగ బిలిపింప నతిముదంబున నేగుదెంచిన నయ్యతివకు నర్భకు నర్పించి "యోజననీ! ఇబ్బాలుండు వరదాయకుం డగుకరభంజననారాయణుండు సురలోకవంద్యుండగు దేవకీనందనుని చందంబున జగత్ప్రకాశకిరణుండగు ప్రభాకరునిపగిది వెలుంగుచు నంబ రకేశుని ప్రత్యక్షంబు బడయు నయోనిసంభవుండై మహాగహనంబగు చరిత్రంబుగలిగి రేజరిల్లుచు గహినీనాథనామంబున జగద్విఖ్యాతి నొం దును. మేమిపుడు తీర్థయాత్రోన్ముఖులమై జని యెదము. ద్వాదశవర్షంబు లకు గోరక్షనాథుం డిచ్చోటి కరుదెంచి యనేకమంత్రరహస్యంబులు గహినీనాథున కుపదేశించి పరిపూర్ణపరబ్రహ్మస్వరూపుని జేయు" నన నాయన్నులమిన్న "యోగిశ్రేష్ఠా! నాకొకసంశయం బుదయించెను. ద్వాదశవర్షంబులపై గోరక్షుండు విచ్చేసి గహినీనాథుని దోడ్కొని జనునో బాలుండు పుత్రరూపంబున నుండునో లేదో భవదనుగ్రహపు త్రుండగు గహినీనాథుని బాయుదునో నాకెఱుంగింపవే" యని వేఁడు కొన మత్స్యేంద్రుం డమ్మృగాక్షితో "తల్లీ! నీకీసంశయంబేల! నీయర్భ కుండు నీసుతుండై ప్రకాశించును. మే మిబ్బాలుని మఱువలేము. గోర క్షుండు మంత్రరహస్యంబు లుపదేశించి చనును. నీపుత్రుండు చిరంజీ వుండై నీనికటంబుననే యుండు" నని పలుకుచు నక్కాంతామణిపై మోహనాస్త్రప్రయోగంబు జేసి పాపనియందపార మోహంబుకల్పించి వక్షోజంబుల క్షీరంబు లూరించిన నప్పద్మాక్షి నిజసదనంబున కేగి డింభ కుని డోలికయందుంచి తోటిపడఁతుల బిలచి 'గహినీనాథుం' డని నామకరణంబు జేసెను. తదుపరి మత్స్యేంద్రనాథుం డప్పురంబున కొన్ని దివసంబులు గడపి గ్రామస్థులచే ననుమతిగొని గోరక్షసమేతుండై తీర్థ యాత్రాభిలాషంబున జనుచు మార్గమధ్యంబున గోరక్షుని మంత్ర

శక్తి బరీక్షింపుచు ప్రయోగోపసంహారంబులు సులభంబులై గాన రామింజేసి తపఃప్రభావంబున మనోదృఢం బేర్పడునని తలంచి కేదారేశ్వరుని స్వాధీనపఱచి తపఃప్రారంభంబు గావింపవలయునని హిమాచల మార్గంబున బదరికాశ్రమంబు జేరంజనెను.

ఇతి భక్తిసార నవనాథచరిత్రంబున మత్స్యేంద్ర గోరక్ష గహినీనాథ కథావిశేషంబులుగల దశమాధ్యాయము సంపూర్ణము.

---

## ఏకాదశాధ్యాయము.

మత్స్యేంద్రనాథుండు బదరికాశ్రమంబున గోరక్షనాథుని తపంబునకై నియమించి యరుగుట.

ఇవ్విధంబున మత్స్యేంద్ర గోరక్షులు బదరికాశ్రమంబు జేరి కేదారేశ్వరుని దర్శించి ముకుళితకరకమలులై "యోగపయోపరమూర్తీ! ఆశ్రితజనసంరక్షకగుణజాలుండవగు నీమహిమాతిశయంబులు బొగడ బ్రహ్మేంద్రాదులకైన తరంబగునే? హరా! త్రిపురహరా! భువనబ్రహ్మాండంబులకు కర్తవై భర్తవై హర్తవై వెలుంగు నవాఙ్మానసగోచరంబగు నీసచ్చిదానంద విగ్రహంబు సామాన్యులకు గోచరంబగునే? ఓయనాది నిధనా! కందర్పదర్పదమనా!" యనుచు నీశుని యపారగుణరాశిం బొగడుచుండ భక్తజనానుగ్రహసమగ్రుండగు భర్గుండు బ్రత్యక్షంబై సచ్చరిత్రుండగు మత్స్యేంద్రుని కౌఁగిటంజేర్చి నికటంబున నధిష్ఠింప నియమించి యోగక్షేమంబులు విచారింపుచు గోరక్షుని దనకరాబ్జంబులచే నిజాంకంబుపై నుంచుకొని మూర్ధంబు బునుకుచు "మత్స్యేంద్రా! ఇబ్బాలుండు బ్రహ్మాండతారకుండగు హరినారాయణుండు కనకగిరినగరంబున నాదిత్యాద్యఖిలదేవతలు నీచే బ్రస్తుతింపంబడి ప్రసన్నులై యిగ్గోరక్షుని దీవించి వరంబు లొసంగిన దేనెఱుంగుదు. నీ వనేకవిద్య లుపదేశించినను నీరంబులులేని తీరంబులకరణి నాసికంబులేని ముఖంబుపగిది భూరుహంబులులేని పురంబుభంగి తపోబలంబులేని మంత్రంబు లపారతేజోవంతంబులై శోభిల్లునే? కావున నిబ్బాలుని మదీయాశ్రమంబున తపంబొనరించుటకు నియమింపుము. జీవనంబులచే

వృక్షంబు లభివృద్ధి జెందినక్రియ తపఃప్రభావంబున మంత్రంబులు మూర్తివంతంబులై దేజరిల్లు" నని చెప్ప మత్స్యేంద్రనాథుండు "దయాఘనా! నీలకంఠా! చిఱుతప్రాయముగలగోరక్షుం డోపునో లేదో" యని పలికెను. విశాలాక్షుండు "మత్స్యేంద్రా! నీహస్తకమలంబు గోరక్షుని మస్తకంబున నుంచితివి తత్కారణంబున నిబ్బాలుండు నిర్భయుండై తపంబొనరించును. నే నప్పుడప్పుడు వీరియోగక్షేమంబులు విచారించెద" నన్న మత్స్యేంద్రుండు జన్మాంధుండు చక్షురింద్రియోద్భవంబున సంతోషించినకైవడి తపఃఫలదాయకుండగు శూలికి నిర్మలచిత్తుండగు గోరక్షు నర్పించిన నుమారమణుండు తపోయోగ్యంబగు మాసపక్షతిథివారనక్షత్రశుభలగ్నం బేర్పడం జెప్ప ధైర్యధుర్యుండగు గోరక్షుండు లోహకంటకంబుల నంగుష్ఠంబులుంచి మారుతాశనుండై సవితృమండలమధ్యంబున దృష్టినిలిపి తపంబు ప్రారంభించిన, మత్స్యేంద్రుండు గనుంగొని పరమానందభరితుండై "గోరక్షా! నేను మహాతీర్థంబుల సేవించి ద్వాదశాబ్దంబుల కరుదెంచెద" నని చెప్పి పుష్కరకేశుని యనుమతిగొని పనివినియెను. తదుపరి భక్తరక్షణపరాయణుండగు హరుం డహర్నిశంబులు గోరక్షుని రక్షించుచుండెను. ఇట మత్స్యేంద్రయోగివర్యుండు మహాకాళేశ్వర సోమనాథ బ్రహ్మగిరి త్ర్యంబకేశ్వర ఘృష్ణేశ్వర భీమేశ్వర నాగనాథ ప్ర

-ꕥꕥ { మత్స్యేంద్రనాథుండు రామేశ్వరంబునకేగి మారుతాత్మజుని సమేతుండై మైనాకినీరాణిం జేరంజనుట. } ꕥꕥ-

ముఖ చతుర్దశపీఠంబులు దర్శించి పండరీనాథుని సేవించి నానాతీర్థంబుల గ్రుంకులిడుచు సేతుబంధరామేశ్వరంబు జేరి రామలింగేశ్వరుని గొనియాడి సముద్రస్నానం బాచరించి వాయునందనుని దర్శింప హరిసూనుండు పరమాహ్లాదంబున ప్రసన్నుండై హృదయాలింగనం బొసంగి "యోగద్రుమా! చతుర్వింశద్వర్షంబులకు నీపునర్దర్శనం బయ్యె. నే నహర్నిశంబులు భవదాగమననిరీక్షకుండనై నేఁడు తృప్తిం జెందితి. నాథముఖ్యా! స్త్రీరాజ్యంబునకేఁగి మదీయకోరిక లీడేర్చితివో ప్రపంచనిస్పృహత్వంబున నాకభయం బొసంగినది మఱచితివో యికనైన మైనాకినీహృదయతాపంబు బాపుదువే? నే నాచపలాక్షికి తపోధనుండగు మత్స్యేంద్రుండు విచ్చేసి పచ్చగుజ్జాలవజీరుని రచ్చం ·దేల్చునని

 

పలికిన పలుకులు చులుకంజేయక నిలుపు" మన నాథుం డవశ్యంబని త్రి రాత్రంబు లచ్చో గడపి యంజనీసూనుసహితుండై చనుచు మార్గమ ధ్యంబున నానాతీర్థంబు లాడుచు గౌడబంగాళ దేశం బతిక్రమించి శృంగముకుడీనగరంబు జేరి యత్యున్నతంబులగు చంద్రకాంతప్రాకా రంబులు మిన్నందిన హర్మ్యసౌధంబులు చూపంతని రత్నమయగో పురంబులు జలధరంబుల నదల్చు హనుమద్ధ్వజంబులు మనోహరం బులై విలసిల్లుచుండ నచ్చటచ్చట రథగజతురగసమూహంబుల రవం బు లేకముఖంబై ఘనగర్జితంబన వీనుల విందుసేయ బుద్ధిస్ఫుటతరు లగు భటకోటిమార్గరక్షకత్వంబున వీథులం దిరుగుచుండ ననేకవైభ వవిలాసంబులతో నమరావతీనగరంబున కెనయై ప్రకాశించు నయ్యో ణాక్షుల పురవరంబు జూచుచు హరిహరసన్నిభులగు మత్స్యేంద్రక పీంద్రు లప్పురాధిపతియగు మైనాకినీభవనంబు బ్రవేశింప నంత నమ్మా నినీమణి రయమ్మున హిరణ్మయసింహాసనంబులపై బ్రతాపముఖ్యుల నలంకృతులంజేసి యర్ఘ్యపాద్యాదివిధులచే బూజలుసల్పి బద్ధాంజ లియై నికటంబున నిలచి "వాయునందనా! భవత్సమీపంబున విరాజ మానుండగు మహామహుని నామధేయంబు దెలుపు" మన్న నంజనీ సుతుండు "మోకలభగామినీ! మున్న నీనిగ్రహాతపంబునకు నే నను గ్రహించి మత్స్యేంద్రనాథయోగిశ్రేష్ఠుండువిచ్చేసి నీమనోభవతాపంబు బాపునని నిరూపించితి గాన నిమ్మహాతపోధనుండు మత్స్యేంద్రుండు. ఫాలాక్షుండు విశాలాక్షిని గూడినపగిది యీబుద్ధిదక్షుండగు సిద్ధుండు సహస్రాక్షునిబోలి నిన్నేలు" నని చెప్పి మిన్నుచూలితనయుం డా యన్నువమందిరంబున మూన్నాళ్లుండి వెడలెను. తదనంతరం బా మీా నోదరసంభవుండు మణిమయభూషణాలంకృతుండై యమోఘది వ్యాంబరంబు లంగంబుల ధరయించి హేమనిర్మితసింహాసనాసీనుం డై వేత్రపాణులు స్తోత్రంబులు జేయుచుండ వందిమాగధులు బొగ డుచుండ నటవిటగాయకులు సుస్వరంబుల బాడుచుండ నుడుగణం బున భాసిల్లెడి సుధాకరునిభంగి యవ్వనరుహాక్షుల మండలంబున కడు ముదంబుచే వెలుంగుచు మైనాకినిం జూచి దనమనంబున నీద్విరద గామినిముఖకాంతి శీతమయూఖుని మీాఱు నెరికురులు బంభరంబుల బారు భ్రూయుగంబు కోదండంబుల దూఱు శ్రోత్రంబులు శ్రీకారం

బుల సౌరు నయనంబులచెల్మి బిసరుహంబులు గోరు నాసికంబు తిలకు
సుమంబుల బోరు బింబం బధరంబు జూచిన జాఱు రదనంబులు కుం
దంబుల హేరు గళసౌందర్యంబు జలజంబు తీరు బాహువులు విద్యుల్ల
తలన దనరారు చనుదోయి గనకకలశంబుల గీఱు నసితనాగం బనజా
లిన నూగారు మధ్యంబు హరిమధ్యంబును గేరు శ్రోణులు గిరికార్ము
కుని తేరు యూరులు రంభేభంబుల బీరు జంఘలు తూణీరంబులకు మా
ఱు పదంబులు పద్మంబుల జీరు నఖాగ్రంబులు నక్షత్రంబుల చేరు నని
సర్వావయవంబు లభివర్ణించుచు సిద్ధుండు సర్వకళావిశారదత్వంబున
శృంగార వీర కరు ణాద్భుత హాస్య భయ బీభత్స రౌద్ర శాంతరసం
బు లప్పుడప్పుడు గనబఱచుచుండ నచ్చేడియ జవ్వనంపుక్రొవ్వున హావ
భావవిలాసవిభ్రమాదుల మత్స్యేంద్రుని దృష్టి పఱచుచుండ నవ్వసితా
ధీనుండగు వసుకుమారుం డానందపరవశత్వంబున సౌఖ్యావహంబగు
లీలావినోదంబు సలుపుచు నానాబంధంబుల మందయానను బొందు
చుండ నాశుభాంగి గర్భంబు ధరియించి నవమాసపరిపూర్తి జెంది
యుదయార్కనిభుండగు బాలుని గనె నపు డా మత్స్యేంద్రయోగీం
ద్రుం డనూనముదంబుతో గోభూహిరణ్యదానంబుల విప్రులం దృప్తి
జేసి ద్వాదశదివసంబున యర్భకునకు మీననాథుండను నామకరణం
బొనర్చి రాజ్యభోగంబు లనుభవించుచుండెను.

## జాలంధరనాథజన్మము.

ఇక్కలికాలప్రారంభ ప్రభృతి ద్విసహస్రస ప్తశతవర్షంబులు గడ
చినపిమ్మట భరతవంశసంజాత జనమేజయునకు సప్తమపురుషుండగు
బృహద్రథుండు పట్టాభిషిక్తుండై రాజ్యపరిపాలనంబు జేయుచు నొక
జన్నంబుప్రారంభించి వేదవిద్యాబ్రాహ్మణులచే దాహకునిసాహుతుల సంతు
ష్టపఱచినంత నప్పావకుండు మున్ను ముక్కంటికంటిమంట మడిసిన
చెఱకువింటి మొనగానిపీర్యంబు దనకుక్షియం దున్నకతంబున నయ్యది
యాగసమాప్తిని కుండంబునం బడవైవ నందంతరిక్షునారాయణుండు
ప్రవేశించెను. పిదప నబ్భ్యాసురులు భూనాథునికై యజ్ఞప్రసాదంబు
దీయందలంచి కుండంబున హస్తంబు లుంచునెడ సుకుమారతనువిలా
సుండగు బాలుం డగుపడి రోదనంబు జేయుచుండ నత్యంతాశ్చర్యం

బుచే శాబకుని పైకిదీసి "రాజోత్తమా! యజ్ఞకుండంబున తేజోమ యుండగు డింభకుం డుద్భవించెను గొను" మని యర్పించిన జలార్ణవో ద్భవచతుర్దశరత్నంబులచే సురనరులు సంతోషించినవిధి శ్రీరామచం ద్రునిజన్మంబున దశరథుండు సంభ్రమించినతీరు బృహద్రథుంకు ముదం బున మహాప్రసాదంబని దనకరాబ్జంబులబుచ్చుకొని కనికరంబున చుబు కంబు చుంబించుచు బిసరుహాక్షుల నేచు కుసుమశరుండో మూర్తివం తంబగు విద్యుత్పుంజంబో యనుచు నతిశీఘ్రంబున నంతఃపురంబు బ్రవేశించిన నశేషరూపగుణలావణ్యంబులచే రమామణిని సరకుగొనని సార్థకనామధేయంబుగల సులోచనియను రాజకాంత "నృపోత్తమా! భవత్కరకమలంబుల భానుంబోలి బ్రకాశించెడు బాలుం డెవరి బాలుం" డని విచారింప భూకాంతుండు "ఓకాంతామణీ! హవనంబుచే హుతాశనుండు హర్షించి శిశుప్రసాదం బొసంగెను గావున మన మీ నకేతననామిన్నాసుతాసహజన్ముండై ప్రవర్ధనుండగుచు వంశోద్ధారంబు జేయు" నని వాక్రుచ్చి శిశువు నప్పగించిన నమ్మరాళగామిని యురోజ మ్ముల పయంబులూఱ పాపని దృప్తిపఱచి ద్వాదశదినంబులకు నామక రణంబుకై తోటిచేడియల బిలచిన వారిబ్బాలుం డయోనిసంభవుం డని తలంచి దహనుని జ్వాలయం దుద్భవించినకతంబున జాలంధరుం డని నామంబిడిరి. మహీరమణుండు మహీసురుల కనేక ఫలదం బులగు దానంబు లొసంగె. నంత శుక్లపక్షపాకరునికైవడి బాలుం డు దినదినప్రవర్ధనుండై పంచవర్షంబులు నిండిన నుపనయనాది సం స్కారంబులు గావించి సకలవిద్యాభ్యాసంబు జేయించుచు ద్వాదశ వత్సరంబులకు సర్వజనాశ్రయంబగు గృహస్థాశ్రమం బేర్పఱచదలంచి చతురవచనరచనాధురీణులగు సచివసహిత పురోహితులనుబిలచి మత్సు తునకునతులితగుణవతియగుసతీమణిని దెమ్మనియానతిచ్చిన వా రనేక దే శంబులు గ్రుమ్మరుచుండిరి. ఇట నొకనాఁడు జాలంధరుండు నిజజననన్యం కంబునలంకరించి "యోజననీ! నిర్మలచిత్తుండగు ధర్మిణమంత్రిపుంగవుం డెందుబోయె" నని విచారించిన నత్తలోదరి "పుత్రా! భవత్పితృవాక్య ధారితుండగు మంత్రిశేఖరుండు పురోహితసమేతుండై నీకొకలోలాక్షిని దేనరిగె" ననిన బాలుండు "తల్లీ! అయ్యది యెట్లుండు" నని యడుగ "వ త్సా! యప్పుడఁ(లే)మిన్న నొయట్టిదై యుండు" నని నుడివె నంత నవ్వా

క్యంబులు మనంబున నిడుకొని యాటలకై బడుచువారిం జేరంజని యాడుచు "సఖులారా! మజ్జనకుండు నాకొక స్త్రీని జేయునట తత్కారణం బేమిగాబోలు" నని యడుగ వారలు "జాలంధరా! సంసారవిషయసుఖంబులకై సారసాక్షిని బెండ్లియాడెద" రనుచు దుడుకుతనంబున స్త్రీపురుషసురతలక్షణంబులు దేటతెల్లంబుగ దెలియంజెప్పిన జాలంధరుండు విచారగ్రస్తుండై "యహో! సంసారం బతిదుర్గమం బపరిమితవిగీతంబు. పదంతిమిన్న నాయట్టిదై యుండునని మజ్జననీవాక్యంబు గలదు. మాతృసమానయగు యువతి సతియౌనే? యిట్టినింద్యకార్యం బే నంగీకరింతునే? మహాపాపం" బని తాపం బొందుచు కాననంబున కేగందలంచి పరుగెత్తెను. బాలుండు రాచకుమారుండని గ్రామరక్షకులు మందలించక తొందరచే నరపాలునకెఱింగించిన నక్షితీశుండు తక్షణంబున సపరివారుండై పరుగెత్తుచున్న సమయంబున జాలంధరుండు తన మనంబుననన్నెవరైన గనుంగొనియెద రని మార్గంబు విడచి విపినంబు బ్రవేశించి దృష్టి దప్పించి తీవ్రగమనంబున నానామహీధరంబులమధ్యమార్గప్రదేశంబు ననుసరించి జనుచుండెను. నృపుండు భటసమూహంబుచే నానాదిశలు శోధించి తనయుం డమావాస్యచంద్రుని పగిది గానరామిం జేసి బహువిధవిలాపంబులు జేయుచు నిరాశుండై గ్రామంబు ప్రవేశించి యపారదుఃఖాంబుధినిమగ్నుండగుచు బాలుండగు జాలంధరుని శైశవక్రీడావినోదంబు లభివర్ణించుచు "నాయట్టి దౌర్భాగ్యులు గలరే? హుతాశనుని ప్రసాదంబని దలంచిన సుతుండు మత్కర్మయోగంబున బాసెనుగా పుత్రా! నీరూపలావణ్యంబు లేరీతి మఱతు" నని సులోచనీసమేతంబుగ నేడ్చుచున్నంత సేనానాయకుండు "ప్రభో! బాలుం డయోనిజుండు. చిరంజీవుండై యుండును. చతుస్సముద్రముద్రితంబగు భూవలయంబెల్ల శోధించి తెచ్చెద" నని పెక్కుభంగుల సమాధానపఱచెను.

ఇట జాలంధరుండు విపినమార్గంబున జనుచు సూర్యాస్తమయానంతరం బొకపర్వతసమీపంబున వైశ్వానరుం డరణ్యంబు దహింపుచుండం గని మార్గంబు గానక తత్సమీపభూధరంబుచెంత నత్తమిల్లైను. జ్వలనుండు నిజజ్వాలలచే శుష్కతృణకాష్ఠంబులు దహించుచు శయనించియుండు బాలునింజూచి స్వగర్భస్థకామువిర్యోద్భవుండని

గ్రహించి శాంతిం బొంది మూర్తివంతుండై విస్మితుండగుచు వాత్స ల్యంబున బాలుని చేరందీసి నిజాంకంబుపై నుంచుకొని శరీరంబు నివురుచు "పుత్రా! నీ వెందుం డిచ్చటి కరుదెంచితి వేతత్కారణం బేమి" యని విచారించిన నప్పుడుచువాఁడు "మీరెవ"రని ధనంజయుని నడుగ నవ్వీతిహోత్రుండు "వత్సా! భవత్పిత్రుండ" నని కామదహనాది చరిత్రం బెల్ల దెటపఱచెను.

ఇతి భక్తిసార నవనాథచరిత్రంబున మత్స్యేంద్ర కపీంద్రులు స్త్రీ రాజ్యంబు ప్రవేశించుటయును మీననాథ జాలంధరనాథ జన్మకథా విశేషంబును గల ఏకాదశాధ్యాయము సంపూర్ణము.

---

## ద్వాదశాధ్యాయము.

జాలంధరనాథుండు దత్తానుగ్రహంబుచే మంత్రార్థంబు లెఱింగి తపం బొనరించుట.

జ్వలనుండు జాలంధరునకు జన్మవృత్తాంతం బెఱింగించి "పుత్రా! భవదీప్సితంబు దెలుపు" మని యడిగిన జాలంధరుండు "జనకా! మచ్చిత్తంబు నిష్కామ్యంబుచే పరమేశ్వరాయత్తంబై యున్నది. నిస్సారం బగు సంసారసుఖంబు లేనొల్లను. ధనీషణాదిత్రయంబు మదిం దలంచను. రాజ్యభాగ్యభోగంబు లపేక్షించను. నరదేహధారియగు పురుషుం డస్థిరసంపదలకాశించి భ్రష్టుండగుం గాన నిర్మలజ్ఞానోపదేశంబుచే శాశ్వతుండనై నిత్యుండనై వెలుంగవలయు నను కుతూహలంబు గల" దని విన్నవింప బాలుండగు జాలంధరుని గుణజాలంబులకు జాతవేదుండు ప్రీతుండై నిజభుజాగ్రంబులపై బాలు నిడుకొని యతిశీఘ్రంబున నత్రిసూనుల జేరంజనిన నా త్రిమూర్తుండు ద్విమూర్ధు నెదుర్కొని యాలింగనం బొనంగి "భవదాగమనకారణంబు దయ జేయు" మని విచారించుచు "ని బ్బాలుం డెవరినందనుం"డని మందలించిన నవ్వాయుసఖుండు "అత్రినందనా! దురితహరుండగు హరుండు మదనదహనం బొనర్ప దివ్యతరంబగు నమ్మరునివీర్యంబు మత్కుక్షి

యందుండె నయ్యది బృహద్రథుని యాగకుండంబున బడనైవ నిబ్బాలుం డుదయించె. ఖండపరశుచండతరక్రోధానలదహ్యమానకం దర్పవీర్యం బగుటయేగాక మద్గర్భంబున ధరియించిన కారణంబుచే నీయూషపానునకు సంజీవిని లభించినచందం బౌనగూడె. తదుపరి యంతరిక్షనారాయణు ప్రవేశవిశేషంబు బొగడ ద్విసహస్రజిహ్వుని కైనవశంబే గావున సువర్ణంబుపై మరకతంబులు గూర్చినవిధంబు భవత్కరకుశేశయం బిబ్బాలుని శిరంబుపై నిడి యజరామరమూర్తిని జేయవే" యని ప్రార్థించిన ననసూయాసుతుండు హర్షించి యంకంబుపై నుంచుకొని బాలుని మస్తకంబున వరదహస్తంబుంచి యాత్మానాత్మవిచారం బుపదేశించి జ్ఞానసూర్యోదయంబుచే నజ్ఞానతిమిరంబు బాపిన నబ్బాలుండు బ్రహ్మానుభవంబున భూమానందుండై వెలుంగుచుండ దత్తాత్రేయుండు "హుతాశనా! జాలంధరుండు మన్నికటంబున ద్వాదశవర్షంబు లుండవలయు" నని నుడివిన నతండు చేతోముదంబున నంగీకరించి యంతర్ధానంబు నొందెను.

అనంతరం బా దత్తాత్రేయుండు ప్రియశిష్యుండగు జాలంధరుని వెంబడిగొని నానాపర్వతశృంగారంబులు జూపుచు వినోదార్థంబున దృశ్యాదృశ్యంబను విద్యాభ్యాసంబు జేయించి ప్రతిదినంబు భాగీరథీవనంబుల స్నానంబు లాడించుచు నుమారమణుని దర్శనంబు గావించి కోల్హాపురనగరంబున భిక్షాన్నంబుచే భోజనంబుచేయించుచు ద్వాదశవర్షంబులు గడపి శిష్యుని దాస్యత్వంబున కపరిమితసంతుష్టుండై జాలంధరుని డగ్గరం జీరి వాతాస్త్ర జలదాస్త్రాగ్నేయాస్త్ర పర్వతాస్త్ర కామాస్త్ర వజ్రాస్త్ర బ్రహ్మాస్త్ర వాతాకర్షణ ప్రముఖ నిఖిల మహాస్త్రంబుల ప్రయోగోపసంహారంబులు దెలిపి ఋగ్యజుస్సామాథర్వణవేదంబులు శిక్షావ్యాకరణాది షడంగంబులు నానానాటకాలంకారంబులు నృత్తగీతవాద్యచమత్కారంబులు ప్రబంధరచనాకవిత్వ నైపుణ్యంబులు గఱపిన, జాలంధరుండు నిజజనకుండగు ధనంజయుని మనంబున స్మరియింప నప్పావకుండు ప్రత్యక్షం బైనంత కుమారుం డనేకవిద్యాకుశలత్వంబు గనుబఱచిన ననలుండు సంతుష్టాంతరంగుండై యనసూయాసుతుని పెక్కుభంగుల గొనియాడుచుండ నత్రిసుతుండు "హుతాశనా! శీలగుణసంపన్నుండగు జాలంధరుండు మంత్రతంత్రార్థ

రహస్యంబులచే సర్వతంత్ర స్వతంత్రుండై ప్రకాశించె. నీ వీ పుత్రుని దోడ్కొని మంత్రాధి దేవతల ప్రత్యక్షదర్శనంబులు జేయించు" మని వాక్రుచ్చిన నతం డవశ్యంబని కుమారు నెత్తుకొని నానా దేవతలద ర్శనం బొక్కచో ఘటియించునని తలంచి నాగాశ్వత్థ భూజంబు జేరం జని మున్ను సచ్చరిత్రుం డగు మత్స్యేంద్రుం డాచరించినకైవడి మార్తాండకుండంబుల స్నానంబు లాడించి వృక్షస్థసకల దేవతల ప్రత్య క్షంబు గావించిన నమ్మహానుభావు లా జాలంధరునకు వరంబు లొసంగి "స్థిరమతివై తపం బాచరించు" మని యాజ్ఞాపింప జాలంధరుండు జ్వలనుని వెంటనంటి బదరికాశ్రమంబు జేరి ముక్కంటియాశ్రమం బాశ్రయించి శోచిష్కేశుని యనుమతి వడసి లోహకంటకంబులపై శరీరంబు నిలిపి వాతాశనుండై జగదుద్ధారకంబగు తారకంబు జపి యించుచు ద్వాదశవర్షంబులు తపం బాచరించినంత హరిహరబ్రహ్మా దినమస్త దేవతలు ప్రసన్నులై తపశ్శాంతి యొనర్చి యరిగినపిమ్మట బద రికేశ్వరుండు జాలంధరుని వీతిహోత్రుని సహితము దననికటంబున త్రిరాత్రంబు లుంచుకొని "వత్సా! నీకొకచిత్రంబగు చరిత్రంబు దెలి పెద" నని జాలంధరునితో నిట్లనియె.

### కానీపనాథ జన్మకథాప్రారంభము

"తొల్లి సత్యలోకాధిపతి యగు పితామహుండు లీలావినోదం బుచే నొకలోలాక్షిని గల్పించి యానవయౌవనాంగిం జూచి ముఖం బిందుబింబంబో తనుకాంతి విద్యుత్పుంజంబో ముఖనయనగళకరచరణ కటి యురోజంబులు వనజంబుల గేలిసేయు నని నప్పలుకుల జవరాలి వలపుగులుకులు యలరువిలుకాని లేయలుగల ములుకులన నులికిపడిన నన్నలుమొగంబుల దేవర వీర్యం బొలకి యనిలుని బలమున వలినులని కటంబున శయనించు దిగ్గజకర్ణరంధ్రంబునం బడి చతుర్యుగంబు లయ్యె నయ్యది మహామహుని వీర్యంబైనకతంబుచే బిందురూపంబున సజీ వంబై యుండ నందు ప్రబుద్ధనారాయణుండు ప్రవేశించి శిశురూపం బున ప్రకాశించుచుండు గాన నోజాలంధర! గనుంగొన జనవలయు" నన నతండు హర్షించి "నీలకంఠా! తద్దిగ్గజంబును మఱితద్దిగ్గజకర్ణరంధ్ర స్థబాలుని విలోకించదలంచెదం జూపవే" యనిన విశాలాక్షుం డనలుని

సహితుండై జాలంధరుని దోడ్కొని హిమవత్పర్వతంబు జేరి స్థూలోన్నతవిశాలంబులచే నగంబుకై వడి నేలంబడియున్న మహానాగంబును జూపి "జాలంధరా! యీదిగ్గజం బగ్గలంబగు కోపంబున మనల నుగ్గడంచు. డగ్గరం జేరంజనుట కష్టం" బనిన నయ్యగ్గికొడుకు "మచ్ఛిరంబున త్రిలోకవందితుండగు యత్రినందనుని వరదకరంబుండ నిగ్గజగర్వంబు హరించుట దుస్తరంబే? మద్గురుప్రభావంబున కృతాంతుని క్రోధం బుపశమింపదే? వాతగతిజరించెడు నభోమణిస్యందనంబు స్తంభించదే? చూడు" మని కక్షపాలాంతరభస్మంబు దీసి మోహనాస్త్రంబు జపియించి స్పర్శాస్త్రసంపుటీమార్గంబున బ్రయోగింప నగ్గజంబు కీలూడినబొమ్మ యన కరచరణంబుల కదలికలేక బడియుండ జాలంధరుండు మృత్యుంజయ ధనంజయుల నచ్చో నిలువ నియమించి తద్దిగ్గజకర్ణసమీపంబు జేరి "గజోత్తమా! నీకర్ణేంద్రియంబున ప్రబుద్ధనారాయణుం డవతరించి యున్నవాఁడు. నీవు శాంతిం బొందు" మనుచు "ప్రబుద్ధనారాయణా! సర్వసమర్థత్వంబున కానీపనామంబుచే లోకప్రసిద్ధి జెందెదవు తడవేల? బహిర్గతుండవు కమ్మా" యని కేక వేయ భాస్కరసన్నిభుండగు షోడశాబ్దంబుల బాలుండు కర్ణద్వారంబు వెలువడి జాలంధరునకు కరంబులెత్తి నమస్కారంబు జేసి దిశలు రోయుచు విగలిగి నిలుచున్న, జాలంధరుండు నిజభుజాగ్రంబులపై కానీపు నుంచుకొని విరూపాక్షుని సమక్షంబున డించి "కానీపా! లోకశంకరుండగు శంకరునకు వందనం బాచరించి పిదప మజ్జనకుండగు హుతాశనునకు నమస్కరించి యశోవంతుండవై యుండు"మన నక్కానీపుండు భోగిరాట్భూషణుని చరణాంభోరుహంబుల కెఱఁగి పిదప పావకునకు నమస్కరించి ముదంబున జాలంధరునిపదంబుల వ్రాలినంత చంద్రచూడుండు సాంద్రప్రేమాతిశయంబున నిజాంకంబుపై బాలునుంచిదనకరంబునశిరంబుబునుకుచు "జాలంధరా! భవత్కరకమలంబీకర్ణకానీపునిశిరంబున కనికరంబుచే నిడి యుర్కొనయంబున తిమిరజాలంబుదొలంగుకై వడిజ్ఞానోదయంబునమాయంబాయు సిద్ధునిజేయు"మని నుడివిన జాలంధరుండు దనహృత్పంకజంబున నత్రిసూనుచరణకంజంబులు ధ్యానింపుచు కానీపునిమస్తకంబున హస్తంబుంచి కర్ణేంద్రియంబున గురుమంత్రం బుపదేశించి మహావాక్యచతుష్కంబుచే లక్ష్యార్థంబు దెలిపి

దృక్సంయోగవివరంబున సఖుండలుండై వెలుంగం జేయ కానీపుం డమితానందుండయ్యె. త్రిపురదహనుండు దహనదహనసుతవిధిసుతుల సమేతుండై బదరికాశ్రమంబున కేగెను. హవ్యవాహనుండు "జాలంధరా! శ్రీగురుదత్తాత్రేయదత్తసకలమంత్రంబులు కానీపునకు దెలుపు మని వాక్రుచ్చి యదృశ్యుండయ్యె.

{ జాలంధరనాథుండు కానీపనాథున కనుగ్రహం బొసఁగి యక్కానీపునికి నిర్జరులచే వరంబు లిప్పించుట. }

అనంతరం బా జాలంధరుం డుమారమణుని నికటంబున షణ్మాసంబులలో ననేకవిద్య లుపదేశించి నానాస్త్రంబుల ప్రయోగోపసంహారంబులుబోధించి జ్ఞానఘనుని జేసి కానీపుండు గజకర్ణోద్భవుండు భరించునో భరించఁడో యనుసంశయంబున వాతాకర్షణ సంజీవినీయోగంబులు దెలుపఁడయ్యె. ముల్లోకనాథుండగు నీలకంఠుండు "జాలంధరా! కానీపునకు సకలమంత్రాధిదేవతలదర్శనంబు గావించి వరంబు లిప్పించు" మన జాలంధరుండు స్తవనాస్త్రయోగంబున తత్తద్దేవతల ప్రత్యక్షంబు గావించి స్తోత్రంబులచే సర్వదేవతలం దృప్తిపఱచి "దయాసముద్రులారా! కానీపుండు నిఖిలమంత్రంబుల సిద్ధిబడసె; గావున తా మనుగ్రహించి వరంబు లొసంగెదరని వేఁడెద" నన్న నాహూయమాన మహామహులు "జాలంధరా! నీవు హుతాశనుని సుతుండవై యనసూయాపుత్రునకు ప్రియశిష్యుండవైనకతంబున నీ కనేకవరంబు లొసంగితిమిగాని నీ వొకశిష్యుని జేసి తచ్ఛిష్యునికై వరంబు లీమనుట యుచితంబే? యిట్లనేకశిష్యులం జేయుచు ననేకుల కీవిధి విద్యలం గఱపుచు మమ్మేచుట విశేషంబే? సరిగా" దని నిఖిలదేవతాకదంబంబులు విమానారూఢులై జనుచుండ నగ్నిసుతుం డుక్రుద్ధుండై నన్నంత నీచుంగని దలంచితిరే? మత్ప్రతాపంబు జూడుం డని రోషతామ్రాక్షుండై వాతాస్త్రంబు జపియించి ప్రయోగించిన నయ్యది గగనమార్గంబున జని విమానంబుల ముట్టడించ సర్వవిమానంబులు కులాలచక్రంబులపగిది దిర్ద్రిరందిరుగుచుండ దేవలోకంబు క్షోభించి తమతముకోదండంబుల నారింబోసి జాలంధరునిపై గంధర్వుండు పర్వతాస్త్రం బమరనాయకుండు వజ్రాస్త్రంబు యక్షుండాగ్నే

యాస్త్రంబు వరుణుండు జలదాస్త్రం బశ్వినీదేవతలు ధూమాస్త్రంబు నాగాస్త్రంబు లనేకు లనేకాస్త్రంబులు బ్రయోగించుచుండ శివకేశవు లీమహాచిత్రంబు జూచుచుండిరి. తత్సమయంబున వైశ్వానరసుతుం డాగతాస్త్రంబులపై మోహనాస్త్రంబు వఱపిన నయ్యస్త్రరాజి దనుతమ చెయువు లెఱుంగక మతిభ్రష్టమై జాలంధరునకు వందనంబు లాచరించి యంతర్ధానంబు నొందెను. పర్వతాస్త్రంబుచే సిద్ధనిర్మిత మారుతాస్త్రవేగం బడంగినంత తక్షణం బా సురసముదాయంబు విమానంబులతో నిజనివాసంబుల కరిగి మనయస్త్రంబులు నిష్ఫలంబులయ్యె. ముం దేమిజరుగబోవునో యన ముపేక్షించుట కర్జంబుగాదు. సకల శస్త్రాస్త్రపరికరంబులు బూని జాలంధరుని ప్రాణంబులు గొనవలయునని నిశ్చయించి విమానారూఢులై ముసల ముద్గర ఖడ్గ పరశు త్రిశూల తోమ రాంకుశ గదా చక్ర ప్రముఖ శస్త్రంబులు ధరియించి యుద్ధవిడి నేతెంచుచున్న యమరకోటిని జూచి యవ్యాహతధైర్యధుర్యుండగు జాలంధరుండు కామిన్యాస్త్రంబు సంధించి తత్సహాయంబుగ కామాస్త్రంబు గూర్చి యడరించిన కామిన్యాస్త్రంబుచే ననేకనారీమణు లుద్భవించి రంభోర్వసుల దిరస్కరించు రూపలావణ్యంబులు గలిగి విహరించుచుండ కామాస్త్రయోగంబున గీర్వాణాదు లోర్వలేని తమకంబున హరిణాక్షులవృక్షరవ్రాతంబులచేబద్ధులై బుద్ధితప్పి యమ్ముద్దియల వెంటనంటి బదరికాశ్రమవనంబున నానామహీరుహంబుల మధ్యప్రదేశంబున సంచరించుచు నిజకరంబుల కలభగమనుల నొడిసిపట్టి విశాల వృక్షంబులపై జేరినంత మహాకుశలుండగు హుతాశనసుతుండు స్పర్శాస్త్రంబు వఱపి సుపర్వులపాదంబులు బంధించిన పల్లవాధరులు పట్టు దప్పించుక పరువులిడిరి. సురలోకంబు నారీమణులంజూచి "హా! తలోదరులారా! పోయెదరే" యని చిత్తజు శరవేదన జ్వరపిత్తంబుచే యున్మత్తులై చేతులెత్తిన స్పర్శాస్త్రనైపుణ్యంబునసధోముఖులై పాదంబులు పాదపాగ్రశాఖంబుల నంటుగొని వ్రేలాడుచుండ మకుటంబులు మహింబడ భూషణంబులు వ్రాలుచుండ వినోదయసమయంబున తరుశాఖాగ్రంబులు ప్రభాసిల్లెడుచందంబున నగపడుచుండ సురసంఘంబులం జూచి హరిహరులు విస్మితాననులై మున్నిట్టి విపరీత త్రాణతం బెవరొనర్చిరని జాలంధరుని గుణంబు లుగ్గడించుచుండ సిద్ధనిర్మితసుం

దరీమణులు వియచ్చరుల వలువలను వదల్చి నగ్నులంజేసి వసనంబులు హస్తంబుల ధరియించి యోగధూర్జటియగు జాలంధరు నికటంబున నిడుచుండ జాలంధరుండు కానీపునకు వస్త్రచిహ్నంబుల దేవతానామంబులు దెలుపుచు గోప్యంబున "కానీపా! సురలు నగ్నులైరి. నీవరిగి వారివారివస్త్రంబులు వారివారికింగట్టించు" మని జెప్పినం గానీపుండు వస్త్రభూషణంబులు గొని ముదంబున నరిగి వసనంబులు గట్టుచుండ దేవత లనేకవిధంబుల బొగడుచు "కానీపా! నీగురుప్రతాపంబు జెప్పనలవియగునే" యనుచుండ కానీపుండు వందనంబు లాచరించుచుండెను. సురసంఘంబు తమలో తాము "యీకానీపునకు వరంబులొసంగనిది జాలంధరుండు వదలునే" యని నిశ్చయించి "జాలంధరా! కానీపుని మనోభీష్టంబు దీర్చెదము. మమ్ము స్మరియించినమాత్రంబున బ్రత్యక్షంబై బనులు సలిపెదము. నిశ్చయము. నిశ్చయం" బని పలుకుచున్న దివిషద్వర్గంబును జూచి పావకాత్మజుండు విభక్తాస్త్రంబుచే స్పర్శాస్త్రం బుపసంహరింప సకలదేవతలు జాలంధరుని సమీపించి గుణరాశిం బొగడుచుండ జాలంధరుం "డోదయాఘనులారా! ముందు నేరచించెదు శాబరీవిద్యకై సహాయు లౌదురని కోరెద" నన వారది యంగీకరించి తమతమనిజనికేతనంబుల కరిగిరి. యాపై నుమా రమానరులు జాలంధర కానీపులసమేతంబుగ బదరికాశ్రమంబున త్రిరాత్రంబులు గడపిరి.

ఇతి భక్తిసార నవనాథచరిత్రంబున జాలంధర కానీపనాథచరిత్రంబును గల ద్వాదశాధ్యాయము సంపూర్ణము.

---

## త్రయోదశాధ్యాయము.

{ జాలంధరకానీపనాథులు శివుని యనుమతిచే శాబరీమంత్రశాస్త్రంబు కల్పించి కానీపనాథుండు తపం బాచరించుచుండ జాలంధరనాథుండు తీర్థయాత్రోన్ముఖుండై వెడలుట. }

ఉమా రమానరులు కానీపజాలంధరసహితులై బదరికాశ్రమంబున నివసించి బృందారకులు పరాభవంబుచే ప్రసన్నులై, వరంబు

లొసంగుట కెంతవిచారహీనులని దలంచుచు ము న్ననేకమారు లసు రులతో నోటుబడి యి ట్లుపహాస్యంబు నొందిరే బుద్ధిపతులగు సిద్ధుల చరిత్రంబు లెఱుంగలేరై రనుచు హాస్యరససల్లాపంబు లాడుచుండి గిరిజాధవుండు "జాలంధరా! నాగాశ్వత్థవృక్షనికటంబున పూర్ణాహుతు లొసంగి శాబరీమంత్రశాస్త్రంబు రచియించి పిమ్మట తత్తద్దేవతల వరంబులు బొందెదవేని నీమంత్రంబుల వేదమంత్రంబులు బోలంజా లునే కలికాలమందమతులు శక్తిహీనులై నకతంబున వేదమంత్రంబులు సిద్ధించక కడుకష్టంబు లనుభవించెదరు గావున మంత్రసిద్ధిం బడసి యుష్మచ్ఛిష్యుండగు కానీపునకు బోధింపుము. కానీపుం డుదారశక్తి యుక్తుండై కార్యానుకూలంబున మెలంగుచు ననేకశిష్యులంజేసి మంత్రంబులు లోకప్రసిద్ధిజేయును. తొల్లి శాంబరీఋషివర్యుం డొక కొన్నిమంత్రంబు గల్పించె నవి యసంపూర్తిచే జగద్విఖ్యాతి నొంద లేవు. మీ నవనాథ సిద్ధుల మంత్రంబు లేక శతకోటిసంఖ్యాపరిమితి గల్గి మూర్తివంతంబులై విస్తరించవలయు నందు ముప్పదిమూడు కోట్ల తొంబదియైదులక్షలమంత్రంబులు మత్స్యేంద్రనాథుండు కల్పించె ను. గోరక్షుండు పండ్రెండుకోట్ల తొమ్మిదిలక్షలు జేయును. మీననాథుం డొకకోటి లక్ష చర్పటనాథుండు తొమ్మిదికోట్ల యేడులక్షలు భర్తరీనా థుండేడుకోట్ల నాలుగులక్షలు రేవణనాథుండు రెండుకోట్ల మూడులక్ష లు వటసిద్ధనాథుం డొకకోటి యొకలక్ష చేయుదురు. నీవు ముప్పదినా లుగుకోట్ల పండ్రెండులక్ష లొనర్పు మారుకోట్ల యెనిమిదిలక్షలమం త్రంబు లీకానీపుండు జేయు నీమహాప్రయోగంబులు గోరక్షుని పుర స్సరంబున ప్రపంచంబున నెల్లడిజేయఁబడు. నిక ముందు మంత్రకల్పం బులు జేయుమహాత్ములు గలుగబోరు. ఈసిద్ధనిర్మిత మంత్రరాజం బులు ప్రసిద్ధిబొంది యాధ్యాత్మికాధిభౌతికాధిదైవికాదిబాధలం దొలంగించు నివ్విధంబున ప్రతికలియుగంబున జరిగిన విషయంబేగదా త్రికాలవేత్తలగు సిద్ధులు మీరెఱుంగరే నిఖిలదేవతావాహనం బొనర్చి కానీపునకు వరంబు లొసంగు మనుట భవిష్యచ్చరిత్రం బెఱిం గియేకదాతిఁక వేల? మీకవిత్వవైజ్ఞానికత్వంబున మంత్రకోటిని గల్పింపు మిక్కానీపునిచే తపం బాచరింపించు" మనుచుండునంత మధుసూద నుండు కానీప జాలంధరులకు వరంబు లొసంగి వైకుంఠంబున కరిగెను.

ఈయుభయసిద్ధులు నేలుబదికోట్ల యిరువదిలక్షల మంత్రగ్రంథంబు రచియించి బదరికేశ్వరునకు జూప నయ్యనలాత్ముండు సంతసిల్లి "జాలంధరా! నాగాశ్వత్థవృక్షస్థ సమస్తదేవతల వరంబులు గొను" మని యాన తిచ్చిన హుతాశనసుతుండు కానీఫునిసహిత మాతరురాజనికటంబున కేగి సూర్యకుండతోయంబులు వృక్షమూలంబునం బోయుచు పూర్ణాహుతు లొసంగి బావన్నవీరప్రముఖ సమస్తదేవతల వరంబులు గొని కానీపుని దోడ్కొని బదరికాశ్రమంబునకు పునరాగమనంబు జేసి గోరక్షుండు తపంబాచరించు స్థలసమీపంబున లోహకంటకంబుల తపంబుకై కానీపుని నియమించి మృడుని యనుమతిగొని జాలంధరుండు తీర్థయాత్రోన్ముఖుండై యరుగుచు నరణ్యంబున తృణంబు జత గూర్చి క్షేత్రశోధనంబుకై భారంబుగట్టి నిజశిరంబుపై నిడుకొని ప్రతి క్షేత్రంబునకు దర్శనార్థంబై ప్రయాణంబు జేయుచుండ మిన్నుచూలి జాలంధరుండు దనపౌత్రుండని తలంచి శిరోభారంబును లేవనెత్తుకొని యవ్వీతిహోత్రనందనుని వెనువెంటం జనుచుండెను ఇప్పగిది ప్రతిక్షేత్రంబునంగల గోవ్రజంబును దృప్తిపఱచుచు నచ్చటచ్చటిమూర్తుల దర్శనంబులు గొని తీర్థంబుల స్నానంబు లాడుచు గౌడబంగాళ దేశస్థ హేలాపట్టణంబు బ్రవేశించి జనుచుండ శిరోగ్రభాగంబున నిరాధారంబై నడచుచున్న తృణ్యాంబును పురవాసులు గనుంగొని యత్యంతాశ్చర్యంబుచే నోహో! ఇమ్మహానుభావుం డెవరుకాబోలు? నపారచరిత్రుండగు సిద్ధుండో ప్రచ్ఛన్నవేషంబున మెలంగెడి సురుండో లేకున్న తృణ్యాంబు దనంతట తా నడచునె యనుచు నలుదిశల గుమిగూడి జూచుచుండ జాలంధరుం డొక్కచో గోసంచయంబు గని తృణ్యాంబు డించి విడదీసి బడవైచిన నానావీథుల దిరుగు గోసముదాయం బచ్చోటి కరుదెంచి తృప్తిం బొందుచుండెను. ప్రతిదినం బీప్రకారంబున గోసముదాయంబును దృప్తిపఱచుచు స్వయంభిక్షాన్నం బాహారంబు గొని యచ్చో గొన్నిదినంబులు గడుపుచుండెను.

—ం✿✿ { జాలంధరనాథుండు హేలాపట్టణంబు ప్రవేశించి మైనావతీరాణి కనుగ్రహం బొసంగుట. } ✿✿ం—

అప్పట్టణంబున సులోచనమహారాజసుతుండు నానారత్నమయహాటకభూషణాలంకారంబులచే సుచైశ్వర్యంబుల సరకుగొననిద్వాదశ

లక్షఘోటకంబులును యువతీజనకుచరదనోరుయానంబులదిరస్కరించు గనునశుండదంతకుంభంబుల కలిమిచే నంజనాచలంబు లనంబరఁగు వేదండతండంబులునాలంబున కాలునిగణుతింపని కాల్బలంబులు లక్ష శతంబులు పొంగుచుండ ముక్కంటిచెలికాని లెక్కంగొనని పెక్కైశ్వ ర్యంబుల పెంపెక్కి షోడశశతసంఖ్య జలజాయతాక్షులు పడఁతులు గలిగి మీనుమొసలిసిడెంబుల మేటినీటగు సోయగంబునం ద్రిభువనభ ర్తయనందగు గోపీచందమహీపాలుని జననియగు మైనావతీదేవి యొకానొకసమయంబున సౌధాగ్రభాగంబున దిశావలోకనంబు జేయుచు స్వేచ్ఛావిహారంబు సల్పుచు నద్దుగ మొగంబుల వేల్పుపట్టి నిత్యనియమప్రకారంబున గోసమూహంబుకై తృణ్యంబు శిరోపరిభాగంబుపై దనంతట తా నడువ జనుదెంచుట గనుంగొని "యేమి యీచిత్రం బితండు మానవుండొనె గరుడగంధర్వాదులకైన నిట్టిసామర్థ్యంబు గలదె? లీలాగతి మెలంగఁదలంచిన జలజాక్షుండో గాకున్న నీతృణ్యంబు నిరాధారంబున నడుచునే యిమ్మహామహుని కటాక్షవీక్షణంబున మర్త్యు లమర్త్యులై బ్రకాశించరె? దృఢభక్తి యోగంబున నియ్యోగివర్యునారాధించి స్థిరపదవి బొందెద" నని నిశ్చ యించి యొకసఖీమణిని బిలచి "ప్రియురాలా! నీకొకరహస్యంబగు కార్యంబు దెలిపెద వెల్లడిజేయవలదు కార్యసాధనపరత్వంబున కుశల మతివై వర్తింపవలయుంగాన నదుగో యోగీంద్రుని జూచితివే" యని కనుబఱచినంత నచ్చేడియ యచ్చెరువొంది "యితండు ప్రచ్ఛన్నంబున జరియించెడి లక్ష్మీరమణుండో హరుండో యన్యులకీ యసదృశప్రభావం బుండునే? ప్రభాకరకరనికరద్యుతి నణంచెడు దేహకాంతి స్వర్గమర్త్య పాతాళవాసులలో నెవరికైనం గలదె? ఇతండనుగ్రహించిన శాశ్వత పదంబు ధ్రువునికైనడి లభించకుండునే" యనుచున్న సఖీమణిం జూచి మైనావతీదేవి "యోశుభాననా! యిమ్మహామహుండీనగరంబున నెచ్చో నివసించియుండునో కనుంగొని వేగమ్మున రమ్మా" యన నవశ్యం బని యమ్మగువ జాలంధరుని వెనువెంటం జనుచుండ నయ్యోగిముఖ్యుం డొ క్కచో గోధనంబునకు తృణంబు వేసి వేగంబున నొకజీర్ణవీథియం దొరులెఱుంగకుండ గూర్చుండంగని యమ్ముదిత యతిశీఘ్రంబున రాజ మాతకడ కరుదెంచి "యోతల్లీ! యోగిపురుషుం డన్యాలోకనభయం

కరంబగు నొకయేకాంతస్థలంబున పిశాచంబుపగిది నివసించె నచ్చట శ్వానసూకరంబులైన దిరుగంజాల" వని నుడివిన రాజమాత మంచి దని హర్షించి యనేకపక్వాన్నంబులు చేతంబూని నడిరేయిసమయం బున కంబళం బాచ్ఛాదించుకొని గోప్యంబున నఖినుణిం దోడ్కొని నిర్దిశ్యస్థలంబునకు జేరి యోగద్రుముండు రాజయోగసంధానంబున బరబ్రహ్మస్వరూపుండై ప్రకాశించుచుండం గని పాదంబులపై దండం బుకైవడి ప్రణమిల్లి యుభయు లమ్మహాసిద్ధుని సమ్ముఖంబున బద్ధాంజ లులై "దయాఘనా ! దీనవత్సలా ! తాపత్రయదావానిమగ్నలమగు నుమ్ము భవత్కరుణాకటాక్షజలధరంబున నుద్ధరింపవే" యని వేడు చుండ నాథునిమనంబున నతిముదం బావహించి బహిర్గతంబు జేయక మైనావతీ మనోదృఢం బెఱుంగందలంచి కృత్రిమంబున పిశాచచేష్ట లవలంబించి యౌదార్యగుణసంపన్నుండగు మేఘుండు పాషాణంబులు గురిపించినచందంబున కఠినోచ్చారణంబులు జేసిన రాజమాత యతి ధైర్యంబున నిమ్మహానుభావునిచే మృత్యువైనను మోక్షంబు గలదని ధారాధరజలధారలకు చలింపని భూధరంబుకరణి ధైర్యంబు బూని సమక్షంబున నిశ్చలమతియై గూర్చుండ జాలంధరుండు ఙాలు బువ్వ చు "నీవెవతివి? నే నిమ్మహాదుర్గంధమిళితంబగు వీథియందు పిశాచరూ పంబున నివసించియుండ నాకడ కరుదెంచుట కారణంబేమి? దుర్మతిచే మత్తపోభంగంబు గావించితివి. శీఘ్రంబున నీనామరూపంబులు దెలి యంబలుకు" మని నలుకవొడమ బలికిన నాశుభాంగి "కరుణామయా! నాపేరు మైనావతి యందురు. నే సులోచనపృథ్వీశుని ధర్మపత్నిని. మత్పతి కాలగతి నొందెను. తద్వస్మచ్ఛరీరంబు కాలునిచే వృథా యప హరింపఁబడుననిజన్మసార్థకంబుకై భవచ్చరణాంభోరుహంబుల నాశ్ర యింపఁ దలంచితి" నన యోగిపుంగవుండు "మైనావతీ! నీ విపు డెవరి పోష్యంబున నుండెద" వని యడిగిన నమ్మానినీమణి "ప్రభో! నా కొక కుమారుండు గలఁడు. ఈగౌడబంగాళదేశాధిపత్యంబు వహించి భవ ద్దాసుండై గోపీచందనామంబున బ్రకాశించును. నా కానైభవంబు లేల? కృతాంతపాశబంధంబుల దొలగించి కడ తేర్చవే" యనిబతిమాలినంత సిద్ధుండు "మైనావతీ! నాయట్టిపిశాచరూపునిచే కృతాంతభయం బేవిధి దీరును? వ్యర్థకాలహరణం బేలచేసెదవు? చనుచను. నీకుమారున కీ

విషయంబు దెలిసిన సనర్థంబు ఘటియించు" ననుచుండ నరుణోదయస
మయం బేర్పడిన సులోచనురాణి వేగంబున నిజభవనంబున కేగి జాలం
ధరునిచరణకంజంబులు మనంబున నిడుకొని దినంబెల్ల గడిపి నిశాసమ
యంబున పరిచారికను వెంటనిడుకొని యోగనిష్ఠాగరిష్ఠుండగు జడదా
రికడ కరుగుదెంచి పాదకమలంబుల కెఱఁగి మహాభక్తివిశేషంబులచే
నతుగులొత్తుచు పునఃపునర్వందనంబు లాచరించి సూర్యోదయాత్పూ
ర్వం బింటికి జనుదెంచె నిప్పగిది ప్రతిదినంబు నిజసదనంబున గృహకృ
త్యంబులు జరుపుచు రాత్రికాలంబున సిద్ధుని పాదసేవ లొనర్చుచు
పక్షానంబులు గడప నొకానొకసమయంబున జాలంధరుండు లోలాక్షి
బుద్ధిదార్ఢ్యంబు లక్షింపఁదలంచి మైనావతీదేవ్యంకస్థలంబుపై నిజ
మూర్ధంబుంచి తదంకంబున కధరభాగంబున నొకభ్రమరంబును గల్పించి
సుఖనిద్రం జెందుచుండె నంత నత్తేటి యయ్యువతి దొడయడుగున
గాయంబు గావించిన రుధిరం బపరిమితంబై గాఱుచుండ గురునిద్రాభం
గంబౌ నని దేహాభిమానంబు వదలి దృఢచిత్తంబున నుత్తమాంగన
యగు మైనావతీదేవి చలింపక యూర్చున్నం గని సిద్ధుండు మేల్కాంచి
గురుభక్తిపరాయణురాలగు మగువం జూచి యత్యంతానందంబున
శిరంబున వరదకరంబుంచి కర్ణంబున తారకం బుపదేశించె నమ్మహారా
ణి యవాఙ్మానసగోచరంబగు పరబ్రహ్మంబుదానై వెలుంగుచు విశ్వమ
యత్వంబున పశుపక్షిమృగప్రముఖ నానాచరాచరంబులు దనకన్యంబు
లు గావని యద్వితీయంబై ప్రకాశించుచుండ సిద్ధముఖ్యుండు సంజీవినీ
మంత్రంబు కర్ణద్వారంబునం బ్రవేశింపంజేయ శ్రీరామభద్రుండున క్తం
చరాధిపుండగు రావణానుజుని చిరంజీవి చేసినచందంబున మైనావతీదేవి
యనుశాంగనయై దేజరిల్లుచుండ నాథుండు భ్రమరకృతక్షతంబు క్షణ
మాత్రంబున మాన్పిన నద్దేవి పరమానందంబున యోగిపుంగవుని
సుగుణనికరంబున కచ్చెరువొంది దనమనంబున మత్సుతుండగు గోపీ
చందుం డనుగుండ్లెన బాగుండుసని దలంచుచుండెను.

ఇతి భక్తిసార నవనాథచరిత్రంబున జాలంధర మైనావతీకథా
విశేషంబు గల త్రయోదశాధ్యాయము సంపూర్ణము.

---

 

## చతుర్దశాధ్యాయము.

మైనావతీదేవి గురుకరుణాకటాక్షంబున బ్రహ్మానుభవజ్ఞానంబు గలిగి తనమనంబున భోగభాగ్యరూపయౌవనంబుల పెంపెక్కిన సుతుండగు గోపీచందమహారాజుం దలంచి యతులితవైభవోన్నతుండగు మద్భర్త స్థిరపదవి దలంపక కాలగతి నొందె. సుకుమారతను విలాసుండగు మత్పుత్రుండు తద్వత్కాలగతి నొందును. విపినంబు దహించు వీతిహోత్రుండు రమ్యతరలతావితానంబుల నుపేక్షించనిచందంబున నవవృశకుసుమశరసముండగు మత్సుతుని కృతాంతుండు సదయుండై రక్షించునే నేనేమిచేయుదు నని యమృతంబుకై కద్రువ విలపించిన కైవడి రాజ్యభోగసుఖసంపత్సమృద్ధుండగు పుత్రునికై కాలచక్రంబు నుద్దేశించి తపించుచు నొకానొకసమయంబున మాఘమాసదినోదయ శీతబాధ దొలంగుటకై యుష్ణాంశుకిరణంబుల కాశించి సౌధాగ్రంబున పరిచారికాసహితంబై కూర్చున్నంత గోపీచందుండు తద్రమ్యతర హర్మ్యనికటంబున స్నానంబునకై రత్నమయపీఠం బలంకరింప తేజోవంతంబులగు దివ్యాంబరమణిమయస్వర్ణాభరణంబులు విడదీసి నవయౌవనాంగనామణులు ప్రియం బిగురొత్త మౌక్తికహారంబులు గురుకుచోపరిభాగంబున నాట్యంబులాడ కరంబుల రత్నమయకంకణంబులు ఘల్లుమని మ్రోయ సుగంధపరిమళద్రవ్యంబులు శరీరంబున లేపనంబు జేయుచు మృగమదచందనాగరుమిళితోష్ణోదకంబుల స్నానంబు లాడించుచుండ నక్షత్రమధ్యంబున బ్రకాశించెడు నిశాకరునిభంగి యపరిమితదేహకాంతి నలుదిక్కులు దోయుచుండ మైనావతీదేవి గనుంగొని శోకభరితహృదయయై చక్షురింద్రియబాష్పంబులు రాల్పన నవి భూవల్లభుని శరీరంబుపై సంజీవినీజీవనంబులపగిది పతనంబయ్యె. నృపుం డిది యేమిచిత్రంబు తోయబిందువు లాకసంబునుండి బడియె నోయనుచు ఘనమండలంబు నిరీక్షింపుచు సౌధాగ్రంబున నధిష్ఠించి యున్న నిజమాతృముఖావలోకనంబు జేయుచు నశ్రుపూరితనయనంబులు గనుంగొని వేవేగంబున రత్నమయపీఠంబు డిగ్గి జననీసమక్షంబున కరిగి పాదంబుల వ్రాలి "తల్లీ! నీదుఃఖకారణం బేమి? నాయట్టి

పూర్ణప్రతాపవంతుండగు పుత్రుండుగలుగ నిర్భయహృదయులై నిన్నె
నరేమనిరి? తత్క్షణంబున నాదుర్మార్గుల దలద్రెళ్ల వేయుదు జెప్పవే? య
ఘటితకార్యంబని శంకింపనలదు. నీమనోభీష్టంబు దీర్పని మజ్జన్మంబు
శ్వానసూకరజన్మంబులకంటె నింద్యంబుగాదే? మాతృదుఃఖకారకుం
డగు పుత్రుండు శత్రుండుగాక మిత్రుండే? జననీజనకులదుఃఖంబు దీ
ర్పని తనయుండు భూభారుండు గాండే? 'నమాతుఃపరదైవతం' బనుశా
స్త్రం బేనెఱుంగనే? మాతాపితృతాపం బెఱుంగక కాంతాధీనుం
డగు సుతునికై భూదేవి శోకింపదే? దుఃఖం బుడుపకున్న మత్ప్రాణం
బులు నిలుచునే" యనుచున్న సుతునిజూచి సులోచనురాణి "వత్సా!
మద్గర్భంబున రూపలావణ్యవిశేషుండవై జన్మించి స్వప్రతాపంబున
నిఖిలరాజలోకంబున కొడయుండవై దేజరిల్లుచుండ మృగరాజును
ద్విరదంబు మార్కొనునట్లు నన్నెవరేమనియెదరు? పుత్రా! భవజ్జన
కుండు నీయట్టినవమన్మథస్వరూపంబుచే విశాలకీర్తివంతుండై తుదకు
కాలగతి దప్పింపలేక ప్రాణంబులు బాసి దేహంబు దాహకునిపా
లొనర్చె. మూషకంబుకై మార్జాలంబుపగిది గోసంచయంబుకై వ్యా
ఘ్రంబుకరణి దయాహీనుండగు కృతాంతుండు నీమోహనాకారం
బున కాశించును గావున సారాసారవిచారుండగు విభీషణుండు
రఘుపుంగవుని యనుగ్రహంబున చిరంజీవుండు గాండే? విష్ణునారాధిం
చిన నారదునిచే వ్యాసమహర్షి కుమారుండగు శుకమహాయోగీం
ద్రుండు సర్వమయత్వంబు నొందండే? శుకయోగీంద్రునిచే కృష్ణ
యాజ్ఞవల్క్యుండు, కృష్ణయాజ్ఞవల్క్యునిచే రామానుజుండు శాశ్వత
పదంబు నొందండే? ఈసాంప్రదాయం బభివృద్ధిజెంది రామానుజులచే
ముకుందరాజప్రముఖులగు మహాత్ములు నిలసిల్లిరి. తచ్చైతన్య సాం
ప్రదాయకంబున కపిలచైతన్యుండు రాఘవచైతన్యుండు బ్రహ్మచైత
న్యుండు కేశవచైతన్యుండు మొదలగు మహానుభావులు ప్రకాశించిరి.
తదనంతరం బమోఘుంబగు స్వరూపసాంప్రదాయకంబున హంసస్వ
రూపుండగు భగవంతుండు బ్రహ్మ కుపదేశింప నాబ్రహ్మచే నత్రిమ
హర్షి తత్వజ్ఞానంబు గ్రహించి దత్తాత్రేయుల కుపదేశించె. దత్తునిచే
సిద్ధనాథులు విరాజమానులైరి యాపై చతుర్థసాంప్రదాయంబు నంద
సాంప్రదాయనామంబుచే వికసించి సూర్యునిచే యాజ్ఞవల్క్యుండు,

యాజ్ఞవల్క్యునిచే సహజానందుండు, సహజానందునిచే బ్రహ్మా
నందుండు, యోగానందుండు, చిదానందుండు పరిపూర్ణబ్రహ్మస్వరూ
పులై దేజరిల్లిరి. పుత్రా! గోపీచందా! నీ వప్పగిది నిశ్చలనిర్గుణుండవై
యజరామరస్వరూపంబునొందిన విశేషం బగునని తలంచి దుఃఖించితి
గాని "యన్యం బేమియు లే" దన గోపీచందుండు "జననీ! యుష్మద్వా
క్యంబు లమృతతుల్యంబులు నిజంబే ప్రస్తుతం బట్టియమరత్వంబొసంగు
తపోఘను లెవరు కల" రని విచారించ మైనావతీ దేవి "వత్సా! ప్రకృతం
బీనగరంబున జాలంధరనాథుండను పరమయోగీంద్రుండు స్వరూప
సాంప్రదాయాబ్ధిచంద్రుండై విలసిల్లు. త్రికరణశుద్ధిచే నీవా యోగ
మూర్తికి తనుమనోధనంబు లర్పించి శరణు వేఁడిన నిన్నతండు సనాతన
పరబ్రహ్మస్వరూపుం జేసి యమరత్వంబొసంగును. ప్రపంచభోగంబులు
నిత్యంబులుగావని తలంపు"మని వాక్రుచ్చిన, సులోచనసుతుండు "తల్లీ!
దారాసుతాదిబంధువర్గభారం బతిశయించి యుండ సుఖసంపదలఁ
బరిత్యజించి యోగమార్గం బాశ్రయించుట మహాకష్టతరంబుగాదే?
ద్వాదశవర్షంబు లీ భోగంబు లనుభవించి యాపిదప యోగధారణ
వహించెన్నై యుత్తానపాదునికైవడి బ్రకాశించెద" నని నుడివిన మై
నావతీ దేవి "పుత్రా! ద్వాదశవత్సరంబు లననేల; ద్వాదశనిమిషంబు
లైన స్థిరంబులుగాని భోగంబుల కాశించెదవే? క్షణభంగురంబులగు
చిత్తవిత్తజీవితంబులు శాశ్వతంబులని దలంచుట వేదుఱుగాదే!
తృషార్తుండు మృగజలంబుల నపేక్షించిన నేమిలాభంబు! బుద్బుదతు
ల్యంబులగు సంసారసుఖంబులు వంధ్యాపుత్రునిచందం బనఁదగదే!
స్వప్నగోచరేంద్రభోగంబులు భోగంబులగునే! శుక కపిల దత్తాత్రేయ
వ్యాసప్రహ్లాదాది చరిత్రంబులెఱుంగవే! కాలవ్యాపనంబు దలంపక
సమయనిరీక్షకుండగు శమనున కవశుండవగుము తండ్రీ!" యని బోధ
ప్రబోధ జేయుచుండ నుమావతియను రాజకాంత తద్వాక్యంబులు గో
ప్యంబున నాకర్ణించి "యహహా! రాజ్యభోగంబులు బరిత్యజించి విరా
గుండై సంచరించుమనుట వొల్లి శ్రీరామచంద్రునినరణ్యంబునకంపిన
కైకమ్మచందంబుగాదె! తనయునివైభవంబు లరణ్యంబుల పాలు
జేయు తల్లి తల్లియే? దుర్బోధంబులు సుబోధంబులని బలుకుచు
శత్రురూపంబున పిసన్మార్గప్రదర్శనంబు జేయు పరమపాపిష్ఠి దుర్వచ

నంబు లేకునిదలంపుదును? మ మ్మేగతి జేయునో నృపుం డేయాపద
నొందునో రాజ్యంబున కనర్థం బేమిసంభవించునో దాసదాసీజనం
బులు వికటప్రత్యుత్తరంబు లొసంగుట సత్యం బనృతంబై దోఁచుట
క్రూరస్వప్నంబులు గలుగుట భూనిక్షిప్తధనం బంతరించుట దనశత్రుం
డు బలిష్ఠుండౌట నుపకారంబులు విపరీతార్థంబులై దోఁచుట భూపతికి
వైరాగ్యంబు గలుగుట పరమేశ్వరుం డలిగె నని నిశ్చయింపవలయు.
తల్లియే సుతునకు ప్రపంచం బెడబాయుచునుట రాజ్యపదచ్యుతికి
చోద్యం బె"యని విలపించుచు నంతఃపురంబు ప్రవేశించె నట గోపీచం
దమహారాజు తల్లివచనంబుల కుల్లసిల్లి "యోతల్లీ! జాలంధరనాథుని
నాకన్నుల కగుపఱచుము. నేనామహామహుని గుణజాలంబులు గనుం
గొని తనుమనోధనంబు లర్పించి సుఖయించెదను. నీవ్యసనంబు మాను"
మని దుఃఖోపశమనంబు జేసి స్నానంబుకై చనెను

{ జాలంధరనాథుండు మైనావతీరాణికతంబున గోపీచంద
మహారాజుచే కూపంబునం బడినుండుట. }

తదుపరి యంతఃపురంబున పట్టరాణియగు లుమావతీదేవి పరి
తప్తహృదయయై భూకాంతుని ముఖ్యకాంతలను బిలుచుకొని సత్కా-
రంబులు సలిపి "సఖులారా! రాజమాతయగు మైనావతీ విపరీతచరి
త్రంబు వింటిరే? ఇప్పురంబున కెవఁడో యతీశ్వరుండు పాడయ్యెనట
వానిపేరు జాలంధరనాథుండట వానిచే రాజునకు దా నిర్వాణదీక్ష
లిప్పించునట! రాజ్యభోగంబుల కగ్గి ముట్టించునో నృపుని తాపసుని
జేసి గోచిపెట్టించునో మనగతు లేమిచేయునో మనరాజ్యంబు పరు
లచే నపహరింపఁబడునో మన ముపేక్షించుట మహాహానికరంబౌను.
మనయుక్తిచే వారిదురాలోచనలు భంగపఱచవలయు. లేకున్న
స్తంభంబుబడిన గృహంబు గూలుట నిశ్చయంబు. యగ్నికణం బించు
కైనను గుణంబు కొరవౌనె!" యనుచు నొకరితో నొకరనేకయుక్తి
ప్రయుక్తంబులగు సంభాషణంబులు జేయుచుండ కుశలమతియగు
లుమావతీదేవి యొకకుటిలంబు దలంచి "సవతులారా! మనపురంబున
నివసించెడు జాలంధరనాథునిపై మైనావతి భక్తిదృఢత్వం బమితంబై
విలసిల్లె. మనమా యోగీంద్రునిపై విషయ లోలత్వంబున మైనావతి

దేవి మరిగెనని మిత్రభేదతంత్రంబుచే నేకాంతంబున పుడమీశునకు
మీతల్లి తపంబుకై మిమ్మడవి కంపి జాలంధరునితో సుఖంబు లనుభ
వింపఁదలంచెనని యనర్థంబులు కల్పింపవలయు నట్లైన నృపుండు
జాలంధరుని శిక్షించును. మనకాయాసంబు బొసంగనేర" దని తమ
లోతాము నిశ్చయించుకొని తమతమయంతఃపురంబులం బ్రవేశించిరి.
తదుపరి యొకనాఁ డా భూమీశుండు సూర్యాస్తసమయానంతరప్ర
థమయామంబున భోజనంబు సల్పి వినోదార్థం బంతఃపురంబున దిరు
గుచుండ లుమావతీదేవి తనపడకగదిలో రత్నమయసింహాసనంబుపై
నరనాథు నలంకరించి మోహావేశంబగు హావభావంబున పూజలు
సలిపి కామోత్సుకుండగు నరపుంగవుని జూచి కేలుమోడ్చి "రాజో
త్తమా! అత్యంతభయావహంబగు దుర్వార్త మత్కర్ణరంధ్రంబున
దూఱె నయ్యది దెలియపఱచకున్న ధర్మంబుగాదు. ధర్మంబని దలం
చిన ననర్థంబు సంభవించునో యనుభయంబున హృదయంబు గంపిం
చుచు నీయుభయార్థంబుల మచ్చిత్తం బతికష్టంబు నొందుచున్న"
దని పలికిన పలుకులు ములుకులై నాటుచుండ పుడమిఱేఁడు లోలా
క్షింజూచి "నిర్భయంబున దెలుఁపుము. మత్సరాక్రమదర్పంబునీకేల?"
సని కరతలం బొడ్డిన నక్కపటహృదయకుటిలాక్షి "ప్రభో! భవజ్జననీ
చరిత్రంబు వింటిరే! జాలంధరుండను జడదారిని మోహించి వారిచే
మీకనుగ్రహం బిప్పించి తపంబుకై దూరదేశారణ్యంబునకు మిమ్మంపి
తా నా సన్యాసిచే రతిసుఖం బనుభవించుచు రాజ్యం బేలదలంచె
నట. మాసౌభాగ్యబలంబున వినవచ్చె. నిజానిజంబులు మీరేయో
చింపు" డని నుడివిన నుడువులు పిడుగులై ఱొందంబు నంటుకొన
చండక్రోధానలవిస్ఫులింగంబులు నేత్రంబుల రాల్పుచు భయంకరా
కారంబున జాలంధరుని గబళింపం దలంచి సభామంటపంబు జేరి
మంత్రిపుంగవసహితుండై జాలంధరుని జేరంజని యయ్యోగిముఖ్యుని
యోధులతో దెప్పించి యశ్వశాలాంతరకూపంబున బడవైచి యాపై
నశ్వవిష్టంబు పర్వతతుల్యంబుగ గప్పి "రహస్యంబు వెల్లడిజేసిన యధ
ముని శిక్షించెద" నని శాసనవాక్యంబులు బలికి యథాప్రకారంబున
రాజ్యం బేలుచుండెను.

ఇక్కౌతుకంబు నిశాకాలంబున జరిగినకతంబున నోరులెఱుంగ లేరైరి. సూర్యోదయానంతరంబున స్వస్థానంబున నాథుం గగుపడ లేమిం జేసి పురజనులు జాలంధరుండు తీర్థయాత్రాపరతంత్రంబున నేగెను గాబోలునని యొకరికొకరు దెలుపుచుండ నొకపరిచారికచే మైనావతీ దేవి యాకర్ణించి "యయ్యో! మత్పుత్రుండు హీనభాగ్యుండు నాయత్నంబు కొనసాగదయ్యె" నని విలపించుచుండెను.

జాలంధరనాథుండు భ్రూసంకేతంబున బ్రహ్మాండంబు డుల్ల జేయు పరాక్రమంబు గలిగియు భవిష్యచ్చరిత్రంబు దలంచి శత్రుమిత్రసముండు గావున కూపంబున కార్యాకార్యవిచక్షణత్వంబుచే వజ్రాసనాసీనుండై యాకాశాస్త్రప్రయోగంబున నశ్వవిష్ఠభారంబు శిరంబున గలుగకుండ నిరాధారంబున నుంచి స్వస్థచిత్తుండై పరబ్రహ్మయోగానుసంధానంబుచే విరాజమానుం డౌచుండెను. ఇట నంతఃపురనారీమణులు పురజనులవార్తలను విని మనకష్టంబులు గడతేరె. జాలంధరుండు వెడలిపోయెనని ముదితాత్ములైరి.

ఇతి భక్తిసార నవనాథచరిత్రంబున జాలంధర మైనావతీ గోపీచంద కథావిశేషంబులు గల చతుర్దశాధ్యాయము సంపూర్ణము.

---

## పంచదశాధ్యాయము.

గోరక్షనాథుండు గురువును వెదకుచు దేశంబులు గ్రుమ్మరుట.

ఇవ్విధంబున తపోఘనుండగు జాలంధరుండు కూపంబున నిశ్చలత్వంబుచే ప్రకాశించుచుండె నట బదరికాశ్రమంబున గోరక్ష కానీఫులొకరినొకరెఱుంగక ద్వాదశవత్సరంబులు తపం బాచరించుచుండ నుమాధవుండు భవిష్యచ్చరిత్రం బెఱింగి గోరక్ష కానీఫులసఖ్యం బొనగూర్పందయ్యె. తపాంతంబున కానీఫుం డుత్తరదేశంబున కరిగె. గోరక్షుండు పూర్వోత్తరమధ్యభాగమార్గం బనుసరించి గయాప్రయాగ కాశీప్రముఖతీర్థంబులు సేవించి గురువన్యుండగు మత్స్యేంద్రనాథుని

శోధించం జనియె. తద్వృత్తజన్మోద్భవకాలీపుండు గురుచరణావలోకన కుతూహలుండై పయనం బొనర్చె. గోరక్షుండు మాతృవిహీనశిశువం దంబున నహర్నిశం బన్నపానాదులు వర్జించి నిజగురుపదపంకజార్పిత చిత్తుండై నానారణ్యంబులు గ్రుమ్మరుచు నాథా! మత్స్యేంద్రసద్గురూ! యని కేకలిడుచు తటస్థజనులను విచారించుచు గౌడబంగాళ దేశస్థ గ్రామగ్రామంబు గవేషించుచు నపరిమితచింతాభరంబున శుష్కీభూత శరీరుండై హేలాపట్టణగ్రామద్వారసమీపంబున కేగి గోరక్షుండు ద్వార పాలురను గని "ద్వారపాలకులారా! ఈపురంబున తపోధనుండగు మత్స్యేంద్రనాథుండు గలండా" యని విచారించిన, వారలు మత్స్యేం ద్రనాథనామయతీంద్రుం డీనగరంబున లేడు. కతిపయవత్సరంబుల క్రిందట జాలంధరనామయోగీశ్వరుం డేతెంచి ప్రతిదినంబు శిరాగ్రం బున తృణ్యంబు నిరాధారంబున దెచ్చుచు నగరగోసంచయంబును దృప్తిపఱచుచు నొకవత్సరం బిచ్చో గడపి యెచ్చటికేగెనో మే మెఱుంగము. తదాది దశవర్షంబులయ్యె" నన గోరక్షుండు తనమనం బున తత్పురుషశ్రేష్ఠుండు సద్గురుండగు మత్స్యేంద్రుండు గాబోలు. లేకున్న నిట్టిసామర్థ్యం బన్యులకు గలదే! తొల్లిటి మత్స్యేంద్రనామం బు బరిత్యజించి జాలంధరనామంబున దేశరిల్లెనో యని తలంచుచు శోకభరితహృదయుండై "హా! గురుసద్గురూ! నన్నేడబాయుట ధర్మం బౌనే! సర్వజ్ఞుయుండవై నా కగుపడని కారణంబేమి? న న్నేలమఱచి తిరి? నాయందలిప్రేమాతిశయం బంతరించెనో నాకెవరుదిక్కు? నాథా! నాథా." యని గోవుకై వక్షంబుకై పడి విలపించి నిట్టూర్పులిడుచుచు పురంబుప్రవేశించి భిక్షానెపంబున ప్రతిగృహంబుననలక్ భిక్షాప్రశ్నలు జేయుచు జాలంధరనాథకూపసమీపంబు జేరినంత జాలంధరుండు గోర క్షుని భిక్షాప్రశ్నచే నాథపంథీమహాపురుషుండని తలంచి యాదేశ నమ స్కారంబు జేయ గోరక్షుం డచ్చెరువొంది యీశబ్దం బెక్కడిదని కూపనికటంబున నిలువంబడి "నీ వెవరు? నీనామం బేమి? నీ వెక్కడ నున్నా" వని యడుగ నతండు "నేను జాలంధరనాథుండను. యీకూ పంబున నివసించియున్నాను. నీగురు వెవరు? నీనామధేయంబేమి? తెలుపు" మన నయ్యునతనయుండు "నాపేరు గోరక్షుం డనియెదరు. మద్గురుమూర్తినామంబు మత్స్యేంద్రనాథుం" డనుచు "తామీకూపం

బున బడియుండుట కారణంబేమి" యని విచారించెను. హుతాశన సుతుండు గోపీచందనృపాలుని జ్ఞానరహితచరిత్రం బెల్ల దేటపఱచిన గోరక్షుండు రోషతామ్రాక్షుండై "యోగద్రుమా! భవదాజ్ఞానుసారంబున నీక్షితీశుని భస్మంబుజేయుదునే? లేక నీబ్రహ్మాండంబు కొనగోట మీటుదునె యింతనర కుపేక్షించుట కారణంబేమి? సురలోకవందితుండవగు ని న్నిట్టికష్టంబులు పెట్టు నృపాధముని శిక్షించక క్షమియింతురే" యనుచుండ, జాలంధరనాథుండు "గోపీచందభూనాయకునిచే నాథపంథీసాంప్రదాయపరంపరాభివృద్ధి జెందవలసిన భవిష్యతి గలదు గాన క్రోధసమయంబు గాదు. నీవీ వర్తమానంబు వెల్లడిచేయవలదు. నీవు దేశంబులు భ్రమ్మరుచుండ మచ్ఛిష్యుండగు కానీపుం డగుపడు. వానికీ వృత్తాంతంబంతయు దెలియబఱచిన నక్కానీపుం డేతెంచి యుక్తిప్రయుక్తులచే నృపుని రక్షించి నన్ను దీయు" నని జెప్ప గోరక్షుం డాదేశవందనం బాచరించి యచ్చటచ్చట భిక్షాన్నంబు గ్రహించి శైలీ సింగీ పరికరంబులు ధరియించి నానాదేశంబులు భ్రమ్మరుచు జగన్నాథంబు ప్రవేశించెను.

{ కానీపనాథుండు దేశంబులు భ్రమ్మరుచు స్త్రీరాజ్యంబున కేగుచెడ మారుతాత్మజుం డిడుగులంబడి సఖ్యం బొనర్చుకొనుట. }

ఇట కానీపనాథుండు ప్రతిగ్రామంబు సంచరించుచు నచ్చటచ్చట శిష్యులంజేసి బోధప్రబోధనలు జేయుచుండ కానీపుని వైరాగ్యంబునకు లోలులై శిష్యసమూహం బభివృద్ధినొంది సప్తశతసంఖ్య నచ్ఛిష్యులు వెంటనంటి జనుచుండ స్త్రీరాజ్యంబున నరగమనం బతికష్టంబనియు తద్రాజ్యమహిమాతిశయంబులు నిరీక్షింపం దలంచి తచ్ఛిష్యజనసమేతుండై సర్వభక్షకుండగు వైశ్వానరునివిధంబున సర్వసమర్థత్వంబున కానీపుం డేగుచుండ శిష్యజనులు దమలో తాము అహో! మన మారాజ్యంబు బ్రవేశించి పీతిహోత్రుని పూర్ణాహుతి పగిది గాక బ్రతుకనేర్తుమె? మనచే తద్రాజ్యప్రవేశం బగునే? విషపానంబున ప్రాణంబులు వాయునట్లు దీపజ్వాలపై కేగిన పతంగంబుభంగి జీవించలేమని నిశ్చయించి కొందఱు పలాయనంబు జేయవలయుననియు, కొందఱు తనుమనోధనంబులు గురుచరణార్పితంబులై యుండ మనకెట్టిభ

 

యంబనియు, నొకకొంద ఱీవెఱ్ఱి వేదాంతంబు లేల? ప్రాణంబులున్న శు
భంబులు బడయవచ్చును. మృత్యునిలయంబునకు జనుట వేడబంబుగా
దె యనుచు గుంపు గట్టి యన్యోన్యాలోచనపరత్వంబున గూర్చున్న
శిష్యజనకదంబంబుజూచి కానీపనాథుండు గ్రహించి భయగ్రస్థమంద
మతులకు వాచాపురుషార్థంబున నుత్పన్నితాపంబు దెలిపిన నిష్ప్రయోజ
కంబగునని దలంచి చిటికెడుభస్మం బభిమంత్రించి స్పర్శాస్త్రప్రయోగం
బున శిష్యసంఘంబు పలాయితులు గాకుండ దశదిగ్బంధనం
బొనర్చి తత్సమీపస్త్రీరాజ్యనాయకుండగు మారుతాత్మజ భుభుఃకార
మహానినదంబు వినరాకుండ నొసర్చి శిష్యులం బిలిచి "నాకు స్త్రీరా
జ్యంబున కేగుట ముఖ్యకారణంబు గలదు. తద్రాజ్యనల్ల భుండగు కపి
వల్లభుని ఘోరతరభుభుఃకారరవంబున పురుషులు జీవించలేరు. స్త్రీరా
జ్యంబున విశేషపుణ్యఫలదంబులగు ముఖ్యతీర్థంబులు గల వయ్యవి
సేవించిన భవబంధంబులు దొలంగు. నాయందలి భక్తిదృఢత్వంబున
నేతెంచితిరేని సులభంబులై ఘటియించు. లేకున్న బ్రతుకుట కష్టం
బు మీామీాయభిప్రాయంబులు దేటపఱచి గురుభక్తి విశేషజ్ఞులుతప్ప
తక్కినవారలు నిజేచ్ఛ సదనంబుల కేగవలయు ననీ పరీక్షార్థంబున
నుడువ సప్తశతసంఖ్యశిష్యసముదాయంబున దృఢీకృతమనస్కులగు
పురుషసప్తకంబుదప్ప తక్కినవార లొక్కుమ్మడి దిక్కులంబడి గురుండు
మనమనోగతం బెఱింగి శలవొసంగెనని పెక్కుభంగుల గొనియా
డుచు నొక్కక్రోశం బేగినంత గురునిర్మితస్పర్శాస్త్రంబు ముట్ట
డించి కరపాదంబులు బంధించ వారలు చేతనంబు దప్పి నిర్విణ్ణులై
మహింబడియుండిరి. తత్సమయంబున కానీపనాథుండు శిష్యసప్తకం
బును బిలిచి యావృత్తాంతంబంతయు దెలియఁజెప్పి "మీారు శీఘ్రగమ
నంబున నచ్చోటికేగి వారిపృష్ఠభాగంబున పాషాణంబు లిడుఁ" డని
యాజ్ఞాపింప వార లతివేగంబున శిష్యవర్గంబు జేరంజని గురూ
క్తప్రకారంబున పాషాణంబులెత్తి వారిపృష్ఠభాగంబున నుంచు
చుండ వార లత్యంతదుఃఖార్ణవనిమగ్నులై హాహాకారంబులు జేయుచు
"నపరాధుల మపరాధులము క్షమియించి రక్షింపుడీ. మాకృత్యంబు
లనర్థంబులయ్యె సదయహృదయగురువచనుంబునుదప్ప నన్యులు రక్షిం
తురే? మాయం దనుగ్రహించి స్త్రీరాజ్యంబునకు వెంటగొని జను"

మని యాక్రందించుచుండ నాశిష్యసప్తకంబు గురునికటంబుజేరి పాదంబుల కెఱఁగి మృదువాక్యంబులచే స్పర్శాస్త్రబద్ధ బుద్ధిహీనశిష్యుల రోదనం బెల్ల దెల్లంబుజేసి "యోదీనశరణ్య! శిష్యులకష్టంబులు కడతేర్చవే" యని ప్రస్తుతింప పరమదయారసంబున ప్రసన్నుండై విభక్తాస్త్రంబు జపియించి యొకశిష్యునికి భస్మంబిచ్చి "యచ్చోటికేగి వారలకీ వృత్తాంతంబు దెలిపి ముక్తులం జేయు" మని యాజ్ఞాపింప నతం డరిగి విముక్తులం జేసినంత వార లపరిమితమోదంబున గురుసమక్షంబున కేతెంచి పదకంజంబుల వ్రాలి క్షమాపణంబు గోర కానీపుండు హర్షించి తచ్ఛిష్యజన సహితుండై స్త్రీరాజ్యసీమసమీపంబుజేరి నివసించియుండ నారాత్రిసమయంబున వాయుసూనుండు స్త్రీరాజ్యనారీమణులకై భుభుఃకారశబ్దం బీదలంచి సేతూప్రదేశంబునుండి స్త్రీరాజ్యంబున కేతెంచుచుండ మార్గమధ్యంబున స్పర్శాస్త్రంబు నిరోధించి పాదంబు లంటుచుండ వజ్రశరీరుండగుటన నయ్యస్త్రంబును సరకుగొనక నిది స్పర్శాస్త్రంబని యొవ్వఁడో మహాప్రతాపపురుషుం డిచ్చోటికేతెంచి యుండునో లేక మత్స్యేంద్రయోగివర్యుండు మైనాకినీరాణిం బాసి యిట సంచరించుచుండునో నాప్రయత్నంబు విఫలంబై మైనాకినీదేవి పరితపించుచుండెనో యని మనంబున సంశయించుచు భయంకరాకారంబున పిండీకృత బ్రహ్మాండుండై లాంగూలంబు మిన్నందిభ్రమణంబుజేయుచుండ ప్రళయకాలరుద్రునిమాడ్కి రోషంబున నేతెంచుచున్న మరుత్సూనుం గనుంగొని శిష్యసమూహంబు భయభ్రాంతహృదయంబై కానీపనాథుని సమక్షంబునకు పరుగెత్తిన ధైర్యధుర్యుండగు నాథుండు భయపడకుఁడని భస్మం బభిమంత్రించి వజ్రాస్త్రంబు బ్రయోగింప నయ్యస్త్రరాజంబు మహాతీక్ష్ణ్యంబున నేతెంచుచుండ ననిలతనయుం డుత్తుంగమహీధరంబులు దానిపైఁ బడవైవ తద్వజ్రహతంబున నయ్యవి చూర్ణంబులయ్యె. బలశౌర్యుండగు హనుమంతుం డవ్వజ్రాస్త్రంబును నిజకరంబుల నొడిసిపట్టి భూమిం బడవైచె. గజకర్ణోద్భవుం డీ యపారపరాక్రమంబు గని కాళికాస్త్రంబు బఱపి తత్సహాయంబుకై వాసవాస్త్రాగ్నేయాస్త్రవాతాస్త్రంబు లేకముఖంబున నడరించిన ననలాస్త్రం బనిలాస్త్ర బలంబున దిశలు ముట్టి కపీశప్రయోగకృత కుధరంబుల భస్మంబు గా

వించిన నంజనీసూనుం డభ్రంకషశరీరుండై విశాలవక్త్రంబు దెఱచి నిఖి
లజనసంఘంబును గబళింపఁదలంచ సిద్ధనిర్మిత వాసవాస్త్రంబు తద్వత్ప్ర
కటంబై ముఖాముఖిఁ నిలిచియున్నంత హుతాశనమారుతాస్త్రంబులు
మారుతిశరీరంబు బీడించుచుండ పూర్వపశ్చిమభాగంబుల వాసవాస్త్ర
కాళికాస్త్రంబులు ముష్టిఘాతంబులు జేయుచుండ మిన్నుచూలి తన
యుండు గనలి వాసవకాళికాస్త్రద్వయంబును కరద్వయంబున నొడి
సిపట్టి యనలాస్త్రంబు పుచ్ఛంబున బంధించి మారుతాస్త్రంబును
సుతుని బాధించుట ధర్మంబే యని బొగడుచు నుపశమింపఁజేయు
జాలంధరప్రియశిష్యుం డీ యద్భుతవిక్రమంబు జూచి మోహనాస్త్రంబు
వఱపిన నదికపిపుంగవుని హృదయంబు బ్రవేశించి తత్క్షణం బవ్వజ్రకా
యంబు భేదించలేకుండెను. గంధవహసుతుం డాగ్నేయాస్త్రంబును
పుచ్ఛంబుచేజలధినిముంచఁదలంచిననంత సజ్జలచరంబులునశియించునని
సముద్రుండు మూర్తివంతంబున బ్రత్యక్షుండై జనుదెంచి జలదంబులచే
ననలాస్త్రంబు జల్లార్చె నీప్రకారంబున వాయుసుత కర్ణసుతు లన్యోన్య
జయకాంక్షలచేఁ బోరుచుండ నాథప్రయోగ మోహనాస్త్రంబు సన్నస
న్నంబున దేహంబు వ్యాపించుచుండ ననిలనందనుం డొకమల నెత్తద
లంచియు చిత్తవిభ్రమనొందెను. తత్సంధిసమయంబున వాసవాస్త్రకా
ళికాస్త్రంబులు హృదయంబు భేదించి క్వచిన్మూర్ఛం బొందించ నని
లుండు పుత్రవాత్సల్యంబున బ్రసన్నుండై సమీపించె నప్పు డాప్రభం
జనసుతుండు మూర్ఛదేరి రౌద్రావేశంబున యుద్ధసన్నద్ధుండై నిల్చి
యుండ మిన్నుచూలి దనతనయుని హస్తంబు ధరియించి "పుత్రా!
నాథులబలపరాక్రమంబీ వెఱుంగవే? మున్ను మత్స్యేంద్రయోగివర్యుం
డు శౌర్యధైర్యంబున వాతాకర్షణయోగంబుచే నీకరపాదస్తంభనం
బొనర్పఁడే కావున వ్యర్థకలహంబున ననర్థంబు సంభవించు. సఖ్యంబుచే
సుఖావహం బౌ"నని పలుకుచుండ సముద్రుం డిదియే నాయభిప్రాయం
బని నుడివెను. మరుత్సూనుం డపాంపతి పృషదశ్వసహితుండై కానీఫ
నాథ సమీపంబు జేర నగ్గజకర్ణోద్భవుండు మహాపురుషత్రయంబునకు
నమస్కారంబులుసల్పి యంజనీసూనునితో "సమరం బేల నిల్పితి" రని
యడుగుచుండ చదలుపుట్టు "సమరకారణం బేమి" యని కానీఫు నడుగ
నతం "డేనెఱుంగను. భవత్సుతుని విచారించు" మనుచుండ హనుమం

తుండు సమీరునితో "జనకా! మున్ను నే ననేకవిధంబుల యోగిము ఖ్యుండగు మత్స్యేంద్రునకు బోధించి స్త్రీరాజ్యాధిపత్యం బొసంగితి ని క్కానీపుం డచ్చటి కేగెనేని యతిశయవైరాగ్యంబుచే మత్స్యేంద్రునిచి త్తం బపహరించి వెంటనిడుకొని జనియెనేని తద్వియోగంబున మైనాకి నీదేవి విలపించునని తలంచి దర్పంబు జూపితినిగాని యన్యం బేమియు లేదు గావున కానీపుం డటకేగి వికటోక్తులు బలుకనని వచనం బీకు న్న జనవల" దన జాలంధరశిష్యుండు హాసన్ముఖుండై "మత్స్యేంద్రుని వియోగంబు నా కనవసరం" బని కరతలభాషణం బొసంగె నపు డా త్రిమూర్తులు స్వస్థానంబుల కేగిరి. ఇట కానీపనాథుండు సూర్యోద యానంతరంబున శిష్యజనపరివృతుండై స్త్రీరాజ్యంబుప్రవేశించి నానా తీర్థంబుల స్నానంబు లాడుచు శృంగమురుడీనగరంబుజేరి యలక్ భిక్షా ప్రశ్న జేయుచు రాజభవనంబున కేతెంచుచుండ నొకకొండలు చారు లతివేగంబున రాజనగరు ప్రవేశించి సభాస్థానంబున మైనాకినీసమే తుండై రత్నమయసింహాసనాసీనుండగు మత్స్యేంద్రనాథునకు వంద నంబు లాచరించి "రాజోత్తమా! కానీపనాథనామంబున నొక తపోధ నుండు నాథపంథీచిహ్నంబులచే సప్తశతసంఖ్యశిష్యజనసహితుండై యుష్మద్దర్శనకుతూహలత్వంబువనేతెంచుచున్నా" డనినుడువ వతోస్య దరసంభవుండు గోరక్షుండు తననిజనామంబు గోప్యపఱచి కానీపనాథ నామంబున జనుదెంచెంగాబోలు? చంద్రచంద్రికలనేలు మైనాకినీముఖ విలాసంబు బాయుదునో నేనేమిచేయుదు నని దలంచుచు నశ్వారూ ఢుండై భటకోటి నడుచుచుండ రాజభోగంబులచే కానీపనాథుని జేరం జని యాదేశశబ్దంబుల నన్యోన్యనమస్కారంబు లాచరించుకొని దివ్యా సనంబుల బుడమి నలంకరించిరి. మత్స్యేంద్రుండు కానీపుని గురుసాం ప్రదాయ విశేషంబులు విచారింప నంత నతండు జాలంధరనాథజన్మ ప్ర భృతి వృత్తాంతంబంతయు తేటతెల్లంబుగ శ్రుతిపఱచెను. మత్స్యేం ద్రుండు సంతసించి "యోకానీపనాథా! జాలంధరుండు దత్తశిష్యుండై నకతంబున మద్గురుబంధుండయ్యె. తత్కారణంబున నీవు నాకు ముఖ్యుండ" వని మృదువచనంబులచే తుష్టపఱచి గజాదోహణంబు

జేసి నానావైభవంబులతో రాజభవనంబు ప్రవేశం బొనర్చి సరసోక్తులచే నొకమాసంబు గడపెను.

ఇతి భక్తిసార నవనాథచరిత్రంబున కానీపనాథకథావిశేషంబు గల పంచదశాధ్యాయము సంపూర్ణము.

---

## షోడశాధ్యాయము.

{ కానీపనాథుండు శృంగమురుడీనగరంబు ప్రవేశించి మత్స్యేంద్ర నాథునిచే నాతిథ్యంబు గొని చనుదు గోరక్షనాథునిచే దనగురుపుజాడ లెఱింగి హేలాపట్టణంబు ప్రవేశించుట. }

మత్స్యేంద్రయోగివర్యుండత్యంతాదరంబునకానీపునకాతిథ్యం బొసంగుచు తనహృదయంబున నిక్కానీపుండు స్వదేశంబున కేగనేని గోరక్షునకీ వైభవవృత్తాంతంబులు తేటపఱచును. వాఁడా తక్షణంబ మత్సమీపంబున కరుదెంచి భోగభాగ్యంబుల నన్నెడబాపును. గోరక్షనాథుండు మచ్ఛిష్యుం డని కానీపునితో వెల్లడిజేయ తగదు. యుక్తిప్రయుక్తులచే కానీపు నిచ్చో స్థిరపఱచవలయునని నిశ్చయించి యనేకనవయౌవనాంగులం బిలచి "మీకుటిలేక్షణప్రసారంబున కానీపనాథునిచిత్తం బపహరించి దర్పకభల్లంబుల పాలుజేసి విషయలోలత్వంబు గల్పింపు" మని యాజ్ఞాపింప నయ్యకలంకచంద్రముఖులు నిజముఖావలోకనంబున తాపసులనైన పరితపింపఁజేయు లావణ్యంబులచే పరిమళవంతంబులగు చందనాగరుద్రవ్యంబులు శరీరంబుల నలఁది యుత్తుంగపయోధరభారంబున గౌను లల్లాడ మత్తమాతంగ యూథంబుపగిది గమనసోయగంబుచే కానీపనాథునికటంబుజేరి మోహావేశసంభాషణంబులొనర్చుచుండ కానీపనాథుండు నిశ్చలమనంబున విరాజమానుండయ్యె. మత్స్యేంద్రనాథుం డక్కానీపునిదృఢచిత్తం బెఱింగి యచ్చేడియం బిలచి "శిష్యసంఘంబునైనమోహపరవశత్వంబు బఱపు" మన నా రనేక హావభావవిలాసంబులు గనఁబఱుప దచ్ఛిష్యులును చలింపరైరి. ఇబ్బంగి యొక మాసంబు గడపుచుండ కానీపనాథుండు మత్స్యేంద్ర యోగిపుంగవుని సముఖంబు జేరి "శల వొసంగిన స్వదేశంబున కేగెద" నని విచారింప మత్స్యేంద్రుం "డవశ్యం" బని

సర్వసంపత్సమృద్ధుండు గాన కానీపనాథునకు రత్నమయభూషణాంబరంబులు గజతురగోష్ట్రంబులు సమర్పించి యొకక్రోశంబు వెంటనంటి జనియు పరమాదరంబున నమస్కరించి స్వస్థానంబుజేరెను. కానీపనాథుండు నానాతీర్థక్షేత్రంబులదర్శించుచు స్వదేశంబుజేరి స్వేచ్ఛావిహారంబు సలుపుచు గ్రామగ్రామంబున భక్తజనకృతసపర్యలం గైకొనుచు దిగంతవ్యాప్తకీర్తిధనుండై బంగాళదేశంబు ప్రవేశించినంత నాథుని యపారసచ్చరిత్రంబులు హేలాపట్టణంబు నిండియుండెను. అట గోరక్షనాథుండు జగన్నాథాది సమస్తక్షేత్రంబులు సేవింపుచు బంగాళదేశంబుజేరి విపినమార్గంబున నేగుచుండ తత్కాననంబున విశాలతరతరుశోభితప్రదేశంబున గజకర్ణోద్భవుం డగుపడిన గోరక్షుం డాలోకించి యన్యోన్య నమస్కారంబు లొనర్చుకొనుచుండ కానీపనాథుండు స్వర్ణమయదివ్యాంబరాసనంబున గోరక్షుని నివసింపజేసి తత్పార్శ్వంబున తానివసించి యతనితో "తమనాథపంథీగురుమూర్తినామధేయంబు దెలుపు" మనగోరక్షుండు దనజన్మప్రభృతిచరిత్రం బెల్ల వెల్లడిచేసి కానీపునితో "యుష్మద్గురునర్యాభిధానం బెఱింగింతు"రనిపలుక నక్కానీపుం "డస్మద్గురుశ్రేష్ఠుండు జాలంధరనాథాఖ్యుం" డనుచు జన్మాదివృత్తాంతంబు దెలియపఱచియు దనమనంబున గోరక్షుండు మత్స్యేంద్రనాథప్రియశిష్యుండు మత్స్యేంద్రనాథుండు శ్రీగురుదత్తాత్రేయశిష్యుండు గావున సిద్ధగోరక్షుని విద్యానైపుణ్యంబు గనుంగొని యస్మత్ప్రభావంబు వెల్లడిపఱచవలయు నని తలంచి "గోరక్షా! పక్వఫలశాఖాశోభితమాకందవృక్షరాజినిజూచితివె యీమధురసపూరితఫలంబు లనుభవించవలయు నను కుతూహలంబు గల"దని నుడువ గోరక్షుండు వలదనుచుండ కానీపనాథుండు తత్ఫలంబులకై శిష్యులం బిలచి యాజ్ఞాపించెను. గోరక్షుండు "కానీపనాథా! యింతటికై శిష్యుల నంప నవసరంబేల నట్లైన శిష్యులులేనిసమయంబున మనకు ఫలంబు లెట్లులభియించును. గావున స్వగురుప్రతాపసమర్థత్వంబుచే ఫలంబులు గ్రహించి తృప్తిం బొందవలయు" నన కానీపనాథుండు వార్షించి చిటికెడుభస్మం బభిమంత్రించి విభక్తాస్త్రంబు జపియించి యాకర్షణయోగంబున ననేకఫలంబులు సంకల్పమాత్రంబున తనసమక్షంబునకు దెప్పించి శిష్య

కోటిసహితులై యుభయనాథులు ఫలంబు లనుభవించుచుండ గోర
క్షుండు కానీపనాథుని ప్రతాపంబు గనుంగొని స్వప్రతాపంబు జూపం
దలంచి తద్వద్విభక్తాస్త్రయోగంబున మధురసభరితచూతఫలంబు
లాకర్షణశక్తిచే దెప్పించి యత్యంతానందంబున దృప్తులై నిజాసనం
బుల నలంకరించి యుండుతఱి గోరక్షుండు "గజకర్ణోద్భవా! మహారస
పూరితరసాలఫలంబులు శేషించి నిరర్థకంబున పృథివిపైఁ బడియుండె
నియ్యవి తత్తత్తరుశాఖంబుల పూర్వస్థితి బ్రకాశించియుంట విశేషం
బని దలంచెద" నన కానీపుండు "గోరక్షా! పునస్సృష్టిఁ జేయు ద్వితీ
యపితామహుండిచ్చో నెవ్వఁడు గలం" డన గోరక్షుండు "కానీపా!
సప్తసముద్రంబు లేకముఖంబున గ్రసించు మహాపురుషునకు నదంబు
లక్ష్యమై నిల్చునే! వసుంధరాభారంబు శిరంబున వహించు యహికులా
గ్రగణ్యుండు కుధరంబుల సరకుగొనునే? స్వకటాక్షవీక్షణమహత్వం
బున పాషాణపఙ్క్తులు పరుసంబులై దేజరిల్లుచుండ హేమప్రయ
త్నంబు లక్ష్యంబే? కావున గురుకరుణాకటాక్షపరిపూర్ణమహామహు
లకు పితామహుండు సముండగునే" యనుచుండ గోరక్షునిజూచి కానీ
పుండు క్షోభించి "యౌనౌను. నీగురుసమర్థత్వం బేనెఱుంగుదును?
నీచకర్మంబులం బడి వాచావేదాంతంబులు బలికిన నేమిలాభంబు?
నీగురుండు స్త్రీరాజ్యాధిపత్యంబువహించి మైనాకినీలోలుండై పాపకృ
త్యంబు లాచరింపుచుండ క్రియాసాక్షిత్వంబులేని నిగ్రహవాక్యం
బులు బలుకుట చిత్రంబుగాదే? నీగురువునకు మీననాథపుత్రుండు
నిదర్శనంబు గలఁడు. నీశూరత్వవాచాలత్వంబులు నీగురుస్వరూప
స్త్రీలోలత్వంబులు పరమహేయంబులు గావే చాలు నీపరుషోక్తు" లను
చుండ గోరక్షుండు కానీపునితో "భ్రష్టాత్మా! నీగురుండగు జాలంధర
నాథుండు ప్రతాపహీనుండై హేలాపట్టణంబున గోపీచందభూపాలుని
దర్పంబునకు నిలువలేక నొకమహాకూపంబున తురంగమలంబుచే
గప్పంబడి దీనభావంబున నుండుట కెంతశౌర్యంబో దలంపుము.
మూర్ఖా! తద్వస్మద్గురుండౌనే యెవ్వనిహస్తకమలంబున నీలకంఠుని
త్రిశూలంబు ప్రకాశించునో సమరంబున దేవదానవు లెవ్వనిచే
నోటుబడి దాసులైరో రామకార్యధురంధరుండగు మారుతాత్మజుం
డెవ్వనిచే స్తంభింపఁబడెనో దుర్జయపరాక్రముండగు వీరభద్రుం

డెవ్వనిచే కంఠగతప్రాణుండై నిల్చెనో త్రిమూర్త్యాత్మకుండగుమార్తాం డుం డేమహానుభావునిచే గగనపథంబు బాసి పుడమినిం బడెనో సురా సురనరగరుడగంధర్వాదులే తపోఘనుని నిర్వక్రపరాక్రమంబు లుగ్గ డించి నమస్కారంబులు సల్పిరో యట్టి పరమయోగీశ్వరుని గుణదో షంబు లెంచ బ్రహ్మాదులకైన దరంబగునే జ్ఞానహీనా! యస్మద్గురుశక్తి గనబఱచెద చూడు" మని గోరక్షుండు భస్మంబుదీసి సంజీవనీమం త్రప్రభావంబుచే భుక్తశేషఫలంబులు యథాస్థితి వృక్షశాఖంబుల నంటించిన నక్కానీపుం డచ్చెరువొంది "గోరక్షా! ధన్యుండవు. సమ ర్థుండ" వని బొగడుచు విరుద్ధసల్లాపంబులు మాని పరమానందహృద యుండై "నీకతంబున మద్గురుపశ్యనిజాడ లెఱుంగనైతి" నని గొని యాడుచుండ గోరక్షుండు "కానీపనాథా! నాచే నీమనోరథం బీడేరె. నీచే నాకష్టంబులు కడతేరె" నని యన్యోన్యాలింగనంబులు సలుపు కొని యుభయసిద్ధులు నమనోన్ముఖులై గోరక్షుండు స్త్రీరాజ్యమార్గం బున నేగెను. కానీపుండు హేలాపట్టణపథంబున జనుచు గోపీచంద నృపాధముని క్షణమాత్రంబున భస్మంబు జేయక నుపేక్షింతునే నహాహా దయాపరమూర్తియగు జాలంధరనాథుని తపింపజేసిన పాపా త్ముని మత్కోపానలశిఖాజ్వాలల నాహుతి గొనియెద నని రౌద్రరసం బుప్పతిల్ల శీఘ్రగమనంబున శిష్యసముదాయసహితుండై హేలాపట్ట ణంబు సమీపింప గోపీచందమహీధవుండు కానీపనాథసచ్చరిత్రంబు లగాధంబులని తొల్లి వినియుండుటంజేసి యాసమయంబున చారులచే సిద్ధాగమనవర్తమానంబు గ్రహించి సపరివారంబుగ నెదుర్కొన నేగుచు సప్తశతసంఖ్యశిష్యసంఘమధ్యంబున మూర్తివంతంబగు వైరాగ్యంబో యన ప్రకాశించుచున్న కానీపనాథుని దూరంబున గనుంగొని దనమనంబున నిమ్మహాయోగిపుంగవుండు గజతురగశిష్య పరివారసహితుండై శాంతశమదమాది గుణంబులు గలిగి యతులిత వైభవవిశేషంబులచే కీర్తనీయగుణజాలుండై దేజరిల్లు నిమ్మహానుభా వుని పదసరోజంబు లాశ్రయించి యనుగ్రహంబు బడసి యమర త్వంబు నొందవలయు నని వితర్కించుచు మంత్రిపుంగవుని బిలచి "ప్రధానిశేఖరా! మద్భాగ్యవశంబున సిద్ధపురుషుం డిచ్చోటికి కేతెంచె. నితనియోగ్యత్వం బస్మద్భోగభాగ్యంబుల కనుమాపంబై వర్తిల్లు. నే

 

నీ తపోమూర్తి బోధామృతపానుండనై పరమేశ్వరధ్యానతత్పరత్వం బున మెలంగవలయు నని తలంచెద. మున్ను మజ్జననీవాక్యోల్లంఘనం బు జేయక సురమహీరుహవనంబున బహ్వారవృక్షంబుల జేర్చినట్లు రత్నాకరుండు కాచభూషణంబులు ధరియించినపగిది హీనుండగు జాలంధరనాథుని యనుగ్రహంబు బడయుట రాజ్యవైభవంబులు హేయంబులు గాకుండునే గావున నిక్కానీపనాథుండు యోగ్యా చార్యుం" డనుచు భక్తియుక్తుండై జనుచుండ కానీపుండా పుడ మిరేని జూచి క్రోధపూరితుండై తత్క్షణంబున నృపాధముని భస్మంబు జేయం దలంచి భూపుండు గలించెనేని గురువర్యునిజాడ ఘటియిం చునో లేదో యనుసంశయంబుచే కార్యసాధన పరత్వంబున శ్రీగురు జాలంధరనాథునిజాడ లెఱింగి యాపిదప బుడమిరేని శిక్షించెద నని కృతనిశ్చయుండై స్తబ్ధించి యుండునంత గోపీచందుండు కానీపనాథుని సమీపించి చరణకమలంబులకు నమస్కరించి బద్ధాంజలుండై "సమర్థా! నేడు భవద్దర్శనమాత్రంబున మజ్జన్మంబు పవిత్రంబయ్యె. భవాదృశ మహాపురుషసందర్శనం బస్మదాదులకు ఘటియించుట సామాన్యవిష యంబే? ధన్యాత్మా! అనాథులను సనాథులఁజేయు సమర్థుండవు గాన నాయం దనుగ్రహించి యుష్మద్వాక్సుధారసధారలచే నన్నజరామర మూర్తిని జేయవే" యని నమ్రోక్తులచే సిద్ధుని బొగడుచుండ కానీప నాథుండు పార్థివుని దృఢభక్తియుక్తంబులగు స్తోత్రంబులకు విగతక్రో ధుండై శాంతింబొంది పరమాహ్లాదంబున నృపునిహస్తంబు ధరియించి నిజనికటంబున గూర్చుండ నియమించి కుశలప్రశ్నలు జేయుచు "నోరాజోత్తమా! నీభాగ్యోదయవిశేషం బేమని వచియింతును? నీ మృదుమధురప్రియవచనంబులచే నాచిత్తంబు శాంతిం బొందె. లేకున్న నుత్కోపానలంబున ననర్థంబు వాటిల్లకుండునే? తత్కారణే తిహాసంబు తెల్లంబు జేసెద. వేగంబున సదనంబున కేగవలయు" నన గోపీచందుండు కానీపనాథుని శిబికాసనంబున నలంకరించి శిష్య జనసహితంబుగ నిజనికేతనంబు జేరి మణిఖచితకనకాసనంబున నాథుని షోడశోపచారంబుల బూజ లొనర్చి మహావినయంబున "యోగద్రుమా! భవదనుగ్రహంబుచే బ్రహ్మానందపదవి నొందవలయు నని దలంచి గొనియాడుచుండ 'క్రోధంబు శమియించె' నని వచించిన

కారణం బెయ్యదియో దయజేయుడు" రనుచుండ గజకర్ణోద్భవుండు "రాజపుంగవా! న న్ననుగ్రహించు మని వేడితివి. నిజంబే. నే నే తపోఘనుని కృపాకటాక్షంబున నక్షీణభక్తివైరాగ్యంబుల బ్రకాశిం చితినో యట్టినిరుపమానగుణజాలుండగు జాలంధరనాథుని నొకకూపం బున బద్ధనై చి తురంగవిష్ఠంబు గప్పుట కెంతని శిక్షింతును? నీపూర్వపు ణ్యఫలంబున నింతవర కమ్మహానుభావుం డుపేక్షించె లేకున్న నతం డలిగెనేని భువనబ్రహ్మాండంబులు క్షణమాత్రంబున నశించక నిలు చునే? నాకలోకనివాసు లెవనిప్రతాపదర్పంబున కెదురించలేక మతి భ్రష్టులై విహంగంబులకై వడి వృక్షశాఖాగ్రంబుల నంటుకొనిరో యమ్మహాయోగిపుంగవుండు నీయట్టి యఃశ్చిత్పురుషుని గణుతిం చునే" యనుచుండ గోపీచంద మహీపాలుం డత్యంతభయవిహ్వలాం గుండై గడగడవడంకుచు నదరిపడి కానీపుని పదకంజంబుల వ్రాలి "దీనశరణ్యా! నే మహాపాతకుండనై ఘోరతరకృత్యం బాచరించితి. నాయట్టి దుర్మతిపాపంబునకు పారంబుగలదే? హా యీదుష్టాత్ముని గడ తేర్చ సత్పురుషశిరోమణులగు మీరుదక్క నన్యులు గలరే! సుఖదుః ఖలాభనష్టశత్రుమిత్రసర్వసమత్వబుద్ధిచే ప్రకాశించెడు తపోఘనులు క్షమాశీలురై రక్షింతురుగాక. నితరుల శక్యంబే" యనుచు ననేకవి ధంబుల విలపించుచుండ దయాసముద్రుండగు కానీపనాథుండు "నృపో త్తమా! భయపడవల" దని నుడువుచు పుడమిజేనిసహితుండై వెడి దికిం జనెను.

ఇట పరిచారకు లీవృత్తాంతంబు గ్రహించి తీవ్రగమనంబున రాజమాతకడ కరుదెంచి "యోజననీ! తద్గురుండగు జాలంధరనా థుండు గోపీచందపృథ్వీరమణుని యాగ్రహంబుచే కూపంబున హయ విష్ఠంబునే గప్పంబడి దశవర్షంబులు గడచెనట! నేఁ డొక కానీపనా థాహ్వయతాపసోత్తముండు జాలంధరనాథప్రియకుమారుండ నని మహావైభవంబులతో రాజసభ కేతెంచి సంభాషించుచుండ నీచరి త్రంబు తేటపడియె. భవత్సుతుం డా కానీపనాథుని సేవ లొనర్చుచు భయభక్తిచే మెలంగుచున్నాఁ" డని విన్నవించ మైనావతీహృద యంబు క్షోభించి పుత్రమోహంబున నిశ్చలత్వంబున నుండె నట

భూనాయకుండు గజకర్ణోద్భవుని సహుషంబున కౌరవులు దుర్వా సుని సేవించినచందంబున ముకుళితకరపుటుండై వినయంబున కైంక ర్యంబులు సల్పుచు సూర్యాస్తమయానంతరంబున సిద్ధునిచే ననుజ్ఞ గొని నిజసదనంబున కేతెంచి మైనావతీచరణంబుల కెఱఁగి గతవృ త్తాంతం బంతయు సవిస్తరంబుగ దేటపఱచి "తల్లీ! నీవక్కానీఫనాథుని సమీపంబు జేరి మృదువాక్యంబులచే కోపోపశమనం బొనర్చి నిర్వి ఘ్నంబుగ ప్రసన్నునిం జేయవే" యని పలుక నవశ్యంబని మైనావతీ మహారాణి కడువేగంబున నాథుని శిబిరంబు జేరం జని కానీపునిపదం బులకు వందనం బాచరించి "యోగిపురుషా! మీచిహ్నంబులువిచారింప నాథపంథీసాంప్రదాయకం బగుపడు నేను శ్రీగురు జాలంధరనాథప్రి యశిష్యురాలనై మెలంగెద" నని గురుబంధుత్వంబు దెలియబలుక నోహో! యనుచు కానీపుండు "నీయట్టి సచ్ఛిష్యురాలు గలిగి పరమదయాకరుండగు జాలంధరనాథుని కూపంబున బడవైచి యశ్వవిష్ఠంబు గప్పించుట కర్జంబగునే" యన రాజమాత "నుత్పు తుండు మందమతిచే నాచరించిన భయంకరకృత్యంబు భవదాగమన కారణంబున విశదంబయ్యె. దుర్మతుల దుష్కర్మంబులు జ్ఞానఘనులు జక్కంబెట్టుట లోకప్రసిద్ధంబు గాదే? సమర్థా! దయానిధియగు గురు నర్యుని బహిర్గతంబు జేయుట కితరులు సమర్థులగుదురే? మత్సుతునిచే నిక్కార్యంబు జక్కబెట్టందలంచితేని తపోధూర్జటి యగు జాలంధ రుని కోపజ్వాలల కాగునే గాన యుక్తిప్రయుక్తుల భూపుని రక్షించి కీర్తనీయగుణకదంబుండగు జాలంధరనాథుని బహిర్గతంబుజేయ భవ త్కీర్తి త్రిలోకవిదితంబై ప్రకాశించు"నన నతండు "క్షితీశుని రక్షించి శ్రీగురుచరణసరోజంబులు ప్రదర్శించెద. సంశయం బుడుఁగు" మని నుడువ నప్పుడఁతిమిన్న జడదారి యడుగుల కెఱఁగి నిజనిలయంబున కేగి పుడమితేనికి వృత్తాంతంబు దెలిపి భయవిముక్తుం జేసెను.

ఇతి భక్తిసార నవనాథచరిత్రంబున గోరక్ష కానీప గోపీచంద సందర్శనప్రసంగవిశేషంబులుగల షోడశాధ్యాయము సంపూర్ణము.

---

# సప్తదశాధ్యాయము.

గోపీచంద్రుండు కానీపనాథుని సహాయంబుచే భూపస్థిత జాలంధరనాథుని పైకిదీసి యనుగ్రహంబు వడసి తపంబు కేగుచనుట.

గోపీచంద్రమహీశుండు సూర్యోదయంబున గృతకృత్యుండై గజకర్ణసంభవుని శిబిరంబున కేగి పదపద్మంబులకు నమస్కరించి వినయభయభక్తియుక్తుండై నికటంబున నిలిచియుండ కానీపుండు "జాలంధరనాథు నెచ్చోట బడవైచితివో మచ్ఛిష్యుని కాప్రదేశంబు గనబఱచు" మని వాక్రుచ్చిన నతం డవశ్యం బని యొకసచ్ఛిష్యుని వెంటఁగొని తత్ప్రదేశంబు బొడసూపి పునః కానీపుని విడిది కేతెంచియుండ నక్కానీపనాథుండు "గోపీచందా! నీప్రాణంబులు రక్షించుకొన దలంచెదవేని కనక రజత తామ్ర పిత్తల లోహ ధాతుపంచకంబుచే భవత్సదృశపుత్తళులఁ నిర్మించి తెప్పింపు" మన నృపుండు తత్క్షణంబున కుశలమతులగు స్వర్ణకార లోహకారులం బిలిపించి యాజ్ఞాపించి నంత వార లతినిపుణత్వంబున రాజాకృతిప్రతిమల నిర్మించి నాథుని చెంగట సమర్పించినం గనుఁగొని యొకసుదినంబున వసుంధరాధిపుని దోడ్కొని శిల్పంబులం గొని గుప్తస్థానంబు జేరి తత్కూపనికటంబున తా నివసించి యొకత్రపుకోలం బార్థివుని కరభాగంబుననుంచి "యో రాజేంద్రా! ఖననంబు జేయు సమయంబున ప్రతాపపరిపూర్ణుండగు వైశ్వానరసుతుండు 'నీవెవరు? నీనామం బేమి' యని విచారించు. నీ వపుడు నీనామంబు దెలియఁబలుకుచు నతివేగంబున నచ్చోటు బాసి దూరంబు జను" మని చిరంజీవత్వమంత్రంబు జపియించి నరనాథుని ఫాలభాగంబున భస్మంబు బూసెను. పృథ్వీశుండును తత్ప్రదేశమధ్య భాగంబున ప్రతిమలనుంచి కుద్దాలంబు కరంబుల ధరియించిఖననంబు జేయుచుండ నాగ్రహంబున 'నీవెవ్వండ' వని జాలంధరనాథుం డడుగ రాజోత్తముండు 'నే గోపీచంద్రుండ' ననుచు దూరదూరం బొలఁగి యరిగెను. వీతిహోత్రనందనుం డత్యంతక్రోధావేశుండై భస్మంబు గమ్మని శపియించుచుండ తచ్ఛాపాగ్నిజ్వాలలు కనకశిల్పంబు ముట్టడించి భస్మం

బొనర్చె నాపిదప ద్వితీయప్రతిమ మధ్యభాగంబున నుంచి పూర్వవిధం బున సులోచనసుతుండు ఖననంబు జేయుచుండ 'నౌరా! నీవెవ్వండ' వనిసక్రోధంబున ధనంజయతనయుం డడుగుతఱి యవనీశుండు 'నే గోపీ చందుండ' ననుచు నతివేగంబున దొాలంగెను. మఱియు సిద్ధుండు భస్మంబు గమ్మని శపించినంత నారజితమయపుత్తళి భస్మంబు నొందె నివ్విధంబున తామ్ర పిత్తల లోహ ప్రతిమల ప్రతిహతశాపానలంబుచే క్రమంబున భస్మంబై నేలం గూలియుండ కానీపనాథుండు "రాజ శ్రేష్ఠా! భీతిల్లకు మిక నీనామంబు నే తెలియఁబలికెద" ననిపలుకనుహీ రమణుండు పునఃఖననంబు జేయుచుండె నప్పు డయ్యగ్గిఱొడుకు దన డెందంబున నబ్బురంబొంది "మత్కోపాగ్నిశిఖలచే లోకత్రయంబు నశించు సులోచననందనుండు బ్రతికియుండుట చిత్రంబుగాదే! తక్షక విషదంతదంశితుండు రక్షింపఁబడుగాక! ఖగేంద్రునిచేఁ గబళింపఁబడిన యురగంబు జీవించుగాక! సర్పముఖాంతర్గత మూషకంబు ప్రాణంబులు వాయకుండుగాక! మచ్ఛాపంబున నశించక వీఁడెట్లు మిగిలె" ననినవిత ర్కించుచు ఖననశబ్దంబు కర్ణేంద్రియంబు సోకుచుండ నీవెవ్వం డనియ డుగ చాతుర్యధుర్యుండగు కానీపుం డిది సమయం బని తలంచి "గురు సమర్థా! భవత్ప్రియతనయుండగు కానీపుండు యుష్మచ్చరణాంభోరు హదర్శనాపేక్షచే నిచ్చటికేతెంచి యీభూపాగ్రగణ్యుండగు గోపీచందునిచే ఖననప్రారంభంబు గావించె" నని పలుక నిగ్రహాను గ్రహసమర్థుండగు హుతాశనసుతుండు దయామయహృదయుండై "గోపీచందా! జననమరణహరణంబగు చిరంజీవత్వంబు బడయు" మని యనుగ్రహించి జ్ఞానపుత్రుండగు కానీపుని వేవేగ జూడందలంచి త్వరి తంబున దప్పించుమని యాజ్ఞాపించెను. అట్టియెడ బుడమిఱేని యను జ్ఞచే కాయబలసంపన్నులగు ఖాతకులు ఖనిత్రాదిపరికరంబులు గొని ఖననంబు జేయుచుండ పర్వతతుల్యతురంగవిష్ఠంబు దఱుగ లేకున్న గని కానీపుండు భటులం దొాలంగించి శక్రునుద్దేశించి వజ్రాస్త్రప్రయో గంబున హయమలం బతిసులభోపాయంబున బాయంజేయ నుభయ నాథు లన్యోన్యముఖావలోకనమాత్రంబున ప్రేమాస్పదబాష్పపూ రితలోచనులై యుండ జాలంధరనాథుం డుపరిభాగంబున కేతెంచి "కా నీపా! నీకతంబున నృపుండు రక్షింపఁబడియె" ననుచు దృఢాలింగనం

బొనర్చునసమయంబున గోపీచందుండు తపోఘనుండగు జాలంధరనాథ చరణసరోజంబులకు దండప్రణామంబు లాచరించెను. దయాసము ద్రుండగు సిద్ధుండు ధరణీధవుని శిరంబున వరదకరంబుంచి "వత్సా! మత్కోపానలతీక్ష్ణజ్వాలలచే దక్కితివి. నీ కపాయం బికమీఁదగలుగ నేర దాచంద్రార్కచిరంజీవుండవైతి" వని యాశీర్వదించుచుండ సు లోచనురాణి యగు మైనావతీ దేవి గురునాథుని పదంబుల ఫాలంబు మోపి యశ్రుధారలచే నభిషేకించి "క్షమాశీలా! నాఁడీ మూఢమతి యగు మత్సుతుని కృత్యంబుచే వత్సంబుల బాసిన ధేనువుపగిది య స్తమించి నేఁడీ దాసులకై యుదయించుట చంద్రచకోరన్యాయంబు గాదే" యని పలువిధంబుల బలవించుచుండు మైనావతీనేత్రగళితబా ష్పంబులు నాథుండు సదయుండై తుడుచుచు ప్రియంబున బుడమీ శుని ముఖకమలంబు నివిరి "వత్సా' గోపీచందా! రాజ్యభోగసుఖసం పదల కాశించెదో బ్రహ్మానుభవజ్ఞానంబున నిత్యుండవై వెలుఁగఁద లంచెదో నీ కెయ్యది యభీష్టంబో వేఁడుము. కాలాంతరంబున శక్రుండు స్వర్గభోగంబుల దొలంగు. మృగజలంబులకరణి భాసమా నంబగు సంసారసుఖంబులు కల్లలుగాకుండునే? తొల్లి సారాసారవిచార ధుర్యుండగు గాధిసుతుం డతులితరాజ్యవైభవంబుల దృణీకరించఁడే? ఉత్తమోత్తముండగు నుత్తానపాదుండు సచ్చిదానందస్వరూపుండై ప్రకాశించుట లోకవిదితంబు గాదే! కావున దీర్ఘాలోచనపరుండవై విచారించు" మన నరనాథుండు దనహృదయంబున ప్రభాపరహితం బులగు రాజ్యభోగభాగ్యంబులు తపోధనంబున కెనయౌనే? క్షణ భంగురంబగు సంసారతాపత్రయకూపంబు యోగిజనసంసేవిత వైరా గ్యజలార్ణవంబునకు హస్తిమశకాంతరభేదంబు గలదనుట నిస్సంశయం బేకదా! ఇమ్మహాఘనుండగు జాలంధరనాథుం డంధకారబంధురంబగు కూపంబునంబడి నిరాయాసంబున దేజరిల్లుట యాశ్చర్యంబు గాదే? లోహంబు పరుసంబుచే హేమంబైనచందంబున సిద్ధుండు నిజకరుణా కటాక్షవీక్షణంబున మర్త్యుల సమర్త్యులం జేయుట శమనుని దర్పం బడంచుటగాక పన్యంబే? బ్రహ్మాండోద్ధారక సిద్ధపురుషవైరాగ్యసత్తా భాగ్యంబు లనూనంబు లని వితర్కించి "యోగురువర్యా! అక్షీణ వైరాగ్యధనంబే ఘనంబుగాక నిహసుఖంబులు స్థిరంబులౌనే? నాయం

దనుగ్రహించి భ్రమరకీటకన్యాయంబున స్వస్వరూపుని జేయవే"
యని గొనియాడుచుండు మనోదృఢ వాక్యంబు లాకర్ణించి యప్పావ
కనందనుండ పార్థివపుంగవుని శిరంబున కనికరంబుచే వరదకరం
బుంచి కర్ణపుటంబున గురుమంత్రరాజం బుపదేశించి నాథపంథీరహ
స్యంబులు దేటపఱచినంత సులోచనతనయుండు బ్రహ్మానందాంబుధి
నిమగ్నుండై నిర్మోహ నిరహంకార నిర్ద్వంద్వ నిశ్చలత్వంబున దేజ
రిల్లుచు నశాశ్వతరాజ్యసంపదల దిరస్కరించి శైలీ సింగీ కంథాది
నాథపంథీ చిహ్నంబులు స్వీకరించి కక్షపాలంబున భస్మంబు ధరి
యించి భిక్షాన్నంబుచే దృప్తుండై సాంద్రవైరాగ్యంబున సంచరించు
చుండెను. ఈవృత్తాంతం బంతఃపురస్త్రీసంఘంబు లాలకించి హాహాకా
రంబులు జేయుచు మైనావతీరాణిని దూషించుచు దుఃఖపరవశత్వంబు
న బుడమింబడి యాక్రందనంబు జేయుచు "హాప్రాణవల్లభా! ని న్నెడ
బాసి మాప్రాణంబులు నిమిషంబైన నిల్చునే? నీరాజ్యసుఖసంపదలు
విపినంబులపాలు జేసితివే? మమ్మనాథలను జేయుట ధర్మంబగునే!
నీసుందర సుకుమార తనువిలాసంబు మఱవ వశంబగునే? మాకోర్కు
లీడేర్చుఘనుండ వీవుదక్క నన్యు లెవరు గలరు? నీవు లేని భాగ్యంబులు
రోగంబులుగాక భోగంబులగునే? నిన్నెందు నెమకుదుము. ప్రాణప్రియా!
నీ పరిపూర్ణప్రేమాతిశయంబు లెందుబోయె. సదయహృదయుండవై
మమ్ము పేక్షించుట కర్జంబగునే" యని మానినీనివహం బేకముఖంబున
మహారవంబు జేయుచు చిత్తవిభ్రాంతిచే నొకయువతి 'గోపీచందా'!
యని దనంతట తా వదనంబుచుంబించు: మఱియొకలోలాక్షి 'నృపాల
శేఖరా! రమ్ము ర'మ్మని బలవరించు: నొకమందయాన 'నామనోహరుండు
హాసించె' నని దనలో తా నవ్వు: నొకచపలాక్షి 'ప్రియుండు వేణీభ
రంబులాగె నని యదరిపడు నివ్విధంబున వియోగశోకాకులితచిత్తలై
మాకీ శృంగారంబులేల నని మణిమయహారభూషణంబులు బడవైచి
'హానాథా! హాప్రియా! హారాజోత్తమా.' యని నేత్రాంబుధరాశ్రు
ధారాప్రవాహంబు లురోజకుధరంబులపై గళితంబు లౌచుండ కీలూడి
నబొమ్మలచందంబున స్మృతిదొలంగి నేలంబడుచు ప్రియుండిదె వచ్చె
నని దిక్కులు రోయుచు "నమ్మక్కలార! మనదిక్కెవ్వ రికమీద
దెల్పరే దయారసమొలుక బలుకరే మావిషమశరసమపురుషుజాడ

లెఱుంగింపరే దయాసముద్రుండగు నరేంద్రుని గనుబఱచి మాహృ
దయతాపంబు బాపరే జూపరే" యని పల్లవాధరనికరంబులు గుల్లు
మని పెల్లేడ్చుచుండెను. తత్సమయంబున జాలంధరనాథుండు "గోపీ
చందా! నీవు తపం బాచరించుట కర్తవ్యంబు. నీప్రాణప్రియులగు
ద్వాదశశతసంఖ్యనారీశిరోమణుల భవనంబులకేగి సింగీనాదవినోదం
బుచే మాతృభావంబున 'నలక్ నిరంజన' యని భిక్షాప్రశ్న జేయుచు
కలియంజూచి పిదప తపం బాచరించెదవా" యన గోపీచందుం డవ
శ్యంబని యంతఃపురంబుల బ్రవేశించి 'యలక్ భిక్షా' యని ప్రశ్న జేయు
చునేగుచుండ నక్కాంతామణు లొక్కుమ్మడి యదరిపడి భూపుని దీన
దశారూపంబు విలోకించి యాహా యను మహానిర్ఘోషంబు నింగిముట్టి
ప్రతిధ్వను లీనుచుండ రోదనంబు జేయుచు నొకర్తు ముఖతాడనం
బొనరించుకొనుచు మఱియొకతి శిరోతాడనం బొనరించుకొనుచు
నొకతి భూస్థలింబడి హాహాకారంబు జేయుచు ననేకు లనేకవిధంబుల
నృపునిచెయ్యు లుగ్గడించుచు "ప్రాణనాయకా! నీకీ నిరుపమానరాజ్య
సుఖంబులు నింద్యంబులయ్యెనే? నీస్వరూపలావణ్యంబుల కనుగైవిల
సిల్లు సుగంధపరిమళద్రవ్యంబులు హేయంబులై భస్మలేపనం బమి
తానందంబు నొందించెనే?నీ నవయౌవనాకారరూపసౌందర్యం బెందు
బోయె? యాచకజనాశా పరిపూర్తియొసంగు నీహస్తకు శేశయంబన్నం
బుకై పరుల వేడుట కేవిధి గల్పించెనో హానాథా! నాథా!" యని
యుద్ఘోషించుచుండ పట్టమహిషియగు లుమావతీరాణి రాజనికటంబు
జేరి వారిపూరితనయనంబులచే కాంతునిముఖకాంతి దిలకించుచుండ
నప్పుడఃలిమిన్న లపారశోకరాశి మునుంగుచు సమక్షంబున కేతెంచి
"ప్రాణప్రియా! నీవు మమ్మెడబాసి చనుట ధర్మంబగునే? భవద్వియో
గదుఃఖానలపరితప్తహృదయలమై ప్రాణంబులులేని శరీరంబులభంగి
మాయున్కి నిష్ఫలంబుగాదే? గావున భగవద్ధ్యానయోగంబులిచ్చో
నాచరింపుడు. మావిషయసుఖంబులకై మి మ్మపేక్షింపము. యుష్మ
న్ముఖకమల నిరీక్షణాసక్తిచే బ్రవర్తించెదము. భవదాశ్రయ బలులమై
యుండుట మాకు నిరంతరశుభంబులు గావే? మహీరమణా! మీ కను
కూలప్రదేశంబున నతిశోభాయమానంబగు పర్ణకుటీరం బేర్పఱిచెద
ము. తా మక్కుటీరంబున మణిహిరణ్మయ సింగీశైలి హస్తకమలం

బుల ధరియించి దివ్యాంబరనిర్మిత కంథాసహితుడై మృగచర్మంబులు బరిత్యజించి యమోఘదుకూలంబులచే నలంకృతుడై భిక్షాన్నంబులు వర్జించి షడ్రసోపేతపక్వాన్నంబులు పరిగ్రహించుచు దాసదాసీజనంబులు సుగంధపరిమళద్రవ్యంబులు శరీరంబున నలదుచుండ మృదులతరపర్యంకంబుపై నర్తమిల్లుచు ద్వాదశశతమృగాక్షీసమూహ పరిసేవిత పాదపద్ముండనై కఠినతరవిపినసంచారకాంక్ష లుడిగి రథగజతురగభటపరివృతుండనై సకలసుఖనివహంబు లనుభవించుచు రాజయోగీశ్వరుండనై నిచ్చో నివసించుట జ్ఞానవైరాగ్యంబులకు గొఱవానే" యని చతురోక్తులు బలుక నృపుం డాగ్రహచిత్తుండై యవ్వనితలధిక్కరించుచుండ నక్క పటశతమయచపలాక్షు లిరుగడల బరివేష్టించి "నాథా! కాననంబున నీతో ముచ్చటించు నెయ్యు లెవరు? శయ్యాసన పరిధానంబు లెట్లు లభించును? నీసహాయులై శయనించువా రెవరు? తరుమారుతజన్యసీతబాధ లెట్లు సహింతువు? నీమాతాపితృభగినీసహోదరు లెవరు గలరు? షడ్రసోపేత భోజనంబు లెట్లుఘటియించు? కౌపీనంబు జీర్ణించెనేని యొండెట్లు ప్రాప్తించు" నన గోపీచందుండు "మందమతులారా! కాంతారంబున సింగీసారంగులతో ముచ్చటింతు. భూమ్యాకాశంబులు శయ్యాసనపరిధానంబులై విలసిల్లు. హంసదండంబు మత్సహాయంబై శయనించు. పంచాగ్ని యోగంబున సీతబాధ హరించు. విశ్వస్వరూపంబున ప్రతిగృహస్థులు మాతాపితృభగినీసహోదరులు గాకుందురే? మధురసయుతఫలంబులసరి షడ్రసభోజనంబు లగునే? ఇంద్రియదమనదృఢకౌపీనంబుండ వసనకౌపీనజీర్ణత్వంబున కే వెఱతునె" యని యుచితప్రత్యుత్తరంబు లొసంగుచు నిరస్తమోహుండై యదరిపడ బెడిదంబులు బలుకుచు నిస్పృహత్వంబున 'నోజననీ! యలక్ భిక్షా' యనుచుండ తల్లియగు మైనావతీదేవి భిక్షాన్నం బిడినంత నృపుండు తల్లిపాదంబులకు బ్రణమిల్లి శీఘ్రంబున జాలంధరనాథుసమీపంబు జేరి గతవృత్తాంతం బంతయు విని యోగించె ననంతరం బా హుతాశనసుతుండు గోపీచందున కనేకరహస్యంబు లుపదేశించి లుమానవతీపట్టమహిషీగర్భశుక్తిముక్తుండగు ముక్తచందాహ్వయునకు రాజ్యపట్టాభిషేకంబు గట్టి "మంత్రిప్రజాసేవకలోకంబు ముక్తచంద్రభూవల్లభుని యాజ్ఞాధారకులై మెలంగవలయు" నని నియ

నించి గోపీచందుని జూచి "వత్సా! బదరికాశ్రమంబున కేగి కేదారే శ్వరుని చరణకంజంబులకు బ్రణమిల్లి తత్ప్రదేశంబున లోహకంటకం బులపై పాదంబులుంచి ద్వాదశవత్సరంబులు తపం బాచరింపవలయు జను" మని రాజోత్తమునివెంబడి కానీపనాథసహితుండై జాలంధరనా థుండు ప్రయాణంబు చేయించుచుండ పురజనసముదాయంబు వెంట నంటి యపారదుఃఖభరితహృదయులై "నృపాలశేఖరా! పితృసహపుం డవై దయాఘనుండవై మముబోషించి మహావైభవంబులు విసర్జించి యరణ్యంబుల కేగితివే" యని యాక్రందించుచు నొకక్రోశంబు నడువ యోగద్రుముండగు జాలంధరనాథుం డాపురజనుల నాశ్వాసించి యోదార్చి కానీపసహితుండై నిల్చిన, వార లచ్చో నృపాగ్రణి సుగుణవితానంబు లుగ్గడించి స్తోత్రంబులు చేయుచు పునఃపునర్ము ఖావలోకనకుతూహలులై కొందఱు శిరంబులెత్తి జూచుచు నొక కొందఱు బరుగెత్తి పునర్దర్శనంబులు గొనుచు మఱికొందఱు యున్న తస్థలంబుల నిల్చి నిరీక్షించుచు దృష్టిగోచరంబు గాకున్నతఱి కానీ పజాలంధరసమేతులై నిజనివాసంబుల కేగందలంచి గుమిగూడి బుడమి తేని పునర్దర్శనం బెన్నఁడో యనుచు పురంబు జేరి రాజభవనంబున గతచైతన్యశరీరంబులకైవడి నిశ్శబ్దులై నిల్చియున్న ముక్తచందుండు పట్టాభిషేకమహోత్సవానందంబున వారల కనేకవస్త్రభూషణాదులు బ హుమతు లొసంగి తమతమనివాసంబులకంపి యంతఃపురంబు ప్రవేశిం చి నిఖలస్త్రీజనసమూహంబునకు సమాధానపఱచి మైనావతీరాణి కప్పగించె నమ్మానినీమణి "ముక్తచందా! శీలగుణసంపన్నుండవై భవ జ్జననీతుల్యులగు విమాతల యభీష్టంబులు దీర్చుచు సుఖంబున రాజ్యం బేలు" మని యాజ్ఞాపించెను. ముక్తచందుండు సింహాసనాసీనుండై రాజ్యాభిషేకసంతోషంబున యాచకజనాశాపరిపూర్తి జేసి కీర్తియు తుండై దేజరిల్లుచుండె. యోగధూర్జటియగు జాలంధరనాథుండు కానీ పనాథ తచ్ఛిష్యసంఘయుతుండై షణ్మాసంబు లప్పురంబున నివసించి యుండెను.

ఇతి భక్తిసారనవనాథచరిత్రంబున కానీప జాలంధర గోపీచంద కథాభాగంబు గల సప్తదశాధ్యాయము సంపూర్ణము.

---

# అష్టాదశాధ్యాయము.

-◦◦-

{ గోపీచంద నృపుండు పౌలపట్టణంబు ప్రవేశించి దనకై గలించిన చంపావతీదేవిని బ్రతికించుట }

గోపీచందుండు నిర్మలవైరాగ్యంబుచే తపంబుకై బదరికాశ్రమంబు జేరందలంచి యనేకారణ్యంబులు గ్రుమ్మరుచు తటస్థగ్రామంబుల బ్రవేశించి యాహారంబుకై భిక్షాన్నంబు గ్రహించుచు గురుమంత్రధ్యానతత్పరుండై స్వేచ్ఛావిహారంబున నేగుచుండ తద్గౌడబంగాళదేశగ్రామవాసుల కీ వృత్తాంతంబు దెలసి పుత్రవాత్సల్యంబున మనల బోషించు కరుణాజలధుండగు నృపుం డనూనవైభవాతిశయంబుల నెడబాసి విపినంబుల కేగుట యత్యంతాశ్చర్యకరం బని గుంపులుగట్టి భూజాని కెదురం జని నానావిధఫలపక్వరసాన్నంబులు సముఖంబున నిడి పరితప్తచిత్తులై "రాజోత్తమా! భవద్వియోగశోకఘనభారం బే మెట్లు సహింతుము? వేగంబున యోగంబు సాధించి పునర్దర్శనం బొసంగరే" యనుచుండ నమ్మహీరమణుం డవశ్యం బని సమాధానపఱచుచు నొకకొన్నిదివసంబులు స్వరాజ్యంబున సంచరించి కౌలబంగాళదేశంబు జేరి జరింపుచుండ నపారచరిత్రుండగు నృపుని ప్రపంచనిస్పృహత్వంబు గ్రామగ్రామంబు విస్తరింప నచ్చటచ్చటి పురజనులు శత్రుకుల సంక్షోభితుండగు సులోచనరాజపుత్రుండు సర్వజనమిత్రుండై నిరుపమాన దాతృత్వప్రముఖ సుగుణగణంబులచే బ్రకాశించి తుద కిక్కాననంబున ద్రిమ్మరుచుండెనే యనుచుండ గోపీచంద భగినీ చంపావతీదేవి శ్వశురుండగు తత్కౌలబంగాళదేశాధిపతి త్రిలోకచంద మహీపాలుండు పౌలపట్టణంబున రథగజతురగనివహంబులు గలిగి ప్రత్యక్షయుద్ధదక్షులగు సహస్రలక్ష పృతనంబులచే మహాప్రతాపదర్పుండై ధనధాన్యసుఖసంపత్సమృద్ధత్వంబున దేజరిల్లుచుండి గోపీచందుండు రాజ్యలక్ష్మిం దొలంగి వైరాగ్యధనఘనుండై విహరింపుచుండె నని యాకర్ణించి యహాహా! హీనమతిచే గోపీచందుం డపగతసర్వస్వుండై క్షాత్రధర్మం బెఱుంగక మండునిపగిది భిక్షాపాత్రంబు

ధరియించుట జీవన్మృతుండు గాఁడే? మీచుట్టరికం బిట్టిదని పసులు మము దూషింపరే? క్షత్రియవంశంబున జన్మించి కులంబునకు కళం కంబు గలిగించుటగర్హితంబుగాదే? స్వధర్మంబునకు వైఫల్యంబు గల్పిం చిన జన్మంబు గాల్పనే! దుష్టబుద్ధిచే మైనావతీదేవి దనరాజ్యభోగ సంపదలు జాలంధరనాథాధీనంబుజేసి సుతునికరంబుల భిక్షాపాత్రం బొసంగి కాంతారంబున కనుపుట హేమంబు బరిత్యజించి మృత్తికం గొనినచందంబు గాదే? ప్రపంచభ్రష్టుండగు సన్యాసి నాశ్రయించి స్వసుతుని రాజ్యపదచ్యుతుని జేయు మాత మిత్తిగాదే? వీరిరాజ్యంబు వినుతులచే హరింపఁబడక నిర్వహించునే! ధిగ్ధిగ్జన్మంబులని మైనావతీ గోపీచందుల దూషింపుచు త్రిలోకచంద్రుండు భార్యాసహితుండై సంభాషించుచుండు సమయంబున సులోచనదుహిత చంపావతీదేవి యాలకించి శ్వశురవాక్యరక్షితహృదయయై మనంబున దల్లడిల్లుచు "హా! మత్సహజన్ముండు దైవోపహతచేతస్కుండై త్రిలోకనింద్యంబు లగుకృత్యంబులుసల్పుచు రాజ్యపదభ్రష్టుండై హీనదశచే కడుకష్టంబు లనుభవించుట దుష్టాత్మురాలగు మైనావతీదేవి దుర్నీతులచే గాక నొండుగలదే! కీర్తిక్షయకరంబులగు దుష్కృతంబులచే ననర్థంబులు ఘటించె"నని రోదనంబు జేయుచుండె నిట గోపీచందుం డనేకగ్రామం బులు గడచి పౌలపట్టణసమీపంబు జేరి యొకవాపీనికటంబున సింగీ నాదవినోదంబుచే వేణుగానలోలుని గుణగాయనంబు జేయుచు మేఘ చ్ఛన్నదివాకరునికైవడి ప్రచ్ఛన్నవేషంబుచే గూర్చున్నతఱి చంపా వతీపరిచారిక లాకస్మికంబుగ నచ్చోటి కరుదెంచి రూపలావణ్యసౌంద ర్యంబుచే దేజరిల్లుచున్న ప్రతాపముఖ్యుండగు గోపీచందుని గుర్తించి రయంబున రాజభవనంబు జేరంజని సపరివారుండగు త్రిలోకచంద నరపాలున కెఱింగించిరి. అతం డత్యంతక్షీణచిత్తుండై దనమనంబున "గోపీచందుండు కళంకముఖుండై నిచ్చోటి కేలసరుదెంచె? వీఁడీ నగ రంబున భిక్షార్థంబై ప్రతిగృహంబున కేగెనేని మా కపకీర్తి వాటి ల్లదే? మా క్ష్మాభృత్కులంబు లోకులచే నపహసింపఁబడదే? స్వదేశం బున సంచరింపక నిందేలవిచ్చేసె" నని దలంచుచు నొకసేవకుని బిలచి "గోపీచందుం డీ పట్టణంబున భిక్షాన్నంబు గ్రహించుటచే మా కప కీర్తి ఘటియించుఁ గావున నీ వతివేగంబున నతనిం దోడ్కొని మదీ

యాశ్వశాలయందుంచి భోజనంబిడి ప్రయాణంబు జేయించు" మని యాజ్ఞాపింప నప్పరిచారకుం డా వైరాగ్యఘనుండగు గోపీచందుని సన్నిధి కేతెంచి "యోనృపోత్తమా! యుష్మద్భగినియగు చంపావతీ దేవితో సంభాషించుటకై దోడితెమ్మని మాపార్థివుం డాజ్ఞాపించె. దయచేయు" మన గోపీచందుండు "మాబోటివిరాగుల కెక్కడిభగిని గల" దనుచు నైనను "చంపావతీదేవిం గలసి యేగెద" నని పరిచారకుని వెంబడి జనుచుండ వాఁడా పశ్చిమమార్గంబున నశ్వశాలం బ్రవేశపఱచి "మీరీ ప్రదేశంబున నివసించెదరు గాక" యని నియమించి దా నంతఃపురంబు ప్రవేశించి గోపీచందుని రాకం దెల్ప గ్రక్కున నారాజకాంతలు శ్లాఘ్యతరాన్నంబు పాత్రంబుల నుంచి యొకపరిచారికచే మునుముందుగా గోపీచందుండు భుజించుటకై తురంగశాలకంపిన నదిచూచి గోపీచందుండు నిజహృదయంబున బంధుమిత్రకళత్రంబులు సంపత్సమృద్ధిచే సంతుష్టు లయ్యెదరు. గాకున్న చంపావతీదేవి తత్క్షణంబ మత్సమక్షంబునకు రాక నిర్లక్ష్యంబు జేయునే చింతించనేల? సమశ్శత్రుమిత్రుండనై సన్యసించి సుఖదుఃఖాశ్రయ మానావమాన ప్రపంచాభిమానము నాకేల నని నిశ్చయనిర్మలుండై చైతన్యబ్రహ్మంబున కన్నబ్రహ్మంబుచే సత్వంబుగలుగు నాచైతన్యబ్రహ్మంబుచే పరబ్రహ్మాన్వనుసంధానంబనుకూలించుగావున నన్నంబు పరిగ్రహించుట ముఖ్యకారణం బని దలంచి ప్రత్యవసానం బొనరుచుండ నట్టియెడ త్రిలోకచందుని నారీమణులు రాజసౌధగవాక్షద్వారంబుల నిలిచి గోపీచందుని నిరీక్షింపుచు "నాహా! లజ్జాహీనుండగు సులోచనసుతుండు బంధుత్వస్థలంబని దలపోయక నశ్వశాలయందు భుజించుట కాలవిపరీతంబుగాదే" యని యన్యోన్యసంభాషణంబులు జేయుచుండ నొకసఖీమణి చంపావతీదేవి కెఱుంగింపవలయు నని నుడువుచు వెసం జని సులోచనపుత్రిని రమ్మని రయంబున దోడ్తెచ్చి గవాక్షంబున నిలిపి జూడుమని కరంబెత్తి చూపుచు విషాదకరవాక్యంబులచే "నీభ్రష్టాత్ముండు మందభాగ్యుండై నిఖిలవైభవంబుల నెడబాసి తస్కరునిపగిది నానాదేశంబులు ద్రిమ్మరుచు మానావమాన జ్ఞానంబులేక నిందెతెంచి లాయంబుసంజేరి శ్వానంబుకరణి భుజియించుట హీనంబుగాదే" యనుచుండ పల్లవాధరుల యవహేళన వాక్యభల్లంబు లుల్లంబున నాటు

కొన సులోచనపుత్రి యగు చంపావతీదేవి యపారపశ్చాత్తాపంబుచే రోదనంబు జేయుచు నచ్ఛపలాతుల మండలంబు దొలంగి నెవ్వడిని స్వసౌధంబున కరుదెంచి యతిశయదుఃఖభారంబు సహింపలేమి తీక్ష్ణతరశస్త్రఘాతంబున హృదయస్ఫోటం బొనర్చుకొని రుధిరనిర్గతకుక్షియై తక్షణంబున ప్రాణంబులు వాసి పడియుండెను.

ఇట గోపీచందుం డన్నంబు భుజయించి తృప్తుండై చంపావతిని జూడందలంచి పరిచారికతో దెలుప నత్తెఅవ "దనయుత్తమామల యుత్తరువులేని పెత్తనంబులు వడి యిత్తురంగశాల కెత్తెఅంగున నేలెంచు నీవెఱుంగవే? నేఁ డిచ్చో నివసించెదేని నిశాసమయంబున నచ్చకో రాక్షిని దోడ్కి తెచ్చెద" నన గోపీచందుం డందుకు హర్షించి నివసించెను. తదుపరి యాపరిచారిక చంపావతీదేవి సదనంబున కీవృత్తాంతం బెఱుంగించ నతివేగంబున నేగి నిర్జీవకళేబరంబు గాంచి పిడుగుపడిన చందంబున నదరిపడి మహానినదంబు జేయుచు "పుడమిమీఁదనిపడఁతి మిన్నల జేరంజనియె" నని నుడువ నజ్జలజాయతాక్షు లేకముఖంబుగ జలధి ఘూర్ణిల్లినకై వడి పెడబొబ్బ లిడుచు నడినేగి యచ్చేడియ కాయంబు గనుంగొని హాహాకారంబులు జేయుచుండ పతిదేవర శ్వశురు లచ్చోటి కేతెంచి "నీచుండగు గోపీచందునికతంబున జీవోత్సర్గం బొనర్చుకొనియె నాయధముండు నిజసదనధనంబున కగ్గివెట్టి లజ్జారహితవదనుండై దనసహోదరిప్రాణంబులు గొనుట కేతెంచె గబోలు" నని విలపించుచు నప్పాపాత్ముని నెట్టివేయావలయు ననుచు కొందఱు ఛంపావతీదేవి దనసహజన్మునికై ప్రాణంబులు వాసెనని హృదయతాడనంబు లొనర్చుకొనుచు నొకకొంద ఱాయన్నులమిన్న సుగుణవితానంబు లుగ్గడించుచు మఱికొంద ఱీ మానవతియగు చంపావతీదేవి భ్రష్టాత్ముండగు గోపీచందుని నీచకర్మాచరణంబు సహింపలేక శరీరంబు బాసెనని మహారసంబున రోదనంబు జేయుచుండ గోపీచందుం డాకర్ణించి యచ్చటి హయరక్షకునితో నిదేటి హాహాకారధ్వానం బని యడుగ నయ్యశ్వరక్షకుం డా దుఃఖకారణం బెఱింగి యితండు గోపీచందుం డని దెలియక "అయ్యా! నే నేమని దెల్పుదు. మహాసుగుణమణియగు ఛంపావతీరాణి దనసహోదరుండగు సులోచనతనయుండు రాజ్యపదచ్యుతుండై చిత్తవిభ్రాంతిచే నానాకాననంబుల భ్రమింపుచుండె నని

శోకభారాతిశయంబున శరీరంబు బాసె" నని పలుక నన్మైనావతీప్రియ తనయుండు మత్కారణంబున సహోదరి కాయంబు దొలంగె నని మోహావేశంబున నాక్రందించుచు నే నిప్పురంబున కేల జనుదెంచితి నతులితపతిభక్తి విశేషగుణసంపత్తిచే నొప్పారు చంపావతీమరణంబు నా కపకీర్తికరకారణంబుగాదె? యిమ్మహాఘోరకృత్యంబు త్రిలోకవిదితంబై విలసిల్లదే యని మనంబున వితర్కించుచుండు సమయంబున నగ్నిసంస్కారంబుకై చంపావతీదేవిం గొనిపోవుచుండ గనుంగొని గోపీచందుం డిక నే నుపేక్షించుట నాథపంథీయోగం బత్యంతహీనం బగును. నన్నీనృపుండు తృణతుల్యంబుగ భావింపుచుండు గావున ఫాలాక్షుండు దన్ను భిక్షుకుం డని నిర్లక్ష్యంబుచే దూషించిన దక్షుని శిక్షించినచందంబున గుజ్జుండు ముజ్జగంబుల నాక్రమించి బలిగర్వం బడంచినవిధంబు కపీశుండు దన్ను దిరస్కరించిన దశముఖునిపురంబు హుతాశనుపాలు జేసినపగిది సద్గురుశక్తి ప్రతాపం బీపుడమీశున కెఱుంగించెద నని శీఘ్రంబున స్మశానవాటిక కేతెంచి ప్రేతనికటంబు జేరి "యగ్నిసంస్కారంబు జేయవలదు. సద్గురుసమర్థుండగు జాలంధరనాథునిచ్చోటికిం దోడితెచ్చి యీ మాతులకులంబు రక్షించినకై వడి నాకతంబున ప్రాణంబులు విడిచిన చంపావతీదేవిని బ్రతికింతు" ననుచుండ వా "రీనిష్ఫలయోజకపురుషార్థవాక్యంబు లప్రత్యక్షంబులు గాక యథార్థంబు లగునే? గతించినజీవంబు పునఃప్రవేశంబొంట హుళక్కిగాదే" యని ప్రత్యుత్తరంబులు బలుకుతఱి గోపీచందుండు "సద్గురుప్రతాపకృత్యంబుల బొగడ వాగ్దేవికైన తరంబగునే? నిజశిష్యుండగు కానీఫనాథునికై నిర్జరబృందంబును భూరుహాగ్రంబుల నంటింపడే? దుర్భరంబగు హయవిష్ఠప్రపూరితకూపంబున నివసించి నిర్భయంబుచే దశవర్షంబులు సజీవుండై విభ్రాజమానుండు గాడే? ప్రాజ్ఞులారా! ధైర్యంబు బూని శవంబును రక్షింపుడు. జ్ఞానఘనుండగు జాలంధరయోగీశ్వరుని దోడితెత్తు" నన వారా గోపీచందుని సంభాషణంబులు సరకుగొనక ప్రేతసంస్కారంబుకై కాష్ఠంబులకు నిప్పంటించ దలంచినంత సులోచనసుతుండు తత్కాష్ఠంబులపైఁ గూర్చుండి "యగ్నిసంస్కారంబుచే నన్ను భస్మంబు జేయుఁడు. తదుపరి సద్గురువర్యుం డేతెంచి యస్మత్కారణంబున మున్నీటియగ్గిచందం బగ్గలం

బగు కోపానలంబుచే నిష్ఫురవరంబు భస్మంబు గావింపఁడే" యనుచుండ త్రిలోకచందుండు సక్రోధుండై "గోపీచందా! మద్గురుండు సర్వసమ ర్థుం డని వృథాప్రలాపంబు లేల జేసెదవు? నిశ్చయంబేని నీ వామహా స్తంబు విడదీసి యిం దిడి యేగుము. నిజంబని తలంచి ప్రేతంబును రక్షించెద" మన గోపీచందుండు సంతసించి తత్క్షణంబున దనవామ కరంబు దీసి యత్రిలోకచందసుతున కొసంగి మహావేగంబున దురం తప్రతాపుండగు జాలంధరనాథునికై జనుచుండ నజ్ఞానాంధులు గోపీ చందునివాక్యంబు లాదరించక నగ్నిసంస్కారంబు గావించిరి.

ఇట త్రికాలవేత్తయగు ధనంజయసుతుండు జ్ఞానయోగంబున గోపీచందునిరాకం దలంచి "వాఁ డిచ్చోటి కరుదెంచె నేని బంధు మిత్రకళత్రంబు లత్యంతవిషాదంబుచే విలపించెద" రని యూహించి కృపాసముద్రుండు గాన ప్రయాణోన్ముఖుండై వాతగతి నిమిషమాత్రం బున గోపీచందుని కలియంజేరి "వత్సా! పునరాగమనకారణంబేమి" యని యడుగ నతండు గురుపాదంబులపై ఫాలంబుమోపి గతవృత్తాం తం బంతయు విశదీకరించెను. నాథుం డత్యాదరంబున "పుత్రా! నీమనో రథం బీడేర్చెద. చింతింపవలదు ర" మ్మని యుభయులు గమనంబు జేయుచు పౌలపట్టణంబు జేరి బంధుమిత్రాప్తజనపరివేష్టితుండై చంపా వతీమరణతాపంబుచే సభామంటపంబున నివసించియున్న భూపుని గనుంగొనుచుండ నత్రిలోకచందుండు మహాభయంబుచే నిజసింహాస నంబు డిగ్గి యెదురం జని శిష్యయుత జాలంధరనాథునకు దండప్రణా మంబు లాచరించి యభయఘనులం దోడ్తెచ్చి హాటకమయసింహాస నంబుల నలంకరించి యజాగళస్తనంబులభంగి బకధ్యానయోగంబు పగిది పడపుచెలివలపులవిధంబు జ్ఞానంబులేని వినయంబులు బలుకు చుండ జాలంధరనాథుండు గ్రహించి "త్రిలోకచందా! గర్దభంబునకు చందనం బనుకూలించునే? మర్కటంబునకు సంస్కృతంబు ఫలించునే? తద్వత్సకలగుణసంపన్నత్వంబుచే బ్రకాశించు చంపావతీదేవి నీగృహం బున శోభిల్లునే కానిమ్ము. విధికృతకార్యంబునకు చింతింపనేల? గోపీచం దుని హస్తంబుదె" మ్మని కృపాకటాక్షంబున నిరీక్షించి దనప్రియశిష్యు ని భుజసంపుటి యొనర్చి సంజీవినీమంత్రంబుచే యథావిధి నమర్చి తదు పరి శ్మశానస్థలంబు జేరంజని సంజీవినీప్రయోగయోగంబున చంపా

 

వతీరాణిని జీవింప నొనర్చి సంబోధించి పిలుచుచుండ క్షణమాత్రం
బున నప్పొలతుక జాజ్వల్యమానదేహంబుచే బ్రకటితయై నాథునిచర
ణంబులపై శిరంబు మోపి బ్రస్తుతింపుచుండ జూపరు లమ్మహామహుని
యద్భుతచరిత్రంబునకు విస్మితులై ప్రత్యక్షశుక్రుండుగాఁడే గాన నిగ్గో
పీచందనృపోత్తముండు నిఖిలవైభవంబు లస్థిరంబులని తలంచి పశ్చా
త్తాపంబుచే నపూర్వప్రతాపుండగు నీజాలంధరనాథబోధామృతపాన
మత్తుండై బ్రవర్తిల్లె నని వైరాగ్యత్రయంబుచే జయజయశబ్దంబులు
జేయుచుండ నయ్యనలతనయుండు హేలాపట్టణంబున కేగందలంప
త్రిలోకచందుండు భయభ్రాంతుండై జాలంధరనాథుపదసరోజంబుల
పై వ్రాలి "నే నతిపాపుండను. నీచుండను. యుష్మత్పరితాపం
బెఱుంగక గోపీచందనృపాలుని చులుకం జూచితిని. దయాఘనులై
క్షమింతు" రని యనేకవిధంబుల స్తోత్రంబులు జేయుచు "సమర్థా!
నాయందనుగ్రహించి నేఁటిరాత్రి యిచ్చో విందారగించి మద్భవనంబు
పవిత్రంబు గావింపరే" యనుచుండ నగ్నికుమారుండు "చంపావతీ
హస్తపాకంబు భుజింతుముగాక" యన త్రిలోకచందుండు హర్షించి
యక్కలువకంటిచే శ్లాఘ్యతరపక్వాన్నంబులు జేయించ ధనంజయత
నూభవుండు చంపావతి గోపీచందుల స్వపఙ్క్తి నిడుకొని యవ్విందార
గించుచు కరుణాంతరంగహృదయుండై దనయుచ్ఛిష్టప్రసాదం బా
ముద్దియ కనుగ్రహించి సంజీవినీప్రతాపంబుచే నమరత్వం బొసంగెను.
పిదప త్రిలోకచందునిజూచి "యోభూనాయకా! గోపీచందుండు తపం
బుకై బదరికాశ్రమంబున కేగును. ముక్తచందుండు బాల్యంబున
పట్టాభిషిక్తుండయ్యె. నీవు ప్రత్యర్థిప్రతాప దర్పదమనుండవు కావున
నబ్బాలున కవసరసమయంబున సహాయం బొసఁగుము. నే నచ్చో
షణ్మాసంబులు నివసించి యక్కుమారునకు సకలార్థంబు లెఱింగించి
తీర్థసేవానిమిత్తంబై జనియెద" నన త్రిలోకచందుం డవశ్యం బను
చుండ జాలంధరనాథుం డాత్రియామంబు గడపి గమనోన్ముఖుండై
హేలాపట్టణంబున కేగుచుండ గోపీచందుండుగురువర్యునిచరణకంజం
బుల కెఱఁగి యనుజ్ఞగొని తపంబుకై నానాగ్రామంబులు గడచి బదరి
కాశ్రంబు జేరి కేదారేశ్వరునకు నమస్కరించి లోహకంటకంబులపై
పాదంబులు నిలిపి తపం బాచరింపుచుండెను.

ఇట జాలంధరనాథుండు హేలాపట్టణంబు ప్రవేశించి షణ్మాసంబులు నివసించి ముక్తచందున కనేకార్థంబులు బోధించి శిష్యసహిత కానీపనాథసమేతుండై బయలుదేరి మహాతీర్థంబులు సేవింపుచు ద్వాదశవర్షంబుల కాబదరికాశ్రమంబు జేరి గోపీచందుని తపోద్యాపనంబు గావించి యనేకమంత్రమంత్రార్థంబు లుపదేశించి తత్తన్మంత్రాధిదేవతలగు బ్రహ్మవిష్ణుమహేశ్వరేంద్రాగ్ని యమ వరుణ ప్రముఖ నిఖిల దేవలోకంబును ప్రసన్నంబు జేసి వరంబు లిప్పించి సకలవిద్యాపారంగతుండై నాథపంథీయోగంబున విలసిల్లం జేసెను.

ఇతి భక్తిసార నవనాథచరిత్రంబున గోపీచందాఖ్యానం బష్టాదశాధ్యాయము సంపూర్ణము.

---

## ఏకోనవింశత్యధ్యాయము.

---

{ గోరక్షనాథుండు శృంగమురుడీనగరంబున కేగు నెడ నాంజనేయుండు కష్టంబులంబడి శ్రీరామచంద్రసహితుండై గోరక్షుని జేరంబోవుట. }

అట బుద్ధిగతుండగు గోరక్షుసిద్ధుండు గజకర్ణోద్భవునిచే నచ్చరిత్రుండగు మత్స్యేంద్రనాథునిజాడ లెఱింగి గౌడబంగాళకైలబంగాళాది నానాదేశంబు లతిక్రమించి స్త్రీరాజ్యసీమం జేరంజని నిజహృదయంబున మద్గురుం డీ రాజ్యాధిపత్యంబు వహించి సకలైశ్వర్యసంపన్నత్వంబున నటవిటభటపరివృతుండై మణిమండితమంటపంబున బ్రకాశించుచుండును. భిక్షుకుండనై దీనదశచే నేనచ్చటి కేగిన నమ్మహాపురుషుండు శ్రీమంతుండు దరిద్రునియం దనాదరణ జేసినచందంబున నన్ను లక్షించుట దుస్తరంబుగాదే? ఖద్యోతుని సమక్షంబున ఖద్యోతంబులు కాంతిహీనంబులు గావె? జాతరూపంబునకు పిత్తలం బెనయగునే? మేరుమశకాంతరంబగు నే నెక్కడ? వైభవపూర్ణుండగు నాథుం డెక్కడ? ఇంతియగాక నన్నుజూచిన నత్తపోధనుండు మనస్తాపంబు నొందును. షడ్రసభోజనంబు బరిత్యజించి తిక్తద్రవ్యంబులు భుజించినకరణి ధనధాన్యసం

పత్సమృద్ధుండు వైరాగ్యమార్గం బాశ్రయించునే యస్మదాగతవృ
త్తాంతం బాయోగిముఖ్యుం డాకర్ణించెనేని దనవిద్యానైపుణ్యంబున
న న్నేమిజేయందలంచునో ప్రతిఘటించుట గురుద్వేషంబు సంభ
వించు నని వితర్కింపుచుండు సమయంబున నొకరథంబుపై దిరస్కృత
రంభోర్వసు లన సర్వాంగసుందరీమణులగు వేశ్యభామినులమేళం
బొకటి బొడగాంచి సుధాకరవదన భీతహరిణేక్షణ నవపల్లవాధరి
యనందగి సకలవిద్యానవద్య కుశలత్వంబుచే గానరసంబున గానర
సాభిజ్ఞులయుల్లంబులు పల్లవింపఁజేయు కళింగనామ్నామేళనాయకిం
జేరంజని "నీనామం బేమి? మీారెచ్చటి కేకతంబున నేగెద" రన నవ్వే
డ్కకత్తె "నానామంబు కళింగ శృంగమురుడీనగరాధిపతియగు మైనా
కినీరాణి సభాస్థానంబున కేగి నృత్తగీతవాద్యవిశేషంబులచే నమ్మానినీ
మణిని సంతుష్టపఱచి యపారద్రవ్యం బాకర్షించెద"మని నుడువుచుండ
గోరక్షుండీ నటనకత్తియల నాశ్రయించి గుప్తవేషంబున నరిగిన మేలో
నగూడునని దలంచి "మీారు నాయం దనుగ్రహించితిరేని మీావెంబడి
నే నే తెంచెద" నన వారు "నీకుశలత్వం బేమి" యని విచారింప నాథుం
డు "నాకు గీతవాద్యవిద్యావిశారదత్వంబు గలదు. మీానృత్యంబునకు
సరియైన మృదంగవాద్యసుశబ్దంబులు గప్పెద" నన నప్పడపుచెలి
"నరోత్తమా! గానవాద్యసురసంబు లెఱింగెద నని సెలవొసంగితిరి
గావున భవద్విద్యానైపుణ్యంబు మాకెఱింగింపు" మన నవశ్యం
బనుచు నయ్యినతనయుం డా పడఁతిమిన్నచే విపంచిని గొని దనకరా
బ్జంబుల ధరియించి గంధర్వవిద్యామంత్రరాజంబు స్మరియించి నలుది
శలం బ్రయోగించి యవ్వీణను స్పృశింప నంత నమ్మంత్రమహిమాతి
శయంబుచే తత్కాననాంతరతరుపాషాణంబులు స్వరశాస్త్రోక్తరాగజ్ఞా
నపరిపూర్ణులై సుస్వరంబుల గాయనంబు జేయుచుండ నవ్వల్లకీతం
త్రులు మృదుమధురశబ్దంబు లీనుచు నవరసంబు లొలుక దనంతట
తా మ్రోగుచుండె నప్పు డగ్గణికాశిరోమణి విస్మయంబుచే మధ్య
మాంగుళంబు గఱచుకొని తనడెందంబున "నితండు హరుండుగాక
నరుండౌనే? పరుసంబుచే లోహంబు కర్బురంబగుట సహజంబు. జడత
రపాషాణంబులు రాగజ్ఞానోదయంబులగు టొకవింతగాదే? మర్త్యభూ
జంబులచే కామ్యంబులు చేకూరుచుండ సురభూజమహాత్వంబు బొగడ

దరంబే? దత్పూర్వరుసాషాణంబులచే గానంబు జేయించు ఘనుని స్వము
ఖనిర్గత రాగాలాప మాధుర్యంబు లానుటకు గంధర్వాదులకైన వశం
బగునే? నే నీ రసజ్ఞుని నాశ్రయించుట మద్భాగ్యోదయకారణం" బని
యూహించి "యోసర్వకళాదక్షా! యుష్మచ్చరణకమలాశ్రయంబుచే
నాయజ్ఞానతిమిరం బెడబాయును గావున తమ జగద్విఖ్యాతంబగు
నామధేయంబు దెలియ దయచేయు" మన నాహరిదశ్వతనయుండు
నిజనామంబు దెలియఁబలికిన కార్యసాధనానుకూలంబు గాదని దలంచి
"నానామంబు పూర్వడాముం డనియెదరు. నేను ద్రవ్యంబున కాశిం
పను. సమయంబునకు భోజనంబు లభించెనేని యంతియ నాకు ముఖ్య
కారణం" బన నమ్మగువ "పురుషశ్రేష్ఠా! నీకొకవిశేషంబు దెలియపఱి
చెద నాకర్ణింపుము. స్త్రీరాజ్యంబున కన్యపురుషగమనంబు లేదు.
తద్రాజ్యస్త్రీసమూహంబునకు ప్రభంజనసుతుండు ప్రాణనాయకుం
డతం డూర్ధ్వరేతస్కుండుగాన దనభుభుఃకారనినదంబుచే నచ్చటిపడఁ
తిమిన్నల గర్భవతులం జేయును. తద్ఘోరతరధ్వానంబు పురుషులకు మృ
త్యుస్వరూపంబు. నీవెట్లు జనుదెంచెదవో" యనుచుండ నాథుండు
"మారుతాత్మజుండు నన్నేమిజేయును? తపఃప్రతాపంబుచే నభోమణిని
గబళించెడువానికి నక్షత్రంబు లడ్డమగునే? భూభారంబు శిరంబున
వహించెడువాఁడు భూధరంబుల సరకుగొనునే? జలార్ణవంబు ప్రాశించె
డువానికి నదంబులు లక్ష్యంబే? నీవాసంశయం బుడుగు" మని యాక
ళింగనామ్నీ వేశ్యాభామినిని రథారోహణంబు గావించి తా నారథం
బునకు సారథ్యం బవలంబించి కక్షపాలాంతరభస్మంబుగొని దూరా
లోచనపరుండై వజ్రాస్త్రం బభిమంత్రించి తత్సహాయంబున స్పర్శాస్త్ర
మోహనాస్త్ర నాగాస్త్రంబులు గల్పించి దేశసీమాంతదిగ్బంధనం
బొనర్చి రథారూఢుండై తీవ్రగమనంబున నేగుచుండ తద్రథహయగ
మనధ్వనులు విలోకించి యమ్మువ్వేలుపులయిక్క తేరివారువం
బులు కసిబూని నటునరించి బడలికచే చేతనంబు దప్పి స్యందనంబు
గొని మున్నీటంబడెనో యన నినుండు గ్రుంక నజ్ఞానాంధులబుద్ధికై వడి
యంధకారంబు దిశలు గప్పుచుండె నంత నపూర్వదిక్కాంత దనఫా
లభాగంబున మృగమదతిలకంబు దిద్దునెడ వామకరాగ్రభాగంబున
నిడుకొన్న తిలకప్రతిబింబసంయుత ముకురంబో యన నపొప్పెడుపుకొం

డపై యొప్పెడు రేఱేఁడుం జూచి సతు లొక్కుమ్మడి దమయొడయుం డేతెంచె నని సంతసంబుచే జల్లిన సేసలన రిక్కలు దమతమస్థానంబు లలంకరించియుండె నాసమయంబున ధీమంతుఁడగు గోరక్షుండు ఛిన్నా పట్టణంబు జేరెను. పూర్వయామాంతరంబున మారుతాత్మజుండు సేతుస్థలంబు వదలి స్త్రీరాజ్యసీమం బ్రవేశింపుచుండ సిద్ధనిర్మితవజ్రాస్త్ర దృఢతాడనంబుచే నదరిపడి బుడమింబడ స్పర్శాస్త్రంబు ముట్టడించి నేలం గఱచిపట్టె. మోహనాస్త్రంబు హృదయంబు దూఱి మతి దొలంగించె. నాగాస్త్రప్రయోగమహిమాతిశయంబుచే భోగీంద్రుం డేతెంచి కరపాదంబులు బంధించె. వాయుపుత్త్రుం డీ యద్భుత చరిత్రంబున కచ్చెరువొంది పైకి లంఘింపఁదలంచియు మోహనాస్త్రవశగతచిత్తుండై మహాజవసత్వయుత శేషబంధంబులకు ముక్తుండుగాక శక్తిదొలంగి వమనంబు జేయుచు దేహాయాసబహుళంబుచే పరితపింపుచు కాలంబు గూడెనని కృతనిశ్చయుండై తాపత్రయ నివారకుండగు శ్రీరామచంద్ర పాదకమలార్పితచిత్తుండై "యోఖర దూషణాది పిశితాశనప్రతాపదర్ప దమనా! నుతత్రిణయనా! దృగాయుధకరకమలవిరాజమాన మహేష్వాస ఖండనోద్దండ పరాక్రమాతిశయాప్రమేయా! యోగిజనధ్యేయా! రఘుకులాన్వయార్ణవానందకరకలాధరా! జానకీవరా! నిరంతర నిర్మల పరిపూర్ణ సచ్చిదానందవిగ్రహా! మహాబలవాలినిగ్రహా! దశవదనదుర్వారగర్వనిర్వాపణ ప్రబలపాండిత్యశూరా! మేరునగధీరా! శుకనారదపరాశరాది నిఖిల మునిసేవితపాదకమలా! జ్ఞానఘనలోలా! సురనరగరుడగంధర్వకిన్నరాది సంస్తూయమానగుణజాలా! లోకత్రయపాలా! దాసజనహృదయ సరసీరుహవిహార మత్తభృంగా! శ్యామాంగా! యుష్మచ్చరణాంభోరుహదాసుండగు గంధవహసుతుండు సంకటంబు లనుభవింపుచుండ నుపేక్షించుట కర్జంబగునే? నీయార్తజనరక్షణపరాయణబిరుదాంకిత దివ్యతరనామంబునకు లోపంబు వాటిల్లదే" యనుచుండ పరమదయాకరమూర్తియగు రఘుపుంగవుండు ప్రసన్నుండై కరువలిపట్టి దురవస్థం జూచి జలబహిర్గతమీనంబుభంగి వత్సంబు బాసిన ధేనువుపగిది దుఃఖపీడితుండగు సుతుంగనుంగొని పరితపించు మాతకరణి కళవళింపుచు తక్షణంబ పాకశాసనాస్త్రప్రయోగంబుచే వజ్రాస్త్రంబు నివారించి

విధక్తాస్త్రంబుచే స్పర్శాస్త్రంబు బోనడంచి క్షీరాబ్ధిశయనుండగు శ్రీమన్నారాయణ దివ్యవాహనంబగు వైనతేయు నావాహనంబు జేయ నహినాయకుండు నమస్కరించి యంతర్ధానంబునొందె నాపిదప జగన్మోహనంబగు వైష్ణవమాయచే మోహనాస్త్రంబు రూపుమాప సర్వసంకటవిముక్తుండగు హనుమంతుండు స్వస్థచిత్తుండై నలుదిక్కులు నిరీక్షించి దననికటంబున నిల్చియున్న బ్రహ్మాండవల్లభుండగు శ్రీరామమూర్తిం గనుంగొని పాదంబులపై వ్రాలి "లోకాభిరామ రామా! భవత్కరుణాకటాక్షవీక్షణంబున కేవల ప్రళయకాలతుల్యంబులగు మహదస్త్రజ్వాల లడంగె. నీయట్టి దయాసముద్రుండు గలఁడే? నాజన్మప్రభృతి నిప్పగిది నిడుములంబడితినే? నీయనుగ్రహంబు లేకున్న ప్రాణంబులు వాయుట నిక్కం"బని బొగడుచుండ శ్రీరామచంద్రుండు "వత్సా! నీకై మూడుపర్యాయంబు లేతెంచితి. నిత్తఱి నీబోఁవడచిన విమతుండెవఁడు? వేగంబున దెలియంబలుకు" మన భక్తాగ్రేసరుండగు గంధవహసుతుండు "ప్రభో! న న్నెదిరించు క్షత్రియదోర్బలు లెవరు గలరు? మహాప్రళయానలస్వరూపులగు నాథపంథీప్రతాపశూరుల కీ దర్పంబు దక్క నన్యుల కిట్టిశౌర్యంబుగలదే? నవనాథులలో నొకఁడు గాబోలు" నన రామచంద్రుండు "పుత్రా! నవనాథులు నాయంతరంగభక్తులు. వారు నిర్వక్రపరాక్రమాతిశయధైర్యధుర్యులు. వారిచే నీకుపందెంబు వల" దనుచు జానకీరమణుండు నిజదృష్టిచే గోరక్షుని కృత్యంబని దలంచి "యంజనీతనయా! హరినారాయణావతారుండగు గోరక్షుండీ స్త్రీరాజ్యంబున కేగ నరుదెంచి యొకయోజనదూరంబున ఛిన్నాపట్టణసమీపంబున నివసించె" నన హరిసూనుండు "రఘునాయకా! స్త్రీరాజ్యాధిపతియగు మైనాకినీరాణి మనోభీష్టంబు దీర్పఁదలంచి మత్స్యేంద్రయోగివర్యుని జతగూర్చితి నిగ్గోరక్షుం డిపు డాశృంగమురుడీనగరంబున కేగి మత్స్యేంద్రునిచిత్తం బపహరించి మైనాకినీరాణి నెఱబాపి మద్వచనభంగంబు జేయు గావున మృదుమధురవచనంబులచే గోరక్షుని సంతుష్టపఱచి నామనోరథం బీడేర్పు"మని పొగడుచుండ శ్రీరాముండు హర్షించి కపిముఖ్యుని వెంటగొని ఛిన్నాపట్టణనికటంబున దమనిజస్వరూపంబులు వదలి బ్రాహ్మణవేషధారులై గురుధ్యానానందాబ్ధినిమగ్నుండగు గోరక్షుని సమీపంబు జేరి యాదేశశబ్దం

బులచే నందనంబు లాచరించి "యోగిపురుషా! మేము షట్ఛాస్త్రవేత్త లము. నీవునిగ్రహానుగ్రహసమర్థుండవై నిరుపమానజలధిగంభీరంబుచే దుష్టుల శిక్షించి శిష్టుల రక్షింపుచు నింద్రియదమనుండవై సాంద్రవై రాగ్యపరిపూర్ణత్వంబుచే బ్రకాశించెడు మహామహుండవు. యోగికు లభూషణుండవై యాచకజనాశాపరిపూర్తిజేయు ఘనుండవు గాన మామనోభీప్సితంబు లీడేర్పు" మని వేడుచుండ జగచ్ఛతుష్పుత్రుండు "మీకామ్యం బెయ్యది దెల్పు" మన వారు "తమవాగ్దత్తానంతరం బున వెల్లడిపఱతు" మనిరి. గోరక్షుండు దనమనంబున "నేను శైలీ సింగీ కంథాది చిహ్నంబులచే గ్రుమ్మరుచుండువాఁడను. వీరు నన్నేమి విచా రించెదరో ? నిశామధ్యంబున వీ రేగుదెంచుట కారణం బెయ్యది యో? పురుషసంచారరహితంబగు స్త్రీరాజ్యంబున కీ వారు లెట్లరుదెం చిరో? వీరు మానవులు గారు. ప్రచ్ఛన్న వేషంబుల మెలంగెడు వరుణేం ద్రప్రముఖ సురలోకవాసులు గాబోలు నని కృతనిశ్చయుండై వీరిమ నోభీష్టంబు లెయ్యవియో మత్కార్యసాధనభంగకర కామ్యంబుదక్క నితరకోరిక లీడేర్చెద" నని తలంచి "యోఘనులారా! మీరు వేషధా రులగు సురోత్తములుగాని భూసురులు గారనుట నిక్కంబు. మత్పరి కల్పిత మహదస్త్రచతుష్కం బతిక్రమించి సీమోల్లంఘనంబు జేయ సామాన్యులకు దరంబే? మారుతాత్మజుని భుభుఃకారరవంబుచే మర్త్యు లకు మృత్యువు ఘటింపదే? ఉరగరాజముఖనిర్గతగరళం బానహరుండు దక్క నరుండు నిల్చునే! దహనుం డాకసంబు గబళింపుచుండ పతం గంబులు విహరించుట చిత్రంబు గాదే? తదస్మన్నిర్మితదారుణాస్త్రజా లంబుచే నరోత్తములు జీవింతురే? మీరు సురలోకపూజితులుగాక నరు లుగారని పాదంబుల కెఱఁగి దమనిజనామరూపంబులు దయచేయు" మనుచుండ రామభద్రుండు దరహాసితవదనుండై మరుత్సూనుని ము ఖం బాలోకించి మనరూపంబులు గోప్యపఱచ నవసరంబు గాదనుచు దన నిజస్వరూపంబుచే ప్రసన్నుండై గోరక్షు నెవ నదుముకొని "వ త్సా! మద్వచనం బాకర్ణింపుము. తొల్లి మైనాకినీరాణి పంచశరుశరపరం పరలచే గ్రాగి యిస్మహామహుండగు పృషదశ్వసుతునికై తపం బాచ రింప నితండు బ్రత్యక్షుండై తద్దేవిమనోతాపంబు దీర్పందలంచి మత్స్యేంద్రయోగివర్యుని సమకూర్చె. నీవిపు డా శృంగమురుడీనగరం

బున కేగి మీనానోదరసంభవుని గొనిపోయెదవేని దనవచనభంగం బౌనని యిక్కపిముఖ్యుండు దలంచెం గాన నీ వా నాథముఖ్యుని గొనిపోవల" దని నుడువ గోరక్షుండు "రఘుకులాబ్ధిచంద్రా! వాయుపుత్రుండు చతురవచనరచనుండై ప్రపంచవిరక్తుం డగుమత్స్యేంద్రనాథుని మోసపుచ్చుటధర్మంబగునే? వసుంధరపై నభంబుకూలుఁగాక. కుతలంబురసాతలంబునకు గ్రుంకుఁగాక. కులగిరులుదలక్రిందులై పడుఁగాక. మత్ప్రాణంబులైన నిచ్చి యస్మద్గురువర్యుని దోడ్కొని జనియెద" నన శ్రీరాఘవచంద్రుండు "వాయుపుత్రా! గోరక్షుండు గురుభక్తిపరాయణుండై కదనంబైన జేయందలంచు. గురుమూర్తిని వదలుట కష్టం" బనుచుండ నంజనీసూనుండు రోషతామ్రాక్షుండై యుద్ధంబు జేయందలంచి నిలుచుండ భక్తవత్సలుండగు రామభద్రుం డాంజనేయునితో "లఘుకార్యంబునకై మహాక్రోధం బిదేల? మీనసనాథుని జననంబుచే మైనాకినీరాణి హృదయతాపంబు బాసె. నీవచనంబునకు భంగం బేలగలుగు? ముం దీనాథుల కనేకకార్యంబులు గల" వని కోపోపశమనంబు జేసి గోరక్షుని దనహృదయంబునకు ధరించి యాపిదప నిజనివాసంబున కేగందలంచినంత మిత్రపుత్రుండు రాఘవేంద్రునిచరణసరసీరుహంబులపై వ్రాలి యనేకవిధంబుల స్తోత్రంబులు జేయ జానకీరమణుండు పరమానందుండై యంతర్ధానంబు నొందె నిట వాయుకుమారుండు మైనాకినీసదనంబున కేగెను.

ఇతి భక్తిసార నవనాథచరిత్రంబున గోరక్షానిలసుతచరిత్రం బేకోనవింశత్యధ్యాయము సంపూర్ణము.

---

## వింశత్యధ్యాయము.

---

శృంగమురుడీనగరాధిపతియగు మైనాకినీరాణి పూర్వచరిత్ర.

వాయుసుతుండు శృంగముగుడీనగరంబున మైనాకినీభవనంబు జేరంజని యంతఃపురంబున ననల్పంబగు హంసతూలికాతల్పంబున నల్పనిద్రను శయనించియుండు తిలోత్తమ మైనాకినీ నైకటికవిష్టరంబుపై యుపవిష్టుండైన సమయంబున నచ్ఛపలాక్షియగు పద్మిని యసంపూర్తినిద్రచే నీక్షణంబులు దెఱచి సమక్షంబున నివసించి యున్న విప

క్షుదర్పదమన భుజబలదక్షుండగు పృషదశ్వసుతుం గనుంగొని భయన
యభక్తివిశేషంబులచే నదరిపడి లేచియబ్ధిధనుతుని పదసరోజంబులపై
వ్రాలి ముకుళితకరద్వయై నిలుచుండెను. శ్రోత "లీయావిధ కైత్తైఅంగున
తిలోత్తమమైనాకినీపద్మినీయనునామత్రయంబుగలిగె"ననిసూతుని విచా
రింప నతండు "శ్రోతలారా! సావధానచిత్తులై వినుఁ" డని యిట్లనియె.
"ము న్నీ మగువ మేరుమందరసమీపస్థల సింహళద్వీపంబున తేజః
పుంజలై ప్రకాశించు పద్మినీపూబోడుల సముదయంబున నుడుగణం
బున సుధాకరునిభంగిపద్మినియను సార్థకనామధేయంబుచే రూపయౌవ
నలావణ్యంబులుగలిగినిరుపమానయై వెలుంగుచు నొకానొకదివసంబున
నభ్యంగనస్నానం బాచరించి లీలావినోదంబుచే కబరీభరంబు ముడు
చుకొనుచు విష్ణుపథావలోకనంబు జేయుచుండ నత్యంతవైభవసహి
తుండగు యుపరిచరవసువు దివ్యతరమణిఖచితవిమానారూఢుండై చను
చుండ వాతగతిచే దుకూలంబు దొలంగి తద్విమానగవాక్షద్వారం
బున నీచేంద్రియంబు గోచరంబైనంత నక్కలభగామిని హాస్యరసం
బొలుక పక్కుమని నవ్వెను తత్కారణంబున వసుపుంగవుండు క్రుద్ధుం
డై 'నీవు జారిణీవర్తనంబున విషయాపేక్షచే నల్పమతివై హసించితివి.
నే నింద్రియదమనుండనై తపోయోగంబున బ్రవర్తించుట నీవెఱుం
గవే? దుష్టే! నీవు స్త్రీరాజ్యంబున నన్యపురుషలోలత్వంబుచే నివసిం
చెద' వని శపింప నమ్ముద్దియ భయకంపితహృదయయై 'వసునాథా!
మత్ప్రారబ్ధయోగంబున నాకీ దుర్బుద్ధి యావహించెను. నాయపరా
ధంబు క్షమియించి శాపనివారణమార్గంబు దయచేయు' మనుచు
పెక్కుభంగుల నుతింపుచుండ నప్పరమదయాసముద్రుండగు వసుము
ఖ్యుండు కరుణించి 'మోహమైనాకినీ! స్త్రీరాజ్యాధినాయకియగుతిలోత్తమ
రాణి యాయుష్యంబు సమీపించినది. నీవా స్థానాధిపత్యంబు వహిం
చెదవు. నీచిత్తంబు నాయందర్పించిన కారణంబుచే మత్స్యేంద్రనాథా
భిధానంబున బ్రసిద్ధిబొందిన మత్సుతుం డచ్చోటికి కరుదెంచి నిన్నపరి
మిత రతిసుఖంబులం దేల్చి మీననాథుండను సుపుత్రసంతానంబు బడ
యు' నని బలుక నక్కమలేక్షణ 'వసునాయకా! పురుషహీనరాజ్య
సుందరీమణులుసంతానవంతులెట్లయ్యెదరు? తద్దేశంబునకు మత్స్యేంద్ర
యోగిముఖ్యుం డేవిధి జనుదెంచు నీసంశయంబు బాపవే' యన నతం

'ఓ మందయాన! తద్రాజ్యవల్లభుండగు కపినాయకుని భుభుఃకారమారుతంబున నచ్చటిచేడియలు సంతానవంతు లయ్యెదరు. నీ వా దేశంబున తపం బాచరించి యంజనీసూను ప్రసన్నత్వంబు బడసి మనోజసుఖంబు గోర నతండు విషయోపద్రవరహితుం డైనకతంబున మహాసుప్రసిద్ధుండగు మత్స్యేంద్రసిద్ధుని నీ కొసగూర్చు' నని వాక్రుచ్చి స్వస్థానంబున కేగెను. తదుపరి సుందరీమణి యగు మైనాకినీదేవి వసుశాపహతబుద్ధిచే స్వదేశంబు బాసి గ్రుమ్మరుచు స్త్రీరాజ్యంబు జేరంజని శృంగమురుడీనగరంబున నొకచర్మకారిణీ సదనసమీపంబున నివసించియుండ న త్తరలాక్షీ రూపలావణ్యంబులు గనుంగొని యచ్చర్మకారిణి 'నీదేశం బెయ్యది? నీనామధేయం బేమి' యని యడుగ మైనాకినీదేవి 'నేను సింహళద్వీపనివాసురాలను. నానాముంబు మైనాకినీ యనెదరు. నేనుపరిచరవసుశాపవశంబుచే దేశసదనంబులు బాసి యిచ్చోటికేతెంచితి నన్నాదరించువా రెవరు గల' రని వినయపూర్వకంబుగ బలుక నచ్చర్మకారిణి ప్రేమాన్వితహృదయయై మైనాకినీదేవిని మిగుల నాదరించి 'మద్గృహంబున నివసించు'మని నుడువనప్పడతిమిన్న తచ్చర్మకారిణీసదనంబున పాకక్రియలు జేయుచు ముదంబుచే కాలంబు గడపుచుండ నొకకొన్ని దినంబులకా నగరాధినాయకియగు తిలోత్తమ మహారాణికాలంబు సమకూరి సంతానంబు లేనికతంబున రాజ్యాధిపత్యయోగ్యంబగుచపలాక్షి నన్వేషించుటకై సచివకు దెలుపనయ్యువిదయొకమహానాగంబును దివ్యభూషణాంబరంబులచే నలంకరించి శుండాగ్రంబున పుష్పహారం బొసంగి యప్పురంబునం గలనిఖిలచంద్రముఖుల రావించి సభదీర్చినంత నమ్మహాగజం బా యన్నువలకూటంబు విలోకించి యొకభాగంబున నొప్పులకుప్పయై వెలుంగుచున్న మైనాకినీగళంబున హారం బర్పించియుండ నవ్వనితలెల్ల సంతసంబున నమ్మైనాకినీదేవినిమహారాణిగ పట్టాభిషేకంబు గావించిరి. పిదప నద్దేవి పూర్వోక్తప్రకారంబున ఘోరతరతపంబుచే ప్రభంజనసుతుని ప్రత్యక్షంబు బడసి మహామహుండగు మత్స్యేంద్రనాథయోగివర్యున కనురూపయై ప్రవర్తించెం గాన నిక్కాంతామణి పూర్వనామంబు మైనాకినీదేవి యనంబడి సింహళద్వీపతరళాక్షీకదంబంబున ఘనతవహించుటచే పద్మిని యనునామధేయంబు గలిగి తిలోత్తమారాణి సింహాసనాస్థానంబున శోభిల్లు

టచే తిలోత్తమాహ్వాయంబుచే విలసిల్లె" నని శ్రోతల సంశయంబు వాపి ముందటికథావిశేషంబు దెల్పం బూని యిట్లనియె. వాయుసూనుండు ముకుళితకరకమలవై పురోభాగంబున నిల్చున్నమైనాకినితో "నీతపంబునకు ముదితాత్ముండనై యోగచంద్రముండగు మత్స్యేంద్రునిచే నీమనోభీష్టంబు దీర్చితి నిక నీసుఖంబునకు విఘ్నంబు వాటిల్లె నిప్పుడీ మత్స్యేంద్రుని ప్రియశిష్యుండు సర్వకళాదక్షుండగు గోరక్షుం డీనగరంబునకు దనగురుమూర్తిని దోడ్కొని పోవుట కరుదెంచె నతం డత్యంతప్రతాపశౌర్యధైర్యసమృద్ధత్వంబున మహావైరాగ్యంబుచే బ్రహ్మానందాబ్ధినిమగ్నుండై ప్రకాశించు నత్తపోధనుని గుణజాలంబు బొగడ బ్రహ్మేంద్రాదులకైన తరంబుగాదు. నే నా మహామహుని సమక్షంబునకు నీకతంబున శ్రీరామచంద్రసహితుండనై వెడలి యనేకయుక్తియుక్తంబుల బోధించిన నతండు నిర్లక్ష్యంబుచే మావాక్యంబులు గ్రహింపక దనగురునాథుని దోడ్కొనియరుగుట నిక్కంబని నొక్కి వక్కాణించె నగ్గోరక్షుం డిచ్చోటికే తెంచు నతండు విషయసుఖవిరక్తుండు నీవత్తపోధనుని భయభక్తులు గలిగి శయనాసనభోజనాది వివిధోపాయంబులచే గౌరవించి చేలబద్ధమాణిక్యంబు పగిది బహుజాగ్రత గలిగి సంతుష్టపఱచు" మని యాజ్ఞాపించి యంతర్ధానంబు నొందెను.

**గోరక్షుండు శృంగమురుడీనగరంబు ప్రవేశించి మత్స్యేంద్రనాథుని హెచ్చరించుట.**

ఇట జగత్ప్రతీతుండగు గోరక్షుండు ఛిన్నాపట్టణంబు బయలుదేరి గణికాయుతరథసమేతుండై యనేకగ్రామంబులు గడచి శైల్యదేశశృంగమురుడీనగరంబు జేరంజనిపుర బాహ్యపథికాశ్రయంబున నివాసంబు జేసియుండ నగ్గణికాశిరోమణి యగు కళింగ దనమేళసంబంధమరాళగామినుల వెంబడిగొని చూపరుల నేత్రోత్సవంబు జేయు రూపంబులచే మందగమనంబున మైనాకినీ సదనంబు, జేరంజని ద్వారరక్షులతో దనరాక దెలుప వార లతివేగంబున తిలోత్తమకు దెల్పి యనుజ్ఞబడసి ద్వారంబు దాటింప నానటనకత్తియలు రయంబున సభాస్థానంబున కేగి యుడుగణంబున బ్రకాశించెడు రోహిణీపతిచందంబున నవరత్నస్థగితకనకసింహాసనంబుపై మైనాకినీరాణిసహితంబుగ నలంకరించియున్న మీనోదరసంభవుని గనుంగొని జొహారులిడి యప్పద్మినీ

మణి నుద్దేశించి "తల్లీ! భవత్కీర్తి ముల్లోకంబున విస్తరిల్లె నిక్కలి యుగంబున కలావంత బృహద్రథ గోపీచంద ప్రముఖ రాజాధిరాజు లపారకీర్తిఘనులై నీయుదారగుణసంచాశ్చర్యస్థైర్యధైర్యంబుల కెన యైరే గావున నృత్తగీతవాద్యంబుల దమయుల్లంబు రంజిల్లఁజేయు నిని ర్దిషచే నరుదెంచితి" మన నమ్మహారాణి పరమానందకందళిత హృద యారవిందయై వేశ్యకత్తియలవేడుక జూడందలంచియాజ్ఞాపింప వారు దముకోర్కెలీడేరె నని విడిదికిం జని వీణా మృదంగాది వాద్యంబులు సరియొనర్చి సావధానత్వంబున నుండిరి. అట మైనాకినీదేవి సూర్యాస్త మయానంతరంబున నానామణిమయ స్తంభపరిశోభితవిశాలమంటపంబు న శ్రీచందనాగరుమృగమదాది పరిమళమిళితతోయంబులచే తత్సభాస్థ లం బలంకరించి నిరుపమాన మణిప్రతిఫలిత దీపసముదయ చిత్రతర కాంతిపుంజంబులు దిరస్కృతక్షపాకర కరనికరంబై వెలుంగుచుండ యోగిసార్వభౌముండగు మత్స్యేంద్రనాథుని వామభాగంబున సుతుం డగు మీననాథసహితంబుగ నయ్యొడ్డోలగంబున నలంకరించి వేశ్య భామినీమణియగు కళింగ నాహ్వానింప నప్పుడపుచెలి దమసాధనవరి ష్ఠంబులు గొని రాజభవనంబున కేగుచుండ గోరక్షుండు వెంబడి బోదలంచి వేశ్యకాంతతో రహస్యంబున "నీ వా సభాస్థానంబున నాట్యంబు సలుపునెడ నే మృదంగవాద్యంబు మాధుర్యంబుగ సల్పి సభ్యుల యుల్లంబునకు సంతసం బొనగూర్తు. నీ కపారద్రవ్యంబు లభిం చు"నన నక్కలికి "పూర్వడామారాజసభాస్థలంబు స్త్రీజనపరివృతంబై యుండు. పురుషగమనం బచ్చోటి కెట్లగు నేతద్రాజ్యంబున పురుష సంచారంబు లేదని మీరెఱుంగరే? మీ రచ్చటి కరుదెంచుటచే నన ర్థంబు సంభవించు" నన నతండు "నేస్త్రీవేషంబుధరించి సభామధ్యం బున నృత్తగీతంబులు సల్పి సభాసదులచిత్తంబు లానందాయత్తంబు నొందించెద. నాకోర్కెలీడేరు. నీ కపరిమితలాభంబు గలుగు" నన నక్కళింగ హర్షించి దివ్యతరాంబరంబు లా గోరక్షనాథునకు గట్టించి జడలచిక్కు వాపి కబరీభరంబు ముడిచి లలాటంబున సారంగమదతిల కంబు దిద్ది మణివిభ్రాజితం బగుతాటంకంబుల శ్రోత్రంబు లలంకరించి బహురత్నఖచిత కనకాభరణంబులు గళభాగంబున శోభిల్లంజేయ

నంగనామణి వేషానుకూలభూషణభూషితసర్వాంగసుందరియై వగజగి బిగి సొగసు వలపు మిటారంబులు గలిగి రంభోర్వసులను దిరస్కరించు రూపంబుచే మృదంగంబు గొని వేశ్యాంగన వెనువెంట వీరమోహినియై సభాస్థానంబు జేరంజన నప్పాథోరుహదళలోచను లీ స్త్రీవేషధరగోరక్షుని నవయౌవనాంగంబుల కలిమి గనుంగొని యన్యోన్యభాషణంబులచే "నిత్తరలాక్షి తనువిలాస సోయగం బీ వయారం బీ తళుకీ బెళుకీ లోకంబున నే యన్నులకైన గలదే? మున్నిట్టి పడంతిమిన్న నెందైన గంటిమె? రంభోర్వసు లీ కలభగామిని పాదకమలద్యుతి కెనయౌదురె? మహాచాతుర్యధుర్యుండగు చతురాననుం డీచంద్రముఖిని సృజించుట కెంత యోచించెనో" యని యాశ్చర్యంబున గొనియాడుచుండు సమయంబున గోరక్షుండు శృతిమిశ్రమంబుకై మాధుర్యమాణ మృదంగనాదంబు జేయ నక్కళింగ కాలానుకూల రాగాలాపంబు గావించి గానవిద్యా నైపుణ్యంబుచే వర్జావర్జ ప్రకృతి వికృతి స్వరవివేకంబు గలిగి గాయనంబు జేయుచు శాస్త్రోక్తభరతంబుచే సభాసదుల మనః పద్మంబులు వికసింపం జేయుచుండ సకలవిద్యావిశారదుండగు దినేశతనయుం డప్రతిహతచతురత్వంబున మృదంగంబు వాయించుచు విచిత్రతరమణిచిత్రిత హేమసింహాసనోపరివిశ్రమితవసుకుమారచరణసరసీరుహార్పితచిత్తుండై దనయుల్లంబున మద్గురుపదపంకజదర్శనంబు ఘటించె కృతకార్యుండ నైతినని పరమానందంబున డోలాయమానమానసుండై మృదుమధుర మృదంగశబ్ద నినదంబుచే విద్యాకుశలత్వంబు గనుపఱచ నమ్మత్స్యేంద్రుం డరసంభవుం డమితానందంబున నహో యని మనోజ్ఞపరిధానం బా మందయాన కొసంగుచుండ గోరక్షనాథుం డాయానందపరవశత్వంబు విలోకించి మృదంగంబున నానావిధశబ్దంబులు తాళమానగతులచే గల్పించుచు నిజచతురత్వంబున "మత్స్యేంద్రయోగివర్యా! భవత్పుత్రుండగు గోరక్షుం డేతెంచె నీకై తడవేల వెడలవలయు" నని శబ్దంబులు మృదంగంబున వ్యక్తపఱచ నవ్వసుకుమారుం డహస్కరసుతుండగు గోరక్షునినామం బెక్కడిది దని దలంచుచుండ పునఃపునర్మృదంగనాదంబున స్వనామ గోరక్షనామంబులు శ్రవణరంధ్రంబుల సోకుచుండ నత్యంతాశ్చర్యంబుచే దిశలుగనుంగొనుచు భిన్నహృదయుండై గోరక్షుం డెందు గలఁడని చిత్తంబునతత్తరంబుచేఁగొంద

లంబంది మ్లానవదనుండై గానరసంబు గ్రోలకున్న యోగద్రుముని జూచి (మైనాకినీదేవి) "ప్రాణప్రియా! యుష్మన్ముఖకమలంబు కాంతిహీనంబగుట కారణంబేమి" యన నమ్మహానుహుండు "తిలోత్తమా! మచ్ఛిష్యుండు ప్రతాపవతుండగు గోరక్షుండు దూరీకృతవిషయానురాగుండై స్వేచ్ఛావిహారంబుచే నిప్పురవరంబున కేతెంచి నన్నీభాగ్యభోగంబుల కెడబాపి స్వదేశంబునకు గొనిపోవునను సంశయంబు గలిగె" నన నత్తరుణీమణి పూర్వోక్తమాగుతాత్మజవాక్యంబు లెద స్మరించి యదరిపడి పరితపించుచుండ గానరసంబు లవణమిశ్రిత దుగ్ధంబుపగిది విరసంబై దోఁచుచుండ నత్తఱి యత్తిలోత్తమ స్త్రీవేషధర గోరక్ష మృదంగశబ్ద పరంపర లాకర్ణించి తత్సాధనవరిష్ఠగుణదోషంబని యూహించి కళింగం బిలచి "యితరమృదంగంబు వాయించు" మని యొకమృదంగం బిప్పింప నచ్చేడియ వల్లే యని గోరక్షున కొసంగిన నమ్మృదంగం బెప్పటియట్ల శబ్దంబు లీనుచుండె నంత నియ్యది మృదంగదోషంబు గాదని వితర్కించి కైతవస్త్రీని దొలంగించి కలావంతిని యను నొకపరిచారిక నప్పగింప నందు గోరక్ష మత్స్యేంద్రనామ శబ్దంబులు వినరామి తత్క్షణంబా మృదంగశిఖామణియగు వేషధర గోరక్షుని హస్తంబు ధరియించి యేకాంతస్థలంబునకు దోడ్కొని చని "నీ నిజనామరూపంబు లెఱింగింపుము. నీగురుచరణకమలంబు లాన" యని పలుకుచున్న మైనాకినీదేవివచనంబు లాలకించి స్వరూపప్రకటంబున కిది మంచిసమయంబని "తల్లీ! నేను మత్స్యేంద్రనాథ ప్రియతనయుండ నానామంబు గోరక్షుం డనియెదరు. నీరాజమందిరంబున పురుషాగమనంబు లేదని యెఱింగి యువతీవేషంబున నేతెంచితి" నన నమ్మైనాకినీరాణి సవినయభయభక్తిచే గోరక్షుని పాదంబుల కెఱఁగి వేగంబున పురుషవస్త్రంబులర్పించి "గోరక్షా! నీవు మత్పుత్రుండవైతివి. మున్ను నీనామరూపగుణవిశేషంబులు మత్స్యేంద్రయోగిపుంగవునిచే విశ్రుతంబయి తదాది నినుగనుంగొను ప్రాప్తం బెన్న డొనఁగూడునో యని త్రికరణశుద్ధిచే నిరీక్షింపుచు మద్భాగ్యోదయంబుచే నేఁడు గనుఁగొంటిని. వత్సా! భవజ్జనకుండగు మత్స్యేంద్రనాథుండు నీయందలి ప్రేమాతిశయంబుచే నానావిధరత్నఖచితస్వర్ణభూషణంబులు శరచ్చంద్రచంద్రికల నేలు సాంద్రప్రకాశ మౌక్తికహారంబులు నపరిమితామూ

ల్యాదివ్యాంబరంబులు నీకై సిద్ధపఱచె" నని కరంబు బూని మత్స్యేం ద్రుని సపక్షంబున కరుదెంచుచుండ యోగద్రుముండు విస్మితుండై గోర క్షుని వీక్షింపుచుండ చతురవచనరచనాధురీణ యగు తిలోత్తమరాణి మునుముందుగా మత్స్యేంద్రసిద్ధునితో "భవచ్చరణాంబురుహదర్శనా పేక్షచే నుత్సుతుండగు గోరక్షుం డరుదెంచె. మననోములు ఫలించె నితండు బలదర్పశౌర్యధైర్యంబులచే మీననాథున కగ్రజుండై నిఖిల సంపత్సమృద్ధంబగు రాజ్యభారంబు వహించును. జగద్రక్షకుండగు కమలాక్షుండు మనయం దపారకరుణాకటాక్షంబుచే నిగ్గోరక్షుని సమ కూర్చె. మనవృద్ధదశ కష్టంబులు కడతేరె" నని నుడువుచుండ గోర క్షుండు దరహసితవదనుండై నిజహృదయంబున జన్మాంధునకు దర్ప ణంబేల? గతపతిసతులకు కుంకుమాది సౌభాగ్యద్రవ్యంబులేల ? క్షీరా బ్ధిశయనుండు గోదుగ్ధంబుల కాశించునే? పరుసంబుపై స్వర్ణమయశృం గారంబు లనవసరంబుగాదే? తద్వత్ మాబోటి విరక్తుల కీయస్థిరవైభ వంబులేల ? క్రమంబున నగ్గురునాథుని సాధించి పిదప తుచ్ఛసంపదల దిరస్కరించెద నని తలపోయుచుండ మత్స్యేంద్రుండు కళింగ కనేక వస్త్రభూషణద్రవ్యంబులు బహుమతులొసంగి శీఘ్రంబున సింహాస నంబు డిగ్గి ప్రియశిష్యుండగు గోరక్షుని దనహృదయంబున కదుము కొని ప్రేమపూరితమానసుండై యోగక్షేమంబులు విచారింప గోర క్షుండు గురునాథుని చరణపంకేరుహంబులకు ప్రణమిల్లి బదరికాశ్ర మంబున తపం బాచరించినవిధంబు సుమారమణుండు ప్రసన్నుండై సర్వదేవతావాహనం బొనర్చి వరంబు లిప్పించిన కథావిశేషంబు తేట పఱచియు "భవద్వియోగాకులితచిత్తుండనై జలనిర్గత ఝషంబుకై వడి దడబడుచు నానాదేశకాననంబులు ద్రిమ్మరుచు తుద కీరాజ్యంబున యుష్మచ్చరణాశ్రయుండ నైతి నికమీఁద నొంటి నివసింప లే" నన కరుణామయుండగు మత్స్యేంద్రుండు "వత్సా! నిన్ను బాల్యంబునుండి పోషించి యిపుడు నిన్నొంటి బరిత్యజింతునే? పవమానతనయుండు నన్ను మిగుల గౌరవించి రాజ్యసుఖసంపద లొసంగె. నీవులేని భోగం బులు సుఖకరంబు లగునే? భోజనశయ్యాసనసమయంబుల నిన్నుస్మరి యించని దినంబు గలదే? మచ్చిత్తంబు నీయం దెల్లప్పుడు దవిలియుండి యప్పుడప్పు డగ్గలంబగు తాపంబుచే 'మత్సుతుని బాసితిని. పరమపా

పిని' యని నిందించుకొందు. పుత్రా! నీవులేని తీర్థాటనంబు వ్యర్థంబు గాదే? నీవులేని గృహంబు శూన్యాగారంబు గాదే" యన గోరక్షుండు "నాథా! కమలంబు లనేకంబు లుండినను కమలాప్తుం డొక్కం డనుక రణి జలచరంబు లపరిమితంబైనను జలం బొక్కటైన పగిది దేశదేశం బుల నీ కనేకసుతులు గలిగినను జనకుండ వొకండ" వని యశ్రుపూరిత లోచనుండై నంత మత్స్యేంద్రయోగిశ్రేష్ఠుం డపార మోహంబుచే గోరక్షుని మూర్ధంబు చుంబించి "తనయా! నీవట్టిపుత్రులు గలరే" యని సభాస్థానంబు వదలి గోరక్షుని దోడ్కొని పాకభవనంబున కేగి యేకపాత్రంబున షడ్రసోపేతభోజనంబు సలిపిరి. ఈవిధంబున ప్రతి దినంబు భోజనశయ్యాసనాదుల నెడబాయక జరుపుచు సభామంటపం బున నిరుపార్శ్వంబుల గోరక్ష మీననాథుల నిడుకొని సింహాసనాసీ నుండై పార్శ్వద్వయంబున శోభిల్లెడు లంబోదర షడానన సహిత శంకరునిభంగి యుభయాంకస్థితరామకృష్ణసమేతుండగు వసుదేవుపగిది భాసమానుం డగుచు రాజ్యపరిపాలనంబు జేయుచుండెను.

ఇతి భక్తిసార నవనాథచరిత్రంబున గోరక్ష మత్స్యేంద్ర సందర్శనకథాసహిత వింశత్యధ్యాయము సంపూర్ణము.

---

## ఏకవింశత్యధ్యాయము.

---

గోరక్షుండు మత్స్యేంద్రనాథుని వెంటఁగొని చనుట.

ఇవ్విధంబున గోరక్ష మత్స్యేంద్రు లేకాసనంబున ప్రభాసిల్లు చుండ సత్త్రిలోత్తమ యసదృశకుశలమతియై గోరక్షున కపారమోహా వహస్నానంబు లొనర్చుచు భక్ష్యభోజ్యలేహ్యచోష్యాదిపదార్థంబులు ప్రేమాన్వితహృదయయై స్వకరకమలంబులచే నిడుచు వినూత్నదివ్యాం బరభూషణప్రముఖాఖిల వస్తుజాలంబులచే లాలింపుచుండ వైరాగ్య ఘనుండగు గోరక్షుం డివి యన్నియు నిరవధికసుఖకరజ్ఞానతరుమూల చ్ఛేదనకుఠారంబులు గావే దుర్గ్వరిపీడితశరీరునకు షడ్రసభోజనంబులు విషతుల్యంబు లననగవే యని మనంబున వితర్కించి యేకాంతంబున త్రిలోకనుత మత్స్యేంద్రునితో "గురుసత్తమా! మన మీదేశంబున

 

నివసించుట నిర్దోషనాథపంథంబునకు నైల్యంబు వాటిల్లు. పిత్తలంబు
నకు రతనంబులు దాపినట్లు రమాదేవి శ్మశానంబున వసించినవిధంబు
మేషగ్రీవంబున చింతామణి దాల్చినచందంబున నభ్రంకషకీర్తి
ధ్వజసమన్విత భవాదృశు లీ స్త్రీరాజ్యం బాశ్రయించి సురాసురవం
దిత చరణారవిందులై నింబాస్యసుందరీనికురుంబసంసేవితు లగుట
మహాచిత్రంబు గాదే? నాథా! మనమీ జగదుద్ధారనిమిత్తంబై యవత
రించి లీలామానుషవేషంబుల తపంబు సల్పి తాపత్రయాగ్నిపరితప్తచే
తస్కులగు నజ్ఞానాంధుల బంధంబులు నిముక్తి జేయుట మాని నీచక
ర్మాచరణం బొనర్చుట కెంతవిచారకరంబు? మన మిప్పగిది మెలంగుచు
నితరులకు జ్ఞానమార్గం బుపదేశించుట నృపుండు తస్కరుండై పరుల
శిక్షించినకైవడి గాదే? ఘనమండలాచ్ఛాదిత గ్రహారాట్కాంతిపుంజం
బు తిమిరంబు బాపునే? భవదాచరిత దుష్కర్మంబులు వీక్షించి చప
లమతులగు మానవు లెంతయేని దురాచారంబుల బ్రవర్తింతురు. యు
ష్మదవతారకార్యకారణంబులకు భంగంబు వాటిల్లు గావున ప్రథ
మంబున విషయసుఖానుకూలసంసారం బాశ్రయించి క్రమక్రమంబున
సంగంబు దొలంగి వైరాగ్యోదకంబున స్నానంబులాడి నిర్మలత్వం
బున విషయరహితబుద్ధులై ప్రకాశింపవలయు ననియు రజోగుణ
క్షితి నిక్షిప్తకామబీజోద్భవవృక్షం బభివృద్ధిబొంది కామక్రోధలో
భ శాఖాత్రయంబుచే విశాలంబై మత్సరగంధసహిత మదకుసుమం
బులు గలిగి మోహరసపూరిత విషయఫలంబులు మనోహరంబులై
విలసిల్లి తత్ఫలానుభవంబుచే బ్రహ్మానందాధిరాజ్యపదభ్రష్టుండై య
మలోకదుఃఖవారాశిని మునుంగుట తథ్యంబు. హరగళగరళంబైన
సహింపవచ్చు సుఖదుఃఖాస్పదంబగు విషయతాపంబు భరింపవచ్చునే!
తచ్ఛాంతికై జ్ఞానౌషధంబు సేవింపవలయు నని మీ రెఱుంగించినవిష
యంబేకదా. యోగిముఖ్యా! తుచ్ఛసంపదల బరిత్యజించి సావధానచి
త్తులై యోగమార్గం బాశ్రయింపు" మని యుక్తియుక్తవాక్యంబు
లచే విన్నవింప మత్స్యేంద్రనాథుం డానందమయ స్వాంతంబున దూరీ
కృతమోహుండై "గోరక్షా! నీవాక్యంబు లమృతతుల్యంబులై మచ్చి
త్తంబున కాప్యాయనం బొనర్చె నిక మన స్వదేశంబున కేగవలయు"
నని దృఢంబుగ బలికి సంతుష్టపఱచి వేగంబున గోరక్షసహితుండై

పాకశాల కరుదెంచి భోజనంబు సలిపి ప్రత్యేకస్థలంబున శయనించిరి. అంత నమ్మైనాకినీరాణి మత్స్యేంద్రుని శయ్యాగృహంబు జేరి సుఖగోష్ఠి జరుపుచుండ నతం డద్దేవితో "నన్ను గోరక్షుండు స్వదేశంబునకు గొని పోవు నే నందు కంగీకరించితి గాని మచ్చిత్తంబు భవదధీనంబై దొలం గనేర దిందు కెయ్యది యుపాయంబో" యన నక్కాంతామణి "నాథా! మీ రరుగకున్న నతం డెట్లు దోడ్కొని జను" నన మత్స్యేంద్రయోగి శ్రేష్ఠుండు "ప్రియే! గోరక్షుండు విరక్తి మార్గప్రదర్శక వచనంబులచే వైరాగ్యంబు గల్పింప తత్కారణంబున కుతుకంబుచే జనుదెంచెద నని వాక్యం బొసంగితి నిక నేనేమిజేయుదు? నీవా ప్రభాకరపుత్రుని యుల్లం బత్యంతలాలనంబుచే నపహరించితేని కార్యసాధనంబా" నన నచ్చేడియ "వసుపుత్రా! గోరక్షుని యసిధారావైరాగ్యంబు నిరుపమాన నిశ్చలబుద్ధిదార్ఢ్యంబు మత్పరికల్పిత వివిధోపాయంబులకు చలింపదు. కానిమ్ము యోచించెద" నని యన్యోన్యసంభాషణంబులచే నారేయి గడపి సదుపాయం బూహించుచుండు సమయంబున గోరక్షునాథుం డేతెంచి "తల్లీ! నేను తీర్థాటనంబు జేయందలంచితిని. మద్గురువర్యుం డగు మత్స్యేంద్రయోగిపుంగవుని దోడ్కొని యేగెదను. శల వొసం గవే" యని వేడ నక్కుటిలాలక "పుత్రా! గోరక్షా! నిన్ను జ్యేష్ఠ పుత్రుండని మనంబున నిశ్చయించితి. నేతద్రాజ్యభారంబు వహించి బాలుండగుమీననాథునిగాపాడుచు నిర్వక్రవిక్రమంబున తేజోమయుం డవై మా కన్నవస్త్రంబు లిడుచు బోషించెడి సమర్థుండవు. వత్సా! యుష్మజ్జనకునకు వృద్ధాప్యంబు ఘటించె. తద్వశ్మత్కాయం బనుదినంబు వికలంబు నొందు. మావృద్ధుల గాపాడెడుఘనుండ వీవు దక్క నొరు లెవరుగలరు? మాకోర్కు లెవరిచే నీడేరును? మాగతి మోక్షంబు లెవరు విచారించెదరు? చిఱుతప్రాయము గల మీననాథుం డెవనిచే నభివృద్ధిజెందు నీయట్టిసుకుమారుండు గలిగి మాతాపితృలకు దుఃఖంబు వాటిల్లజేయుదురే? మమ్మెడబాయ దలంచితేని మ మ్మొకకూపంబున బడద్రైచి వెడలు" మని మోహారసం బుప్పతిల్ల దీనవదనంబుచే బలుక గోరక్షుండు వర్షధారలకు చలింపని పర్వతంబుకై వడి ధీరచిత్తుండై "జననీ! చతుస్సముద్రముద్రితం బగు భూవలయంబన నేల? ముల్లోకంబుల కేకమీ డై దేజరిల్లెడు వాని

కీ స్త్రీరాజ్యసుఖసంపదలు గణుతియె? నీభాగ్యంబుల కాశింపను. త్వరిత గతి తీర్థంబుల కేగవలయును. నీవు నీ నిజస్థానంబున సౌఖ్యంబుగ నుండుము. మేమిా తుచ్ఛసుఖంబుల కపేక్షింపము. మాధనంబులు యోగంబులు గాక నస్థిరరాజ్యభోగంబు లగునే? తడవేల? జనవలయు శలవొసంగు" మన నత్తిలోత్తమరాణి తనడెందంబున నీ గోరక్షుం డింద్రియదమనదక్షుం డితనిహృదయంబు మాయోపాయంబుల గరంగించి దారాపరిగ్రహం బొనర్చినగాని సాధ్యుండుగాడని దలంచి "గోరక్షా! నీవు తీర్థయాత్రానిమిత్తంబై జనియెదనంటివి. నీ వేతెంచి షణ్మాసంబులయ్యెఁ గావున వత్సరాంతంబువఱకిచ్చో నివసించి తదుపరి నిజగురుసమేతుండవై స్వేచ్ఛావిహారంబున జనవలయు నే నాటంకపఱచను. నావచనంబు నిజంబని నమ్ము" మని యనేకవిధంబుల సమాధానపఱచ నతం డందుకొడంబడి "షణ్మాసాంతంబున మద్గురునాథుని దోడ్కొని చనియెద" నని స్థిరచిత్తుండై నివసించియుండెను. ఒకానొకదివసంబున మైనాకినీ దేవి గోరక్షుని దననికటంబున గూర్చుండ నియమించి యంతఃకరణచే ముఖకమలంబు నివురుచు "వత్సా! ఉత్తమోత్తమంబగు గృహస్థాశ్రమధర్మం బాశ్రయింపుము. నీవివాహంబుచే నాకు స్నుషాలాభంబు గలుగు నమ్ముద్దియ నాయొద్దనుంచి నీయథేచ్ఛం జని పుణ్యతీర్థంబులు సేవించి పునరాగమనుండవై దారాసహితంబుగ మద్భవనంబున వసించి పట్టాభిషిక్తుండవై రాజ్యపరిపాలనం బొనర్చి నాయపేక్ష పరిపూర్తి జేసెద వని దలంచితిని. శలవొసంగెదేని లగ్నసమారంభంబు ప్రారంభించెద" నన దినకరపుత్రుండు "జననీ! గురుకరుణాకటాక్షంబుచే నే మున్ను యోగనామ్నీయువతిని వరియించి నిత్యభోగుండనై దృప్తిబొందుచు కాముకుండనై యన్యకాంతల నపేక్షించుట జారపురుషలక్షణంబుగాదే? గురుభక్తిపరాయణత్వంబునకు లోపంబు వాటిల్లదే" యని ప్రత్యుత్తరం బొసంగ నప్పద్మినీమణి గోరక్షుని నిర్మోహనిశ్చలత్వంబునకు విస్మయంబుచే స్తబ్ధించియుండి యొకనాఁ డితరగ్రామవాసిని యగు నొకయన్నులమిన్నను బిలచి "గోరక్షుని కుసుమశరువిశిఖంబుల పాలొనర్చి మోహపరవశు జేయు" మని యాజ్ఞాపింప నమ్మృగాక్షి మందగమనంబున గోరక్షుని శయనాలయంబు జేరంజని కడుదరహాసంబుచే పయ్యెద సవరించుచు

కడకంటిప్రసారంబుల రతిసంభ్రమంబు దెల్పుచు "నాథా! వినోదం బుచే నాటలాడం దలంచి యొకబిందుతంత్రంబు గొనితెచ్చితి. నాయ భీష్టంబు దీర్పవే" యన నతం డవశ్యంబని యాడుచుండ నక్కుటిల మతి యగు చపలాక్షి యిక్షుచాపుని తూపు లనజాలిన చూపు లా నిర్ధూతపాపునిపైఁ బఱపుచు జాణయై తనంతట తా నోటుబడి మోహా పూరిత వాక్సుధారసధారలచే సరసుండవు చతురుండవు శూరుండ వని పొగడుచు విరహభారపరవశంబున శాటీముక్తోత్తుంగకుచయై నిట్టూర్పు లిడుచుచు వలపుగులుకు సిగ్గుచే దనజఘనంబు గాన్పించె నను నెపంబున వలువ సవరించుకొనుచు భావభవవిశిఖతాపోద్రేక మోహావహ హావ భావాన్వితయై నిజభావంబు వెల్లడిపఱచి వైరాగ్యకులిశనిర్భిన్న మోహ భూధరుండై రాహుముక్తప్రభాకరనిభంగి బ్రకాశించుచున్న గోర క్షుని గనుంగొని లజ్జాయమాన వదనంబుచే శీఘ్రంబునం జని మైనా కినీదేవికి దెలుప నద్దేవి గోరక్షునకు దనసదనంబునగల వజ్ర వైడూర్య గోమేధిక పుష్యరాగ మరకత మాణిక్యాది ద్రవ్యాగారంబులు గను బఱచి "పుత్రా! యీయనూనధనాగారంబు లన్నియు నీయధీనంబులై యుండు నిందుచే నాచంద్రార్కమహాసుఖం బనుభవింప నగు" నని పలుక నగ్గోరక్షుండు చలింపకున్న నతని నిస్పృహత్వంబునకు తపించి బాలుండగు మీననాథుని జేరందీసి తోయపూరితనయనయై రోదనంబు జేయుచుండు మైనాకినిం జూచి చెలికత్తియ లనేకవిధంబుల తాపోపశ మనంబు చేయుచు "మాచతురత్వంబుచే నిగ్గోరక్షుని నోడంబఱతు" మనుచు దివసంబులు గడుపుచుండ క్రమక్రమంబుచే షణ్మాసపూర్తియై వత్సరాంత ప్రతిపదుదయకాలసమయంబున నేఁడు మత్స్యేంద్రయోగి వర్యుం డేగునని గ్రామగ్రామారామ లా మహామహుని సుగుణసమాజం బు దలంచి దైవమా యని మొఱలిడుచు నాథుని శౌర్యస్థైర్యధై ర్యంబు లుగ్గడించి యొకమదిరాక్షి నాథుండు దనయపూర్వగుణవి తానంబుచే నేతద్రాజ్యంబు పరిపాలింపుచు మమ్మాదరించె ననుచు నొక చక్రస్తని విషమశరుసము వసుపుత్రు నికుశలత్వదయాపరత్వంబులు బొగ డుచు నిమ్మహాఘనుని వియోగంబున నినుండు లేని నభంబుపగిది మన రాజ్యంబు శోభిల్ల దనుచు మఱియొకకంబుకంఠి మనభాగ్యవశంబుచే

లభించిన మత్స్యేంద్రుని గోరక్షగ్రహంబు గ్రసించె ననుచు నొకయ బ్జాక్షి గోరక్షుండు ప్రత్యక్షయముండై మనప్రాణంబులు హరింపదలంచె ననుచు భిక్షాన్నంబుచే దృప్తిని బొందు కక్షపాలధరులగు బికాసులకీ భక్ష్యభోజ్యంబు లెట్లు సహించు? దైవహతబుద్ధులగు దరిద్రులకు ధనధాన్యంబు లిముడునే? కాననంబున దిరుగు ద్రిమ్మరులకు కనకమయసౌధంబుల దనివిదీఱునే యని బహువిధంబుల గోరక్షునిదూఱుచు నాథా! మత్స్యేంద్రయోగిసమర్థా! యని విలపించుచు శృంగమురుడీనగరంబు జేరం జనుచుండ నిట గోరక్షుండు సింగీ శైలీ కంథాది యోగి చిహ్నపరికరంబులుబూని మత్స్యేంద్రుని పాదంబులకు బ్రణమిల్లి పురోభాగంబున నిల్చి "గురునాథా! కాలాతిక్రమణంబు జేయక శీఘ్రంబున జననలయు తడవేల" ననుచుండ తిలోత్తమరాణి బాష్పపూరితలోచనయై "వత్సా! భోజనం బాచరించి జను" మని వేగంబున మధురసభోజ్యంబులు సిద్ధపఱచి గురుశిష్యులకు భోజనం బిడుచు గద్గదకంఠంబుచే "నాథా! భవత్సుతుండగు మీననాథుం డిచ్చో నెట్లు నివసించు? మీరు లేకున్న మారుతాత్మజుని భుభుః కారనినదంబుచే నెట్లు జీవించు? యుష్మజ్జనకుండగు యుపరిచరవసుశాపవశంబుచే సింహళద్వీపంబు బాసి యీరాజ్యంబు జేరి తచ్ఛాపవిముక్తికై భవదంఘ్రియుగళంబాశ్రయించి మీననాథసుతుని బడసి శాపంబుచేకడతేరితి నిక నుపరిచరవసు వేతెంచి నిజవిమానంబున నను గొనిపోవును. మీననాథుండు మర్త్యలోకజన్ముండు గాన సశరీరంబుచే దేవలోకంబున కరుదెంచుట కనర్హుండు. పరిత్యజించితేని యిట రక్షించువారలెవరు? గావున నీతనయుని దోడ్కొని చనుట ముఖ్యకారణం" బని విన్నవింప నాథుం డవశ్యంబని భోజనంబు సల్పి ప్రయాణోన్ముఖుండై నిల్చున్నసమయంబున మైనాకినీదేవి మీననాథుని సిద్ధపఱచి పతిసుతవియోగదుఃఖభారం బోర్వలేక నేత్రాంబుధారల నవయనంబులుదడుపుచు మహారవంబుచేరోదనంబు జేయుచుండ నదిచూచి యువతీసమూహం బొక్కుమ్మొగి దిక్కులు పిక్కటిల్ల నాక్రందించుచు గోరక్షనాథుని సమీపంబు జేరి "గోరక్షా! నీకీ కఠినతరగుణం బేలగలిగె? మాప్రాణంబు లపహరించుట కిం దేతెంచితివో? రాజ్యసుఖంబుల దిరస్కరించి విపినంబులే మేలని దలంచితివో? చారుతరచంద్రకాంతమణికుడ్యసౌధనిలయంబులు సుమాళంబులు గావో? నానావిధ

సుగంధప్రసూనసమన్వితతరులతావితానపరిశోభితప్రమదావనవిహారం బులానందకరంబులుగావో? రథగజతురగభటపృతనాపరిసేవిత సింహాస నాధిపత్యంబ మోఘంబుగాదో? విచిత్రతరమణిచిత్రితదివ్యభూషణాంబ రభూషితులై ప్రభాసిల్లుచు ననల్పంబగుహంసతూలికాతల్పంబుల ఝుష ధ్వజసాయకేక్షణకుచధరపరిరంభమాణవక్షస్థలులై సురతసుఖాంబుధి నోలలాడుటపూర్వపుణ్యవిశేషంబు గాదో? మిత్రసంకనా:మృడ్రసోపేత భోజనంబులుబరిత్యజించి కాననాంతరకందమూలఫలంబులకాశించుట వేదుఱో! లేక గ్రహచారబలంబో? మణిమయసింహాసనాసీనుండవై సహస్రాక్షునిబోలిభోగంబు లనుభవించక క్రూరమృగంబులవిధంబు నర ణ్యంబుల గ్రుమ్మరుట నీజన్మగుణంబో?గాక కాలగతియో? శత్రుభయ రహిత శైలదేశాధినాయకుండవై మమ్మేలవే" యనుచుండ కువల యాక్షులవాక్యంబు లాకర్ణించి మోహపాశరహితుండగు గోరక్షుం డు "మీతాంత్రికప్రసంగంబు లేనెఱుంగుదు. మావైభవంబులు మీ రెఱుంగుదురే? భూమ్యాకాశంబులు శయనాసనపరిధానంబులై నిశ్చల యోగమార్గంబున జరించెడువారు తుచ్ఛసంపదల కాశింతురే? చాలు మీదుర్బోధ"లని బెడిదంబులచే ధిఃకరించుచు గమనోన్ముఖుండై పద చలనంబు జేయుచుండ నప్పుడ్మినీరాణి బాలుండగు మీననాథుని దన భుజంబులపై నెక్కించుకొని పురబాహ్యంబునకు మత్స్యేంద్రయో గివర్యుని వెంటనంటి జనుచు గోరక్షుం డెఱుంగకుండ నతిగోప్యంబుచే మత్స్యేంద్రనాథుని కక్షపాలంబున హాటకేష్టికంబులుంచి నాథుని పద కనులంబులపై కీలూడిన బొమ్మపగిది వ్రాలి మోహభరవశత్వంబుచే రోదనంబుజేయుచు గోరక్షుని కౌగిటంజేర్చి "వత్సా! మత్ప్రాణనాయ కుండగు మత్స్యేంద్రుండు వృద్ధుండు భవననుజన్ముండగు మీననాథుం డు కేవలబాలుండు వీరిరువుర నెప్పగిది భోజనశయనాదుల దృప్తి పఱచె దవో నీవు ప్రాజ్ఞుండవు. సచ్ఛిష్యుండవు. నీకెఱుంగింపవలసిన ధర్మంబు లే నెఱుంగుదునే? వీరిప్రకృతిగుణంబు లతిసూక్ష్మంబులుగాన దెలియఁ బలికితి" ననుచు హాహాకారంబుచే సుగుణజలధుండగు నాథుని ముఖ కమలంబు దిలకించుచు మీపునర్దర్శనం బెన్నఁడో యని నేత్రాంబువులు రాల్పుచు నేడ్చుచున్నంత గోరక్షుండు దనమనంబున కాలవ్యాపనం బుచే మత్స్యేంద్రుండు మోహాతిశయపాశబద్ధుం డౌనని వితర్కించి

గురుకరవనజంబుగొని వేగంబున నేగుచు క్షణమాత్రంబున నదృశ్యులై గోచరంబు గాకున్న పద్మినీమణియగు మైనాకినీరాణి దనహస్తంబులచే వక్షస్థలంబు మొత్తుచు వత్సంబు బాసిన మొదవుచందంబున మహాధ్వని జేయుచు "హా సర్వలక్షణ లక్షణుండగు మత్స్యేంద్రుం డెట్లగుపడు నుదారగుణసంపన్నుండగు నాథుండు శచీకాంతునికై వడి విరాజమానుండై నన్నేలి యపగతమోహుండై చనుట యాశ్చర్యంబు గాదె? చెలియలారా! దయాసముద్రుండగు నాథుండు దరిద్రునిచేతి ద్రవ్యంబుకరణి బాయుట మందభాగ్యంబుగాదె ? జలధిజీవనంబులు మేఘుండు హరించినభంగి తస్కరునిచే నపహరింపఁబడిన యంధునిచేతి దండంబుమాదిరి మత్స్యేంద్రుండు గోరక్షునిచే గొనిపోవఁబడెనే? కనకాసనంబున నివసించెడు నాథుండు లేమిం జేసి నాభవనంబు శోభించునే? రామలారా! నాకీ నగరంబు మూర్తిరహిత జీర్ణాలయంబునగిది భాసమానంబగు నే నీ దుఃఖం బెట్లుసహింతు? నాథుని ప్రేమపూరిత గుణంబు లెంతని బొగడుదు? నతని శాంతశమదమాదిచరిత్రంబులు ఘటాంతంబుననైన మఱువ వశంబగునే ? నన్నను దినంబు సంపూర్ణ మోహంబుచే నెంతయేని లాలింపుచుండునే" యని మహింబడి మృత్తికనుగొని మస్తకంబున వైచుకొనుచుండు నసమయంబున నుపరిచరవసుపుంగవుండు విమానంబు గొని నికటంబు జేర నత్తిలోత్తమ వసునాయకుని పదసరోజంబులకు నమస్కరించి నిల్చున్నతఱి వసుముఖ్యుండు "మైనాకినీ! నీ కిదేటితాపంబు? నీవు సురలోకవాసినినై మర్త్యులకై విలపించఁదగునే" యనుచు కేలూని నిజవిమానంబుపై నెక్కించుకొని యశ్రుపూరితలోచనంబులు దుడుచుచు రాజభవనంబున కరుదెంచి యనేకవిధంబుల సమాధానంబు జేయుచుండెను.

ఇతి భక్తిసార నవనాథచరిత్రంబున మైనాకినీవియోగ గోరక్ష మత్స్యేంద్ర చరిత్రం బేకవింశత్యధ్యాయము సంపూర్ణము.

---

# ద్వావింశత్యధ్యాయము.

---

## మైనాకినీరాణి సింహళద్వీపంబు ప్రవేశించుట.

వసుపుంగవుండు మైనాకినీసహితంబుగ విమానారూఢుండై తద్దేవీమందిరంబు జేరంజని మత్స్యేంద్రనాథవియోగాకులితచిత్తయై పరిపరివిధంబుల విలపించుచున్న నప్పద్మిణీమణిని సమాధానపఱచుచు "పరిదృశ్యమాన మాయాప్రపంచంబు నిత్యంబని దలంచితివే? నీ నిజ నివాసస్థలం బెయ్యది? నీ వెచ్చో జన్మించి యిందు కేకతంబున జనుదెంచితివి? సురలోకవాసినివగు నీవెక్కడ? తపోఘనుండగు మత్స్యేంద్రుం డెక్కడ? మీసంబంధవియోగంబులకు కారణం బేమి? సుఖదుఃఖాశ్రయ లాభాలాభ జయాజయంబులు ప్రారబ్ధవశంబున లభించు నయ్యవి స్థిరంబులయ్యె నేని ద్వంద్వస్వరూపంబు లెట్లగును? నిర్ద్వంద్వంబయ్యె నేని నీపూర్వపదభ్రష్టత్వం బేలగలిగె? గలిగిన నీరాజ్యం బెట్లు లభించె? లభించిన మత్స్యేంద్రునిసంయోగం బేవిధి ఘటించె? నెంచి చూడ నివి యన్నియు పరమేశ్వరప్రేరితంబు లని దలంపక వృథా శోకంబుచే తాపంబు నొందుట ఫలం బేమి? మత్స్యేంద్రుం డీ విచారంబుచే దనమేలుకై సుఖకరంబగు సింహాసనాధిపత్యంబు విసర్జించి విపినంబుల కేగఁదలంచెగాక నితరంబుగల దే? తద్వ న్నీలాభం బీవెఱుంగవే నిది మొదలు ద్వాదశవత్సరంబున సింహళద్వీపంబున వేయి కన్నులవేల్పు జన్నంబొనర్చు నాహవనంబుకై హరివిరించి శంకరులు శశిదివాకరప్రభృతి వియచ్చరు లేతెంతురు. తత్సమయంబున మేఘవాహనుని యాహ్వానంబుచే గహినీ గోపీచందభర్తరీ కానీప జాలంధర చర్పట రేవణ గోరక్ష మత్స్యేంద్రనాథులు యజ్ఞసమారంభ సందర్శన కుతూహలంబుచే నచ్చోటి కరుదెంచెదరు. నీ వప్పాకశాసనుని సభాస్థలంబున నీ ప్రియుండగు మత్స్యేంద్రయోగద్రుముని గనుంగొనియెద వంతకుమున్నె నీపుత్రుండగు మీననాథుండు నిను జేరు గావున జింతింపనేల? రయంబున విమానారూఢులమై నిజస్థానంబున కేగవలయు నిదియ శాపమోచనకాలంబు శోకింపవల" దని మోదాద్భుచున్న శ్వశురునితో తిలోత్తమాదేవి "వసుచంద్రమా! శచీకాం

తుండు పావనంబు జేయునో నాథు లచ్చోటి కేతెంచెదరో నాకీ సంశయాస్పదవాక్యంబు లేల? ద్వాదశవర్షంబులకు మత్పతిని జూపెద నని వచనం బొసంగు" మన నతం డందు కంగీకరించి యవశ్యం బను చుండ మైనాకినీదేవి వసువరుని యనుజ్ఞచే ధైర్యాభమా యను నొక సుందరీలలామంబునకు రాజ్యపట్టాభిషేకం బొనర్చి యనేకధర్మంబులు బోధించి తన వియోగంబునకు పరితపించుచున్న పల్లవాధరల శాంతి బఱచి యాపిదప స్నుషాశ్వశురులు విమానారూఢులై సింహళద్వీపంబు జేరంజన వసుముఖ్యుం డప్పుద్మినీమణిని స్వస్థానంబున నిల్పి దననిజ నివాసస్థలంబున కేగెను.

గోరక్షనాథుండు మీననాథునిప్రాణంబు లపహరించి పునరుత్థితుం జేయుట.

ఇట గోరక్షుండు యోగిపుంగవుండగు మత్స్యేంద్రనాథుని దోడ్కొని మీననాథుండు బాలుండని తలంచి భుజాగ్రంబులపై నెత్తుకొని శైల్యదేశారణ్యంబు లధిగమించి గౌడబంగాళదేశంబు సంచరించుచు సమయానుకూలంబుగ ప్రతిగ్రామంబున భిక్షాన్నంబుచే వారిరువురను దృప్తిపఱచుచు కైలబంగాళదేశంబు ప్రవేశించి యేగుచు మున్ను కానీపుం డగుపడిన చూతవనంబు గని గోరక్షుండు దనడెందంబున నీవనప్రదేశం బత్యంతపుణ్యమయస్థానంబు. గోవుకై వత్సంబు విలపించువిధంబున మద్గురుమూర్తి దర్శనంబుకై నే నపరిమితతాపంబుచే శోధించుచు దిరుగుచుండ నిట కానీపనాథునిచే నెఱుంగఁబడి శైల్యదేశంబున గనుంగొననైతి నీస్థలంబే నాకోర్కు లీడేర్చె నని తలపోయుచు వారిపూరితలోచనుండై మీననాథుని భూమికిం దించి తత్ప్రదేశంబునకు నమస్కరించుచుండ నది గని మత్స్యేంద్రుండు "వత్సా! గోరక్షా! నీనయనంబుల నీరుగ్రమ్ముట కారణంబేమి? యట్టి విపరీతకరకార్యం బెయ్యదియో చయ్యన నెఱిఁగింపు" మన గోరక్షుండు గురువుకై తా ననుభవించిన సంకటంబులు స్మృతిదలంచి బాష్పంబులు రాల్చుచు గద్గదకంఠుండై కొంతసడికి శాంతింబొంది తొల్లి బదరికాశ్రమంబున తపంబు ప్రారంభించినది మొదలు శృంగమురుడీనగరప్రవేశంబువఱ కనుభవించిన యిడుములన్నియు సవిస్తరంబుగ నుడువుచు "గురుసమర్థా! నాకీ పుణ్యవనంబున జ్ఞానఘనుండగు

కానీపనాథునిచే నెఱుంగఁబడి యుష్మద్దర్శనంబు లభించె. మత్కామి తార్థ ఫలప్రదాయకంబగు వనంబు సురభూజవనంబు గాదే! భవద్వి యోగదుఃఖపాశంబుల విముక్తపఱచిన పుణ్యస్థలం" బని పులకాంకిత శరీరుండగు గోరక్షుని గురుభక్తి దృఢత్వంబునకు సంతసిల్లి హృద యంబున కదుముకొని నేత్రోదకంబులు నిజహస్తంబులచే దుడిచి సమాధానపఱచి ప్రయాణంబుసల్పుచుండ గోరక్షుండు మార్గమధ్యం బున జాలంధరనాథ గోపీచందచరిత్రంబు దెలుపుచు "గురునాథా! యుష్మద్గురుసమర్థుండగు దత్తాత్రేయప్రియశిష్యుండై తపోయోగంబు చే నిష్కళంకంబున విరాజమానుండగు జాలంధరనాథుని హేలాపట్ట ణాధిపతియగు గోపీచందుండు క్రూరమతిచే నొకమహాకూపంబున బడ వైచి యశ్వవిష్ఠంబుచే గప్పె"నని సవిస్తరంబుగ దేటపఱచ మత్స్యేంద్ర నాథుండు క్షోభించి "యాభ్రష్టాత్ముండగు నృపుని తక్షణంబున శిక్షిం చెదను. తత్పురంబు భస్మంబొనర్చెద" ననుచు మహాక్రోధంబుచే శీఘ్ర గమనంబున హేలాపట్టణసమీపంబు జేరంజని యొకతెరవరితో నీవృ త్తాంతంబు విచారించిన నతండు "జాలంధరుండు కూపంబున బడియుం డుట నిక్కంబు. పిదప కానీపనాథునిచే విముక్తుండై బుడమీశున కను గ్రహం బొసఁగ భూనాయకుం డమరుండై గురుమంత్రదీక్షాతత్పరత్వం బున తపంబుకై బదరికాశ్రమంబునకు వెడలె ననంతరంబున తపోఘ నుండగు జాలంధరుండు గోపీచందతనూభవుండగు ముక్తచందునకు రాజ్యపట్టాభిషేకం బొనర్చి యచ్చో షణ్మాసంబులు గడపి పనివినియె" నని గతచరిత్రంబెల్ల వెల్లడిజేసినంత ఘనవృష్టిచే ననలంబు జల్లారినట్లు తాపత్రయపీడితుండు గురుమంత్రౌషధంబుచే ముక్తుండైన చందంబున మత్స్యేంద్రుండు శాంతింబొంది "రాజ్యభారంబు బాలుండగు ముక్తచం దుం డెవ్విధంబున భరించు. విచక్షణమతులై పరిపాలించు ప్రాజ్ఞులెవ" రని యడుగనతండు "అయ్యా! సుధీమణియగుమైనావతీమహారాణియో గద్రుముండగు జాలంధరనాథునిచే దనతనయున కమరత్వం బిప్పించి పరిపూర్ణజ్ఞానోదయంబుచే ముక్తచందుని పురస్సరంబుగ ప్రజాసంరక్ష ణం బొనర్చుచుండు" నని విన్నవింప మత్స్యేంద్ర యోగిపుంగవుం డనచిత్తంబున నయ్యుత్తమగుణ సమన్వితయగు మైనావతీరాణినిజూడఁ దలంచి నగరద్వారనికటంబుజేరి ద్వారపాలకులతో "జాలంధరనాథ

సహోదరుండగు మత్స్యేంద్రనాథుం డేతెంచె నని మహారాణికి
దెలియబలుకు” మన వార్త లతివేగంబున జని యమ్మహారాణితో
“తల్లీ! పురద్వారసమీపంబున నొకమహాపురుషుండు నిరుపమాన తేజః
పుంజుండై జ్ఞానవైరాగ్యనిపుణుండగు సచ్ఛిష్యుని వెంటగొని తోగ
మగని జిగిముగుడించు నగుమొగముగల జిఱుతని సమేతుండై జాలం
ధరనాథానుజన్ముండ నని యేతెంచె నత్తపోధూర్జటి శైలీ సింగీ కం
థాది నాథ పంథీ చిహ్నంబులు ధరియించి లీలావినోదంబుచే మెలంగు
వేల్పుదొర యనందగి దనరాక మీకెఱింగింపు మన నరుదెంచితి”
మని పలుక నద్దేవి కుతుకంబుచే మంత్రిపురోహిత సహితయై యమ్మ
హామహుల నెదుర్కొనదలంచి నగరద్వారంబు జేరంజని మత్స్యేంద్ర
గోరక్షుల చరణసరోజంబులకు వందనం బాచరించి మహావైభవంబుచే
నాందోళికత్రయంబున మూర్తిత్రయంబు నలంకరించి నిజభవనంబు
నకు గొనితెచ్చి రత్నమయసింహాసనంబులపై శోభిల్లంజేసి మత్స్యేంద్ర
యోగిశ్రేష్ఠుని పురోభాగంబున కరంబులు మోడ్చి “యుష్మదాగమ
నంబుచే మద్భవనంబు పవిత్రంబయ్యె. తృషాతురునకు నిర్మలమందాకి
నీజలంబులు లభించినట్లు దరిద్రునిపై ధనదుండు కరుణించినవిధంబు
చింతాసమేతునకు చింతామణి ప్రాప్తంబైనచందంబు మృత్యుభయ
పీడితునకు పీయూషంబు ఘటించినపగిది న న్నుద్ధరించుటకై దయచే
సితిరే తమజగత్ప్రకాశనామరూపంబు లనుగ్రహింపుడు” రని కొని
యాడుచుండ నత్తాపసోత్తముండు “తల్లీ! నే నుపరిచరవసుకుమారుం
డనై త్రిలోకజనవందితుండగు నాత్రేయుని పదకంజంబు లాశ్ర
యింప నమ్మహాఘనుండు సదయహృదయుండై మచ్ఛిరంబున దనవరద
కరంబుంచి మంత్రమంత్రార్థ రహస్యోపదేశంబుచే నన్నుబ్రకాశింపఁజేసి
యాపిదప జాలంధరనాథున కనుగ్రహం బొసఁగె. తత్కారణంబున జాలం
ధరనాథుండు మద్గురుబంధుండై తపఃప్రభావంబుచే దేజరిల్లి నానాదే
శంబులు గ్రుమ్మరుచు నిం దేతెంచియుండ భవత్సుతునిచే తురంగవిష్ఠం
బున గప్పంబడె నని యాలకించి యాఘోరకృత్యంబునకు భూరమణుని
శాసించుటకై క్రోధానలసమన్విత హృదయంబుచే నిం దేతెంచుచు
నేతత్పట్టణవాసునిచే మార్గమధ్యంబున జాలంధరుండు ప్రసన్నుండై
గోపీచందున కనుగ్రహం బొసంగిన దెఱింగి యపగతకోపుండనైతి

నోమైనావతీ! నీకతంబున భవత్పుత్త్రుం డమరత్వంబు నొందె. నీవు ధన్యాత్ముగాలవైతివి. నీజ్ఞానపరిపూర్ణత్వంబు బొగడఁదరంబే? భగీరథుండు గంగాప్రవాహంబుచే వంశపావనం బొనర్చినకైవడి వినతాదాస్యత్వంబు ఖగేంద్రుం డెడఁబాపినకరణి నీకతంబున నీవంశంబు పావనం బయ్యె" నని శ్లాఘించుచున్న నాథుని చరణంబులపై మైనావతీ రాణి ఫాలంబు మోపి "యోగసమర్థా! భవద్దయారసపూరితదృక్ప్రసారంబుచే పామరజనపాపభూధరంబులు భస్మంబగుట చోద్యంబే? నిమిషంబున లోహంపు రూపుమాపి రుక్మంబొనర్చిన పరుసంబు భవాదృశతపోధనుల పాదరజంబున కెనయగునె? సంకల్పసిద్ధి యొనర్చెడు కల్పమహీరుహం బకలంకదయాగుణసమన్విత సత్పురుష మనోసంకల్పంబుల బోలునే? పారావార నీరక్షారం బపహరించి స్వచ్ఛతరజీవనంబు లొసంగెడు ధారాధరంబులు యుష్మద్వాక్సుధారసధారల సరియగునే? మీయనుగ్రహంబే బ్రహ్మాండోద్ధారకతారకం" బని పొగడుచు భక్తిరసభరిత భక్ష్యభోజ్యంబులచే దృప్తిపఱచుచుండ నాథుండా సులోచనురాణి సదనంబున దినత్రయంబు గడపి యాశీర్వదించి యచ్చోటుబాసి గోరక్ష మీననాథసమేతుండై ప్రయాణంబు జేయుచుండ నమ్మహారాణి సచివాది సకలజనపరివృతయై క్రోశంబు వెంటజని యోగిసార్వభౌముని చరణంబులకు ప్రణమిల్లి యనుజ్ఞగొని వసుపుత్త్రుని సుగుణంబు లుగ్గడించుచు నిజనివాసంబుల కరిగిరి. మత్స్యేంద్ర గోరక్ష మీననాథులు నానాగ్రామంబులు దిరుగుచు జగన్నాథంబు జేరంజని జలధిస్నానంబు లాడి జగదీశ్వరుని మందిరంబున త్రిరాత్రంబులు గడపి యాపై స్వేచ్ఛావిహారంబుచే సంచరించుచు సౌరాష్ట్రనగరంబు ప్రవేశించి నివసించి యుండిరి. గోరక్షుండు నిత్యనియమ ప్రకారంబున భిక్షాన్నంబుకై నగరంబున గ్రుమ్మరి యఁట మీననాథుండు శౌచంబు జేయుచుండుసమయంబున కక్షపాలభారంబుచే బడలికజెంది యేతెంచె నప్పుడా మత్స్యేంద్రనాథుండు "గోరక్షా! మీననాథుని శౌచానంతరంబున ప్రక్షాళనం బొనర్చి తోడితె"మ్మని యాజ్ఞాపించెను. గోరక్షుండా భిక్షాన్నకక్షపాల నొకచో నుంచి కరపాండాంగలిప్తములుండగు జ్ఞానరహిత మీననాథుని నికటంబుజేరి యుపాధికరబాలుని గనుంగొని దనమనంబున గతపతులకు పరిమళద్రవ్యంబులు జన్మాంధునకు భూరక్ష

ణంబు భయగ్రస్తునకు తీక్ష్ణశస్త్రంబులు ఉన్మత్తునకు ధనాగారంబులు వ్యర్థంబులు గావే? తద్వద్విషయభోగరహిత ప్రవ్రజితులకీ మహాబాధకర మాయాలంపటం బనర్థదాయకం బని నిశ్చయించి మీననాథుని దనకరంబులచే నెత్తినంత మత్స్యేంద్రుండు మలమయశరీరుండగు బాలుని విలోకించి "గోరక్షా! కుఱ్ఱని దేహంబు నదీజలంబుల శుభ్రపఱచి తె" మ్మని యాజ్ఞాపించెను గోరక్షుం డవశ్యంబని నదీప్రవాహసమీపంబున కబ్బాలుని గొనిపోయి బహిరంతర్మలపరిశుద్ధికై చిఱుతని పాదంబులు దన కేలంబట్టి నికటస్థఘట్టంబున నుతుకుచు ప్రాణంబులు వాపి రుధిరాస్థిమాంసంబులచే ఝషమకరప్రముఖాఖిలజలచరంబుల దృప్తిపఱచి నిర్మలోదకంబుల త్వఙ్మలినంబు విడజేసి యాంతిత్రిని హస్తంబుల ధరియించి మత్స్యేంద్రఘనుండు శిబిరంబున లేనిసమయంబునం జని యయ్యది యుష్ణాంశుకిరణరశ్మి కెదురుగా నారవేసె నంత మత్స్యేంద్రమునిపుంగవుం డేతెంచి సుఖాసీనుండై "గోరక్షా! మీననాథుండేల గనుపడఁ" డని విచారింప గోరక్షుండు "గురుసమర్థా! భవదాజ్ఞాధారకుండనై మీననాథుని బహిరంతర్మలశుద్ధియొనర్చి దివాకరకిరణరశ్మి నెండుటకై వలీకంబుపై బఱవైచితి" నన మత్స్యేంద్రుండు విస్మయంబుచే "గోరక్షా! విపరీతార్థవాక్యంబు లేల పలికెదవు? నిజంబు దెలుపు" మన భాస్కరనందనుండు "సమర్థా! నే ననృతంబు లాడుదునే? సంశయంబు గలదేని బహిరంగణంబున కేతెంచి విలోకింపు" డన నాథుం డదరిపడి కడు వేగంబునం జని రుధిరాస్థిమాంసరహిత నిర్మలచర్మంబు గనుంగొని మూర్ఛాగతశరీరుండై ధరణి గూలి హాహాకారంబు జేయుచు మహాశోకంబుచే వక్షస్థలతాడనం బొనర్చుకొనుచు మృత్తికంగొని వదనంబుపై జల్లుకొనుచు "తనయా! సుందరకాయా!" యని నిర్జీవచర్మంబును హృదయంబున కదుముకొని "నే నత్యంతపాపినై నీజననీవియోగంబొనర్చి యిందుకై దోడితెచ్చితినే? దుష్టుండను. భ్రష్టుండను. హీనభాగ్యుండను. పుత్రఘాతకుండ" నని నిందించుకొనుచు "వత్సా! నన్నెట్లు బాసితివో? నీతల్లియగు మైనాకినీరాణి కేమని దెల్పుదురా? నీమోహనాకారం బేవిధి మఱతురా? మారుతాత్మజ భుభుఃకారనినదంబుచే జీవించ లేనని దలంచి గొనితెచ్చి గోరక్షనామకకృతాంతున కొసంగితిరా.

హాపుత్రా! నీబాలక్రీడావినోదంబులు నీమృదుమధుర సంభాషణంబులు దలంచి దుఃఖభారం బెట్లు సహింతురా? నీరూపంబు నీగుణంబు నీతళుకు నీపలుకు విశేషంబులు దలంప వశంబా నే? కుమారా! భోజనాసనశయ నాది సమయంబుల న న్విడనాడకుంటివిరాపుత్రా! మీననాథా! మీన నాథా!" యని యపరిమితదుఃఖంబుచే శోకించుచు బాలునిగుణంబు లుగ్గడించి యపార మోహావేశంబున బుడమింబడుచు లేచుచుండ గోరక్షుండు దనడెందంబున గురునాథుని చిత్తవిభ్రాంతి దొలంగ లేదని తలంచి పురోభాగంబున కేతెంచి "సమర్థా! మీరెవరు? మీ కుమారుఁ లెవరు? మీ రెవరికై రోదనంబు జేసెదరు? గతించినవా రెవరు? మృత్యు వెవరికి గలదు? శాశ్వతరహిత శరీరంబు హరించెనో సర్వద్రష్టయగు శుద్ధచైతన్యండు మృతించెనో? మీననాథనామం బెవరిచే నెవరికి నేవిధంబున గలిగెనో మీననాథాభిధానాధిపతి శాశ్వతుండో కాఁడో యోచింపుము. శాశ్వ తుం డయ్యె నేని నిఖిలశస్త్రాస్త్రఘాతంబులచేనైన నశించునే? వహ్నిజల వాతంబులచే మ్రందునే" యని బోధించువాక్యంబుల కామహౌఘు నుండు దుఃఖభారాతిశయంబుచే శాంతిం బొందక పుత్రాపుత్రా! యని యాక్రందించుచుండ గోరక్షుండు గురువర్యుని తాపోపశమనంబు జేయుటకై సంజీవినీమంత్రంబు జపియించి భస్మంబు గొని చర్మం బుపై బడ వేసి లేలెమ్మని పలుక మీననాథుండు నిద్రితుండు మేల్కాం చినవిధంబున లేచి మత్స్యేంద్రనాథుని గ్రీవాలింగనంబు సల్పుచుండ నయ్యోగీంద్రుం డత్యంతానందంబుచే "వత్సా! న న్నెడబాసి యెందే గితి" వని ముఖచుంబనం బొనర్చి ముదంబున నాదినంబు గడపి పరది నోదయకాలంబున సుతశిష్యసహితుండై ప్రయాణంబు జేయుచుండ మార్గమధ్యంబున గోరక్షుండు మత్స్యేంద్రనాథు నుద్దేశించి "గురు ఘనా! నిర్జీవకళేబరంబుల సజీవులం జేయ సమర్థుండవై నిరుపమాన ప్రతాపంబు గలిగి పుత్రమరణతాపంబుచే శోకించుట యాశ్చర్యంబు గాదే? సంజీవినీమంత్రయోగంబుచే పునస్సృష్టి యొనర్ప సమర్థుం డవై మీననాథుండు గతించెనని రోదనంబు జేయుట తగునే? సకల జన చింతాహరణంబగు చింతామణి నిజచింత బాయనిచందంబు గాదే" యని పలుకుచున్న గోరక్షునితో మత్స్యేంద్రుండు "నీ వేకతం

బున బాలుని బరిమార్చితి” వని యడుగ సద్దినకరతనయుండు “సమర్థా! యుష్మన్మోహ భావార్థంబులు బరీక్షించుటకై నాయొనర్చినపని యింతియగాక నొండుగలదే? వైరాగ్యశీలురైనవా రీరూపంబున లంఘించి సచ్చిదానందస్వరూపంబున బ్రకాశించుచు దారాపుత్రాదిమోహభ్రాంతులొంట వేడబంబుగాదే” యన మత్స్యేంద్రనాథుండు “వత్సా! నీవు మచ్ఛిష్యుండవై జ్ఞానపూర్ణత్వంబున దేజరిల్లెద వని నిన్ను బరీక్షించుటకు శోకించితిని. కామక్రోధాది షట్కంబు మాయామయప్రపంచంబునకు ముఖ్యస్థానంబులు గావున నీయం దట్టి మోహలేశంబు గలదో నిత్యానిత్యవస్తువివేకజ్ఞానంబుచే శుద్ధనిర్గుణపరబ్రహ్మస్వరూపుండవై వెలింగెదవో లేదో యని యూహించి యిక్కార్యంబు దలపెట్టితిని పుత్రా! వాయసరూపంబు వదలి బిసభుక్తి రూపంబుచే క్షీరోదకతుల్యంబులగు విద్యావిద్యల మేలెఱింగితివి. ధన్యుండవైతి” వని శ్లాఘించుచున్న గురునరుని పదపద్మంబులకు గోరక్షుండు ప్రణమిల్లి “నాథా! భవదనుగ్రహ మహిమాతిశయకారణంబుగాదే” యని ప్రత్యుత్తరం బొసంగి జ్ఞానమార్గ ప్రదర్శక సంభాషణంబులచే సమయంబు గడపుచు నచ్చటచ్చట నివసించుచు స్వేచ్ఛావిహారంబున జనుచుండిరి.

ఇతి భక్తిసార నవనాథచరిత్రంబున మత్స్యేంద్ర గోరక్షులు శైల్య దేశంబు బరిత్యజించి యేగుట ద్వావింశాధ్యాయము సంపూర్ణము.

---

## త్రయోవింశాధ్యాయము

---

{ గోరక్షుండు స్వర్ణేష్టికల పాలివైచి యొకకొండను స్వర్ణంబుగా నొనర్చి దేవతలకు విందొనర్చుట. }

మత్స్యేంద్ర గోరక్ష మీననాథు లనేకదేశంబులు సంచరించుచు త్రిలింగదేశప్రాంతంబున గోదావరీ సముద్ర సంగమ ప్రదేశంబున స్నానంబులాడి తత్తటం బాశ్రయించి పశ్చిమదిశ కేగి వైద్యనాథేశ్వరుని సేవించి దక్షిణమార్గంబున వాల్మీకస్థానంబగు గర్భగిరి జేరం జని యక్కొండలబారు మధ్యప్రదేశంబున హరి ఖడ్గ శల్య భల్లూక

ద్విరద శార్దూలాది క్రూరమృగమయంబై విచిత్రతర ప్రఫుల్ల పుష్ప స్తబక విరాజిత బహువిధ లతానికుంజ వితానంబు లమ్మహీదేవి వినూత్నకంచుకంబన దాల్చి యంబరచుంబితోత్తుంగ శాఖాసమన్విత మాలూర బదరీ వకుళ కపిత్థామ్ర మందార జంబీర బంధూకప్రముఖ తరురాజంబు లన్యపురుషాలోకనం బప్రశస్తంబని వాసరమణి కిరణ ప్రసారభయంబుచే ధరించిన వస్త్రంబో యననొప్పిన సాంద్రచ్ఛాయాచ్ఛాదిత భయంకరకాంతారంబు బొడగని యేమహామహుని దర్పంబునకు తమోభంజనుండు కంపించునో యేతపోఘనుని తపఃప్రభావంబునకు మేరుమందరంబులు కందుకతుల్యంబులై గనుపించునో యట్టి పరిపూర్ణయోగిశ్రేష్ఠుండగు మత్స్యేంద్రుండు గోరక్షుని బరీక్షించుటకై కక్షపాలాంతర స్వర్ణేష్టికలనిమిత్తంబు మదిం దలంచి "గోరక్షా! ఇమ్మహావిపినంబు ఘోరతర గిరికుహర పరివృతమై హరిదశ్వశతాంగ నిరోధకర మహీరుహజాలంబుచే భయావహంబై గాన్పించు నియ్యది తస్కరులకు ముఖ్యస్థానంబు గాబోలును నాహృదయంబు తస్కరులకై చలించు" నని వచింప నగ్గోరక్షుండు దనహృదయంబున మద్గురునాథున కీ భయంబేలగలిగె? దిగంబరులకు తస్కరులబాధ లెట్లు ఘటించు? విత్తం బేమైన గలదని నిశ్చయించి విచారించుట యుచితంబుగాదు. సమయంబు నిరీక్షించి భ్రాంతి దొలంగించవలె నని దలంచి ప్రత్యుత్తరం బొసంగక మౌనంబుచే గమనంబు జేయుచుండ నంతకంతకయ్యరణ్యం బత్యంతగాఢాంధకారమయంబై గనుబడుచుండ నప్పుడప్పుడాగోరక్షునితో మత్స్యేంద్రుండు 'వత్సా' తస్కరభయంబు గలదా' యని హెచ్చరించినను శిష్యుండు నిరుత్తరుండై జనుచుండ నొకానొక ప్రదేశంబున ప్రశస్తంబగు తటాకంబుగని మత్స్యేంద్రుండు "గోరక్షా! నాకక్షపాలంబు గొని భద్రంబున జనుచుండుము. నే నీ ప్రదేశంబున ముఖప్రక్షాళనం బొనర్చుకొని శీఘ్రంబున నేతెంచెద" నన నవశ్యంబని మీననాథుని భుజాగ్రంబులపై నిడుకొని కక్షపాలం గొని కక్షంబున ధరించి భారంబుచే హిరణ్యంబని లక్షించి కొంతదవ్వరిగి భయదాయకం బీ సువర్ణంబని యయ్యది యొకగర్తంబున బాఱవైచి తత్సమభారపాషాణం బాకక్షపాలంబుననుంచి తీవ్రగమనంబున జనుచుండ నంత మత్స్యేంద్రుండు మహావేగంబుచే వెంట

 

నంటి యరుదెంచుచుండఁగనను గోరక్షుండు గురువుకై నిలువక జని చని యొకనిర్మలోదకపూరిత సరోవర నికటంబుజేరి తత్తటంబున మీననాథుని డించి కక్షపాల నచ్చటనుంచి యాత్రోయంబుల స్నానంబులాడి దననిత్యకర్మంబులు దీర్చుకొని పిదప మీననాథునకు స్నానంబు లాడించి మహానందంబున నుపవేశించి యున్నసమయంబున మత్స్యేంద్రయోగివర్యుం డేతెంచి యుభయులను మందలించుచు తజ్జీవనంబుల గ్రుంకులిడి నిత్యనియమంబులు దీర్చుకొని మార్గాయాస బడలికచే విశ్రమించి "గోరక్షా! మహాకర్కశంబగు కాననం బధిగ మించితి మిక ముందెవ్విధంబగు ఘోరాటవిగలదో భయసహితమో రహితమో" యని ప్రశ్నింప నతండు "గురుసమర్థా! మనభయం బెడ బాసి పోయె నిక నెట్టియరణ్యంబైననేమి విత్తరహితుల కేటిభయం" బని ప్రతి బలుకుచుండ మత్స్యేంద్రుండు "పుత్రా! మత్కక్షపాలంబున పద్మినీదత్త హాటకేష్టికంబులు గలవు. తత్కారణంబుచే నిక్కాననం బున భయంబుగలదా యని విచారించితి" నన శాశ్వతరహితంబగు కనకంబు సర్వసంగపరిత్యాగుల కేల" నని గోరక్షుండు గురువర్యుని హస్తంబు దనకరంబుచే ధరించి గర్భాద్రిపై కేగి యచ్చట నొక కొంతదడవు విశ్రమించి గమనోన్ముఖులై తమతమ పరిధానంబులు గొనుచుండ మత్స్యేంద్రుండు దనకక్షపాలను ధరించుటకై హస్తం బుల బూని సంశయమనంబుచే గనుంగొని యందు స్వర్ణంబు గానక తత్సమభారంబగు పాషాణంబులు లక్షించి హాహాకారరవంబు జేయుచు "గోరక్షా! నావిత్తం బపహరించుట న్యాయంబగునటే? భారంబని దలంపక మహాకష్టంబుచే నింతదనుక తీఁడ్చి తెచ్చిన హాటకం బునకు చేటొనగూర్చితివే? నీకింతటితో భారంబై దోచెనటరా? దిట్టతనంబుచే నెందు బడవైచితివో దెలుపవేరా అయ్యో నాభాగ్యం బేమని దలపోయుదు. దైవం బలిగెనో కాలంబు మారెనో" యని రోదనంబు జేయుచు నలుదిశల పరిశోధించుచు నొక్కచో నిలువక మిక్కుటంబగు శోకభారంబుచే బుడమిం బడుచు కరంబులు శిరం బునై ధరించి కొల్లబోయితి నని పెల్లేడ్చుచు పిశాచంబుభంగి భ్రమ ణంబు జేయుచు గోరక్షుని సమీపంబున కేతెంచి "యారా! గోరక్షా! నాధనం బీవేని నిను విడతునే" యని దుఃఖంబున నుడువు

చుండ గోరక్షుండు మత్స్యేంద్రయోగిపుంగవుని హస్తకమలంబు
దనకేలంబూని యప్పర్వతాగ్రంబునకు దోడ్కొని చని సిద్ధయోగ
మంత్రాధిదైవతను ధ్యానించి లఘుశంక యొనర్చినంత నమ్మహీధరంబు
కనకమయంబై ప్రకాశించుచుండె నప్పు డయ్యనతనయుండు "గురు
నాథా! భవదీప్సిత చామీకరంబు పర్వతాకారంబై విలసిల్లెను. వల
యునంత గొను" మని మత్స్యేంద్రుని చరణంబులకు ప్రణమిల్లి విన
యపూర్వకంబుగ బలుకుచుండ నత్తాపసోత్తముండు మోదంబుచే
గోరక్షున కాలింగనం బొసంగి "వత్సా! ధన్యుండవు. ప్రాజ్ఞుండవు.
సకలమంత్రసిద్ధుండవై దేజరిల్లితివి. పరుసంబు త్యజించి లోహంబున
కాశించినకైవడి గృహస్థిత సురధేనుం దిరస్కరించి దుగ్ధంబులకై
పసుల యాచించినవిధంబు రాజహంసను బోనాడి వాయసంబును
గోరినట్లు నవనిధిస్వరూపుండగు నీయట్టి సచ్ఛిష్యుండు గలుగ తుచ్ఛ
కాంచనంబున కపేక్షింతునే" యనుచుండ దినేశనందనుండు "సమర్థా!
భవత్కక్షపాలంబున కనకేష్టికంబులు భద్రపఱచి గొనితెచ్చుట
కారణంబేమి దయజేయుడు" రని విచారింప నమ్మహామహుండు
"గోరక్షా! మనస్వదేశంబున కేగి యీసువర్ణంబుచే సాధుసజ్జనులకు
విందొనర్చి దృప్తిపఱచవలయునను బుద్ధిచే గొనితెచ్చితి దప్ప నన్యం
బేమిలే" దన గోరక్షుండు "గురువర్యా! యుష్మదభిలషితకార్యం
బొనర్చెద గనుంగొను" మని మత్స్యేంద్రు నచ్చోట నిలిపి గంధర్వా
స్త్రంబు జపియించి భస్మయోగంబున నాకంబునకు ప్రయోగింప
నయ్యస్త్రమహిమాతిశయంబుచే చిత్రసేనగంధర్వుం డేకశతగంధర్వ
పరివృతుండై చనుదెంచి తపోఘనునకు నమస్కరించి ముకుళితకరపు
టుండై "భవదీప్సితంబులు దెలుపు"మని యడుగ గోరక్షుండు గంధర్వ
పతితో "మర్త్యలోకవాసులగు యతిజపితపస్విప్రముఖ సాధుజనస
మూహంబును సురలోకనివాసులగు గరుడ గంధర్వ కిన్నర కింపురుష
యక్ష రాక్షసాఖిల దేవలోకంబుచే నేకీభవించి యమితోత్సాహం
బున నుత్సవం బొనర్పవలయునను కుతూహలంబు గలదు. సమ
కూర్పు" మని యాజ్ఞాపింప చిత్రసేనుం డవశ్యంబని దనపరివారంబు
నకు సెలవొసంగి దశదిశల కనిపి యనేక జ్ఞానఘనుల తపోఘనుల
సత్పురుషశిఖామణులను గుప్తవేష ప్రకటవేష ధరులగు హంస పరమ

హంసాది నిఖిలయతీంద్రులను శుక శౌనక యాజ్ఞవల్క్య వసిష్ఠ వామ
దేవ కపిల వాల్మీక వ్యాస పరాశర నారద ప్రముఖ మహాఋషిగణం
బును జాలంధర కానీపాది నాథపంథీవర్గంబును సురలోకస్థ గరుడ
గంధర్వ కిన్నరాది నిర్జరసంఘంబును రప్పింప నష్టవసుసమన్విత యుప
రిచరవసుపుంగవుం డేతెంచి సుతుండగు మత్స్యేంద్రుని కుశలప్రశ్నో
త్తరంబుల సంభాషించుచుండు సమయంబున హరిహరబ్రహ్మేంద్రప్ర
ముఖు లేతెంచి యెడనెడ నివసించియుండ గోరక్షుండు మత్స్యేంద్ర
యోగీంద్రమునితో "నాథా! తిలోత్తమద త్తహేమంబుచే నిమ్మహాలో
కంబును దృప్తిపఱచెదవో" యన గురుసమర్థుండు "ప్రతాపయుత
ముఖ్యశిష్యుండవు గలుగ కనకంబేల" నని దరహాసితవదనుండై నుడు
వుచుండ నుష్ణాంశుతనూభవుండు గురుచరణాంభోజంబులకు నమస్క
రించి యణిమా గరిమా ద్యష్టసిద్ధులను. దనమంత్రప్రభావంబుచే
నావాహనం బొనర్ప నమ్మానినీమణులు ప్రత్యక్షంబై నాథుని సమ
క్షంబున నిల్చి "యుష్మత్కార్యం బెయ్యది దయచేయు" మని సవిన
యంబుగ విచారింప మిత్రపుత్రుండు "షడ్రసోపేత భోజనంబులచే
సురసరమునిగణంబును దృప్తిపఱచు" మన నమ్మగువ లక్ష్యంబని
రయంబున రసభరిత బహువిధ పక్వాన్నంబులు దమకుశలత్వంబుచే
పర్వతతుల్యంబులగు రాసులేర్పఱచి క్షణమాత్రంబున మనోజ్ఞతరా
రామ సప్తకంబు గల్పించి ముఖ్యపరిచారికలచే స్థలశుద్ధి యొనర్చి
కుమారీ నందా ధనదా మంగళాది జలదేవత లేకముఖంబున చాతు
ర్యధుర్యలై భోజనంబు లిడుచుండ గంధర్వసమూహం బా సురనరో
త్తముల నాహ్వానం బొనర్చుచుండ భైరవాష్టకంబు దిశాష్టకంబున
యుపవేశించి న్యూనాధిక్యంబులు పరిశీలింపుచుండ త్రిలోకపావని
యగు వియద్గంగాదేవి నిర్మలోదకంబు లిడుచుండ నుపరిచరవసునా
యకుండు దక్షిణలుగొని నిలుచుండ గంధర్వాధిపుండగు చిత్రసేనుండు
తాంబూలంబులు బూని సుస్థిరుండై యుండ నుమారమణుండు సర్వ
దేవతానివహసమేతుండై విందారగింపుచుండ రంభోర్వసీప్రముఖ గణి
కారత్నంబులు మృదుమధురస్వరంబులతో గాయనంబొనర్చుచువిపంచీ
నాదంబుల సొంపు జూపుచుండ నతులితవై భవాన్వితంబగు సమారం
భంబు గని మత్స్యేంద్రుండు మనోయోగంబున సకలసమూహంబు

నను ప్రదక్షిణం బొనర్చి యానందాంబుధి నోలలాడుచుండుతఱి గోర క్షుండు సంజీవినీమంత్ర ప్రభావ సంజనిత గహినీనాథుని మదిదలంచి గురుసమర్థుండగు మత్స్యేంద్రుని సన్నిధి కేతెంచి "నాథా! మృత్పుత్రికాజనితుండగు గహినీనాథుండు రాఁడయ్యె. గనుఁగొనవలయు నను యపేక్ష కల" దన మత్స్యేంద్రుండు హర్షించి చిత్రసేనునిచే నొక శుభపత్రిక మధువిప్రుని పేర వ్రాయించి సులోచనగంధర్వునిచే కనకగిరి నగరంబున కనుప నాసులోచనుం డతివేగంబున తత్పురంబున కేతెంచి మధువిప్రునకు శుభపత్రిక నొసంగి సకలవృత్తాంతంబు దేటపఱుప నతం డా శుభలేఖనంబున సపరివారుడై గహినీనాథుని దోడ్కొని రయంబున రమ్మనుట జదువుకొని పరమానందంబుచే త్వరితంబున ప్రయాణంబు గావించి గర్భగిరి జేరంజని బాలుండగు గహినీనాథుని మత్స్యేంద్రయోగిముఖ్యుని చరణకంజంబుల కర్పించెను. యోగద్రుముం డబ్బాలుండగు గహినీనాథుని నిజాంకంబుపై నిడుకొని మూర్ధంబు మూర్కొనుచు ప్రేమపూరిత హృదయుండై లాలనంబు జేయుచుండ గిరిజాధవుం డబ్బాలుండు కరభంజననారాయణుండు గహినీనాథనామంబుచే జగద్విఖ్యాతి బొందు నీ విప్పుడే మహానుగ్రహం బొసఁగి పరిపూర్ణసచ్చిదానంద స్వరూపంబుచే ప్రకాశింపఁ జేయుము. జగదుద్ధారనిమిత్తంబై ముందు నే నవతరించి యాగహినీనాథునిచే ననుగ్రహంబు బడయుదు నని వాక్రుచ్చియుండ నవ్వసుతనయుండు గోరక్షునితో "నీవరదకరం బబ్బాలుని శిరంబుపై నుంచు" మని యాజ్ఞాపించెను. గోరక్షుండు ముదంబుచే మృజ్జనిత గహినీనాథుని మస్తకంబున జగత్పవిత్రకరహస్తం బుంచి నిశ్చల నిర్గుణ పరబ్రహ్మస్వరూపానుసంధానంబుచే నిరస్తమోహుం జేసెను. పిదప మత్స్యేంద్రనాథుండు హరి విరించి శంకర ప్రభృత్యఖిల సురగణంబుచే నేకమాసం బచ్చోట నుత్సవంబు గడపుచుండ గోరక్షుండు హరసఖుని బిలచి "బృందారక సంఘంబున కీ స్వర్ణమయనగంబుచే నిఖిలభూషణంబు లమర్చి యొసంగు" మన నద్ధనదుం "డిదేల? మద్భవనంబున గల వస్తుజాలంబులు గొని తెచ్చి యొసంగెద" నని తత్క్షణంబ దివ్యతరమణిచిత్రిత భూషణాంబరంబులు దెప్పించి యోగ్యానుసారంబుగ విబుధలోకంబునకు కానుక లొసంగి యథావిధి దక్షిణలచే యాచకుల దృప్తిపఱచ వార

లమ్మతోస్వోదరసంభవునిచే ననుజ్ఞాతులై నిజనికేతనంబుల కేగుచుండ మత్స్యేంద్రుండు బాలుండగు మీననాథుని సంరక్షించుటకై యుపరిచరవసుపుంగవునిచే సింహళద్వీపవాసిని యగు పద్మినీమణిం జేరంజన బంపిన నవ్వసునాయకుం డబ్బాలుని దోడ్కొని సింహళద్వీపంబు జేరి మైనాకినీదేవికి మత్స్యేంద్రయోగిముఖ్యుని చరిత్రం బంతయు దేటపఱచి మీననాథు నొసంగెను. పద్మినీమణి మత్స్యేంద్రనాథ వియోగాకులితచిత్తయై పరితపించుచుండ వసుపుంగవుం డుచితప్రకారంబుల సమాధానం బొనర్చి నిజనివాసంబు జేరంజన మైనాకినీదేవి మీననాథుని ముఖకమలంబు చుంబించుచు "పుత్రా! భవజ్జనకుని విడనాడి యిందే తెంచితివే" యని యానందబాష్పంబులు రాల్చుచుండెను.

## మత్స్యేంద్రనాథుండు గహినీనాథునకు మంత్రార్థంబు లుపదేశించుట

ఇట యోగద్రుముండగు మత్స్యేంద్రుం డగ్గిరిపై కపాలభృత్సహితుండై గహినీనాథున కనేకరహస్యోపదేశంబులు జేయుచుండ ధనదుం డదృశ్యాస్త్రయోగంబుచే స్వర్ణమయపర్వతంబును నిజనివాసంబునకు గొనిపోయెను. తదాది గర్భగిరిగ్రామంబున వృషభధ్వజుండు వృద్ధదేవుండని ప్రఖ్యాతి గాంచెను. తద్గిరిపశ్చిమభాగంబున కానీపనాథుండుమడీ యను జనపదంబున శిష్యజనకదంబసహితుండై నివసించు దక్షిణభాగంబున యోగద్రుముండగు మత్స్యేంద్రుండు ప్రాగ్భాగంబునసర్వగుణశిరోమణి యగు జాలంధరనాథుండు ఉత్తరభాగంబున వైరాగ్యఘనుండగు నాగనాథుండు విటేగ్రామంబున తాపసోత్తముండగు రేవణసిద్ధనాథుండు నివసించియుండ గర్భాద్రి వామతీర్థస్థానంబున గోరక్షుండు గహినీనాథున కనేకవిద్యలు గఱపుచుండ మధుబ్రాహ్మణుండు నిజనగరంబున కేతెంచెను. తదనంతరం బా గోరక్షనాథుం డొకవత్సరం బా వామతీర్థంబున వసించి గహినీనాథుని పూర్ణసనాతనమూర్తిని జేసి పునర్మధువిప్రుని సదనంబున కనిపి తా నచ్చోటు బాసి నానాతీర్థంబులు సేవించుచు దత్తాత్రేయదర్శన కుతూహలుండై చనుచుండెను.

ఇతి భక్తిసార నవనాథచరిత్రంబున మత్స్యేంద్ర స్వర్ణశైలోత్పత్తిక కథావిశేష త్రయోవింశాధ్యాయము సంపూర్ణము.

---

## చతుర్వింశాధ్యాయము.

---

-:- భర్తరీనాథుని జన్మచరిత్రము. -:-

తొల్లి యొకానొకదివసంబున నహస్కరుండు నిత్యనియమప్రకారంబుచే నిజస్యందనారూఢుండై వియన్మార్గంబున వాతగతి నేగుచుండ నమరావతీనగరవాసినియగు నూర్వశీకాంత మనోహరంబగు విమానంబు నలంకరించి శశిబింబరుచిరాస్యయై సౌధామినీసమద్యుతిశరీరకాంతిచే బ్రకాశించుచు కుటిలేక్షణంబున బతంగునిపై జూపు సాచినంత నక్కలకంఠి చురుకుచూపులు చెఱకువిలుకాని కఱుకుటమ్ములని యదరిపడి, ప్రభాకరుండు దుర్భరమోహపరవశత్వంబున చలింపనింద్రియంబు గళితంబై నభోమార్గంబున బుడమింబడ నేతెంచుచు వాతహతిచే ద్విభాగంబై యందొకభాగంబు లోమశాశ్రమంబున ఘటంబునంబడి యగస్త్యుం డుద్భవించెను. తదితరభాగంబు కైలిక మహర్షి కుటీరసమీపంబున భర్తరీ యను భిక్షాపాత్రంబునం బడియుండెను. కైలికుండు నిత్యకృత్యంబులు దీర్చుకొని భిక్షార్థంబై జనపదంబు కేగందలంచి దివాకరవీర్యపూరిత భర్తరిం గనుంగొని యియ్యది మిత్రవీర్యంబని యూహించి యంతర్దృష్టిచే కలిప్రారంభాది త్రిసహస్రైక శతవత్సరంబుల కిన్మహావీర్యంబున ద్రుమిలనారాయణుండు జన్మంబు బూని లోకోద్ధారం బొనర్చు నని నిశ్చయించి యనేకవర్షంబు లబ్భర్తరిని నిజాశ్రమంబున భద్రపఱచి కలిప్రారంభసమయంబున నయ్యది మందరాచలగుహాంతరంబున నుంచె నందు ద్రుమిలనారాయణుం డు బ్రవేశించి నవమాసపూర్తియై దైవయోగంబున మధుమక్షికములు మధుధార లొసంగ క్రమక్రమంబున నవయవంబు లభివృద్ధి జెంది జలింపుచుండ నప్పాత్రంబు డుల్లి యొక పాషాణంబునకు దాకుచు భిన్నంబై తృణమయంబగు మహింబడి బాలార్కతేజంబగు డింభకుం డుదయించి రోదనంబు జేయుచుండెను. తత్సమీపప్రదేశంబున నొక గర్భిణీకురంగంబు తృణంబుకై జరించుచు నేతెంచి యబ్బాలునిపై కిశోరద్వయంబును బ్రసవించి శిశుత్రయం బుదయించెనని దలపోయుచు ముదంబున దనజిహ్వచే నాకి స్తన్యంబు లొసంగ

తత్కిశోరంబులు క్షీరంబు లానుచుండె నయ్యర్భకుండు స్తనదుగ్ధపాన విధి యెఱుంగక శోకింపుచుండ నక్కురంగంబు బాలుని శిరోపార్శ్వ ద్వయంబున పాదంబులు మోపి వక్త్రంబున స్తనంబులిడి పయఃపానం బు జేయించి దృప్తిపఱచెను. ప్రతిదినం బివ్విధంబున క్షీరంబు లొసం గుచు జిహ్వచే శరీరక్షాళనంబు జేయుచు నత్యంతగారవంబున శాబకుని బోషింపుచుండెను. బాలుండు దినదిన ప్రవర్ధమానుం డగుచు త్ర్యబ్దం బులబాలుండై మృగకిశోరంబుకై వడి కురంగంబు వెంటనంటి యరణ్యంబులు గ్రుమ్మరుచు విపినాంతర వ్యాఘ్రభల్లూకద్విరద జంబుక వృషభాది క్రూరసౌమ్య చతుష్పదద్విపద మృగపక్షిజాలభాషణంబుల కీ లెఱుంగుచు తత్తద్భాషావివేకంబుచే సమయానుకూలంబున మృగపశుసమూహంబులకు ప్రత్యుత్తరంబు లొసంగుచు నిర్భయం బుచే జరించి నిజజననీనికటంబు జేరి విహరించుచు క్రమంబున పం చాబ్దంబులబాలుండై దేజరిల్లి యొకానొకసమయంబున జననీసమే తుండై పెందెరువున జరించుచుండ నమ్మార్గంబున సర్వగుణశీలుం డగు జయసింగనామ పురుషశ్రేష్ఠుండు పరమపావన చరిత్ర యగు రేణుకానామ్నీ జాయాసహితుండై చనుదెంచి మార్గమధ్యంబున లీలావినోదంబుచే శైశవం బొనర్చుచు నగణితకాంతిచే నక్షత్రేశుని బోలి విరాజమానుండై యాడుచున్న బాలుం గని రేణుకతో "ని బ్బాలుని రూపలావణ్యంబులు జూచితివే. జననీ జనకు లీ బాలమన్మ థుం డనఁజాలిన తేజోమయు మతిభ్రష్టులై యరణ్యంబులపా లొనర్చి రి గాబోలు" ననుచు కుఱ్ఱని సమీపంబున కరిగి విలోకించుచుండ న బ్బాలుండు భయభ్రాంతచిత్తుండై మృగశబ్దంబులచే రోదనంబు జేయు చు పరువు లిడుచుండెను. జయసింగభాటుండు వేగంబున వెంట జని బాలుని దనకరంబులచే ధరించి "వత్సా! భయపడకుము. నీజననీ జనకుల నెఱింగింపుము. ని న్నీక్షణంబున గొనిపోయి సమకూర్చెద" నన నబ్భర్తరీజాతుండు కురంగభాషణంబులచే దనతల్లియగు కురంగి ణిని జీరుచు శోకింపుచుండ నక్కురంగంబు దూరంబున నిల్చి దన పుత్రుండు మనుష్యునిచే జిక్కఁబడె నని భయహృదయమై రోదనంబు జేయుచుండెను. జయసింగభాటుం డిబ్బాలుఁడు మూకుండో కేవల జ్ఞానరహితుండో యని సంశయించి దనభుజాగ్రంబులపై నెత్తుకొని

రయంబున నేగుచుండ కడుభయంబుచే రోదనం బొనర్చునెడ కురంగం బతిమోహంబుచే నలుదిశలు బరుగెత్తుచు మహానాదంబుచే నాక్రోశించుచు క్షణక్షణంబున పుత్రుని నిరీక్షించుచు పరితపించుచున్న కురంగంబును జయసింగభాటుండు గని యీహరిగణం బేకతంబున నాక్రోశించుచున్నదని మనంబున విచారించుచు గ్రామసమీపంబు జేరంజన నాహరిణంబు భీతిల్లి నిరాశచే విపినంబునకు జనుచుండెను.

భర్తరీనాథుండు జయసింగభాటునివెంట కాశీక్షేత్రంబు బ్రవేశించుట.

ఇట జయసింగభాటుం డొక గ్రామంబు ప్రవేశించి బాలుని దన జాయానికటంబున నుంచి భిక్షార్థంబై తద్గ్రామంబు సంచరించి విడిదికిం జేరి బాలుని సమాధానంబు జేయుచు నిప్పగిది మాసత్రయం బా జనపదంబున నివసించి యనేకవిధంబుల బాలుని భోజనాదులచే దృప్తిపఱచుచు బోషించుచుండ నచ్చిఱుతడు హరిణీవియోగదుఃఖంబు మాని మనుష్యభాషణంబు లభ్యసించి ముద్దుముద్దుమాటలచే బ్రొద్దు గడపుచుండెను. పిదప జయసింగుం డా గ్రామంబు విడచి బహుగ్రామంబులు ద్రిమ్మరుచు కాశీక్షేత్రంబున కేగి భాగీరథీ జీవనంబుల స్నానంబులాడి విశ్వేశ్వరుని దర్శనం బొనర్చునెడ నమ్మహాలింగంబున "భర్తరీనాథా! రార" మ్మని శబ్దం బుద్భవిల్లిన నబ్బాలుం డుమారమణునకు నమస్కరించె. నీశబ్దం బా జయసింగభాటుం డాలకించి దనహృదయంబున నిబ్బాలుం డీశ్వరునకు వందనంబు లిడుచుండ భర్తరీనాథాయను శబ్దం బాలింగంబున బయలువెడలుట కేమిహేతువో బాలుండు గుప్తవేషధరుండగు సుపర్వుండో దరిద్రునకు ధనాగారంబు లభించినట్లు క్షామపీడితునకు వేల్పుగిడ్డి ప్రాప్తించిన చందంబు నిబ్బాలుండు మద్భాగ్యోదయంబుచే ఘటియించె నని సంతసించుచు ధవళాంగుం డీ కుమారుని "భర్తరీనాథా" యని సంబోధించె గావున నిబ్బాలునినామంబు భర్తరీనాథా యని ప్రకాశింపఁజేయుట విశేషంబని యూహించి విడిదికిం జేరి కులకాంతతో "ప్రియే! సర్వలక్షణయుతుండగు నిబ్బాలుం డవతారపురుషుండు. దేవళంబున వందనం బిడుచుండ 'భర్తరీనాథా! రార' మ్మని మృడుండు వచించెను. మనపుణ్యఫలంబుచే నను కూలించిన సుతునకు భర్తరీనాథ యని నామంబిడి ప్రియంబున బోషిం

పనలయు" నని సవిస్తరంబుగ వాక్రుచ్చి భిక్షార్థం బా పురంబు గ్రుమ్మరి నానాపదార్థంబులు గొనితెచ్చుచుండ పరమసాధ్వియగు రేణుకాయు వతి సుతులు లేనికతంబున నతిముదంబుచే భర్తరీనాథుని నిజాంకం బుపై నిడుకొని యత్యంతప్రేమాన్వితయైముఖకమలంబు చుంబించుచు మహాలాలనంబున భోజనంబులిడుచు నానావిధవస్త్రపరిధానంబులచే దృప్తిపఱచుచుండ బాలుండు శైశవక్రీడావినోదంబున ముద్దులొలుకు నాటపాటలచే జననీజనకుల యుల్లంబులు రంజిల్లం జేయుచుండి యొక నాఁడు తోడిబాలురతో క్రీడ లొనర్చి కడురయంబున పరుగులిడుచు నేతెంచి జననీగళంబున కతిగారవంబుచే నాలింగనం బొసఁగ నమ్మగువ పరమానందకందళితహృదయంబున హాసన్ముఖయై చుంబనంబు గొని ప్రాణప్రియుండగు జయసింగభాటునితో "నిక్కుమారుండు పరమేశ్వ రానుగ్రహంబున మనకు లభించెను. సంతానహీనులమైన కారణంబుచే దయాసముద్రుండగు శంకరుండు మనకొసంగెను గాని యిబ్బాలునికై జననీజనకు లెంత శోధించుచున్నారో తుదకీ పుత్రుండు మనల నెడబా యునో" యని సంభాషింపుచు చిత్తంబున నప్పుడప్పు డీ సంశయంబు చే నాలోచింపుచు తనయుని రూపగుణసౌందర్యంబులు శ్లాఘించుచు నమ్మహాక్షేత్రంబున కుక్షింభరత్వంబుకై భిక్షాటనం బొనర్చుచు కాలం బు గడుపుచుండిరి. ప్రతిదినంబు భర్తరీబాలుండు తోడిబాలురచే నాట లాడుచు కాష్ఠనిర్మిత యశ్వంబుపై తానొక మహీపాలుండ ననియు బాలురందఱు భృత్యవర్గంబనియు వీథివీథుల క్రీడయొనర్చుచు నొకా నొకదివసంబున బాలురతో నేకీభవించి దారుతురంగంబుపై నారో హించి మహోత్సాహంబున దత్క్షేత్రంబు దొలంగి పరుగెత్తుచు సమీ పవిపినంబున కేగి పట్టుదప్పి పుడమింబడి మతిభ్రష్టుండై పిత్తాధిక్యం బుచే నేత్రంబులు ద్రిప్పుచుండ నయ్యర్భకులు వీక్షించి "భర్తరీ ప్రాణం బులు గతంబయ్యె నిక భూతంబై మనల హరించు" నని భీతిల్లి తీవ్రగమ నంబున నటమరించి భాగీరథీఘట్టంబు జేరి భర్తరీబాలుండు పిశాచంబై వెంటనంటును. మన యాటపాటలు కొనసాగవనియు మనమా యర ణ్యంబున నాభూతంబుచే గ్రసింపఁబడుదుమని యనేకవిధంబుల నల్లరి జేయుచుండ నట భర్తరీనాథుండు మూర్ఛాగతుండై శరీరంబున పాషా ణక్షతంబుచే రుధిరంబు గాఱుచుండ బడియుండెను. జగచ్ఛ్రుతుండు

నిజపుత్రుని విలోకించి పుత్రమోహంబుచే రయంబున సమీపించి రక్తలిప్తాంగుండగు కొమారు నెత్తుకొని భాగీరథీనదీనికటంబున కేతెంచి తత్తోయంబులచే శరీరప్రక్షాళనం బొనర్చి మూర్ఛం దొలంగించి కృపాదృష్టిచే కాయబాధావిముక్తిపఱచి నిజాంకంబుపై యలంకరించుకొని యతిప్రేమచే దనజగత్పవిత్రకరకరంబున ముఖంబు నివిరి యొకపాలుని వేషంబుచే బాలుని హస్తంబు ధరించి యేగుచుండ చెలికాండ్రా భర్తరిం గనుంగొని యొహో! భూతం బేతెంచెనని పరువులిడుచుండిరి. అంత నవ్వేషధరభానుండు జయసింగభాటుని గృహంబుజేరి రేణుకం బిలచి బాలుని భద్రపఱచుకొమ్మని నుడువుచుండ నవ్వనితామణి విప్రోత్తమునకు వందనంబిడి భయభక్తివిశేషంబులచే నాసనం బొసఁగి "బ్రాహ్మణోత్తమా! మత్సుతునిపై నత్యంతమోహంబు గలిగి దోడితెచ్చితిరి. భవన్నామధేయం బెఱింగింపరే" యని సవినయంబుగ నడుగ నక్కమలమిత్రుండు "నే నీబాలునకు జనకుండను. దైవయోగంబున మీకు లభించె గావున నామనోవాక్కాయ త్రికరణశుద్ధిచే మీకర్పించితిని. రక్షింపుకొను" మనుచున్న భూసురోత్తముని "నీయర్భకుండు భవత్తనయుం" డెట్లయ్యె నని యడుగ నమ్మహామహుండు "నేను జగత్ప్రకాశకుండనగు సూర్యుండను. విప్రుండను గాను. మద్వీర్యంబున నీచిఱుతఁడు భర్తరీపాత్రంబున జన్మించి హరిణంబుచే బోషింపఁబడి నీపూర్వపుణ్యఫలంబుచే లభించె" నని జన్మకథావిస్తరంబంతయు దెలియఁబలుకుచు "నిబ్బాలుం డద్భుతచరిత్రుండై దేజరిల్లును. సుఖంబున గాపాడుకొను" మని యనుగ్రహించి యంతర్ధానంబునొందెను. రేణుకా జయసింగభాటులు పరమసంతోషంబున నిర్మలోదకంబులచే శరీరమలక్షాళనం బొనర్చినపగిది పుత్రోత్పత్తిచే ప్రసవవేదన బాసిన బిసరుహాక్షిచందంబున మిత్రదర్శనంబుచే మనోగత సంశయంబు లుడిగి యతిశయానందంబున బాలునిబోషింపుచు నొకకొన్నిసంవత్సరంబు లాకాశీక్షేత్రంబున గడుపుచుండ బాలుండు షోడశవర్ష పరిపూర్ణవయస్కుండై నిరుపమానతేజోధనంబున బ్రకాశించుచుండె నప్పుడా రేణుకాదేవి "బాలుండు యుక్తవయస్కుండయ్యెను. లగ్నం బొనర్చుటకు ప్రశస్త సమయంబు గావున మనస్వదేశంబున కరిగి స్వజాతీయకన్యకను శోధింపవలె" నని ప్రియుండగు జయసింగభాటునితో నాలోచించి గమనోన్ముఖులై

క్షేత్రంబు వదలి స్వదేశంబగు మాళవదేశంబున కేగుచు మార్గమధ్య జనపదంబుల స్వధర్మంబుచే భిక్షాటనంబు జేయుచు విపినపథంబున నేగుచుండ నీచాత్ములగు చోరు లేతెంచి జయసింగభాటుని ప్రాణంబు లపహరించి విత్తంబు గొనిపోయిరి. రేణుకాదేవి దుస్సహదుఃఖభారంబుచే విలపించుచు నిజప్రాణనాథుని చరణకంజంబుల శిరంబు మోపి పంచత్వంబు నొందెను. భర్తరీనాథుం డీ మహాద్భుతంబున కచ్చెరువొంది శోకపూరితహృదయుండై రోదనంబు జేయుచు జననీజనకులపై కాష్ఠంబు లమర్చి యగ్నిసంస్కారం బొనర్చుచు హాహాకారంబుచే "నన్నత్యంతమోహాతిశయంబుచే బోషించిన జననీజనకులు పరలోకగతులై రిక నన్నాదరించు పుణ్యాత్ములెవరు? తల్లీ! యని నే నెవరిని బిలతును. నన్నతులితగౌరవంబుచే రక్షించిన మాతాపితృలేక కాలంబున నేగిరి. మాతాపితృలారా! నన్నెడబాయుట ధర్మంబగునే? కృపాపాత్రుండగు సుతుని మఱచితిరే? పుణ్యులారా! ఘనులారా!" యని వక్షస్థలతాడనం బొనర్చుకొనుచు నతినినదంబుచే శోకింపుచు నిజప్రాణంబులు వాయందలంచి యోచింపుచుండ నొక సైరికుండు శిరంబున హాలంబు ధరించి సౌరభేయంబుల వెంటఁగొని జనుచు బాలునిరోదనం బాలకించి పరితప్తహృదయుండై సమీపంబు జేరి గతవృత్తాంతంబంతయు నెఱింగి "భాటసుతా! భగవత్కృతకార్యంబునకు చింతింపనేల? వ్యర్థశోకంబుచే లాభం బేమి? శోకించితివేని నీజననీజనకులు లభింతురే? ప్రారబ్ధభోగంబు లనుభవింపక తీరునే! బ్రహ్మనిర్మితసూత్రంబు లెవరెఱుంగుదురు? ధైర్యధుర్యుండవై దుఃఖంబుడిగి స్వహితంబుకై సంసారంబాశ్రయించి కీర్తిధ్వజప్రకాశితుండవు గమ్మా! లేలె"మ్మని తోడ్కొని నిజసదనంబున కేతెంచి యనేకబోధప్రబోధంబులచే బాలుని దుఃఖోపశమనంబు జేసి యన్నపానాదులచే దృప్తిపఱచుచుండ బాలుని రూపగుణసౌందర్యంబులు గని నిరాధార పురుషుండని తలంచి తద్గ్రామవాసు లతిప్రేమాన్వితులై స్నిగ్ధభావంబున లాలింపుచుండి రిట్లొక కొన్నిదివసంబులు గడచినంత నొకనాఁడా

వ్యవసాయకుండు వృషభంబులపై ధాన్యంబు గొని విక్రయంబుకై భర్తరీసహితంబుగ నవంతికాపట్టణంబున కేగుచుండెను.

ఇతి భక్తిసార నవనాథచరిత్రంబున భర్తరీనాథజన్మకథావిశేషంబు చతుర్వింశాధ్యాయము సంపూర్ణము.

---

## పంచవింశాధ్యాయము.

---

భర్తరీనాథుం డవంతికాపురంబున కేగుట.

వ్యవసాయకుండు భర్తరీసమేతుండై యవంతికానగరసమీప ప్రదేశంబున సూర్యాస్తమయ కారణంబుచే తెరువరులు నివసించు స్థలంబుగని యచ్చో ధాన్యంబు డించి యా రేయి గడుపుటకై నివసించెను. తదుపరి భోజనం బొనర్చి పాంథులతోగూడి కాష్ఠంబులు జతజేసి యనలంబంటించి యుష్ణంబుకై బరివేష్టించి సుఖగోష్ఠులు జరుపుచుండు నవసరంబున నొకజంబుకవ్రజం బేతెంచి మహాధ్వానంబు జేయుచు మృగభాషణంబుల హెచ్చరించుచు "పాంథులారా! తస్కరులేతెంచెదరు. జాగ్రత జాగ్రత" యని యఱచుచుండ భర్తరీబాలుండా శబ్దార్థంబులు మృగభాషాపరిజ్ఞానంబుచే గ్రహించి తన్ను బోషించుచున్న వ్యవసాయకున కెఱింగించి కాపాడుట ముఖ్యధర్మంబని దలపోయుచు నప్పాంథులు వినుచుండ దన్నేలెడు వానితో "నయ్యా! బహుజాగ్రత గలిగి నివసించుడీ. తస్కరు లేతెంచి మీమీవిత్తంబులపహరించెద" రని బలుకుచుండ వార లా భర్తరీనాథునితో "నీవెట్లెఱుంగుదు" వని విచారించిరి. భర్తరీజనితుండు "జంబుకభాషణంబులచే నే నెఱింగితిని. నాకు మృగభాషాజ్ఞానంబు గలదు. నావచనంబు నిక్కంబని దలంపు" మన వార లతిధైర్యసాహసంబులచే దారుణతర కృపాణంబులు ధరించి యున్నిద్రచే నలుదిశలు నిరీక్షించుచుండుతఱి భయంకరాకారులగు ముచ్చు లరుదెంచి దౌర్జన్యంబు జేయుచుండ వారా చోరులను శస్త్రంబులచే నుగ్గడంచి మొత్తుచు మోదుచు నఱకుచుండ నత్తైక్కాలికాం బ్రుక్కు చెడి యొక్కుమ్మడి పరువులిడిరి. తదు

పరి యాపాంథులు శాంతింబొంది భర్తరిని గొనియాడుచు శిబిరంబుల నిల్పి త్రియామంబు గడపుచుండ తిరిగి జంబుకంబులగుం పేతెంచి కేకలిడుచుండెను. వా రా భర్తరిని జూచి "యయ్యా! మృగభాష లెఱింగెద నని బలికితిరి. జంబుకంబులు పునరాగతంబులై గూయుచున్న శబ్దార్థంబు లెయ్యవియో దయజేయు" మన నతం "డో వ్యవసాయ కులారా! జంబుకనినదాభిప్రాయం బే నెఱింగించెద వినుం డని 'యొక మహారాక్షసుండు హరదత్త శాపమోచన వరంబుచే నుత్తరదిశనుండి దక్షిణదిశ కేగుటకై జనుదెంచె నతనివద్ద నమోఘంబులగు తీవంచర తనంబులు గలవు. యెవ్వండేని యానిశాచరుని శస్త్రఘాతంబున బరి మార్చునో వాం డతిలాభంబు బొందును. వానిశరీరరుధిరంబుచే నే పురుషుండు ఫాలభాగంబున తిలకంబు ధరించునో వాం డవంతికానగర సార్వభౌమసంపద ననుభవించు' నని బలికెను. గావున మీ రేగి యా నక్తంచరుని శస్త్రఘాతంబుచే హతంబొనర్చి రక్తంబున వస్త్రంబు దడిపి గ్రామద్వారంబుపై తిలకంబుమాదిరి నలంకరించెద రేని మీ కత్యంత జయంబు గలుగు" నన నాసమీపంబున విక్రముండు నివసించి యుండి యీవాక్యంబు లాకర్ణించి యసుగుని బరిమార్చుటకై ఖడ్గం బుగొని యేగెను.

## సురోచనగంధర్వుని చరిత్రము.

శ్రోత లీ యపూర్వచరిత్ర మధురసపానులై "యీపిశితాశనుం డేకతంబున నుద్భవించె. తత్కారణం బెఱింగింపు" మన నక్కథకుండు "తొల్లి యీదానవుండు చిత్రమగంధర్వుండు నాకలోకంబున మహాప్రతాపంబుచే విరాజమానుండై యొకనాం డుమారమణుని చరణకమలదర్శనార్థంబున రజితాద్రి కేగి శర్వుండు పర్వత రాట్సుతతో వినోదార్థంబుగ ద్యూతంబాడు సమయంబున నమస్కరించుచున్న గంధర్వుని నీలకంఠుండు నిరీక్షించి యాహ్వానం బొసంగి దననికటంబున కూర్చుండ నియమించి సంతుష్టపఱచెను. పిదప యథాప్రకారంబున నంబికతో ద్యూతం బాడుచుండ నయ్యక్షంబు లుభయుల కుభయరూపంబుల భాసమానంబై దక్షపుత్రి ఫాలాక్షుని జయించితి ననియు శంభుం డంబికను జయించితి ననియు

ద్యూతవివరంబులచే వాదించుచు నుభయు లా గంధర్వుని విచారింప నచ్చిత్రముండు 'త్రినేత్రుండు జయించె' నని పక్షపాతంబుచే నుడివెను. రుద్రాణి క్షోభించి 'గంధర్వా! నీ వసత్యంబని భయంబు మాని పాపమతివై పక్షపాతం బొనర్చితివి గాన నీ వీ దోషంబుచే నిశాచర రూపంబుగొని మర్త్యలోకంబున బడియుండెద'వని శాపం బొసంగెను. చిత్రమగంధర్వుండు దాక్షాయణీదత్త కఠినతరశాపంబునకు భయవి హ్వలాంగుండై గరళకంఠుని చరణాంభోరుహంబులపై శిరంబు మోపి 'దయాసముద్రా! కరుణించవే'యని యశ్రుపూరితలోచనుండై విలపిం చుచున్న గంధర్వుని గని యయ్యంబరకేశుండు దయాన్వితహృదయం బున 'గంధర్వశ్రేష్ఠా! భయపడకుము. శక్రశాపంబుచే సురోచనగంధ ర్వుండు మనుజలోకంబున నివసించె నతని తనూభవుండగు విక్రముండు స్వపరాక్రమంబున శస్త్రఘాతంబుచే నీప్రాణంబులు గొని భవద్రుధిరతిల కంబు ఫాలంబునధరించి మహాభోగంబు లనుభవించు. తత్క్షణంబ నీదివ్య రూపంబు పరిగ్రహించి నిజనికేతనంబున కేతెంచెద' వని వాక్రుచ్చిన త్రిశూలపాణిని చిత్రముండు 'దేవా! నారక్తంబుచే నేతద్వైభవంబు లు సమకూరు నని విక్రముం డెట్లెఱుంగు' నని విచారింప దక్షజామా తృండు 'గంధర్వనాయకా! నీకీ సంశయంబేల? ద్రుమిలనారాయ ణుండు భర్తృరీనాథనామంబున నవతరించి విక్రమునకు దెలియఁజేయు' నని సమాధానపఱచినంతచిత్రమగంధర్వుండు నిజశరీరంబు బరిత్యజించి యసురుండై ప్రవర్తిల్లె" నని శ్రోతలకు సంశయంబు వాపెను. తదనం తరం బా శ్రోతలు "సురోచనగంధర్వుం డేకతంబున నాకేశుని శాప హతుండయ్యె" నని విచారింప నయ్యమలచరిత్రుండగు కథకుండు "శ్రోతలారా! యొకానొకదివసంబున పాకశాసనుండు గరుడగంధర్వ కిన్నరకింపురుషాది సురసంఘసమేతుండై కొలువుకూటంబున రత్న ఖచితసింహాసనంబు నలంకరించి యుండ పురోభాగంబున వశీకృత లోకత్రయులగు మేనకా తిలోత్తమలు తటిల్లతా మిశ్రిత తపనీయ తేజఃపుంజగాత్రంబులు గలిగి శాతకుంభసమ పీనోత్తుంగ పయో దర భారాతిశయ కంపాయమాన తనుమధ్యలై సుస్వరరాగ మూర్ఛా లాపనాది గానరసభరిత హావభావాభినయ నృత్యంబులు సల్పుచుండ చిత్తజుం డున్మత్తుండై తృణచాపంబుచే వాతాంబుపర్ణ భుగ్దుర్భలవిరా

గుల నెదురించి జయంబు గొనె నన తత్సభాంతరస్థిత సురఋషిగణం బులు వివశాత్ములై విలోకింపుచుండ మనోభవనిశితాంబకభిన్నహృదయుండగు సురోచనగంధర్వుండు సభాసదుల దలంపక మేనక నొకహస్తంబుచే నొడిసిపట్టి ద్వితీయహస్తంబున నురోజపీడనం బొనర్చెను. శచీకాంతుండు క్రుద్ధుండై 'సురోచనా! సభ్యులభయం బించుకైన దలంపక నిర్లజ్జుండవై దుశ్చేష్టలొనర్చితివి గాన స్వర్గపదచ్యుతుండవై మనుజలోకంబున గర్దభజన్మం బెత్తు' మని శాపంబొసంగెను. సురోచనుండు భయగ్రస్తుండై పాకశాసనునకు ప్రణమిల్లి 'సమర్థా! నాయపరాధంబు క్షమింపుము. నేను నీపోష్యంబున నభివృద్ధిజెంది యజ్ఞానంబుచే నొనరించిన కృత్యంబులు సహించు దయాఘనుండవుగాన నీకృపాకటాక్ష పీయూషంబున గాపాడవే' యని స్తోత్రంబులు జేయుచుండ నవపుత్రహుండు ప్రీతమనస్కుండై 'గంధర్వా! నీవు మర్త్యలోకంబునకేగి మిథిలాధీశుండగు సత్యవర్మనృపోత్తముని సర్వావయవలావణ్యరాశి యనందగు పుత్రికను వరించి కీర్తిమయుండగు విక్రముని గని ద్వాదశవర్షంబులకు నిజపదంబున కేతెంచెదవు. చింతింపవల'దని శాపమోచనవరం బొసంగెను. సురోచనుండు తచ్ఛాపవశంబున భూలోకపతనుండై మిథిలాకాంతారంబున గర్దభరూపంబుచే రాసభసముదయంబున జరించుచుండెను. మిథిలానగరనివాసుండగు కమఠనామకకులాలుండు దనఖరంబులకై కాననంబు శోధించి నొక్కచో మేయుచున్న గర్దభయూథంబును మరల్చుకొని సదనంబున కేతెంచి వాటిని దన రాసభశాలయందుంచె. నొకకొన్నిదినంబులు గడపినంత నక్కులాలుండు లేములనుభవించుచు గంధర్వగర్దభంబుదక్క నితరఖరంబుల విక్రయం బొనర్చెను. పిదప నొక నిశాసమయంబున గర్దభరూపధర సురోచనుం 'డోకమఠకులాలా! సత్యవర్మపుత్రికం గొని తెచ్చి నావివాహం బొనర్చు' మని శబ్దంబులు వెల్లడి జేయుచుండ నక్కమఠుం డీవాక్యంబు లెక్కడివని దిక్కులు విలోకింపుచు నెవ్వరిం గానక దన మతిభ్రమ యని దలపోయుచు నిశ్శబ్దుండై యోచింపుచుండ పూర్వవచ్ఛబ్దంబు లాకర్ణించి విస్మయంబున గర్దభంబును జూచుచుండె నప్పుడా గర్దభంబు మనుష్యభాషణంబులచే కులాలుని జేరంబిలచి 'కులాలా! సత్యవర్మకూతును గొని తెచ్చి నావివాహం బొనర్పు' మనెను. కమఠుం డా కర్ణకఠోర

సంభాషణంబు లాకర్ణించి దనమనంబున నోహో! గర్దభంబేమి నృపో త్తముని దుహితృసంబంధ మేమి మశకంబు మేరువుచే బోరందలంచిన చందం బౌనగూడె. నీవాక్యంబులు వెల్లడియయ్యెనేని నాప్రాణంబులు స్థానంబులు దప్పవే? నే నిప్పురంబున జీవించు టెట్లు? యన్య దేశంబున కేగవలయు. లేకున్న పుడమీశుండు నాశించ్ఛేదనంబు జేయుటనిక్కం బని యూహింపుచు దనగృహిణి కీవృత్తాంతంబు దెలియపఱచి మరు నటిదివసంబున మూఢమతులగు భార్యాభర్తలు వాచారహిత గర్దభం బేకతంబున సంభాషించును? తత్ఫలం బెయ్యది గాబోలునని దలంపక శీఘ్రంబున గృహోపకరణంబు లా గర్దభంబుపై నెత్తి యుభయు లుభ యపార్శ్వంబుల నడచుచు నగరద్వారనికటంబు జేరంజన ద్వారరక్షకు లీకులాలుండు పలాయనంబు జేయుచున్నాఁడని మనంబున నిశ్చయించి 'కమఠకులాలా! నీ వేకతంబున సంసారోపకరణసమేతుండవై పలాయనం బు జేయుచుండెద' వని విచారింప నక్కులాలుఁడు ప్రత్యుత్తరమార్గం బెఱుంగక గర్దభ చిత్రం బెఱింగించెదనేని యీ దావారికులచే సద్య స్సమయంబున శిక్షింపఁబడెద నని భయంబు గలిగి స్తబ్ధించి నిల్చి యుండెను. దావారికు లిక్కులాలుండు జీవనంబునకై పర దేశంబున కేగునని నిశ్చయించి 'కమఠా! మహానగరంబు త్యజించి యితరగ్రామం బుల కేగుట మేలౌనగూడునే? మామహీధవున కెఱింగించెదము. నిల్వు' మని తజ్జాయాపతుల నిరోధించి వేగంబున రాజభవనంబు జేరంజని 'జననాయకా! కమఠకులాలుం డేతన్నగరంబు విసర్జించి యేగుచున్నాఁ' డన రాజోత్తముండు దూతచే నక్కుంభకారుని బిలిపించి 'కమఠా! నీ వే కారణంబున మత్పురంబు త్యజించం దలంచితివి 'నీకే కష్టంబులు ఘ టిల్లె నవియన్నియు నిర్భయంబుచే సవిస్తరంబుగ దెలియఁజేయు' మన నక్కులాలుండు 'నరపుంగవా! శత్రుకులదమనుండవై మన్ననిశంబు బోషించెడి సచ్చరిత్రుండవు గావున నామనోదుఃఖం బవాచ్యంబు వెల్ల డియొనర్చితినేని నాతల డుల్లుట నిక్కం' బని పలుక భూనాయకుండు 'కమఠా! నీప్రాణంబులు రక్షించెద. నీ వెట్టి పాతకం బొనర్చినను క్ష మింతును. నిస్సంశయంబుచే నీమనోగతం బెఱింగింపుము. నావాక్యం బులు కేవల సత్యంబులని దలంపు' మని వాగ్దత్తం బొసంగిన నక్కమ ఠుండు భయరహితుండై 'నృపాలోత్తమా! నామనోగతం బేకాంతం

బున వెల్లడిజేయుము ర' మ్మని యొకగోష్ఠస్థలంబునకుఁ జని 'దీనశరణ్యా
మత్సదనంబున రాసభం బొకటి రూపగుణశిరోమణియగు యుష్మద్దు
హితయగు సత్యవతీకాంతను దనకు వివాహంబొనర్పు మని నిశాసమ
యంబున నా కెఱింగించె. నేనీ విపర్యాసవాక్యంబులచే భయగ్రస్తుం
డనై నృపుం డెఱింగెనేని శాసించునని తలంచి యతివేగంబున నితర
దేశంబునకు ప్రాణసంరక్షణంబునకై యేగుచుంటి' నని స్పష్టపఱిచెను.
భూరమణుం డీ యాశ్చర్యకర సమాచారంబు డెందంబున నూహించు
చు గర్దభంబునకు మనుష్యభాషణంబు లెట్లు ఘటియించు? నీరా
సభంబు వాచారహితపశువనందగునే! కృత్రిమవేషధరుండగు విය
చ్చరుండు గాబోలు? పరీక్షించి యెఱుంగవలయు నని వితర్కించి
'కమఠా! నీహృదయగతభయంబు దొలంగుము త్వరితంబున స్వసద
నంబున కేగి స్వస్థచిత్తుండవై నివసించి యాఖరోదితవాక్యంబుల బరి
శీలించి నే నీ వాక్యంబులు రాజున కెఱింగించితి ననియు, యీమిథిలా
నగరంబు తామ్రమయం బయ్యెనేని సత్యవతి లభించునని రాజాభిప్రా
యంబు గలదనియు ప్రత్యుత్తరం బొసంగి తత్ప్రత్యుత్తరోత్తరంబు
నా కెఱుంగింపు' మని నృపుం డాజ్ఞాపింప నక్కులాలుండు గర్దభసమే
తుండై నిజసదనంబున కేగె నా రేయి యాఖరంబు పూర్వవద్వాక్యం
బులు బలుకుచుండుతఱి ఘటకారుండు సమీపించి యగ్గర్దభంబుతో
'ఖరశ్రేష్ఠమా! నేనీ యభీష్టంబు మహీధవున కెఱింగించితిని. నీమా
హాత్మ్యంబుచే నిప్పురంబు తామ్రమయం బయ్యెనేని సత్యవతి నర్పించె
ద నని నృపుండు నుడివెను గావున భవత్ప్రతాపశక్తిచే బుడమిఱేని కా
మ్యం బొనగూర్చి సత్యవతిం బొందు' మన గర్దభరూపసురోచనుండు
హాస్యరసపూరితవదనుండై నృపోత్తముని మందమతి యేమని దలంతు
ను? 'కులాలా! తామ్రమయపురం బేల? స్వర్ణమయంబని గోరకూడదే?
గోరెనేని యమరావతీనగరంబునకు సరియొనర్చి బిడౌజునివైభవంబు
లొనగూర్పనే? సురభూజంబుదలంపక మర్త్యమహీరుహంబు గోరుట
చింతామణిని విచారింపక విపినపాషాణంబు వేడుట కామధేనువున
కాశింపక గ్రామధేనువున కపేక్షించుట చిత్రంబుగాదే' యనుచు 'కమ
ఠకులాలా! నీ వతిరయంబున నేగి యీపురంబు తామ్రమయం బొనర్చు
నీయభీప్సితంబు సమకూర్చునని బలుకు' మన కమఠుండు వేగంబున

నరపుంగవుని జేరంజని 'రాజోత్తమా! గర్దభంబు మీయభీష్టంబు దీర్చునట. సత్యవతిని సిద్ధబఱచు' మని విన్నవించెను. త్మానాయకుం డవశ్యంబని యొప్పుకొనెను.

ఇట సురోచనుండు సర్వకళాసమర్థుండగు విశ్వకర్మను ధ్యానింప నమ్మహాపురుషుండు ప్రత్యక్షంబై 'గంధర్వనాథా! నీకామ్యం బెయ్య ది? నన్నేకతంబున స్మరియించితివి? విచారింపు' మన సురోచనుండు 'సమర్థా! విశ్వరచనాధురీణుండవు జగద్గురుండవు జగత్స్వరూపుండవు క్షణజగన్నిర్మితుండవు నాకష్టంబు లెడబాయుటకై నాయం దనుగ్రహించి యిప్పట్టణంబు తామ్రమయనగరంబు జేయు' మని గోనియా డ నవ్విరాట్పుత్రుం డంగీకరించి తత్క్షణంబున నప్పురవరంబు తామ్ర మయం బొనర్చి యదృశ్యుండై నిజధామంబున కేగెను. సూర్యోదయా నంతరంబున నగరవాసు లీయద్భుతంబు గనుంగొని విస్మితులై నిజ సౌధకుడ్యంబు లేకతంబున తామ్రమయంబులయ్యె నని తలపోయు చుండ సత్యవర్మనరేంద్రుండు నిజహృదయంబున గర్దభరూపధరమహా పురుషునకు మత్పుత్రిక నొసంగితినేని జనులు నిందింపరే? నిందా స్పదజీవనంబు కడుకష్టంబుగాదే? కుంభకారున కతిరహస్యంబున మ త్సుత నర్పించి యీదేశం బెడబాపి యన్యదేశంబున నివసింపంజేయ వలయు నని కృతనిశ్చయుండై యక్కులాలుని రప్పించి 'కమతా! నవ మోహనాకార సుందరీమణియగు సత్యవతీకన్యను నీకర్పించెద. నీ వీ దేశంబు బాసి బహుదూరదేశంబున నివసింపుము లేకున్న గర్దభంబు నకు కూతు నొసంగె నని లోకాపవాదము గలుగు' నని తెలియపఱి చెను. ఘటకారుం డవశ్యం బని దనగృహంబునకు విచ్చేసి యన్య దేశంబున కేగుటకై గృహోపకరణంబులు సిద్ధపఱచి నిశాసమయంబున భూకాంతుని సమక్షంబు జేరి గమనోన్ముఖుండ నైతి నని సవినయంబు గ నుడివెను.సత్యవర్ముండు లావణ్యమణియగు సత్యవతిం బిలచి'తల్లీ! ని న్నొక సురశ్రేష్ఠున కర్పించితి నమ్మహాపురుండు ప్రచ్ఛన్నుండై గర్దభ రూపంబున విలసిల్లును. నే నయ్యుదారచరిత్రుని బరీక్షించితి మననగరం బేవిధి తామ్రమయంబయ్యెనో గనుంగొంటివే? గర్దభం బని నిందింప కుము భయభక్తివిశేషంబులచే పతియని దలంపుము. తత్కారణంబున నుభయవంశంబులు పవిత్రంబౌను. ఖరంబని యనాదరణ జేసితివేని సపు

ర్థుండు శాపంబొసంగు నిస్సంశయంబుచే ప్రాణనాయకుండని నిశ్చయిం పుము. నీయుక్తిప్రయుక్తులచే నతని నిజస్వరూపంబు బ్రకటింపంజేయుము.నిర్మలమనస్సుచే కమఠకులాలుని సదనంబునకేగుదు వే'యన నప్పడంతి యొడంబడి పితృసహితంబుగ కులాలుని మందిరంబున కేతెంచి 'మత్ప్రాణేశుని జూపు' మన నక్కుమఠుండు గాజోత్తమునకు రాసభంబు గనుబఱచెను తత్క్షణంబా నరపుంగవుండు ఖరచరణోత్తములకు వందనంబాచరించి 'సురోత్తమా! నుద్దుహిత సత్యవతిని భవత్పదపంకజంబుల కర్పించితిని. పరిపాలించుకొ' మ్మన నగ్గర్దభరూపధర సురోచనగంధర్వుండు 'నృపాలశేఖరా! నీభాగ్యోదయకారణంబుచే నీజామాతృండనైతిని. శక్రశాపవశంబుచే ఖరరూపంబున మెలంగుదును. నానిజనామంబు సురోచనగంధర్వుండు. నాపూర్వచరిత్రంబు విను' మని శాపకారణమూ ! ల బెఱింగించి మహీనాయకుని మనంబు రంజిల్లఁజేసెను. సత్యవర్మండు పరమానందంబున గంధర్వుని బొగడి సత్యవతి నర్పించి నిజభవనంబునకు విచ్చేసెను. తదుపరి కమఠుండు గర్దభ సత్యవతీ సమేతుండై యవంతికానగరమార్గం బాశ్రయించి గమనం బొనర్చెను."

ఇతి భక్తిసార నవనాథచరిత్రంబున భర్తరీనాథ కథాంతర్గత విక్రమకథా విశేషంబు పంచవింశత్యధ్యాయము సంపూర్ణము.

---

## షడ్వింశాధ్యాయము.

---

### విక్రమార్కుని జన్మవృత్తాంతము.

కమఠకులాలుండు దనసంసారోపకరణంబులు గర్దభంబుపై నిడుకొని జాయాసహితుండై సత్యవతీదేవిని దోడ్కొని యచ్చటచ్చట జనపదంబులు గడచి యవంతికానగరంబు జేరంబోయి యొకకులాలుని మందిరంబున నివసించి సత్యవతీకాంతను కడుప్రేమచే రక్షింపుచుండె. నంత నొకనాడు సత్యవతీదేవి కమఠకులాలునితో "నయ్యా! నన్నేకతంబున గొనితెచ్చితిరో మఱచితిరే రయంబున నావివాహం

బొనర్చి మత్ప్రతియనుగ్రహంబు గలిగింపవే" యని పలుక నక్కుంభకా ర్యుం డవశ్యం బని యారేయి ఖరరూపధర సురోచను నికటంబు జేరి "గర్దభశ్రేష్ఠమా! యుష్మదీప్సిత సత్యవతీసుందరి లగ్నంబుకై నిరీక్షిం చుచున్నది గావున నక్కాంతామణి కోర్కు లీడేర్పవే" యని విన్న వింప నగ్గర్దభంబు "కమఠా! విధిపూర్వక వివాహంబున కనుకూలస మయంబుగాదు. శాపకారణంబుచే నయ్యది సందర్భింపదు. ఆసురీవి వాహంబున నత్తలోదరిని పరిగ్రహించెద" నన కమఠుండు "గంధర్వ నాయకా! మీనిజరూపంబు పరిత్యజించి పశురూపంబుచే మెలంగితిరి. పరమసుశీల యగు సత్యవతి కీరూపంబున నాసురీవివాహం బెట్లు ఘటి యించు? నాకీ సంశయంబు గలదు. నిగదించు" మన సురోచనుండు "కులాలా! నారీరత్నంబగు సత్యవతీదేవి ఋతుమతియైన చతుర్థదివసం బున నాకెఱుంగింపుము. నే నాదినంబున నిజస్వరూపంబుచే పరిగ్ర హించెద" నన కమఠుండు సంతసిల్లి సత్యవతీసముఖంబున కేతెంచి "తల్లీ! నీవివాహంబునకై పశురూపధర సురోచనునకు తెలియబఱచితి. నమ్మ హోఘనుండు నీఋతుదినంబున నాసురీయోగంబుచే వివాహంబాడి దన నిజస్వరూపంబుచే నీమనోరథం బీడేర్తు ననియెం గాన సంతుష్టినుండు" మని సమాధానపఱచి సుఖంబున కాలంబు గడపుచుండ నప్పూఁబోఁడి పుష్పవతి యయ్యెను. తచ్చతుర్థదివసంబున నక్కమఠుండు సురోచనున కీవృత్తాంతంబు వెల్లడియొనర్చి "సురపుంగవా! భవత్కటాక్షాభిలాషిణి యగు సత్యవతీదేవి మనోభీష్టంబు దీర్పు"మని శ్రుతపఱుప నగ్గంధర్వుండు తత్క్షణంబ బా గర్దభరూపంబు విసర్జించి ద్యుమణినిబోలు శరీరకాం తిచే నవరత్నఖచిత హారకేయూరాది దివ్యభూషణంబులు ధరించి విరా జమానుండై నిల్చున్నం గమఠుండు విస్మయంబొంది నిజహృదయంబున "నాకలోకనివాసుండు మత్పూర్వకృతపుణ్యవిశేషంబుచే నాసదనం బున నివసించె. నితనికై పృథ్వీశునిపుత్రిక సన్నాశ్రయించె. సురసంచ యంబునకు పీయూషంబు లభించినట్లు కలాధరునకు గంగాధరాశ్ర యంబు సమకూరినచందంబున వనితాలలామయగు సత్యవతీదేవి కీస్వర్గ వాసుండు సంబంధించెను. తమోభంజనునకు శ్యామకర్ణంబు కమలా క్షునకు కమలవాసిని ప్రాప్తించినకైవడి సురోచనునకు సత్యవతీదేవి యనుకూలించెను. నేనీ యుభయులచే ధన్యాత్ముండనైతి"నని తలంచు

చు సురోచనుని చరణసరసీరుహంబులపై శిరంబు మోపి "మహా
పురుషా! భవత్స్వరూపప్రతాపంబు లేనెఱుంగక ననేకపాపకర్మం
బు లాచరించితి. మూఢమతిచే సంసారంబుకై నీపృష్ఠభాగంబున
మృత్తికం గొని తెచ్చితి ననేకపర్యాయంబులు తాడనం బొనర్చితి నాయ
ట్టిదురాత్ములుగలరే? నాపాపంబునకు పారంబు గలదే? దయాఘనా!
నాయపరాధంబులు క్షమించి నన్నుద్ధరింపవే" యని పొగడుచుండ
గంధర్వోత్తముండు కుమ్మరకులాలుని శాంతిపఱచి వేగంబున నంతర్గృ
హంబు ప్రవేశించి సత్యవతీదేవిని జేరంబిలువ నమ్ముద్దియ గులుకుమి
టారంబులచే మరాళంబుమాడ్కి మందగమనంబున హరినందనుని
బోలు సురోచనగంధర్వుని సన్నిధి కేతెంచి షోడశోపచారంబులచే
బూజలొనర్ప గంధర్వోత్తముం డాసురీయోగంబున నక్కాంతామ
ణిని మనోభవసుఖాంబుధిని మగ్నపఱచెను. దైవయోగంబున నవ్వ
నజగంధి యారేయి సురోత్తముని వీర్యంబున గర్భంబు ధరియించుట
నెఱింగి సురోచనుండు సత్యవతింజూచి "ప్రియే! సత్యవతీ! నీగర్భం
బున నపూర్వచరిత్రుండగు పుత్రుం డుదయించు నతం డమితతేజో
వంతుండై స్వవిక్రమంబున పృథ్వీచక్రం బేలుచు శౌర్యధైర్య
సాహసంబులచే వితరణశీలుండై విక్రమనామంబున జగద్విఖ్యాతింజెం
ది శకపురుషుండై ప్రకాశించు. నేనా తనూభవుని వదనావలోకనమా
త్రంబున శక్రశాపమోచనుండనై స్వర్గంబున కేగెదను. నీవాపుత్రు
నిచే ననేకభాగ్యంబు లనుభవించుచు మద్వియోగపరితాపంబు మాని
సంతసంబున మెలంగు" మని దనశాపకారణమూలంబు దెలియపఱచి
వేగంబున గర్దభరూపంబు ధరించెను. సత్యవతీదేవి గర్భంబు దినదిన
ప్రవర్ధమానం బగుచుండ పురజను లీకుమ్మరకులాలునిచే "నీసుదిరాక్షి
యెవ్వరికూఁతు" రని విచారింప నతం డిప్పడఁతిమిన్న మత్పుత్రిక"
యనియు నేనీ చేడియను ప్రసవనిమిత్తమై దోడి తెచ్చితననియు సమాధాన
పఱచుచుండెను. తదుపరి సత్యవతీదేవి నవమాసపూర్తిజెంది శుభతిథి
శుభవాసర శుభనక్షత్ర శుభయోగ శుభకరణంబున నపారతేజో
మయుండగు సుతుని బ్రసవించి ద్వాదశదివసంబున డోలికం జేర్చి విక్ర
ముండని నామకరణం బొనర్చె నానాఁడా సురోచనగంధర్వుండు
సూర్యాస్తమయానంతరంబున గర్దభస్వరూపంబు విసర్జించి నిజరూ

పంబుచే ప్రకటుండై జాతాపత్యురాలగు సత్యవతీదేవిని సంబోధించి కుమారుని గనబఱచుచు మన నయ్యువిద తత్క్షణంబున విక్రముని గొని తెచ్చి యొసంగెను. సురోచనుం డమితానందంబుచే తనయుని ముఖ కమలంబు విలోకింపుచుండు సమయంబున పాకశాసనుండు శాపవిమో చనకాలంబు దలంచి మాతలిసహితంబుగ విమానంబు ననుప నతం డతిశీఘ్రంబున నవంతికానగరంబు ప్రవేశించి కమలకులాలుని సదనంబు జేరి సురోచనగంధర్వునితో "గంధర్వోత్తమా! సహస్రాక్షుండు యుష్మ చ్ఛాపమోచనసమయంబు దలంచి దివ్యవిమానంబు బంపె. తడవేల? రయంబున విమానంబుపై యలంకరింపుము. స్వర్గంబున 'కేగవలయు" నన సురోచనుండు సత్యవతీ దేవికి డింభకు నర్పించి గమనోన్ముఖుండై నిల్చున్న గంధర్వశ్రేష్ఠుని గనుంగొని యశ్రుపూరితలోచనయై "ప్రాణ వల్లభా. భవత్కారణంబున మజ్జననీజనకులు మోహరహితులై నన్ను గనుంగొనలేరైరి. యుష్మద్వియోగం బేనెట్లు సహింతు? దయాశీలా! నన్నింటి బరిత్యజించుట ధర్మంబగునే" యని శోకింపుచుండ నమ్మహా మహుం డత్యంతదయాన్వితుండై సత్యవతీనేత్రబాష్పంబులు దుడు చుచు "మద్వియోగంబుచే దుఃఖింపకుము నీవు నన్ను ధ్యానించినక్ష ణంబున ప్రత్యక్షంబయ్యెద"నని యనేకవిధంబుల నోదార్చి విమానా రోహణంబు జేయుచు కమునితో "కులాలోత్తమా! సుతసహిత సత్యవతీదేవిని సంరక్షింపు" మని వాక్రుచ్చి త్వరితంబున నాకలో కంబు జేరం డనెను. పిదప శుక్లపక్షపాకరుభంగి విక్రముండు ప్రవర్ధమానుండగుచు సప్తవర్షంబుల బాలుండై యాటపాటలచే పురోసూచిక రాజచిహ్నశైశవం బొనర్చుచు కాలంబు గడుపుచుండి ద్వాదశవత్సరపరిపూర్తి జెంది తోడిబాలుర సహాయంబుచే ననేకవిద్య లభ్యసించి షోడశవర్షంబులు గలిగి రాజభటసహవాసంబుచే యశ్వా రోహణుండై చతురత్వంబున మెలంగుచుండ తత్పురరక్షకసైన్యం బి బ్బాలుని కుశలత్వంబు శ్లాఘించుచు నగరాధిపతి కెఱింగింప నతం డీ విక్రముని నగరరక్షకాధిపత్యపదవిపై నియమించి పురద్వారసమీపం బున నుంచెను. గావున శ్రోతలారా! సురోచనగంధర్వునిచరిత్రం బీప్ర కారంబు గలదు. తద్గంధర్వసుతుండగు విక్రముండు నగరద్వారరక్ష కుండై పాంథుల నికటంబున కేతెంచుతఱి భర్తృహరినాథుండు జంబుక

వ్రజభాషణంబు లెఱింగి "యొకదానవుం డేతెంచును. తత్పిశితాశ
నుని ఖండించి రుధిరతిలకంబు ఫాలంబున ధరించువారి కీ యవంతికా
నగరసామ్రాజ్యంబు లభించు" నని పలుకుచున్న వాక్యంబులు విక్ర
ముండు గ్రహించి వేగంబున కరవాలంబు గొని నలుదిశలు నిరీక్షిం
చుచుండ చిత్రసుగంధర్వుం డంబికాశాపహతుండై నక్తంచరరూపం
బున నానారణ్యంబులు గ్రుమ్మరుచు జంబుకోక్తప్రకారంబుగ నచ్చోటి
కరుదెంచి పాంథులసమూహకోలాహలంబు లాకర్ణించి దుర్బలుండగు
కతంబున మనుష్యరూపధరుండై కాంతిపూరితరత్నచతుష్కంబు నిజహ
స్తంబున బూని జనుచుండ విక్రముండు భర్తరీనాథోదిత రత్నచిహ్నం
బులు గని యసురుండు వీఁడే యని యూహించి శస్త్రఘాతంబున
నయ్యసురుని మస్తకంబు దెగటార్చి తద్రక్తంబుచే ఫాలంబున తిలకంబు
దిద్ది ధీరుండై నిల్చుండ చిత్రసుగంధర్వుండు శాపమోచనుండై నిశాచ
రకాయంబు బాసి నిజస్వరూపంబుచే ప్రసన్నుండై విక్రముని పదున
రోజంబులకు నంకనం బాచరించుచుండ నతనికై మనోహరవిమానం
బేతెంచెను. విక్రముం "డీ చిత్రంబేమి" యని విచారింప చిత్రసుగం
ధర్వుండు శాంభవీశాపకథనం బెఱింగించి విమానారూఢుండై శీఘ్రం
బున దేవలోకంబున కేగె విక్రముండు భూపతన పిశితాశనశవహస్త
మూల్యరత్నంబులు గనుంగొని ముదంబున తద్రత్నంబులు పరిగ్రహించి
భర్తరీనాథుని నవహృదయంబున దలంచి పాషాణసమూహంబున పరు
సంబుపగిది గ్రామధేనువులలో కామధేనువుభంగి మనుష్యజాతిసంఘం
బున నవతరించిన పుణ్యపురుషుండని పొగడుచు నమ్మహామహుని స్నేహం
బున నా కఖండభోగంబులు గలుగునని యూహించుచు త్వరితంబున
నగరద్వారసమీపంబు జేరి రుధిరతిలకం బాద్వారంబుపై దిద్ది పాంథుల
విడిదికి నేతెంచి వ్యవసాయకుల మధ్యప్రదేశంబున గ్రహమండలంబున
బ్రకాశించెడు ప్రభాకరునికరణి ద్యుతిబూని యుపవేశించి యున్న
భర్తరీనాథుని గనుంగొనుచుండ వ్యవసాయకులాగతవిక్రముని తా
మెవరని బ్రశ్నింప నతండు "నేను రాజసేనకుండనై గ్రామరక్షణపరత్వం
బున దిరుగుచుండెదను. నేనీ యామంబున మీకోలాహల నినదంబుచే
తస్కరు లేతెంచిరని తలంచి మీ యోగక్షేమంబులు విచారింప
నిం దేతెంచితి గావున తస్కరులజాడ మీ రెఱ్ఱెఱింగితిరి. స్పష్టప

అను” మన పాంథులా విక్రమునితో “నయ్యా! మే మిచ్చో నిర్భయంబున నివసించియుండ నొకజంబుకసముదయం బేతెంచి గూయుచుండ తద్భాషాభిజ్ఞుండగు నీభర్తరీనాముం డెఱింగి మాకావృత్తాంతంబు దేటతెల్లంబుగ దెలియపఱచె నందుచే మునుముందు స్వహస్తంబుల శస్త్రంబులు ధరించి చోరుల పొగురడంచితి”మని విన్నవింప విక్రముండు సప్రేమచే భర్తరీనాథుని దర్శించి కొంతవడి పాంథులతో మధురసంభాషణంబులు సల్పి తిరిగి నిజసదనంబున కేతెంచి యుదయంబున శౌచంబుకై జనుచుండ వ్యవసాయకుల ధాన్యసుంకంబు బుచ్చుకొను పురుషుండు హఠాత్తుగ నెదుర నేతెంచుచుండం గని విక్రముం డాపురుషశ్రేష్ఠునితో “నయ్యా! గ్రామబాహ్యంబున బహుధాన్యంబుచే వ్యవసాయకులు నివసించి యున్నారు. మీరా ధాన్యసుంకంబున కపేక్షింపవలదు. నే నా సుంకద్రవ్యంబునకు ముమ్మడిధనం బొసంగెదను. తత్పాంథజనసంఘంబున శోభిల్లెడు భర్తరీనాముని మత్స్వాధీనం బొనర్పుము. తత్కారణం బెయ్యది యన భర్తరీనాముండు మద్బంధుండై దైవయోగంబున నన్నెడబాసి వ్యవసాయకుల వెనువెంట గ్రుమ్మరుచుండుగాన నాయం దనుగ్రహించి యబ్బాలుని సమకూర్చిన నీ కనేకపుణ్యంబు లభించు” నని యనేకవిధంబుల బొగడుచుండ నతండు నిర్జీవశరీరంబు సజీవంబైనచందంబున సుఖదుఃఖ

—విక్రమభర్తరీనాథులకు భ్రాతృభావసఖ్యం బొనగూడుట.—

కారకంబగు ద్రవ్యలోభత్వంబుచే హర్షించి “యక్కార్యం బీడేర్చెద” నని వాగ్దత్తం బొసంగి స్వస్థానంబున కేగి యొకభృత్యునితో వ్యవసాయకుల గొనితెమ్మని యాజ్ఞాపింప వాఁ డతివేగంబున పాంథజనకుటీరంబులు జేరంజని ధాన్యసహితంబుగ వారిని దోడ్కొని యేతెంచెను. తత్క్షణం బా వ్యవసాయకులంగని “మీమండలంబున భర్తరీనామ పురుషశ్రేష్ఠుం డెక్కడ” యని విచారింప వార లతివేగంబున భర్తరీబాలుని సుంకరిపురోభాగంబున నిలుప నతం డబ్బాలుని రూపలావణ్యంబుల కచ్చెరువొంది యీనరోత్తముండు కేవలావతారపురుషుండు గానోపు నని మనంబున నిశ్చయించి యితం డీ నగరంబున నివసింపఁదగియుండు. మూఢమతులగు వ్యవసాయకుల పజ్జ నుండ

దగదని వితర్కించి వ్యవసాయకముఖ్యనాయకుని నేకాంతంబునకు గొని పోయి "మీధాన్యంబునకు శుల్కంబు విచారింపను. మీధాన్యంబిచ్చో బకవైచి శీఘ్రంబున మీగ్రామంబులకేగి ధాన్యంబు దెచ్చి నిర్భయం బుచే విక్రయించుకొను" మనుచు భర్తరీబాలుని జేరబిలిచి "పురుష ముఖ్యా! ఈవ్యవసాయకులేగి ధాన్యంబు గొనితెచ్చువఱకీనగరంబున నివసించి యీధాన్యంబు విక్రయింపుము. నీకై మత్సహాయం బొసం గెద" నన భర్తరీజనితుం డవశ్యం బని ప్రత్యుత్తరం బివ్వ నావ్యవసా యకులు హర్షంబుచే తమతమధాన్యంబు లాసుంకరిగృహంబున నుంచి యందుకై భర్తరీబాలుని నియోగించి "మే మతివేగంబున ధాన్యంబు గొనితెచ్చెదము. మాకార్యంబులు జక్కపెట్టుదు" రని వినయపూర్వ కంబుగ మనవిజేసి తమనివాసస్థలంబుల కేగిరి. పిదప నతండు విక్రము నిబిలచి యతిరహస్యంబున దనకృత్రిమంబు వెల్లడి యొనర్చి "నాకిచ్చె దనన్న ద్రవ్యం" బిమ్మని విచారింప విక్రముం డొకమహారత్నం బా శౌల్కికునకు బహుమతి యొసంగి దనడెందంబున భర్తరీబాలునకు మీబంధులమని దెలియపఱచి మాయింట విందారగింపు మని యొకం బఱచి నిజసదనంబునకు దోడ్కొని జని భోజనాదులచే సంతుష్టిపఱచితి నేని యితని స్వరూపప్రకటనం బగునని తలంచి రహస్యంబున సుం కరి కెఱింగింప నతండు విక్రమునితో "నయ్యా! ప్రతిదినంబు మాగృ హంబున పదార్థంబు గొనిపోయి యుష్మజ్జననీహస్తపాకంబుచే యిభ్భ ర్తరీబాలుని దృప్తిపఱచుచుండు"మని నుడువ విక్రముండు హర్షించి భర్తరిని దనగృహంబునకు దోడ్కొనిపోయి దనతల్లియగు సత్యవతీ దేవికి నిశామృగభాషణాది వృత్తాంతంబు దనకు లభించిన రత్నచతు ష్కచరిత్రం బిమ్మహాఘునునికతంబుచే నని దెలిపి "తల్లీ! అద్యాది యీ భర్తరీపురుషుని మత్తుల్యంబుగ భావించి భోజనాసనాదులచే గాపా డుచు మజ్జ్యేష్ఠపుత్రుండని నిర్భేదంబున ప్రసిద్ధి యొనర్పు మిమ్మహాపురు షుండు ప్రత్యక్షావతారఘనుండు గాబోలు" నని యుక్తియుక్తంబుల నిగదించి యాపై భోజనంబు సల్పి విక్రముండు రాత్రి ప్రథమయా మంబున నిత్యనియమప్రకారంబుచే ద్వారరక్షకపదవిపై జనెను. ఇట భర్తరీజనితుండు భోజనానంతరంబున సుంకరిగృహంబున కేగ నయ్యధికారి గృహిణి భర్తరీనాథునితో "నీవిచ్చో మా

యవసరసమయంబున కార్యసహాయుండవు గ" మ్మన నందు కంగీకరించి పునర్విక్రమసదనంబునకు జేరంజనెను. ఇట్లు భర్తరీనాథుం డుభయ మందిరంబుల సంచరించుచు ననుదినంబు నిజచతురత్వంబున పుర జనులచే లాలింపఁబడుచుండెను. తదనంతరం బా సత్యవతీ దేవి విక్ర మోక్తప్రకారంబుగ జ్యేష్ఠపుత్త్రుం డని మదిదలంచి యంతకంతకు ప్రే మాతిశయంబు గలిగి వత్సంబుపై ధేనువువిధంబున నంతఃకరణ పరి పూర్ణత్వంబుచే రక్షింపుచు జలంబు బాయని వాలుగంబుపగిది భర్తరీముఖ్యుని నెడబాయక విక్రమసమేతంబుగ సమయంబు గడపు చుండెను.

ఇతి భక్తిసారసనాథచరిత్రంబున విక్రమభర్తరీచరిత్రంబు షడ్వింశాధ్యాయము సంపూర్ణము.

---

## సప్తవింశత్యధ్యాయము.

విక్రమార్కుండు శుభవిక్రమనృపాలుని కూఁతును వివాహంబాడి తద్రాజ్య పట్టాభిషిక్తుండగుటయును, తద్వద్భర్తరీనాథుండు సుమంలీకనామ సచివోత్తముకూఁతును వివాహంబాడి యువరాజ్యపట్టాభిషిక్తుం డగుట.

ఇట్లీ భర్తరీ విక్రము లేకోదరులకైవడి యన్యోన్యస్నేహంబుచే సమయంబు గడుపుచుండ నొకనాఁ డా యవంతికాపురాధిపతియగు శుభవిక్రముం డంతఃపురంబున మణిఖచిత సింహాసనంబుపై యుపవేశిం చి వివాహానుకూల నిజదుహిత నీక్షించి దనమంతనంబున నిమ్మేధావతి నిష్కళంక ముఖకమలంబు గని కలాధరుండు సిగ్గరి యుప్పురవీథి జరిం చెనో? యిమ్ముద్దియనయనంబుల కలిమికై కల్వములజవరాలు సలిజంబే నిలయంబుగాఁగొనెనో? చెలిశ్రోత్రంబులు దలంచి శ్రీకారంబు ద్వివి ధాకారంబు బూనెనో? లోలాక్షియధరం బే బింబంబని నిక్క చూచుటకు శుకనికరంబు వృక్షశాఖాగ్రంబులపై వ్రాలెనో? సుందరీమణి మృదుమధురోక్తుల సాధింప నలువరాణి విపంచిని బూనెనో? తరళాక్షిగళసౌందర్యంబున కోటుబడి జలజంబు మ్రోత

లిడెనో? తన్వీమధ్యంబున కెనలేని నిజమధ్యంబు గని సింగం బాగ్ర హంబున చెలికుచకుంభంబులబోలు కరికంభంబులపై కెగిరెనో? యువిదతనుకాంతి కెదిరించు మించు లా చపలాక్షి చూపుతూపుల భయంబుచే చపలంబు లయ్యెనో? సర్వావయవలావణ్యనిధి యగు నీ మేధావతీనారి న్నిరీక్షించుటకు సుర లనిమిషత్వంబు వహిం చిరో? యని యూహించి సుమోచనపరుండగు సుమంతీకుండను సచివుని బిలిచి "మంత్రిముఖ్యా! మేధావతీదేవి వివాహంబున కనుకూలవతి యయ్యెను గావున సర్వలక్షణయుతుండగు వరుని శోధింపు" మని యాజ్ఞాపింప సుమంతీకుండు "నరేంద్రోత్తమా! మీకు పురుషసంతానంబు లేదయ్యె. మీ శరీరంబు జరామయంబై విషయ సుఖంబుల దొలంగె. నికముందు సంతానంబు వడయుట దుర్లభంబు. సకలగుణసంపన్నుండగు వరుని గొని తెచ్చి యిమ్మేధావతీదేవికి వివాహం బొనర్చి జామాతృనకు రాజ్యపట్టాభిషేకం బొనర్పవలయు నతనిచే నుభ యకులపవిత్రకరుండగు దౌహిత్రలాభంబు నొందవలయు నని యస్మద భిప్రాయంబు గల" దన శుభవిక్రముండు హర్షించి "ప్రధానశేఖరా! సర్వేశ్వరాయత్తచిత్తులమై యొక వేదండశుండంబున పుష్పహారంబుంచి యనేకవైభవంబుల చే నూరేగింపవలయు. భగవత్ప్రేరేపితబుద్ధిచే నయ్యి భరాజం బే పురుషశ్రేష్ఠుని గళంబున హారంబుంచునో యానరోత్త మునకు రాజ్యపట్టాభిషేకం బొనర్పవలయు. పిదప మేధావతీకన్యక నొ సంగి వివాహంబు సల్పవలయు" నని స్పష్టపఱిచెను. సుమంతీకుం డందు కంగీకరించి యొకసుదివసంబున మహోత్సాహంబుచే యమూల్యవ స్త్రభూషణాలంకారంబుల ద్విరదంబును శృంగారించి శుండాగ్రంబున పుష్పమాలిక నొసంగి నరపుంగవుం డమాత్యభటనటపురోహిత పరి వృతుండై యూరేగింపఁదలంచి మునుముందు రాజసభ కేతెంచి తత్ స్థలంబు బాసి కుంజరంబు స్వేచ్ఛావిహారంబున పురవీథులు గ్రుమ్మరుచు నేతన్మహోత్సవసందర్శనోత్సుకులై యేతెంచిన యన్యపురనివాసుల నిరీ క్షించుచు నగరద్వారసమీపంబున కేతెంచి మందగమనంబుచే నలు దిశలు విలోకింపుచుండ నృపుండు సంశయమనస్కుండై ద్వారోపరిభా గంబున నివసించు రక్షకభటుల నాహ్వానం బొనర్ప వార లతివేగం బున నేతెంచి భూరమణుని పురోభాగంబున నిల్చున్నంత నమ్మదవా

రణం బతిశీఘ్రంబున జనుదెంచి పరాక్రమధుర్యుండగు విక్రముని గ్రీవంబున హారం బుంచెను. నృపుం డా రూపలావణ్యవిశేషుండగు విక్రముని గనుంగొని యత్యంతానందంబుచే తత్షణం బా గజేంద్రం బుపై నెక్కించి భేరీభాంకారప్రముఖ నిఖిల నినదంబులతో సభామం టపంబునకు దోడ్కొని యేతెంచి స్వర్ణమయదివ్యసింహాసనంబుపై గూర్చుండ నియమించి మృదుభాషణంబులచే సంభాషించుచు కుల గోత్రంబులు వెల్లడి యొనర్చి కులాలుండని గ్రహించెను. మహీధ వుండు పరితప్తమానసుండై కుంభకారకులంబునకు కువలయేశ్వరకుల సంబంధం బెట్లు ఘటించు? నెంచిచూడ మహానింద్యంబుగాదే? యగ మ్యంబగు పరమేష్ఠి సృష్టినిర్మాణం బెవరెఱుంగుదురు? కులాలవంశం బున నిట్టి సర్వలక్షణోపేతుండు జన్మించుట యరుదుగాదే? యని శం కించి మతిమంతుండగు సుమంతుని బిలచి గోప్యంబున "నిప్పురుషుండు కులాలజాతుండో లేక నితరజాతుండో పరిశీలింపు" మన నతం డవ శ్యంబని రయంబున పురద్వారనికటంబు జేరి రక్షకభటులతో "విక్ర ముం డేజాతిపురుషుం" డని విచారించెను. వార లత్యంతభయభక్తు లచే "నయ్యా! మే మా పురుషశ్రేష్ఠుని ఘటకారకులజుండు గానోపు నని యూహించెదము. కమఠనామకులాలుని సదనంబున నతండు నివ సించు నింతియదప్ప యన్యం బే మెఱుంగ" మని విన్నవించిరి. పిదప కుశలమతియగు మంత్రిపుంగవుం డక్కులాలుని గృహంబున కేతెంచి రహస్యంబున కమఠుని విచారింప విక్రముని జనకుండు సురోచనగంధ ర్వేం డనియు, మిథిలానగరాధిపుండగు సత్యవర్మ దుహితయగు సత్య వతీదేవి తల్లి యనియు గతచరిత్రం బంతయు విశదీకరించెను. సచివో త్తముండు పరమానంద భరితుండై కమఠకులాలుని వెంటగొని రాజ భవనంబున కేతెంచి విక్రమజన్మకథావృత్తాంతం బా కమఠునిచే పృథ్వీశున కెఱింగించెను. జననాయకుండు మితిలేని యానందంబుచే "మంత్రిముఖ్యా! నీ వీ కమఠుని గొని పరివారసహితుండవై మిథిలాన గరంబున కేగి సత్యవర్మనృపశ్రేష్ఠున కీ వృత్తాంతంబు శ్రుతపఱచి బహువిధ సన్మానంబులచే దోడితె" మ్మని యాజ్ఞాపింప నతం డవశ్యం బని రయంబున పృతనాసహితుండై మిథిలానగరంబు జేరంజన సత్యవ ర్మనృపుం డా మంత్రిపుంగవుని యాగమనం బెఱింగి సపరివారుండై

యెదుర్కొని నిజభవనంబునకు గొనితెచ్చి యేకాంతంబున మంత్రిస హిత కమఠకులాలునితో కుశలప్రశ్న జేయ నక్కమఠుండు "రాజోత్తమా! భవద్దుహిత యగు సత్యవతీగర్భంబున సురోచనగంధర్వునిచే పుత్రుం డుద్భవించె నయ్యతులితతేజోఘనుండగు భవద్దౌహిత్రుండు విక్రమాభిధానంబుచే బ్రకాశించి దైవయోగంబున నవంతికా సింహాసనాధిపత్యంబు వహించె" నని నిఖిలవృత్తాంతంబు దేటపఱచెను. సుమంతీకమంత్రిపుంగవుండు నృపాలోత్తమునితో "యుష్మద్దౌహిత్ర పట్టాభిషేక మహోత్సవంబు వివాహసమారంభంబు విలోకించుటకై యవంతికానగరంబునకు దయచేయు" మన సత్యవర్మ పృథ్వీశుం డతి కుతుకంబుచే ననేకదళసమేతుండై యవంతికానగరంబు ప్రవేశించి మునుముందు సత్యవతిని గనుంగొని యశ్రుపూరితనయనుండై క్షేమ సమాచారంబులు విచారించి యత్యంతగారవంబున లాలించి తదుపరి శుభవిక్రమునితో గూడి పరమసంతోషంబుచే స్వదౌహిత్రుండగు విక్రమునకు రాజ్యపట్టాభిషేకం బొనర్చెను. విక్రముం డా సమయంబున మహావితరణశీలుండై తత్పట్టాభిషేకమోదంబుచే యాచకజనసంతుష్టి యొనర్చెను. తదనంతరం బా శుభవిక్రముండు దనపుత్రికయగు మేధావతీదేవిని విక్రమున కొసంగి యనేకవైభవంబులచే వివాహం బొనర్చెను. సత్యవర్మనృపుం డా విక్రమునిరూపగుణధైర్యంబుల కానందించి దన మిథిలానగర పట్టాభిషేకోత్సవంబు సలిపెను. విక్రముం డుభయ రాజ్యంబులకు సార్వభౌముండై భర్తరీనాథున కవంతికారాజ్యంబునకు యువరాజ్యాభిషేకంబు గావించి నిర్మలచిత్తుండై రాజ్యంబేలు చుండ సుమంతీక మంత్రిపుంగవుండు భర్తరీనాథుని సౌందర్యం బాలోకించి యిమ్మహాఘనునకు దనకొమార్తె యగు పింగళా యను నారీమణి సర్పింపవలయు ననియు విక్రమనరనాయకునిచే నాలోచించి తిథి వారనక్షత్రంబు లేర్పఱచెదననియూహించుతఱి యొకరజకుండేతెంచి "సచివోత్తమా! భర్తరీపురుషుని జాతిభేదంబులు విచారింపు" మనెను. సుమంతీకుం డాక్షణంబున కమఠకులాలుని బిలచి భర్తరీపురుషుని కుల గోత్రంబులు విచారింప నక్కుంభకారుం డే నెఱుంగననియె ననంతరం బా సుమంతీకుం డంతఃపురంబున కేగి రాజమాతయగు సత్యవతీదేవిని "నీ కీ భర్తరీపురుషశ్రేష్ఠుండు సుతుం డెట్లయ్యె" నని విచా

రింప నమ్మగుప "సద్గర్భోద్భవుండు గాఁ" డనియె. పిదప నృపుండగు
విక్రమునిచే నీసంశయంబు బాయునని దలంచి యేకాంతంబున "నృ
పాలశేఖరా! భర్తృహరీనాముండు భవత్సహోదరుం డెప్పుగిది యయ్యెనో
దయజేయు" మన నమ్మహీవల్లభుండు స్నిగ్ధభావంబున ననుజుం డయ్యె
గాక నితని జన్మవృత్తాంతనైజం బే నెఱుంగ" ననియె. నాపై భర్తృహరిని
విచారించిన విశదం బగునని తలపోసి రహస్యంబున "పురుషశ్రేష్ఠా!
యుష్మజ్జన్మచరిత్రంబు శ్రుతపఱచు" మన నమ్మహామహుండు హరివీర్య
పూరిత భర్తృహరీపాత్ర ప్రముఖ కురంగపోష్య జయసింగ భాటపోష్య కథ
నంబు సవిస్తరంబుగ దెలియఁబలికెను. సుమంతీకుం డతిగహనంబగు
జన్మచరిత్రం బాలకించి దనహృదయంబున భర్తృహరీవాక్యంబులు నిశ్చ
యంబు లెట్లాను? సూర్యవీర్యపతనం బెక్కడ గర్భాధారంబు లేక భిక్షా
పాత్రంబున జన్మించు టెక్కడ? విచారింప స్వలాభంబుకైవచించిన కల్పి
తంబులని దలంచి భర్తృహరితో "వత్సా! యుష్మజ్జనకుండు కమలమిత్రుండే
నిక్కంబేని వివాహమంగళ కార్యప్రారంభంబుకై యతనిచే ననుజ్ఞ
బొందవలయుగాన నద్దినేశుని యాహ్వానం బొనర్పు" మనెను. భర్తృహరీనా
థుండ వశ్యంబని రయంబున బహిరంగణంబున కేతెంచి హస్తంబులెత్తి
"జగద్రక్షకా! నే నీ వీర్యంబున నుదయించుట సత్యంబేని నావివాహ
శుభకార్యంబున కరుదెంచవలయు" నని దీర్ఘశబ్దంబుచే బలుకుచుండ
సర్వవ్యాపకుండగు ప్రభాకరుం డతివేగంబున నవంతికాపురసౌధాగ్ర
సమీపంబున వాతచక్రాధారుండై నిల్చి "సుమంతీకా! భర్తృహరీజనితుండు
మత్పుత్రుం డౌట యథార్థంబు నిస్సంశయుండవై యుష్మత్సుత నొసంగి
వివాహంబు సల్పుము. నరపతుంబున విక్రమజనకుండగు సురోచన గం
ధర్వోత్తముండు సమస్తమంగళద్రవ్యంబులు గొని యేతెంచు. సుర
సంఘంబు మంగళతూర్యంబు లొనర్చుచు పుష్పవర్షంబు గురిపిం
చును. నానిజరూపంబున మర్త్యభూమి కేతెంచెదనేని మత్కిరణ
జ్వాలలచే ననర్థంబు వాటిల్లు" నని సెలవొసంగి స్వస్థానంబు జేరెన్పు
సుమంతీకుండు పరమాహ్లాదంబుచే. శుభదివస శుభలగ్నం బేర.
అచినంత సురోచనగంధర్వుండు మంగళకరవస్తుజాలంబులు గొని
రయంబున నేతెంచి సత్యవతీపురోభాగంబున నిల్చుండ నక్కాంతా
మణి భక్తి వినయంబులచే వల్లభుని పదపల్లవంబులకు ప్రణమిల్లి తన

యుండగు విక్రముని కెఱింగింప నతం డతులితానందంబున జనుదెంచి జనకుని చరణంబులకు వందనంబిడి ప్రధాని శేఖరుండగు సుమంతీకుని సదనంబునకు దోడ్కొని జన సచివోత్తముం డనివారిత ముదంబుచే పులకాంకితశరీరుండై గంధర్వశ్రేష్ఠుని పాదంబులపై ఫాలంబు మోపి పొగడుచుండ సులోచనుండు "సుమంతీకా! నీభాగ్యవిశేషం బెంతని యూహింతును? ప్రత్యక్షద్రుమిలనారాయణుండు భవజ్జామాతయై వెలయుట సామాన్యంబే" యన సుమంతీకుండు గంధర్వముఖ్యునకు పునఃపునర్వందనంబు లాచరించి యుష్మత్కరుణాకటాక్ష ఫలితంబని గొనియాడుచు సీమంతపూజకై శుభమంటపంబున కేగవలయు దయ జేయు మన సులోచనుం డనశ్యం బని మనుష్యవేషధారియై వరపక్షం బున విధ్యుక్తమంగళకార్యంబులు నెరవేర్చి సుముహూర్తసమయంబున మహీసురోత్తములు మంగళాష్టకంబులు పాడ బృందారకబృందంబులు మంగళవాక్యంబులచే లతాంతంబులు వర్షింపుచు నంబరంబున విమానారూఢులై జయజయశబ్దంబులచే కిరతాళంబులు వాయింపుచుండ వధూవరుల మస్తకంబుల విన్యస్త మౌక్తికులై పరమానందంబున దినపంచకం బచ్చో నివసించి మహావైభవంబులచే యాచకజనహృదయసంతోషం బొనర్చి విక్రమనృపాలుని భవనంబున సులోచనుం డొకమాసంబుండి శుభవిక్రముని యనుజ్ఞ గొని నిజధామంబున కేగెను. పిదప భర్తరీనాథుండు ద్వాదశశత సఖీమణుల వివాహంబులాడి యసదృశభోగభాగ్యంబులచే సర్వకళావిశారదత్వంబున సుదతీసంఘ మనఃపద్మవిహార మధుకరుండై ఘోరాటవి భ్రమియించు మత్తేభంబుకై వడి విహరింపుచు ముఖ్యమహిషి యగు పింగళాదేవి నవ యౌవనార్పితచిత్తుండై జలంబు బాయని కర్దమంబుభంగి యన్నుల సమూహంబున నవలక్షనక్షత్ర మధ్యప్రదేశంబున ప్రభాసించెడుమృగాంకుని చందంబున దేజరిల్లుచు దినదినంబు పింగళాదేవి స్వరూప లావణ్యంబుల కత్యంతలోలుండై కాలంబు గడుపుచు వయోవృద్ధుండయ్యెను. ఒకానొకదివసంబున భర్తరీనాథుండు మృగయావినోదంబుచే నరణ్యంబున కేగుచుండ సహస్కరుండు సుతుండగు భర్తరీనాథుని బొడగాంచి దనమనంబున మదీయవీర్యభాగంబుచే నగస్త్యం డుదయించి స్వహితం బొనర్చుకొనియె. భర్తరీజనితుండు రాజ్యసుఖసంపద్బద్ధ

చిత్తుండై నిర్మలజ్ఞానవైరాగ్యమార్గనిష్ఠఁ బ్రకంటకుండయ్యె. విషతుల్యవిషయసుఖంబు లెప్పుగిది దొలంగునో ద్రుమిలనారాయణావతారఘనుండై నాథముఖ్యుల మార్గం బాశ్రయింపక నిజకార్యంబు దలపెట్టఁడయ్యె నని వితర్కించి శీఘ్రంబున ననసూయాపుత్రుండగు దత్తాత్రేయుల సన్నిధికి విచ్చేసి "దయాఘనా! ద్రుమిల నారాయణుండు మద్వీర్యంబున జన్మించి భర్తరీనామంబుచే తుచ్ఛసంసారలంపటుండై స్వహితం బెఱుంగక వైభవంబులచేఁ బ్రకాశించుచుండును. యుష్మత్కృపాకటాక్షంబుచే మత్స్యేంద్రాదులు పరిపూర్ణతపోయోగంబున బ్రతాపధ్వజులై విలసిల్లిరి. మత్సుతుండగు భర్తరి భవదనుగ్రహంబునకు పాత్రుండు గాఁడే" యని సవినయుండై విచారింప నమ్మహామహుండు "కమలమిత్రా! భవిష్యత్పురాణోదిత 'యావన్మహీ తావజ్జతీ' యనువాక్యంబు రిత్తవోవునే? భర్తరీజనితుండు మదనుగ్రహపాత్రుండై మహాతేజంబున చిరంజీవిత్వంబున గీయమాన-గుణకదంబుండగుట నిశ్చయంబని దలంపుము. నీ వీ సంశయంబుడుగు" మని యవ్విభాకరుని నిజస్థానంబున కనిపి జగదుద్ధారఘనుండగు దత్తాత్రేయుండు భర్తరికై నేగుచుండెను.

{ భర్తరీనాథుఁడు వేఁటకై యరణ్యంబున కేగి భ్రమియించునెడ శ్రీగురుదత్తాత్రేయ సందర్శనం బగుట. }

ఇట భర్తరీశ్రేష్ఠుండు నవరత్నస్థగిత నానావిధభూషణభూషితంబులై సమీరగమనంబులచే విహరించు చతుర్దశలక్షతురంగంబులతో రమణీయమణిమయస్వర్ణచిత్రితఝల్లరీయుతదివ్యాంబరంబులచే నమూల్యముక్తాహారపరిశోభిత సుగ్రీవులగు మత్తశుండాలంబు లొకలక్షగొని కృతాంతభట మదవిదారక దోర్బల భటసమూహాన్వితయగణిత పృతనలచే కాననాంతర హరిశరభకిరికిటిప్రముఖాఖిలక్రూరమృగసంచయంబును నఱకుచు నుఱుముచు నుగ్గడంచుచు భయంకరగిరిశిఖరంబులపై కేగుచు నుష్ణాంశురశ్మిచే డస్సి యధోభాగంబున కరుదెంచి తృషార్తులై తోయంబులకొరకతివేగంబున విపినంబు ద్రిమ్మరి జీవనంబులు గానక కొందఱు తమప్రాణంబు లూడుననియు నొకకొందఱీ తృష్ణానలంబుచే శరీరంబు దహించు ననియు మఱికొంద ఱీయర

ణ్యంబున జలంబు లెట్లు ఘటియించు ననుచు కలకలరవంబులచే నజు చుచుండ తద్వ ద్భ ర్తర్యుద్భవుండు పిపాసాహతచేతనుండై నీరంబుల కై శోధింపుచుండెను. తత్సమయంబున సురవందిత చరణుండగు దత్తుం డు గుప్తవేషంబున భర్తరి వెనువెంటం జనుచు నొక్కచో మనో హర సుగంధ ప్రపూరిత మహీరుహచ్ఛాయాచ్ఛాదితంబై శశికాంత మణివేదికలచే నొప్పారు స్వచ్ఛతరవారిసహితంబగు కేళాకూళిం గల్పింప నత్యాతురుండగు భర్తరీసంభవుం డక్కమలాకరంబు గనుం గొని పరుగులిడుచు తోయంబు లానుటకు కరంబులచే స్పర్శింపుచుండ తపోధూర్జటి యగు యత్రిసూనుండు నిజహస్తంబులచే నెద జరుచు కొనుచు భర్తరిపై కరుదెంచి "యారా! నీకులం బెయ్యది? నీస్వరూ పం బెట్టిది? మజ్జీవనంబు లేల స్పృశించితివి? దెలుపు" మన నతం డతి చకితుండై మౌనంబున నిల్చుండ దత్తుండు "నీజననీజనకు లెవరు? గు రువెవండు? సవిస్తరంబుగ దెలియంబలికి జలంబులు గ్రహించెదవేని బ్రతుకుగలదు. లేకున్న పానమాత్రంబున పంచత్వంబు నొందెద" వన ననసూయానందనుని పదకంజంబులపై వ్రాలి "మజ్జనకుండు కమలా త్తుండు. భర్తరీపాత్ర మజ్జన్మస్థానంబు. గురుస్వరూపం బే నెఱుంగ" నన దత్తుండు "ఔరా! నీ పూర్వజన్మదోషం బెట్టిదని దలంతు. గురు కటాక్షంబునకు పాత్రుండు గాని నరుం డధముండు గాండే? నీచాత్మా! మత్తోయంబులు ప్రాశించుట కనర్హుండవు గావే? నష్టా! నీయట్టి క్రియాభ్రష్టు లీ నిర్మలోదకంబులు స్పర్శించిరేని యయ్యవి యదృశ్యం బగును. తదవసరంబున మత్క్రోధాగ్నిచే నిన్ను భస్మం బొనర్చెద" నన నమ్రుండై "దయాసముద్రా! నీరంబునకై మత్ప్రాణంబులు హరించును. నాకీ సమయంబున ననుగ్రహం బొసంగి ప్రాణంబులు గాపాడు" మని బొగడుచుండ నత్రినందనుండు "మూర్ఖా! హరిహర బ్రహ్మాదుల కలవిగాని యస్మదనుగ్రహంబు యఃకశ్చిత్పురుషాధమున కెట్లులభించును? విచారంబులేదే" యన భానువీర్యోద్భవుండు "క్షమా శీలా! జగదుద్ధారక పురుషోత్తములైన మీయట్టి పాపాత్ముల పవిత్రుల నొనర్పక నుపేక్షింతురే? కరుణాజలధే! కడతేర్పవే" యని యార్తశ బ్దంబుల బలుకుచుండ "భర్తరీజనితా! నీశరీరం బనుగ్రహయోగ్యం బె ట్లగును? ద్వాదశవర్షంబులిచ్చో తపం బాచరించితివేని తదుపరి యను

గ్రహంబొసంగెద. నీ విందు కంగీకరించి యుదకంబులు పానంబు జేయుము. త్రికరణశుద్ధిచే జలంబులు బూని తపోనంతరంబున తుచ్ఛ సంసారకూపంబున కాశింపక వైరాగ్యఘనుండనై ప్రకాశించెదననియు వమనతుల్యంబులగు రాజ్యభోగంబులు గోరననియు సంకల్పంబు జేయు"మన దివాకరసుతుండు "దీనశరణ్యా! సంసారసుఖాపేక్షులుడుగ లేదు. పితృఋణ కాంతాఋణంబులు దీఱవయ్యెను. పుత్రసంతానంబు బడసి స్నుషాలాభంబు బొందిన జాయాఋణంబుదీరు. గయాప్రయాగాది పుణ్యతీర్థంబుల తిలోదకంబు లొసంగ పితృఋణంబు దీరు నేత త్ప్రభృతి ద్వాదశవత్సరంబులు సంసారభోగంబు లనుభవించి యాపై తపం బాచరించెద" నన దత్తాత్రేయుం డౌగాక యని కమండలంబుచే నుదకంబు దెచ్చి "వత్సా! తోయంబులు హస్తంబున గొనుము." ద్వాదశవత్సరంబులకు తపప్రారంభం బొనర్తు ననియు తనుమనోధనంబులు గురుచరణార్పితంబులనియు త్రికరణశుద్ధిచే నుడివించి జలంబు ల్విడిపించి మస్తకంబున నిజహస్తం బుంచి గురుమంత్రరహస్యం బుపదేశించి "పుత్రా! నాస్వరూపంబు గనుఁగొంటివే? నే నత్రిసూనుండ" నని నిజరూపంబు గనుబఱచి సరోవరసహితంబుగ నదృశ్యంబయ్యె. భర్తరీనాథుం డత్యాశ్చర్యంబుచే "తోయపానంబు లభించదయ్యె. గురుసమర్థా! నన్నీకష్టంబులపా లొనర్చుట దగునే" యన దత్తుండు పునఃప్రసన్నుండై భోగవతీనదీప్రవాహంబును గల్పింప నయ్యది మహానినదంబుచే ఘూర్ణిల్లుచు గమనించుచుండెను. పిదప సురభి నావాహించి మధురసపక్వాన్నంబులు మహీధరంబుకైనడి నేర్పఱచి "పరిగ్రహింపు" మన భర్తరీనాథుండు చమూసహితుండై తత్తోయంబులు ప్రాశించి సిద్ధాన్నంబుచే దృప్తుండై దత్తాత్రేయ చరణకమలంబులు విలోకింపుచుండ తత్క్షణం బా భోగవతీ కామధేనుసహితుండై దత్తుం డదృశ్యుండయ్యె. భర్తరీనాథుండు దళసమేతుండై నిజనగరంబున కేతెంచెను.

ఇతి భక్తిసార నవనాథచరిత్రంబున విక్రమభర్తరీ రాజ్యాభిషేకాది కథావిశేషంబు సప్తవింశాధ్యాయము సంపూర్ణము.

---

## అష్టావింశత్యధ్యాయము.

భర్తరీనాథుండు పురంబు ప్రవేశించి పింగళాదేవితో పణంబొనర్చి యరణ్యం
బునకరిగి భర్తరీనాథుండు మృతుండయ్యెనని వార్తనంప
నప్పింగళాదేవి ప్రాణంబులంబాయుట. తదుపరి భర్తరీనాథుండు పింగళా
వియోగదుఃఖంబుచే శ్మశానంబున నివసించి దుఃఖించుట.

భర్తరీనాథుండు పృతనాసహితుండై నిజపురంబున కేతెంచి సభా మంటపంబున కొంతవడి మార్గాయాసంబు దీర్చుకొని రయంబున పాకశాల జేరంజని భోజనం బొనర్చి స్వర్ణమయసోపానసహితేంద్ర నీలమణిఖచితకుడ్యనిర్మితంబై కర్పూరాగరుసుగంధధూపపరిమళవం తంబగు పింగళాదేవి కేళీగృహంబు బ్రవేశించి చంద్రచంద్రికాధవ ళంబగు మృదుపర్యంకంబుపై యుపవిష్టుండైనతత్క్షణం బా వినూత్న విద్యుల్లతాతన్వియగు పింగళాదేవి మోహాభవసల్లాపంబుచే నర్ఘ్య పాద్యాదివిధుల పతిచిత్తం బిగురొత్త బూజలొనర్చుచుండ చండకరసు తుండత్యాదరంబున కాంతామణిని గౌఁగిటం జేర్చి మూర్ధంబు నివురు చు చుబుకంబు చుంబించి "కలహంసగామినీ! నీయసదృశ రసభరిత మృదువచన నైపుణ్యంబున కే ననిశంబు వశుండనైతి గాక నీయట్టి గుణంబులదొంతి పూర్ణేందుని హసించు ముఖకాంతి యస్మదాశ్రిత మదవతీ సముదయంబున గంటినే? మచ్చిత్తంబు ఘృతమిశ్రిత మధు రంబుపగిది నకూపారోద్యత్తరంగంబుభంగి నీయం దైక్యంబయ్యె. పింగళే! భీతకురంగదృగ్యుగళే! నీహొయలు నీనడలు కలభంబులకైన గలదే?" యని శ్లాఘించుచు నంతకంతకు శంబరాంతకాకర్ణాంతపూరిత లతాంత విశిఖహతహృజ్జలజాతుండై నాగకమఠప్రముఖ బంధంబుల సురతసుఖార్ణవంబున నోలలాడి సుఖాసీనుండై యుండ నమ్మత్తచకో రాక్షి "నాథా! నా యనేక జన్మసంస్కారఫలంబుచే జగదీశ్వరుండు నీయట్టి రసికోత్తముని పాలొనర్చి క్షీరనీరంబుల చందంబున నైక్యంబు గల్పించెం గావున మద్భాగ్యంబు బొగడ ద్విసహస్రజిహ్వునికైన వశంబౌనె? ఐనను నిర్దయహృదయుండగు కృతాంతుండు ననుమున్నుండు హరించునో యను సంకల్పంబు జనించె. మత్సంకల్పిత కామ్యంబు

పరమేశ్వరుండు నెరవేర్చెనేని నాయట్టి కీర్తనీయ పరమసాధ్వీమణి గలదే" యన భర్తరీనాథుండు "శుభాననే! భగవచ్చిత్రం బెవరెఱుం గుదురు? నీవు మత్సమక్షంబున మృత్యుపదంబు నొందెదవో లేక నీస మక్షంబున నే పంచత్వంబు నొందెదనో హరిపుత్రుండగు శమనుండు విధినిర్మితంబు దొలంగించునే" యని యుత్తరం బొసంగ నక్కలకంఠి "ప్రాణప్రియా! ఫాలలిఖితం బెట్లుగల దట్లాను. మద్వాంఛితంబు సఫ లంబు గాకుండెనేని యుష్మద్దివ్యశరీరం బెడబాసి మత్కాయంబు జీవించునే? నిమిషంబున హుతాశనజ్వాలార్పిత శరీరనై భవదంఘ్రిస రోజంబుల నాశ్రయింపనే" యని మనోహరభాషణంబులచే ప్రత్యు త్తరం బివ్వ భర్తరీనాథుండు "కాంతే! వాక్ప్రౌగల్భ్యంబు లేలపలికె దవు? ప్రాణంబునకంటె ప్రియుం డధికుండే? నామనస్సంతోషంబుకై మోహాయహోక్తులు వెల్లడిపఱచెదవేగాక ఫలితం బేతద్విపరీతంబై యుండు. నాకీ యనుభవజ్ఞానంబు లేదే? భటులు శత్రువులచే నెదురిం చునెడ స్వప్రాణరక్షణోపాయంబులు బన్ని పిదప నుల్లంఘింతురు. విరుద్ధసమయంబు ఘటియించెనేని పలాయితులవుదురు. గావున నీసా హసంబులు నిక్కంబని దలంతునే? బహువేషధరులు తత్తద్రూపాను కూల పురుషార్థంబులు బ్రకటించినంత నిశ్చయ సమరకోవిదు లనవ చ్చునే? పెక్కు లేల? ననుభవంబుచే దెలియనగు" నన నత్తలోదరి "ప్రాణ వల్లభా! మద్వచనంబులు త్రికరణశుద్ధిచే నిశ్చయింపఁబడినవో కావో పరమేశ్వరకల్పితం బేవిధంబై యుండునో దెలియనగు. మచ్చిత్తంబు భవత్పాదార్పితంబగుట నిక్కంబేని సర్వాంతర్యామి యగు భగవం తుండు మచ్ఛరీరంబునకు విధవత్వంబు గల్పించఁడనుట నిస్సంశయంబు గాదే? 'యథాబీజ స్తథాంకురః' యను సుప్రసిద్ధవచనం బబద్ధంబగునే?" యనుచు స్తబ్ధించెను. భర్తరీనాథుం డా సుందరీమణి వాక్యంబులు డెందంబున నిడుకొని సప్రేముండై యొకకొన్నిదివసంబులు గడపి యొకానొకసమయంబున మృగయావినోదంబుచే భటజనసహి తుండై యరణ్యంబున కేగి పింగళాదేవి సంభాషణంబులు హృదయం బున దలంచి నేఁడు పరీక్షించి తీరవలయునని కృతనిశ్చయుండై క్రూర మృగంబుల ఖండింపుచు నొక్కచో నత్యుగ్రపంచాననంబు గనుం గొని వెంటనంటి జనుచుండ నక్కేసరియు కడువేగంబున పరుగులిడు

చుండెను. ధైర్యధుర్యుండగు సూర్యవీర్యోద్భవుండా మృగరాట్ఛిరం బును కరవాలంబుచే చెండాడి తద్రుధిరంబున స్వాంగవస్త్రభూషణం బుల దడపి యొకభృత్యుని కొసంగి "నీవతిరయంబున పురంబునకేగి పింగళాదేవి సముఖంబున నీరక్తమయవస్త్రభూషణంబు లుంచి యక్కాంతామణితో 'యుష్మత్ప్రాణకాంతుండు సింగంబుచే బట్టువడి పరలోకగతుండయ్యె' ననుచు యుక్తిప్రయుక్తులచే దెలియఁబఱచు" మని సెలవొసంగి తానొక విశాలమహీరుహచ్ఛాయాశ్రితుండై యత్తె మిల్లెను. భృత్యుండా వస్త్రంబుఃబుగొని శీఘ్రంబుగ పురంబునకేగి పింగళాదేవి యంతఃపురంబు ప్రవేశించి తద్వస్త్రంబు లద్దేవి పురో భాగంబున నిడి "తల్లీ! భర్తరీసమర్థుండు మృగయా వినోదార్థంబై వనంబున సంచరింపు చుండ పర్వతగుహాంతస్థిత మహాసింహం బొకటి యాగ్రహంబుచే పైబడి భర్తరీప్రాణంబులు హరించె. చమూసమూహంబు దహనంబొనర్చ యేతెంచు. నిదుగో రుధి రమయ వస్త్రంబు" లని నుడివి త్వరితంబున దళసమూహంబు జేరం జనెను. పింగళాదేవి యదరిపడి మూర్ఛాపరవశత్వంబున వాతహత పక్వపర్ణంబుభంగి బుడమిని వ్రాలి క్షణమాత్రంబున స్మృతిదలంచి "హానాథా! హాప్రాణవల్లభా! నన్నెడబాసి పరలోకంబున కేగుట ధర్మంబగునే" యనుచు హాహాకారంబుచే శిరంబు బుడమిని జరు చుచు మృత్తికంగొని ముఖంబుపై వైచికొనుచు "కృపాఘనా! న న్ననిశం బెడబాయనిచిత్తం బెవ్విధి దొలంగించితివో" యని దీర్ఘస్వ రంబుచే నాక్రందించుచుండ తచ్ఛబ్దం బా ద్వాదశశతసుందరీమణుల కర్ణరంధ్రంబుల సోక జివ్వన నవ్వనజగంధు లేకముఖంబున రోదనం బులు జేయుచు నేతెంచి కొందఱు మూర్ఛాగతులై మహింబడుచు నొకకొంద ఱిక మనకేటిబ్రదుకని వక్షస్థలతాడనంబు లొనర్చుకొనుచు మఱికొంద ఱన్యోన్యగ్రీవంబులంబడి మహాధ్వానంబుచే శోకింపుచుండ పింగళాదేవి దుఃఖతాపం బంతకంతకు నగ్గలంబై "ప్రాణనాథా! నీరూ పంబు నీమోహంబు నీప్రేమాతిశయ సంభాషణంబు బొగడతరంబే? న న్నీదుఃఖవారాశిం బడద్రోయుట కెట్లుసహించితివో? పాపుండగు య ముండు మాశోకంబులకు సంతసిల్లెనో? చతురాస్యుండు మాఫాల తిచే మమ్మేల గల్పించెనో? గల్పించెనేని దుర్భరవైధవ్యతాపంబు నిర్మిం

చుట సచ్చరిత్రుల ధర్మంబగునో" యని దైవంబును దూఱుచు "హా ప్రాణనాయకా! యుష్మత్సహవాసావలోకనంబు లేని మద్రూపంబు గా ల్పనే? నే నజగరంబుపగిది జీవించిన లాభంబేమి" యని పింగళాదేవి దనప్రాణంబులు వీతిహోత్రుని పా లొనర్పందలంచి త్వరితంబుగ పురోభాగంబునగల పతిరక్తమయ వస్త్రంబులు ధరించి సఖీజనపరివృ తయై శ్మశానవాటిక కరుదెంచి కాష్ఠచితి నిర్మించి పావకజ్వాలలచే వెలుంగుచున్న చితిం గని శిష్టులచే నాశీర్వాదంబులు బొంది భర్తరీ నాథ చరణార్పితచిత్తంబుచే సుకుమారశరీరం బా వైశ్వానరుని పా లొనర్చి ప్రాణంబులు బాసెను. దైవయోగంబున విక్రమనృపుండు సుమంత్రికాది పరివారసహితుండై మిథిలానగరంబున కేగి యానాం డు మాతులగృహంబున సుఖగోష్ఠిచే నివసించి యుండెం గావున చూ పరు లప్పరమపావనచరిత్ర యగు పింగళాదేవి పతిభక్తి సాహసం బుల కచ్చెరువొంది యాహాకారంబులు జేయుచు నమ్ముద్దియగుణం బులు గొనియాడుచు తమతమ గృహంబుల కేతెంచి పరితప్తమాన సులై భర్తరీనాథుని చరిత్రంబులు దలంచుచు నిట్టూర్పు లిడుచు చుండిరి. అట నుష్ణాంశువీర్యజాతుండు ప్రభాకరుండు పశ్చిమాంబుధి గ్రుంకునెడ పయనంబై దళసహితంబుగ పురంబున కేతెంచుచు నగ రనికటంబున జాజ్వల్యంబుచే దహించుచున్న కాష్ఠనిర్మితచితి నీక్షించి దనమనంబున "నే నతికఠినంబగు నిమిత్తంబు కల్పించితిగాని పిదప నెట్టి యనర్థంబు సంభవించెనో గనుంగొనలేనైతి" నని వితర్కించుచు నగరద్వారసమీపంబున కరుదెంచినంత ద్వారరక్షకు లత్యంతా శ్చర్యంబుతో సమక్షంబున కేతెంచి వందనంబు లిడి శోకపూరితవద నులై "సమర్థా! హతాత్ముగ నొకదూతచే యుష్మత్ప్రాణంబులు పం చాననంబుచే హరింపఁబడి పరలోకంబున కేగెనని యంతఃపురసుంద రీమణు లెఱింగి ఘోరతరదుఃఖాంబుధి నిమగ్నులై శోకింపుచుండ దుస్సహ దుఃఖతాపంబుచే పింగళాదేవి స్వశరీరంబు హుతాశను పా లొనర్చె. పురజను లపరిమిత శోకవారాశిని మునుంగుచు నిప్పుడిప్పుడు దమతమ సదనంబులు జేరంజని" రని విన్నవింప భర్తరీశ్రేష్ఠుం డదరి పడి లంఘించి శ్మశానవాటికకు పరుగెత్తుచుండ పరివారులు వెంట నంటి పరుగులిడుచుండిరి. తత్క్షణం బా భర్తరీజనితుండు శ్మశా

నంబు జేరి దాహకునిచే దహింపఁబడుచున్న పింగళా దేవికాయంబు గనుంగొని హాహాకారంబు జేయుచు నిజశరీరం బప్పావకుని కర్పింపం దలంచు నెడ పరివారులా మహామహుని నిరోధించి సమాధానంబులు వలుకుచుండ నతులితశోకపూరితుండగు భర్తరీఘుండు పింగళా దేవి గుణవితానంబు లుగ్గడించి యూర్ధ్వముఖుండై వక్షస్థలంబు జరుచుకొనుచు "నాహాపింగళా! నీమంగళకరగుణాన్విత తనువిలాసంబు నకు ప్రత్యక్షమృత్యుస్వరూపుండనై మూఢమతిచే బరీక్షింపఁదలంచి నీప్రాణంబులు గొంటినే? దుష్టుండను. నష్టుండను. నాయట్టి పాపమలి కాయంబు గాల్పనే? న న్ననిశం బెడబాయని చిత్తం బెవ్విధి వీతిహోత్రుని కర్పించితివో" యని బుడమింబడి రోదనంబు జేయుచు పింగళా! పింగళా! యని నలుదిశలు నిరీక్షించుచు నీవులేని భువనంబు వనం బనఁదగదే? నీయున్కిలేని భోగంబులు రోగంబులు గావే? నిన్నెడ బాసిన శరీరంబు శుష్కకాష్ఠంబు గాదే? నీప్రేమాతిశయ సంభాషణంబు లమృతోపమంబులై వీనుల విందుసేయ నీ నవయౌవనాకారంబు మచ్చిత్తంబున కాప్యాయనం బొసంగ సుఖంబుచే కాలంబు గడుపుచు నేఁడీ విపరీతకల్పితంబులు నాకేల గలిగెనో? నాయట్టి దౌర్భాగ్యులు గలరే? పింగళా! దినేశుని కిరణప్రసారంబుచే కమలాకరంబు విభూతి గాంచిన చందంబున నీ నలినేక్షణ దృక్ప్రసారంబులచే మన్మనఃపద్మంబు వికసించియుండుట నీవెఱుంగవే? నన్నీ దుఃఖగహనంబున బడవైచుట ధర్మంబౌనే? నీపలుకు నీకులుకు నీమిటారంబు లే యన్నువకైన గలవే? నీస్వరూపంబునకు రంభోర్వసులు లజ్జాయమానులు గారే? నీసుగుణంబులకు శాస్త్రంబులు సరిపోవునే? నీలక్షణంబులకు లక్ష్మీదేవి యెనయగునే? మచ్చిత్తంబున నీరూపం బెడబాయునే? హా పింగళా! నీ పతిభక్తి విశేషంబులు లోకత్రయపావనంబులు గావే? నీయట్టి పరమసుశీల ప్రాణంబులు హరించిన పాతకంబునకు మితిగలదే? నీరూపం బెట్లు గనుఁగొందు? నేనీదుఃఖం బెవ్విధి సహింతు" నని మహాధ్వానంబుచే రోదనంబు జేయుచు కొంతవడి మూర్ఛాగతుండై రయంబున స్మృతిగలిగి "హా పింగళా! హా ప్రాణప్రియే! హా మనోహారీ! హా బాలేందుముఖీ!" యని శోకింపుచుండ నేతద్వృత్తాంతంబు గ్రామవాసు లెఱింగి యత్యంతాశ్చర్యంబుచే

పనుగులిడుచు నేతెంచి పింగళా దేవి సుగుణసాహసంబులు దలపోయు చు నేకముఖంబున ఘనఘూర్జితంబు పగిది రోదనంబులు జేయుచుండ నొకకొంద ఱా భర్తరీఘనుని శోకోపశమనంబు జేయుచు "ధైర్యఘ నా! దైవనిర్మిత కార్యంబునకు చింతింపనేల? దుఃఖంచినంత పింగళా దేవి జీవంబులు ధరించునే? వ్యర్థశోకంబుచే లాభం బేమైనను గలదే? 'జాతస్య మరణం ధ్రువం' బను న్యాయంబు మీ రెఱుం గరే? మన పూర్వజులు కాలగతి నొందరే? శాశ్వతులై విలసిల్లుట మర్త్యజన్మంబుల కెట్లు ఘటించు? మృత్యుదేవత మనల నుపేక్షించునే? మన మొకప్పుడు మృతిబొందమే? మనకీ యశాశ్వతశరీరంబుకై దుఃఖం బేల? సిద్ధసాధు ప్రముఖాఖిల తపోమూర్తులు శరీరంబులు వాయరే? సర్వసమర్థులై సకలశాస్త్రార్థజ్ఞానపూర్ణులై మాయామయశరీరంబుకై విలపింపనేల" యని యనేకవిధంబుల బోధించినను భర్తరీ హృదయగత శోకం బుడుగదయ్యె. పురజను లనేక యుక్తి ప్రయుక్తులచే బోధించి యూసటంగొని దమతమ సదనంబుల కేగిరి. తదనంతరం బా భర్తరీనా ముండు శ్మశానంబు బాయక పింగళార్పితచిత్తుండై శోకింపుచు నారా త్రి గడపుచుండ ననలుండు పింగళా దేవిని భస్మం బొనర్చి యంతర్ధా నంబు నొందె. సూర్యోదయానంతరంబున పింగళా దేవి బంధుమిత్ర పురోహితు లుత్తరకర్మ జేయించదలంచి శ్మశానంబున కేతెంచి యస్థి సంచయం బొనర్పవలయు నను హాళాహాళిచే స్పృశింప నుద్యుక్తు లౌచుండ నద్దివాకరతనయుండు నిరోధించి బహునాదంబుచే రోదనం బు జేయుచుండ వారలాస్థలంబు బాసి తనునిలయంబుల కేతెంచిరి. భర్తరీనాథుం డహర్నిశం బా శ్మశానప్రదేశం బెడబాయక నన్నపా నాదులు వర్జించి పింగళా దేవి గుణసంచయం బభివర్ణించుచు "పింగ ళా! హా పింగళా!" యని కేకలిడుచుండె నంత నొకదూతచే మిథిలా నగరంబున విక్రమనృపుం డాలకించి మహాక్షోభంబున సత్యవర్మ శుభవిక్రమ సుమంతీకాది సహితుండై రయంబున నవంతికానగరం బున కేతెంచి శ్మశానవాటికం జేరి దుర్భరదుఃఖతాపంబుచే నాక్రో శించుచు సర్వాంగసుందరీమణి యగు పింగళా దేవి గుణసౌందర్యంబు లెవ దలంచి సుమంతీకుం డహా! మత్సుకుమార తనువిలాసిని యగు పింగళా దేవి దసశరీరంబు ధనంజయున కొసంగె ననియు విక్రముండు

మన్గృహరత్నంబు కాలతస్కరునిచే నపహరింపఁబడె ననియు సుమంతీ కుండు హా పింగళా! హా సర్వగుణమంగళా ! నీరూపు నీచూపు నీసు గుణంబు నీచతురత్వంబు నీజ్ఞానపరిపూర్ణత్వం బే లోకంబున నే య న్నులమిన్నకైన గలదే? యని శోకింపుచుండ విక్రమనృపుండు భ_ర్త రీనికటంబుజేరి యెన్నివిధంబుల నోదార్చిన నతం డపార శోకాంబుధి నిమగ్నుండై యుపశమింపకున్నంత విక్రముండు మంత్రిపురోహితసహి తుండై యుత్తరక్రియ లొనర్చి పరితప్తమానసంబున పురంబున వసి యించెను. రవిపుత్రుండు శ్మశానంబు వర్జింపక బృందకై గోవిందుండు విలపించినచందంబున హా పింగళా! యనుచు శోకింపుచుండ విక్రముం డనుదినం బాశ్మశానవాటిక కేతెంచి యనేకయుక్తిప్రయుక్తులచే భర్త రిని బోధింపుచుండ నతండు వాతాంబుపర్ణాశనుండై నిజహృదయంబు న పింగళాదేవిని గొనియాడుచు శ్మశానస్థలంబున పిశాచంబు కరణి నివ సించి "హా దైవమా! హా జగద్రక్షకా! హాయనాథనాథా! హా దీనశర ణ్యా! త్రిలోకసుందరీ యనందగు పింగళం గల్పించితివేల? గల్పించితివేని యమ్ముద్దియను నాకొనగూర్చితివేల ? గూర్చితివేని యత్యంతమోహం బేల గలిగించితివి? గలిగించితివో వియోగంబు జేయుట ధర్మంబగునే" యనుచు రోదనంబు జేయుచు ననుదినంబు గృశించి కంఠగతప్రా ణుండై యొకపరి దైవంబును దూఱుచు నొకప్పుడు పింగళా యని విల పించుచు ద్వాదశవత్సరంబులు గడపె నంత నభోమణి నిజసుతుని పరి తాపంబు ద్వాదశాబ్దపరిపూర్ణత్వంబు మనంబున విచారించి వేగంబున సమర్థుండగు దత్తాత్రేయసమక్షంబు జేరంజన నమ్మహామహుండు జగ చ్చక్షుని సన్మానించి "భవదాగమన కారణంబు దెలుపు" మన నినుండు "జ్ఞానఘనా! సర్వమయుండవై ప్రకాశించెడు సమర్థుండవై నీవెఱుం గని కారణంబు గలదే? భవచ్ఛిష్యుండగు భర్తరీయోగక్షేమంబు గనఁ గొంటిరే" యన నత్రిసూనుం డంతరంగదృష్టిచే భర్తరీనాథుని విప త్కాలంబు విచారించి కరుణామయ హృదయుండై "ప్రభాకరా! నీకు మారునికై చింతింపవలదు. నే నహర్నిశంబులు భర్తరీకథిత ద్వాదశ వత్సరంబులుఁ గణియింపుచుంటి. సమయంబు ఘటియించెను. మచ్ఛి ష్యుండగు మత్స్యేంద్రుని ప్రియశిష్యుండు గోరక్షనాముండు నానాతీ ర్థంబులు సేవింపుచు మత్సమక్షంబున కేతెంచు గోరక్షుం డతిసమర్థుండు

గావున నే నా తాపసో త్తముని భ ర్తరీనాథునికై బంపెద నతం డమల జ్ఞానాన్వితమతిచే యుష్మత్సుతుని మోహపాశంబు దెగటార్చి మత్సన్ని ధికి దోడ్కొని తెచ్చు నిక్కం బని నమ్ము” మన నహస్కరుండు హర్షించి యనసూయాతనూభవునిచే ననుజ్ఞ గొని నిజస్థానంబున కేగెను.

ఇతి భ క్తిసార నవనాథచరిత్రంబున పింగళావియోగ భ ర్తరీనాథ దుఃఖకథావిశేషం బష్టావింశాధ్యాయము సంపూర్ణము.

---

## ఏకోనత్రింశత్యధ్యాయము.

---

{ గోరక్షనాథుండు శ్రీగురుదత్తాత్రేయానుమతిచే భ ర్తరీనాథునకు వైరాగ్యంబు గల్పించి వెంటగొని చనుట. }

గోరక్షనాథుండు గర్భాద్రిసమీపస్థ వామతీర్థస్థానం బెడబాసి నానాతీర్థంబులు సేవించుచు గిరినారక్షేత్రంబున కేతెంచి జగదుద్ధా రకుండగు దత్తాత్రేయ పదసరోజంబులకు వందనంబు లాచరింప దత్తుండు పరమాహ్లాదంబుచే గోరక్షుని దనహృదయంబున కదు ముకొని మూర్ధంబు బునుకుచు దననికటంబున నుపవేశింప నియ మించి “గోరక్షా! మత్స్యేంద్రయోగిముఖ్యుల డెచ్చోఁగలఁడు? నీ వా తపోఘనుని త్యజించి యొంటిజరించుట కేమికతం బయ్యమలాత్మునకు క్షేమంబే” యని విచారింప గోరక్షుండు “దయాఘనా! భవదనుగ్ర హపాత్రులగు జ్ఞానుల కనిశంబు క్షేమంబు దక్క నితరంబు గలదే? తపోఘనుండగు మత్స్యేంద్రుండు గర్భగిరినికటంబున బ్రహ్మానందమ యుండై నివసించియుండ నే నామహామహుని యనుజ్ఞచే తీర్థయా త్రోద్దేశంబున జనుదెంచితి” నన నత్రిసూనుండు సంతసించి “వత్సా! నీకొక కార్యంబు దెలిపెద నవంతికానగరంబున మదనుగ్రహపాత్రుం డగు భ ర్తరీనాథుండు రాజ్యభోగలోలుండై విలసిల్లి గతజాయుండై మోహపాశబద్ధమానసంబుచే శ్మశానంబున నివసించి ‘కాంతా కాంతా’ యని మంతనంబున చింతింపుచు నన్నోదకంబులు త్యజించి శోకింపుచుండి ద్వాదశవత్సరంబు లయ్యెం గావున నీ వా భ ర్తరీనా థుని జేరంజని యాత్మానాత్మ విచారంబుచే వైరాగ్యంబు గల్పించి

నీచాతుర్యంబున సమాధానబఱచుము. నే నా పురుషశ్రేష్ఠున కను గ్రహం బొసంగుతఱి ద్వాదశాబ్దంబులకు తుచ్ఛసంసారసుఖంబు త్యజించెద నని సప్రమాణవాగ్దత్తం బా నరోత్తమునిచే జేయించితి. నీకుశలత్వంబుచే నతనిపరితాపంబుమాన్పి నాథపంథీమార్గంబు దెలియఁ జేసి యస్మత్సమక్షంబునకు దోడితె"మ్మనిభర్తరీనాథజన్మకథాదిచరిత్రం బంతయు దేటపఱచెను. గోరక్షుం డీయద్భుతచరిత్రం బాలకించి "కృపానిధే! భవదాజ్ఞాధారకుండనై భర్తరీలోహంబును కనకరూపంబున గొనితెచ్చెద. యుష్మదనుగ్రహపాత్రుల కిక్కార్యం బొకవింతయె?దుర్ఘటంబగు కార్యంబైన భవత్కటాక్ష వీక్షణంబుచే సులభంబు గాదే? కల్పతరుచ్ఛాయాశ్రితులకు కామ్యంబులు జేకూరుట ఘనంబే" యని బొగడుచు ననసూయానందనుని పదకంజంబులకు ప్రణమిల్లి వేగంబున వ్యానాస్త్రంబు జపియించి తన్మంత్రమాహాత్మ్యంబుచే నేబదియోజనంబులమార్గంబు క్షణమాత్రంబున గడచి యవంతికానగరసమీపంబున కేతెంచి దూరస్థశ్మశానప్రదేశంబున క్షీణశరీరంబుచేకంఠగతప్రాణుండై "హారామా! పింగళా! వియోగం బొనర్చితివే" యని వలపోయుచున్న భర్తరీనాథుని విలోకించి దయాన్వితహృదయుండై తనమనంబున నోహో! భర్తరీనాథుం డసాధ్యకరవ్రతంబు బూని యస్థిచర్మగతప్రాణుం డయ్యె నిట్టి దృఢతరచిత్తంబు మఱల్చుట సాధారణం బగునే? పరుసంబు లోహంబును కనకం బొనర్చుగాక! పాషాణంబును సువర్ణంబు జేయునే? ఇక్షువనస్థ నింబవృక్షంబు మధురపూరితం బగునే? బ్రహ్మనిర్మితదరిద్రంబు కృషిచే నశించునే? తద్వత్భర్తరీనాథాచరిత మోహబంధంబు శబ్దబోధంబులచే వశంబగుట దుస్తరంబు గాదే? భర్తరీనాథునిచిత్తంబు శునకపుచ్ఛంబుభంగి వక్రంబై విలసిల్లె. నేను కార్యసాధనపరత్వంబుచే కొంతవడి తద్రూపంబున విలపించి భర్తరీనాథుని సంతుష్టపఱచితినేని మదీప్సితంబు సఫలం బగును. విభీషణుండు విచక్షణమతిచే శత్రుండగు రాముని సఖ్యంబు బూని వైభవంబు లనుభవించిన చందంబున భగవంతుండు ప్రచ్ఛన్నవామనవేషంబుచే బలిని సాధించినట్లు మాయోపాయంబుల భర్తరీనాథుని సాధించి నాథపంథకీర్తిధ్వజంబు ప్రకాశింపవలయు నని కృతనిశ్చయుండై పురంబు జొచ్చి కుంభకారగృహంబున కేగి యొకఘటంబు

గొని దానిపై దనప్రాజ్ఞత్వంబున చిత్రవిచిత్రపటంబులు దీర్చి దానికి 'బాటలీ' యను నామంబిడి శుష్కవేదాంతుల హృదయంబుమాడ్కి ఘటరూపం బాచ్ఛాదించి హస్తంబున ధరించి శ్మశానస్థలంబున విలపించుచున్న భర్తరీనాథుని సమీపంబున కరుదెంచుచు కాపట్యంబుచే బుడమింబడి మూర్ఛితుండై పరవశత్వంబున ఘటంబును భిన్నపఱచి స్మృతిబూని యుత్థితుండై భిన్నఘటంబును గనుంగొని యాహాకారంబు జేయుచు "హా నాబాటలీ! హా నాసుందరరూపిణీ! నన్నెడబాసి భిన్నంబైతివే? నే నీదుఃఖం బెట్లు సహింతు? నీవియోగంబుచే మత్ప్రాణంబులు నిల్చునే? నీస్వరూపంబు నీసుకుమారంబువర్ణింపతరంబగునే" యని మహారవంబుచేశోకింపుచు వక్షస్థలంబు జరుచుకొనుచు పుడమింబడిపొర్లుచు "హాబాటలీ!నీవులేనిజీవనంబు శవభూషణంబులుగావే? నీవులేనినివాసంబు శ్మశానంబుగాదే? నీరూపభిన్నంబుచే నామది ప్రపంచంబు బాయదే? నీవు నాపితృమాతృస్వరూపం బని దలంచితి నన్విడనాడి భిన్నవగుట ధర్మంబగునే? నాకెవరుదిక్కు? నిన్నెక్కడ గనుంగొందు. హాదైవమా! హారామా! నాయం దింత నిర్దయత్వం బేలగలిగె? నాయట్టి దోషాత్ములు లోకంబున లేరే! నాదుఃఖం బెవ్విధి కడతేఱు? నన్నాదరించుపుణ్యాత్ము లెవరుగలరు? నాముద్దుబాటలీ! నాసువర్ణబాటలీ! నీసుందరస్వరూపంబు గనుబఱచవే? నీకీ కఠినంబేల గలిగెనే? సన్నిశంబు బాయకుందువుగదే" యని ఘోరనినదంబుచే రోదనంబు జేయుచుండ భర్తరీనాథుండు శోకంబాలకించి మితిలేని యాశ్చర్యంబుచే హాసించుచు దనమనంబున తుచ్ఛంబగు ఘటం బొకకొంతవెలజేయును. దీనికై యాక్రోశించుట కెంత వేడబం బని విత్కరించి సన్ముఖుండై "యోగిపురుషా! కించిన్మాల్యకుంభంబుకై మూఢమతిచే శోకింపనేల నేతద్ఘటతుల్యఘటంబులు లభింపవే? మూర్ఖా! విచారంబులేదే" యన గోరఖుండు "జ్ఞానపురుషా! నీ వేకతంబున దుఃఖాంబుధి నిమగ్నుండవై తివి. నీయట్టిదుఃఖం బితరులది కాదే? నీకు నీవస్తువధికంబయ్యెండు. నాకు నాఘటం బధికంబుగాదే? నీదుఃఖంబు నీవె ఱుంగుదువు. నాదుఃఖం బే నెఱుంగుదును. ప్రత్యక్షానుభవజ్ఞానంబు గలిగి నన్నిప్పగిది విచారింప ధర్మంబగునే" యన భర్తరీనాథుండు "విచారహీనా! ఘటభిన్నంబుచే సస్మద్దుఃఖసమం బని బలికితివి. నాదుః

ఖంబు నిశ్చయంబు గాదే? స్వరూపలావణ్యంబులచే నొప్పారు పింగళాదేవి హతంబయ్యె నయ్యది పునఃప్రాప్తంబగుట దుర్లభంబుగాదే? యుష్మద్ఘటతుల్యఘటంబులు శతానుశతంబులు క్షణమాత్రంబున లభించు. వలయునేని సమకూర్చెద. నాపింగళాదేవి లభించునే" యన గోరక్షుండు "నీపింగళాస్వరూపంబులు సహస్రానుసహస్రంబులుగల్పించెదను. నామనోజ్ఞతర పాటలి ఘటించునే" యని ప్రత్యుత్తరం బొసంగ భర్తరీనాథుండు "పింగళాసమరూప యౌవనగుణసహిత నారీరత్నంబులు గల్పించెదవేని భవద్పాటలీశతం బీక్షణంబ సిద్ధపఱచెదను. వృథాపురుషార్థప్రగల్భంబులచే లాభం బేమి? కపటవేదాంత ప్రసంగంబులచే ఫలంబు చేకూఱునే? వర్షంబు లేని ఘనగర్జితంబుభంగి జలంబులు లేని యెండమావులచందంబున ప్రత్యక్షానుభవరహితంబగు వాచాశూరత్వంబు వ్యర్థంబుగాదే" యన గోరక్షుండు "పురుషఘనా! పింగళాసమ పల్లవాధరుల గల్పించెదనేని కానుక లేమి యర్పించెదవో దెలుపు" మన భర్తరీనాథుండు మోహపరవశచిత్తుండై "యోగిపురుషా! పింగళాసమ మృగయానల గల్పించెదవేని సూర్యేంద్రాగ్నియమవరుణకుబేరాది దేవతానివహంబు సాక్షి జలదేవతా స్థలదేవతలసాక్షి గొని మద్రాజ్యభోగసంపదలు భవచ్చరణంబుల కర్పించెద. నేనీ వచనంబు దొలంగితినేని మత్పూర్వజులు స్వర్గపతనులై నరకం బనుభవించెదరు. నేనీ జన్మంబు బాసి మహానరకం బనుభవించుచు ననేకజన్మంబు లెత్తుచు రౌరవాదినరకంబు లనుభవించుచుండెదను. నీవచనంబు లనృతంబు లయ్యెనేని నీ వనేకజన్మంబులు నరకం బనుభవించుట తథ్యం" బని శపథంబులు జేయ గోరక్షుండు హర్షించి సత్యంబు సత్యం బని నుడువుచు భస్మంబు గొని కామినీ యస్త్రంబు ధ్యానించి పింగళానామంబుచే బ్రయోగింప నయ్యస్త్ర మహిమాతిశయంబుచే భస్మీకృత పింగళాంశంబున ననేకలతాంగులు నవయౌవనాకారంబులచే విరాజమానలై భర్తరీనాథుని సముఖంబున నిల్చుండిరి. భర్తరీనాథుండు ప్రేమాన్వితహృదయుండై మహామోహంబున నాయన్నుల నుపవేశింప నియమించి దనగృహసంసారోపయోగవాక్యంబులు విచారింపుచుండ నాసుందరీమణి యగు పింగళాదేవి భర్తరీకృత ప్రశ్నంబుల కుత్తరంబు లొసంగుచు "ప్రాణవల్లభా!

మద్వియోగతాపంబుచే గుందనేల? యశాశ్వితశరీరంబు స్థిరంబై యుండునే? ప్రాణప్రియా! మర్త్యులకు మృత్యు వొకప్పుడైన గలదనుట నిక్కంబుగాదే? తత్కారణంబుచే జన్మసార్థకంబుకై యోచింపుట ముఖ్యధర్మంబై యుండు. నే ననిశంబు పరమపాతివ్రత్యధర్మం బాశ్రయించి నయభక్తివిశేషంబులచే భవదధీనంబున మెలంగితి గాన జగదీశ్వరుండు నాకుత్తమలోకంబు లొసంగె. మీరు మీయోగక్షేమంబుకై జ్ఞానమార్గం బాశ్రయింపక మద్వియోగదుఃఖంబుచే రాజ్యభోగంబు లనుభవించిన నేమిఫలం” బని బలుకుచుండ భర్తరీనాథుండు విస్మయుండై గోరక్షుని పాదకమలంబులవ్రాలినంతగోరక్షుండు స్వహస్తంబులచే లేవనెత్తి “నరపుంగవా! మద్గురుండగు మత్స్యేంద్రనాథుండు శ్రీగురుదత్తాత్రేయ ఘనునకు ప్రియశిష్యుండయ్యె. తొల్లి మీకాయంబు శ్రీగురుదత్తానుగ్రహంబునకు పాత్రంబైనకతంబున మత్స్యేంద్రుని సహోదరుండవైతివి. తస్మా ద్వందనీయుండ” వని పాదంబులకు ప్రణమిల్లి “భర్తరీనాథా! యుష్మదభీష్టంబు పింగళాదేవి సహితుండవై రాజ్యభోగంబు లనుభవించుటకై గలదో? లేక తుచ్ఛసంసారంబు బరిత్యజించి సుస్థిరవైరాగ్యం బాశ్రయించెదో? శ్రుతపఱతువేని యొనగూర్తు” నన భర్తరీనాథుండు “జ్ఞానఘనా! పింగళావియోగదుస్సహ దుఃఖభారంబున ద్వాదశవర్షంబులు మందమతిచే కాలంబు గడిపినను కోమలాంగి గాన్పించదయ్యె భవదపార తపఃప్రభావంబున శతానుశత పింగళారూపంబు లీక్షించనైతిని. జ్ఞానహీనంబుచే తొల్లి శ్రీగురుదత్తాత్రేయ సుబోధంబులు లక్షింపక మాయాపూరిత సంసారకూపంబున మునింగి యత్యంతకష్టంబు లనుభవించితి. నేనీయంధకారబంధురంబగుసంసారసుఖాపేక్ష లెవదలంపను. రాజ్యసంపత్సుఖంబులు ప్రతాపరహిత నీచస్వరూపంబులుగాక శ్రేష్ఠంబు లగునో?నీతపోమహాత్వంబుచే శతానుశత పింగళాదేవిరూపంబులు నిర్మించినదెటుంగనో? సమర్థా! భ్రమమయావర్తంబగు సంసారంబు విడనాడి యతులితవైరాగ్యయోగంబుచే పరమపదపట్టాభిషిక్తుండనై ప్రకాశింపం దలంచెద. కరుణామయుండవై శీఘ్రంబున దీనశరణ్యుండగు దత్తాత్రేయుని దర్శనం బొనగూర్పవే” యన గోరక్షుండు “భర్తరీనాథా! నీకతంబున ననేకపింగళాసుందరు లుదయిం

చిరి. వీరిచే సుఖంబు లనుభవించి పిదప వైరాగ్యమార్గంబు ధరిం చుట యుచితంబుగాదే” యన భర్తరీనాథుండు “యొకపింగళాదే విక్రై ద్వాదశాబ్దంబు లిడుము లనుభవించితి నిక యనేకపింగళాము ణులచే ననుభవించెడి దుఃఖం బాచంద్రార్కస్థిరంబుగాదే? పునః పింగ ళాసంసర్గంబు గోరుట వృశ్చికదంశుం డనేకవిషపుచ్ఛసముదయంబున సుఖంచినపగిది యనదగదే? గోరక్షనాథా! పరమార్థభంగులగుశుభాం గుల నదృశ్యపఱచి మద్రాజ్యభోగసంపదలు పరిగ్రహించి రయంబున ననసూయాసుతుని దర్శింపఁజేయవే” యని వేఁడుకొన గోరక్షుండు హ ర్షించి యదృశ్యాస్త్రంబున సుందరీమణుల నంతర్ధానం బొనర్చి భర్తరీనాథుని హస్తంబు ధరించి దోడ్కొని పురంబు ప్రవేశిం చెను. పురజనులీ గోరక్షుని కుశలత్వంబున కచ్చెరువొంది యానందం బుచేబొగడుచుండ విక్రమనృపుండు గోరక్షనాథునిపదపద్మంబులకు వం దనంబు లిడి రత్నమయసింహాసనంబుపై యలంకరింప నియమించి భక్తిభావంబులచే షోడశోపచారపూజ లొనర్చి పురోభాగంబున ముకు ళితకరపుటుండై “దయాసముద్రా! మత్సహోదరుండగు భర్తరీభు నుండు పింగళావియోగ పరితప్తచిత్తుండై చిత్తవిభ్రాంతిచే విలపించు చుండ నెప్పగిది భవద్బోధామృత రసపానుండై శాంతిం బొందెనో యెఱుంగింపవే” యన గోరక్షుండు దనమాయోపాయంబుల తెలిం గెఱుంగించి నృపోత్తముని చిత్తంబు సంతుష్టపఱచెను. సకలధర్మవి దుండగు విక్రమనృపుండు గోరక్షునితో “సమర్థా! మత్పురంబున షణ్మాసంబులు నివసించి క్షీణకాయుండగు భర్తరీబడలిక రసపూరిత పక్వాన్నంబులచే దీర్చి నాయుల్లంబు రంజిల్లదయ జేయవే” యన గోర క్షుండు “భూనాయకా! నీవాక్యంబులు యథార్థంబులై విలసిల్లు. మనోవికారంబులు స్థిరంబులగునే? దినంబులు గడచెనేని చిత్తంబు మాఱదో? గావున కాలంబుగడుపుట యోగ్యంబుగా”దని యుత్తరం బొసంగుచుండ నేతద్గోప్యవాక్యంబు లంతఃపురస్త్రీసమూహం బాల కించి మహారోదనంబు జేయుచు మాభాగ్యం బపహరించెడి చెనటుం డేతెంచె. యాకుటిలాత్ముని ముఖంబు గాల” నని గోరక్షుని దూషిం చుచు బహువిధంబుల ఘోషింపుచుండిరి. గోరక్షుండు విక్రముని భవనంబున త్రిరాత్రంబులు వసించి పిదప భర్తరీసమేతుండై ప్రయా

ణంబు దలంప మహేశుండు ప్రీతమనస్కుండై గోరక్షుని చరణకమలం
బులకు ప్రణమిల్లి సెలవొసంగి ప్రయాణంబు గావింపుచుండ గోరక్షనా
థుండు భర్తరీనాథునితో "పురుషపుంగవా! నీ మనంబున ప్రపంచభో
గంబులు దలంచెదేని తత్క్షణంబ సనుకూర్తు" ననభర్తరీనాథుండు "తాప
సోత్తమా! శ్రీగురుదత్తాత్రేయ బోధానుసారుండనై ధనకనకవస్తువాహ
నాదిసంపద్విభూతి వమనతుల్యంబుగ భావించి తిరిగి యపేక్షించుట నీ
చంబు గాదే? నిర్మలనాథ పంథీమార్గం బాశ్రయించెద"నన గోరక్షుం
డు శైలీ సింగీ కంథాది విరాగచిహ్నపరికరంబు లొసంగి "భర్తరీనాథా!
మత్కుక్షిపాలంబు ధరించి యంతఃపురమందిరప్రవేశుండవై యలక్షశ
బ్దంబులచే భిక్షాన్నంబు గొని తెచ్చెదవే" యన నతం డవశ్యంబని వేగం
బుననంతఃపురంబుప్రవేశించి సారంగినాదంబుజేయుచు "నలక్షనిరంజన
భిక్షా" యని శబ్దోచ్చారణంబుచే దిరుగుచుండ నత్యంతదుఃఖార్ణవ నిమ
గ్నంబగు నారీజనకదంబం బేకముఖంబున శోకింపుచు "హాదయాఘనా!
హా సుందరాకారా! హామనోవల్లభా" యని బహువిధంబుల విలపించు
చు గొందఱు శిరోతాడనంబు లొనర్చుకొనుచు నొకకొందఱు నేలం
బడి పొర్లుచు మఱికొందఱు హస్తంబులు బుడమిజరుచుచు కొందఱు
తమభూషణంబులు బారవైచుచు కొందఱు మూర్ఛాగతులై దండం
బులకై వడి వ్రాలుచు "హా మాభాగ్యహీనం బేమని దలపోయుదుము.
మాప్రాణేశ్వరుండు సహస్రాక్షునిబోలి వైభవవినోదంబులచే నుమ్ము లా
లింపుచుండి భిక్షుకుండై జరించెనే? మాసౌభాగ్యంబునకు చేటొనగూ
డెనో? మాపూర్వజన్మదోషంబులెట్టివో? మనోహరాకారుండగు ప్రాణ
ప్రియుండు వైరాగ్యం బేలబూనెనో? మ మ్మాదరించు పుణ్యాత్ము లెవ
రొకో? కాంతుండు లేని కనకమయ సౌధంబులు గాల్పనే? ప్రియుండు
లేని శృంగారంబులు రాల్పనే? నాథుండు లేని జీవనంబు జీవనంబుల
గల్పనే? ప్రాణనాయకుండు లేని పర్యంకంబులు బడవేయనే? హా ప్రాణవల్ల
భుని కాయం బెంత కృశించెనే దుర్భరవిరాగవేషం బెట్లు ధరించెనే"
యనిజలధిఘూర్ణిల్లినచందంబున రోదనంబు జేయుచు హాహాకారంబుచే
భర్తరీనాథుని బరివేష్టించి "నాథా! మమ్మీ కష్టంబులపాలుజేసి మా
సౌభాగ్యసుఖభోగంబు లపహరించి దూరదేశంబున కేగుట ధర్మంబ
గునే? ప్రపంచనిస్పృహత్వంబుచే మమ్మాదరించక నరణ్యంబుల కేగుట

 

యుచితమార్గంబగునే? యుష్మన్ముఖచంద్రావలోకనంబు లేని మామనో చాతకంబులు జీవించునే” యని యాక్రోశింపుచుండ భర్తరీనాథుండు సక్రోధుండై హంసదండంబుచే విదిలించుచు కఠినహృదయుండై జను చుండ నాతలోదరులు వెంటనంటి “మనోనాయకా! జనదగదు జన దగ” దనుచు “నాథా! ద్వాదశాబ్దంబులు శ్మశానంబున నివసించి తుదకీ రాజ్యంబు బరిత్యజించి జనుట న్యాయంబుగా” దన భర్తరీనాథుండు ప్రత్యుత్తరంబు లొసంగక శీఘ్రగమనుండై పురంబు వెలువడి గోరక్షుని సమీపంబు జేరెను. గోరక్షనాథుండు విక్రమనృపాలునిచే ననుజ్ఞగొని భర్తరీసమేతుండై పదచలనంబు జేయుచుండ క్షితీశుండా గోరక్ష భర్తరీనాథుల బుత్తెంచి నిజభవనంబు జేరంజని యంతఃపుర హాహా కార నినదం బాలకించి త్వరితంబున నేగి పరితప్తహృదయలగు నారీ మణుల ననేక మృదువాక్యంబులచే శోకోపశమనం బొనర్చెను. ఇట గోరక్ష భర్తరీనాథులు వేగంబున జనుచుండ కృశీభూతశరీరుండగు భర్తరీనాథుండు శ్రమజెందుట గనుంగొని గోరక్షుండు వ్యానాస్త్రంబు జపియించి భర్తరీఫాలభాగంబున లేపనంబు జేయ తద్దివ్యాస్త్రమహి మాతిశయంబుచే తత్క్షణం బా గిరినారపర్వతశ్రేష్ఠనికటంబు జేరం జని యుష్ణాంశుతనూభవులు సర్వభూతదయాపరుండగు దత్తాత్రేయ పదసరోజంబులపై వ్రాలినంత దత్తుండు కరుణాంతరంగహృదయుండై దనవరదహస్తంబులచే నుభయనాథుల ముఖకమలంబులు బునుకుచు “గోరక్షా! నీవత్యంతశ్రమజెందితి” వని పేర్మిఁ మించుచు భర్తరీనాథు నితో “వత్సా! బహుకష్టంబు లనుభవించితి” వని లాలింపుచుండెను.

ఇతి భక్తిసార నవనాథచరిత్రంబున భర్తరీనాథ పింగళా వియోగ దుఃఖోపశమన గోరక్ష సందర్శనాది కథావిశేషం బేకోనత్రింశ త్యధ్యాయము సంపూర్ణము.

---

## త్రింశత్యధ్యాయము.

---

భర్తరీనాథుఁడు దత్తానుగ్రహంబుచే బదరికాశ్రమంబున తపం బొనరించుట.

శ్రీగురుదత్తాత్రేయుం డత్యాదరంబున గోరక్ష భర్తరీనాథుల దీవించి యానందంబుచే నిజాశ్రమంబున నివసించియుండ గోరక్షుండు

త్రిరాత్రంబు లచ్చో గడపి గమనోన్ముఖుండై యత్రినూనునితో విన్న వింప నమ్మహామహుండు "గోరక్షా! సచ్చరిత్రుండగు మత్స్యేంద్రుం డగుపడక బహుదినంబులయ్యె. మచ్చిత్తం బా యుత్తమోత్తమునీక్షింపఁదలంచె. రయంబున దోడి తెచ్చి మన్మనఃపద్మంబు వికసింపం జేయు" మన గోరక్షుం డవశ్యంబని యనసూయానందనుని పదకంజంబులకు ప్రణమిల్లి ప్రయాణం బొనర్చెను. ఇట శ్రీ గురుదత్తాత్రేయుండు దయాపూరితహృదయుండై భర్తరీనాథునిశిరంబున తనజగత్పవిత్రకర హస్తంబు మోపి యాచంద్రార్కామరత్వం బొసంగి చరాచరప్రముఖాఖిల సర్వభూత సాక్షిస్వరూపుండవై వెలుంగుమని యజ్ఞానాంధకార బంధురంబగు మాయామయప్రపంచ మోహపాశంబులు దెగటార్చి స్వరశాస్త్ర రసాయనశాస్త్రజ్యోతిశ్శాస్త్ర కోకశాస్త్ర వైద్యశాస్త్ర ధర్మ శాస్త్రాది నానాశాస్త్రంబులు బోధించి వాతాస్త్ర జలదాస్త్ర నాగాస్త్ర స్పర్శాస్త్ర విభక్తాస్త్రాగ్నేయాస్త్రైంద్రాస్త్ర కార్తికాస్త్రకామాస్త్ర ప్రముఖదివ్యాస్త్ర ప్రయోగోపసంహారంబుల కీలెఱింగించి ఖడ్గ త్రిశూలపరశు గదాంకుశాది బహువిధ సాధనంబులజాడల దెలపి యమోఘమంత్ర మంత్రార్థ రహస్యంబు లుపదేశించినంత మున్ను నరాధిపత్యంబుచే సర్వ విద్యాపారంగతుఁడై నకతంబున రత్నస్థగిత చామీకరంబుకరణి విభ్రాజమానుండై వెలుంగుచున్న భర్తరీనాథుని గనుంగొని త్రిమూర్తుండు శాబరీవిద్యారచనంబుకై నాగాశ్వత్థ వృక్షరాజ నికటంబునకేగ విధి విధానంబులు శ్రుతపఱచి సాధింపు మని శలవొసంగ భర్తరీనాథుండు శీఘ్రంబున జేరంజని తొల్లి మత్స్యేంద్రయోగివర్యుం డాచరించిన చందంబున మార్తాండకుండోదకంబులచే వృక్షస్థనిఖిల దేవతాప్రత్యక్షంబుబడసి త్వరితంబున శ్రీగురుదత్తాత్రేయుచరణసన్నిధి కేతెంచెను. గురువర్యుండు భర్తరీనాథుని వెంటగొని బదరికాశ్రమంబున కేగి తత్పవిత్రకరనిర్మలస్థలంబున తపంబుకై భర్తరి న్నియోగించి స్వస్థానం బుజేరి మత్స్యేంద్రనాథాగమన మార్గావలోకనుండై నివసించె నట గోరక్షుండు మత్స్యేంద్రనాథుని దోడ్కొని శ్రీదత్తాత్రేయసన్నిధి కేగుచుండుట. గోరక్షనాథుండు నానాజనపదంబులు గడచి గర్భగిరి చేరంజని తాపసోత్తముండగు మత్స్యేంద్రుని చరణకంజంబులకు నమస్కరించి "దయాఘనా! నే సనేకతీర్థంబులు గ్రుమ్మరుచు శ్రీగురుదత్తాత్రేయాశ్రమంబున

కేగియుండ నమ్మహామహుండు యుష్మత్సందర్శన తృషార్తుండై మీకె ఱింగింపు మని బలికె"నన మత్స్యేంద్రనాథుండు పరమాహ్లాదంబుచే డోలాయమానమానసుండై "వత్సా! మచ్చిత్తం బా పరమదయాకర గుణాళుండగు దత్తాత్రేయుని పదపద్మసందర్శనకుతూహలంబుచే మెలంగుచుండు. వేగంబున నేగవలయు"నని నుడువుచు నొకకొన్నిదినం బులు గడపి గోరక్షసహితుండై ప్రయాణంబొనర్చి వైదర్భదేశమార్గం బాశ్రయించి జనుచు కౌండిన్యనగరంబున భిక్షార్థంబై సంచరింపు చుండ యానాఁ డా నగరాధిపుండగు శశాంగనృపాలుండు కోపావే శుండై స్వసుతుని కరపాదఖండనం బొనర్చి యుండె నన శ్రోత లత్యం తసంశయమనస్కులై శశాంగనృపుం డేకతంబున నిజసుతుని హస్త పాదంబులు ఖండించెనని విచారింప నక్కథకుండు శశాంగమహీశుండు

## శశాంగనృపపుత్రుండగు కృష్ణాగర (సారంగధర) చరిత్రము.

బహువిధ సంపచ్చౌర్యస్థైర్యధైర్యసాహసంబులచే రాజ్యం బేలుచు నన పత్యుండై ప్రపంచనిస్పృహత్వంబుచే రాజ్యభోగసుఖసంపదల విసుకు గొని యహర్నిశంబులు సంతానంబుకై చింతింపుచు మనఃఖేదంబుచే కాలంబు గడుపుచుండ నొకానొకదివసంబున మందాకిని యను పట్ట మహిషి వల్లభునియుల్లంబు గనుంగొని "నాథా! సంతానంబుకై మనస్తాపంబు నొందనేల? చింతించినంత సంతానంబు ఘటియించునే? ఫాలలిఖిత దోషంబు పరితాపంబుచే దొలంగునే? చింతానలంబుచే శరీరంబు క్షీణించుగాక! కామ్యసఫలత్వంబు వాటిల్లునే." యని తా పోపశమనవాక్యంబులు బలుకుచుండ ననుదినం బా శశాంగనరపుంగ వుని హృదయంబున వ్యాకులం బధికంబై నిగ్రహంబుచే నుమాధవుని ధ్యానింపవలయునని తలపోసి సచివోత్తమునికి రాజ్యభారం బొసంగి జాయాసహితుండై రామేశ్వర మహాతీర్థంబున కేగుచు మార్గమధ్యం బున కృష్ణా తుంగభద్ర సంగమస్థలంబున నివసించి త్రియామంబు గడుపుచుండ పంచాననుండు స్వప్నంబున ప్రసన్నుండై "వత్సా! మత్కారణంబున నతిప్రయాసంబుచే రామేశ్వరం బరుగనేల నేతి త్కృష్ణా తుంగభద్రా సంగమ తటస్థానంబున నపర్ణాసహిత మహాలిం గంబు గలదు నీవా లింగంబునకు భక్తియుక్తుండవై యర్చించితివేని

నీకామ్యంబు జేకూరును. సంశయం బుడుగు" మని వరంబొసంగి యంతర్ధానం బైనంత క్షితీశుండు సంతుష్టుండై సూర్యోదయానంత రంబున సంగమప్రదేశంబు జేరంజని తత్స్థలంబున బ్రతిష్ఠాభిన్న మహా లింగంబు బొడగాంచి సప్రేముండై విధిపూర్వకంబుగ నమ్మహాలింగం బును స్థాపించి యఖండోత్సవం బొనర్చి సంగమేశ్వరనామంబుచే జగ ద్విఖ్యాతి గావించెను. తత్పూర్వం బా సమీపస్థ భద్రసంగమగ్రామం బున నొకవిప్రోత్తముండు మిత్రాచార్యనామంబుచే వేదవిద్యాపారంగ తుండై ప్రసిద్ధిగాంచి పతిభక్తి విశేషంబులచే బెంపెక్కిన సరయూ నామ జాయాసహితుండై యపత్యంబు లేనికతంబున నిత్యం బామృ త్యుంజయుని సన్నిధానంబున ధ్యానింపుచుండె. నంత నొకనాం డింద్ర లోకంబున నవరత్నస్థగిత దివ్యపీఠంబున చంద్రశేఖరు నలంకరించి బృం దారకు లత్యంతమోదంబుచే నర్చించి సవినయభయభక్తులచే బరివే ష్టించి కూర్చుండుతఱి యగణితరూపగుణ సౌందర్యమణి యగు సురో చనీనామ్నా యప్సరస దనముఖనఖద్యుతిప్రకరంబులచే సీతమయూఖుని సర్వస్వం బపహరించి తనుదృక్కాంతులచే మించులకు మించు లొసంగి సుస్వరవాఙ్మాధుర్యంబుచే రాగాలాపంబులు జేయుచు కరపల్లవాభిన యంబున సుపర్వాణుల యుల్లంబులు కొల్లగొని ముల్లోకరాజ్యలక్ష్మి కెన యై నిత్యుండగు కాత్యాయనీప్రియుని జగన్మోహనాకారంబు నిరీక్షించి యిక్షుధన్వుని తీక్ష్ణతరాంబక క్షతహృదయయై మనంబున నటేశుని రతిసుఖంబు గోరి నృత్యంబు సల్పుచుండ చంద్రచూడుం డవ్విరహో త్కంఠిత కాంతామణి మనోగతం బెఱింగి యాగ్రహంబుచే "సురో చనీ! నీదివ్యశరీరంబు బరిత్యజించి మనుజలోకంబున కేగి కృష్ణా భద్రా సంగమస్థానంబున మిత్రాచార్యకాంతామణి యగు సరయూ దేవి గర్భంబున జన్మింపు" మని శాపం బొసంగ సురోచనీనారి భయ జనిత హృదయంబుచే "నహహా! నే నొండు దలంప దైవం బొండు దలంచె. రత్నంబులకై ప్రయత్నింప* కాచంబులు లభించుట భాగ్యహీ నంబుగాదె" యని విషాదంబుచే వేరుకార్మ్ముకుని చరణంబుల కెఱఁగి ముకు ళిత కరకమలయై "హరా! త్రిపురహరా! ఆశ్రితజనవరదాయక శుభకరా!

---

* కాచంబులు=గాజుపూసలు.

విబుధజనవినుత పదకనుల హైమవతీవరా! గజదనుజ మదదమనఘన బలత్రిశూలధరా! వననిధిజనిత భయంకర విషధరా! గంగాధరా! శంకరా" యని స్తోత్రంబులు జేయుచు "దయాంతరంగా! నేనీ మనోహర నాకలోకం బెడబాసి మనుజలోకంబున జన్మించుట మహాకష్టంబు గాదే? కృపామతివై శాపమోచనవరం బొసంగవే" యని విలపించుచుండ నప్పరమేశ్వరుండు సంతసించి "సురోచనీ! నీవా విప్రకాంతగర్భంబున జన్మించి నవయౌవనాంగివై మెలంగుచుండ మత్కరస్పర్శన మాత్రంబున నీదివ్యరూపంబు ధరియించి యీయమరలోకంబున కేతెంచెద" వని శాపమోచనకారణంబు దెలిపినంత తక్షణం బా యప్సరాంగనామణి నిజపదంబు దొలంగి కృష్ణాతటంబున శివధ్యాన తత్పరుండగు మిత్రాచార్యవిప్రోత్తముని కాంతామణిగర్భంబున బ్రవేశించి దినదినప్రవర్ధమానయై నవమాసంబుల కుదయించి శుక్లపక్షేందుబింబంబుపగిది వృద్ధిబొందుచు ననుదినంబు మాతాపితృలతో నీలకంఠుని యాలయంబున కరుదెంచి నయభయభక్తులచే దండంబు లిడుచుండె నిట్లా మత్తచకోరాక్షి కదంబయను నామంబుచే బ్రకాశించుచు ద్వాదశాబ్దంబుల పరిపూర్తి వహించి ఘనశశి వనరుహ పల్లవ హరిపద కమఠభంబుల గేలిసేయు కచ ముఖ గళ కర కటి పద నఖంబుల కలిమిగలిగి విద్యుత్పుంజమిళిత చామీకరంబో యన విరాజమానంబగు తనుకాంతిచే భ్రూచాపవినిర్ముక్త దృక్శరనై పుణ్యంబున చిత్తజుని చిత్తం బపహరించుచు లీలావినోదంబులతో మెలంగుచుండ మిత్రాచార్యుం డీముద్దియ స్వరూపానుకూలవరుని వీక్షింపవలయు నని తలంచి మనంబున నూహించుచుండ నొకనాం డక్కంబుకంఠి ముక్కంటిమందిరంబున కేకాంతంబున నేతెంచి వందనంబు లిడుచుండెను. వినుతగుణకదంబుండగు హరుండు కదంబాస్వరూపంబు గని మన్మథోద్రేకంబుచే మదిరాక్షిం గూడదలంచి ప్రసన్నుండై విచారింప భయంబుచే బరువులిడుచుండ నుమానరుండు రయంబున వెనువెంటం బరుగెత్తి యంగస్పర్శనంబు జేయ తక్షణం బాకదంబ బాదేవి దివ్యతరదేవగణికా శరీరంబు దాల్చి దేవలోకంబున కేగెను. తదుపరి సర్పభూషణుండు దేవళంబున కరుదెంచునెడ కదంబార్పితచిత్తుం డైనకతంబున వీర్యంబు గళితంబై కృష్ణాతటంబున బడియుండె. నయ్యది వర్షయోగంబుచే

తన్నదీప్రవాహంబునఁబ్రవహించుతఱి శశాంగనృపుండుతత్తోయంబుల మునింగి దివాకరునికై యర్ఘ్యంబు లొసంగఁదలంచి యంజలీపుటంబున వీర్యయుత నీరంబులు గ్రహింప మనుష్యదేహసంయోగంబుచే నంజలీభాగంబున నర్భకుం డుద్భవించి మహాకాంతిచే బ్రకాశించుచుండెను.మహీధవుం డత్యంతాశ్చర్యంబుతో నిప్పుత్రుండు హరివిరించిప్రముఖాఖిల సురసంఘంబున నొకండు గానోపును. లేకున్న నయోనిజన్మి యగుట దుర్లభంబు గాదే? మత్పురాకృతవిశేషంబున నుమేశుం డొసంగె నని నిశ్చయించి పరమానందంబుచే శిబిరంబున కరుదెంచి మందాకినీదేవి కర్పింప నక్కోమలాంగి ముదాన్వితహృదయయై "నాథా! తేజోధనుండగు డింభకుం డెవనిసుతుం"డని విచారింప క్షితీశుండు సతీతిలకంబుతో "ప్రియే! కృష్ణాప్రవాహతోయంబులచే ప్రభాకరున కర్ఘ్యంబు లొసంగునెడ కరుణాంతరంగుండగు గరళకంఠుం డొసంగె"నన నమ్మృగాక్షి మితిలేని యానందంబుచే నర్భకుని కౌఁగిటం జేర్చుకొనునంత దైవయోగంబున నురోజంబుల క్షీరంబులుదయించె. పిదప ద్వాదశదివసంబు లచ్చో నివసించి శాబకునకు 'కృష్ణాగరుం' డని నామకరణం బొనర్చి మదనారిచరణంబులకు వందనంబులిడి నిజపురంబున కేతెంచిన దినదినం బా కృష్ణాగరుండు వర్ధిల్లుచు ద్వాదశాబ్దంబుల బాలుండై బహుగుణవిశేషంబులచే మెలంగుచుండ శశాంగుండు తనూభవుని వివాహం బొనర్పదలంచి కర్ధముండను మంత్రిపుంగవునితో "బాలుండగు కృష్ణాగరరూపగుణలక్షణంబుల కెనయగు సుదతీరత్నంబును శోధింపు" మన నతం డవశ్యంబని పురోహితాది శిష్టజనపరివృతుండై నానాదేశంబులు గ్రుమ్మరుచు బహుప్రయాసంబుచే ప్రతిపట్టణంబున పల్లవాధరిని శోధించి కృష్ణాగరానురూపముద్దియను గానక తిరిగి కౌండిన్యనగరంబున కేతెంచి నృపాలోత్తమునితో "రాజశ్రేష్ఠా! కృష్ణాగరునకై యనేకనగరంబులు దిరిగి వరానుకూల సారసాక్షిని గానక తిరిగి యేతెంచితి" మని విన్నవించి నిజపదంబున విలసిల్లెను. తదనంతరం బా మహీనాయకుం డొకకొన్నిదివసంబులు గడపుచుండ మందాకినీదేవి ప్రాణంబులు పరలోకగతంబులయ్యె. నృపుండు గతజాయుండై శోకార్ణవంబున మునుంగుచు ఖేదమానసంబుచే నిస్పృహత్వంబున వైభవం

బులు దలంపక నింద్రియనిగ్రహుండై రాజ్యం బేలుచుండి యొకనాఁ డమాత్యునితో "మంత్రిముఖ్యా! కృష్ణాగరునికై యనేకరాజ్యంబులు సంచరించితి వందు నా కనుకూలంబగు పడఁతియున్న గలదేని దెలుపు" మన సచివుండు యోచించి "స్వామి నాయకా. చిత్రకూటనగరాధిపుం డగు భుజధ్వజనామభూవల్లభునకు సకలగుణలక్షణోపేత పుత్రికారత్నంబు గలదు. నే నత్తలోదరి యుత్తమోత్తమగుణంబు లాలకించి కృష్ణాగరునికై విచారింప నమ్మగువ గ్రహశత్రుత్వాది కూటవిరుద్ధంబుచే ఘటియింపనయ్యె. యుష్మన్నామధేయంబుపై యనుకూలవంతంబో కాదో? పురోహితునిచే నాలోచింపవలయు" నని రయంబున భుజధ్వజదుహితృజాతకంబు దీసి చతురుండగు పురోహితుని బిలచి బరీక్షింపు మన నవ్విప్రోత్తముండు "శశాంగనరపుంగవునకు సర్వకూటప్రశస్తంబై ప్రకాశించు" నన తక్షణంబున సచివుండు మహీధవునిచే ననుజ్ఞగొని చిత్రకూటపురంబున కేతెంచి భుజధ్వజునితో శుభసంభాషణంబులు వెల్లడి యొనర్చి శశాంగనృపాలునికై లగ్నసమారంభ ఘటికానిశ్చయశుభపత్రిక లిఖియించి యొకదూతచే కాండిన్యనగరాధిపుని కనుప శశాంగుండు హర్షమానసుండై సపరివారబంధుమిత్రసహితంబుగ చిత్రకూటనగరంబున కరుదెంచి శుభముహూర్తంబున భుజావంతిని వివాహంబాడి శ్వశురునిచే ననుజ్ఞ వడసి జాయాసమేతంబుగ నిజపురంబున కేతెంచి ముదాన్వితమనంబున కాలంబు గడుపుచుండ నక్కాంతామణి షోడశాబ్దపరిపూర్ణుండగు కృష్ణాగరుని నవయౌవనాంగంబులు విలోకించి దుర్మతిచే కృష్ణాగరునితో నేకాంతంబున సంభాషింపవలయునని యూహించి శశాంగుండు మృగయావినోదంబుగ నరణ్యంబున కేగినతఱి నిజకేళీగృహంబున నివసించి యొకపనికత్తియతో కృష్ణాగరుని దోడి తెమ్మనివా క్రుచ్చిన నచ్చెలి శీఘ్రంబున రాకొమరుని జేరంజని "నృపాలతనయా! యుష్మత్సాపత్నిమాత మిము దోడి తెమ్మని యనుజ్ఞ యొసంగె" నన కృష్ణాగరుండు బహుదినంబుల కస్మత్సాపత్నీజనన్యనుగ్రహపాత్రుండనైతినని సంతోషస్వాంతుండై త్వరితంబున నంతఃపురంబు ప్రవేశించి భక్తిభావంబులచే నమస్కరింప నయ్యమలాత్ముని నవమోహనాకారంబు గని మన్మథోద్రేకంబుచే హస్తంబు ధరి

యించి "పురుషశ్రేష్ఠా! మచ్చిత్తంబు చిత్తజనితాపంబుచే భవదర్పితంబయ్యె. నీదయారసపూరితహృదయంబుచే సురతసుఖార్ణవంబున గడతేర్పవే" యని నుడువ కృష్ణాగరుండు క్రుద్ధుండై "భ్రష్టే! మహీశునకు మహిషివై మజ్జననీతుల్యంబుగ సాపత్నిమాతవై నీచమతిచే సుతుండని దలపోయక పొందుగోరుట కర్జంబగునే! నీపాపంబునకు కృతాంతుండు శిక్షించ సరిపోవునే" యని తిరస్కరించి యాహా! స్త్రీజనకపటమానసంబు లెంతవిగీతంబు లనుచు వేగంబున నిజస్థానంబు జేరంజనెను. తదనంతరం బాచపలాక్షి పరిచారికంబిలిచి "సఖీ! నాప్రయత్నంబు విఘ్నంబయ్యె. దృఢతరహృదయుండగు కృష్ణాగరుండు క్షోభించె నికముందు నే నెట్టి యాపదలపాలౌదునో? కృష్ణాగరుండు జనకుని కెఱింగించెనేని నాప్రాణంబు లపహరింపఁబడునో? మునుముందు విషపానంబుచే శరీరంబు త్యజించుట మేలౌనగూడదే? నిందాస్పదజీవనంబు గాల్పనే? జీవింతునేని నృపోత్తమునిచే కడుకష్టంబు లనుభవించక దీరునే? మత్కృత్యంబులు పరమహేయంబులు గావే? ప్రాణంబులు విడుచుట ముఖ్యంబై గాన్పించు" నని బహువిధంబుల విలపించుచుండెను.

ఇతి భక్తిసార నవనాథచరిత్రంబున శశాంగ కృష్ణాగరచరిత్రంబు త్రింశత్యధ్యాయము సంపూర్ణము.

---

## ఏకత్రింశత్యధ్యాయము.

---

{ కరపాద ఖండితుండగు కృష్ణాగరుని మత్స్యేంద్రగోరక్షనాథులు గొనిపోయి తపంబుకై నియమించుట. }

ఇప్పుగిది బుద్ధిరహిత భుజావంతి దనసుద్దు లోకముద్దియతో దెలుపుచు పంచత్వంబు నొందెద నని నిశ్చయమనంబుచే నుడువుచుండ నక్కపటమయ జక్కవచంటి పెక్కుభంగుల నోదార్చుచు "నోహో! నీకింతభయంబేల? మద్బుద్ధినైపుణ్యంబుచే నీకొక సదుపాయంబు దెలిపెద. భోజనంబు బరిత్యజించి భూషణంబులు బడద్రోసి శోకాకులిత చిత్తంబుచే పడకటింటిపాన్పుపై నత్తమిల్లుము. నృపుండే తెంచి 'యేకతంబున శయనించితి'వని విచారించు. నీవపు 'డికేటి బ్రతుకు? మత్ప్రా

ణంబులు బరిత్యజించెద' నని యతనితో 'భవత్సుతుండు కామోద్రేకం బుచే నన్నొడిసిపట్టి బాధింపుచుండ నే నతిసాహసంబున విడలించి యం తఃపురంబు బ్రవేశించినంత పరుగెత్తెను. నాయట్టి నీచశరీరి లోకంబున గలదే'? యని క్రోధావేశవాక్యంబులచే రోదనం బొనర్చె దేని క్షితీశుం డాగ్రహచిత్తుండై కృష్ణాగరుని జీవంబు లపహరించు. వహ్నిస్పర్శభవ నంబు శంబరంబుచే శాంతింబొందినక్రియ దుఃఖప్రవాహంబును మాయోపాయకూలంబుచే బంధించెద వేని నీయమలత్వం బేర్పడు. నీసు ఖంబులు స్థిరంబులై యుండు. నీమనోగత తాపం బెడబాయు'' నని యన ర్థంబులగు దుర్బోధంబులు బోధించి దనగృహంబున కేగెను. పిదప నక్కుటిలమతియగు భుజావంతి మలినవస్త్రంబులు ధరించి మణిచిత్రిత భూషణంబులు బుడమినివైచి కుంకుమాది సౌభాగ్యద్రవ్యంబు లపే క్షింపక శిథిలీకృతపర్యంకంబుపై బవళించియుండ శశాంగనరోత్తముండు నానావనమృగంబుల జెండాడి రయంబున భటజనపరివృతుండై పురం బుజేరి మనోల్లాసంబుచే నంతఃపురంబు ప్రవేశించునంత ద్విజరాజగమని యగు భుజావంతి సంతసంబున నెదురేతెంచలేదని మనంబున చింతిం పుచు నొకదాసీకాంతను విచారింప నయ్యింతి భూకాంతునితో ''భుజా వంతి యేకతంబుననో ఘోరతరచింతాభరత్వంబున నేకాంతంబున శయనించె'' నని విన్నవించెను. శశాంగుం డతివేగంబున తచ్ఛయ్యాగృ హంబు బ్రవేశించి ''ప్రియే! శరచ్చంద్రచంద్రికలనేలు నీముఖకమలం బేలముకుళించె''నని విచారింప నత్తన్వి ప్రత్యుత్తరం బొసంగక బాష్పం బులురాల్చుచు నాక్రందించుచుండెను.బుడమిఱేడు కడు మోహంబున నప్పడఁతిపజ్జం గూర్చుండి ముఖంబు నివిరి బాష్పంబులు దుడిచి లాలిం పుచు ''సఖే! నాయట్టి దోర్బలప్రతాపయుత ప్రియుండు గలుగ నీకీ దుఃఖంబేల? దాసీజనంబులు నీయాజ్ఞోల్లంఘనంబు జేసిరో? మద్ద ర్పంబుఁ దలంపక నెవ్వరేని నీచమతిచే దూషించిరో? తత్క్షణం బా నరాధముల మల్లోకపానలజ్వాలలచే రవిపుత్రుని నిలయంబున కంపక నుపేక్షింతునే? నీమనోవ్యథకారకులగు పురుషుల మశకప్రాయులుగా గణుతించనే? వ్యాఘ్రంబు జంబుకంబుల సరకుగొనునే!దుష్టులను శిక్షిం పని నృపుండు శిష్టుండగునే? మత్పట్టమహిషివై దుఃఖంబుల పాలగుట నాకపకీర్తివాటిల్లదే? నీశోకంబు బాపని శౌర్యంబు గాల్పనే? నిస్సం

శయమనంబుచే నేమనుజాధముండు నిను దిరస్కరించెనో యెఱింగిం పుము. తత్క్షణం బా దుష్టాత్ముని కష్టంబుల పాలొనర్చి ప్రాణంబు లప హరించెద” నన భుజావంతి ముదంబుచే “నాథా! మీరు మృగయాని మిత్తంబై విపినంబున కేగుటంగని కృష్ణాగరుండు దుష్టభావంబుచే నేకాంతంబున కరుదెంచి జ్ఞానశూన్యుండై పాపంబని దలంపక మరు కేళికై మత్కారంబు ధరించి సరసంబులాడుచు శయ్యాగృహంబున కీడ్చు చుండ సాహసంబుచే విదిలించి సౌధాగ్రంబుపై బరుగెత్తితిని. కృష్ణా గరుండు దుర్భాషలాడుచు దననివాసస్థలంబున కేగెను. ప్రాణప్రియా! తత్క్షణంబ గరళంబు ప్రాశించి ప్రాణంబులు బాయందలంచియు యుష్మ త్పదకమలసందర్శనోత్సుకంబుచే మార్గంబు నిరీక్షింపుచు మోహ పాశబద్ధమానసనై నివసించితిని. నామనోభీష్టంబు చేకూరె. మత్ప్రా ణంబులు త్యజించుట నిక్కంబు నిక్కం” బని నొక్కి వక్కాణించి దిక్కులు పిక్కటిల్ల శోకింపుచుండ నక్కునలయేశ్వరుండు కోలనేసిన వ్యాఘ్రంబుపగిది యాగ్రహించి ఘనకోపాలన మూర్తిస్వరూపుండై నిమిషంబున కృష్ణాగరుని భస్మంబొనర్చెద నని పౌరుషంబులు బలు కుచు నేత్రంబుల విస్ఫులింగంబులు రాల్పుచు శీఘ్రంబున సభామంట పంబున కేతెంచి యొకభటునితో “దుష్టుండగు కృష్ణాగరుని కరపా దంబులు ఖండిపు” మని యాజ్ఞాపింప వాఁ డతిరోషంబుచే నృపసు తుని దోడ్కొని మృత్యుభూమిం జేరి కృష్ణాగరు నచ్చోనుంచి భూమీ శుని సన్నిధికేతెంచి “ప్రభో! భవదాజ్ఞానుసారుండనై కృష్ణాగరుని ప్రేతభూమికిఁ గొనిపోయితి” నని విన్నవించుచుండ నరపుంగవుండు గోపించి “తడవేల కరపాదంబులు ఖండింపు” మని వాక్రుచ్చెను. భటుం డతిరయంబున భూపనందనుని సమీపంబున కేతెంచి ద యాంతఃకరుణహృదయుండై ముమ్మారు విచారించుట ధర్మంబని దల పోసి పునశ్శశాంగుని సమక్షంబున కరుదెంచి “దేవా! సెలవా” యని మందలింపుచుండ నృపుండు “తడవేల? శాసింపు” మని యాజ్ఞాపించెను. భటుండు దనడెందంబున విమలజ్ఞానయశోధనుండగు కృష్ణాగరుని హస్తపాదంబులు ఖండింపఁబడుటచే మహదనర్థంబు ఘటియించు” ననుచు ఖేదమతిచే జని యొకరత్నమయపీఠంబుపై రాసుతు నలంకరించి ఖండించుటకై కరచరణంబులు బంధింప నంత పురజను లీభయంకర

వృత్తాంతం బాలకించి గుంపులు గట్టి భూపుని సనుషంబున కేతెంచి కోపపూరితలోచనుం డగుట బొడగాంచి యసమర్థులై యొండుబలుకక వేగంబున హరవీరోద్భవుని విలోకింప జేరంజనిరి. తత్సమయంబున నృపోక్తప్రకారంబుగ భటుండు కరపాదంబులు ఖండించె. నంత నయ్యమలాత్ముండు మూర్ఛాగతుండై బుడమింబడ భూదేవి దనఫాలభాగంబున ధరించిన కుంకుమతిలకంబో యన కరపాదనిర్గత రుధిరధారామయంబై శోభిల్లుచుండ కృష్ణాగరుండు హాహాకారంబు జేయుచుండెను. చూపఱు లీయద్భుతంబుగని యాహా! భూధవుండు వృద్ధుండై బుద్ధిహీనంబుచే స్వసుతుని శిక్షించె ననుచు నొకకొంద ఱీ యనులాత్ముండు నిర్దోషుండనుచు మఱికొంద ఱీ కృష్ణాగరుం డధర్మంబుచే సవతితల్లిని జెనకి శిక్షార్హుం డగుట ధర్మవిరుద్ధం బనదగునే? దృగ్గోచరవృశ్చికంబుల నుపేక్షింతురే? పక్షపాతరహితులగు క్షితీశులు న్యాయమార్గం బాశ్రయించుట ముఖ్యకారణంబు గాదె? యనుచు కొంద ఱీ దుష్టజనాచరిత దుష్కార్యంబు దృఢమానసుండగు కృష్ణాగరునిచే నాచరింపఁబడెననుట కల్లగాదే! నిజానిజం బెఱుంగని భూపుండు పాపమతిచే నేకపుత్రుం డని దలంపక కఠినతరశిక్ష లొనర్చె ననుచు ననేకు లనేకవిధ సంభాషణంబులు సల్పుచు విషాదవదనులై చని పురంబున గుజగుజలాడుచుండుతఱి గోరక్ష మత్స్యేంద్రు లలక్ష్యనిరంజన భిక్షాప్రశ్నంబులు జేయుచుండ బుద్ధిదక్షుండగు గోరక్షుం డీ దుస్సహ దురోక్తు లాలకించి త్వరితగతి ప్రేతభూమి కరుదెంచి వికలాంగుండగు మృత్యుంజయ వీరోద్భవుని గనుంగొని తపోఘనుండగు మత్స్యేంద్ర యోగివర్యుని కెఱింగింప నమ్మహామహుండు కరుణామయుండై దనయంతరంగదృష్టిచే కృష్ణాగరుని నిర్దోషచరిత్రంబు భుజావంతి కుత్సితంబులు దలంచి సక్రోధుండై "భ్రష్టాత్ముండగు భూపుండు కపటమయకాంతార్పితచిత్తుండై న్యాయాన్యాయంబులు శోధింపక మూఢమతిచే గంగాధరవీరోద్భవుని యంగంబులు శస్త్రఘాతంబులచే భంగపఱిచెను. నీచాధముండగు నృపుండు భూభారుండు గాఁడే? విషయలోలుండై దోషం బెఱుంగక నిర్దోషజనాళిని శిక్షించెడు పాపుండు శిక్షార్హుండు గాఁడే" యని "గోరక్షా! తత్క్షణంబున నృపాధముని సనుషంబున కేగవలయు ర" మ్మని తత్ప్రదేశంబు బాసి పదచలనంబు

జేయుచుండ గోరక్షుం డంతరంగదృష్టిచే కృష్ణాగరుండు శివవీరోద్భవుం డగుట యెఱింగి "గురుసమర్థా! మనమీ కృష్ణాగరునికై క్షితిశుని శిక్షింపనేల? నిబ్బాలుని నాథపంథీమార్గంబున బ్రకాశింపఁ జేయవలయు. చతురంగపీఠంబుపై కరచరణంబులు ఖండించినకతంబున చౌరంగనాథనామంబిడి యనేకమంత్రమంత్రార్థరహస్యంబు లుపదేశించి సర్వవిద్యావిశారదత్వంబుచే బ్రఖ్యాతి యొనర్చి పిదప నీచౌరంగనాథునిచే దుష్టజాయాసహిత భూరమణుని గర్వనిర్వాపణం బొనర్పవలయు. మనమిపు డీనృపాధమునితో కృష్ణాగరుని గొనిపోయెదమని దెలియబఱచుట యుచితం" బని విన్నవింప జ్ఞానసంపూర్ణుండగు మత్స్యేంద్రుం డవశ్యం బని రాజభవనంబు జేరంజని ద్వారికునితో దమరాక నెఱుంగింప వాఁ డతివేగంబున నేగి నరాధిపునితో "తాపసోత్తములగు గోరక్ష మత్స్యేంద్రు లేతెంచి" రని వచియించెను. శశాంగుం డమ్మహామహుల తపఃప్రభావచరిత్రంబు లెఱుంగుకతంబున ప్రీతమానసుండై పీఠంబు దొలంగి మంత్రిపురోహితసహితంబుగ తాపసోత్తముల కెదురేగి బహువిధభయభక్తియుక్తుండై యోగిముఖ్యుండగు మత్స్యేంద్రసిద్ధుని పదకమలంబులపై ఫాలంబుమోపి స్తోత్రంబులు జేయుచు తదుపరి గోరక్షనాథచరణంబులకు ప్రణమిల్లి "దయాఘనులారా! మత్పురాకృతపుణ్యఫలంబుచే మీయుభయనాథుల దర్శనంబు ఘటించె. మద్వంశంబు జన్మంబు భవనంబు పావనం బయ్యె. నస్మదజ్ఞానపాపభంగంబుకైయరుదెంచిన గంగాప్రవాహంబన సురనరాది వందితచరణారవిందులై దయారసభరిత హృదయంబులచే నేతెంచితిరి గాబోలు. లేకున్న భవాదృశయోగిముఖ్యుల దర్శనంబు లభియించునే" యని పొగడుచు దోడ్కొని సభామంటపంబున కేతెంచి రత్నఖచిత కనకసింహాసనంబులపై యుభయసిద్ధుల నలంకరించి షోడశోపచారంబులచే బూజలొనర్చి ముకుళితకరపల్లవుండై నికటంబున నిల్చి మత్స్యేంద్రనాథునితో "సమర్థా! భవదాగమనకారణం బెయ్యదియో కృపామతిచే నెఱుంగించి నన్నుద్ధరింపవే" యని వేఁడుచుండ మత్స్యేంద్రుండు నరేంద్రుని వాక్చాతుర్యంబుల కానందించి "రాజోత్తమా! మేమీ నగరంబున కరుదెంచునెడ నొకబాలుండు గ్రామబాహ్యప్రేతభూమిసమీపంబున

చతురంగపీఠంబుపై ఖండీకృతకరపాదుండై విలసిల్లుట గాంచి భవత్ప్రోధానల శిక్షితుండని యెఱింగి యిందే తెంచితిమి. న్యాయవిరుద్ధబాలుండు గావున మాకర్పించెద వేని గొనిపోయెద” మన బుడమీశుండు హాస్యరసపూరితవదనుండై “యోగిపుంగవా! కరపాదరహితుండగు మనుజుండు మిమ్మెట్లు సేవించు? తామా వికలాంగునికై కష్టంబు లనుభవించరే? తమభుజాగ్రంబులపై వహించి చనుట యుచితంబగునే” యని నమ్రుండై విన్నవింప యోగిధూర్జటి యగు మత్స్యేంద్రుండు “రాజశ్రేష్ఠా! నీకుశత్రుస్వరూపుండు గావున నశక్తుని నశక్తుం డనియెదవు. నీకీ సంశయంబేల” నన శశాంగుండు “దయామయా! బాలుండు భవచ్చరణార్పితుండయ్యె నవశ్యంబున దోడ్కొని జనుం” డన శీఘ్రంబున మత్స్యేంద్రగోరక్షులు ప్రేతభూమి కరుదెంచి రాకుమారుని దోడ్కొని దమువిడిది కేతెంచి హస్తపాదప్రక్షాళనం బొనర్చి యొకరాత్రి యచ్చో గడపిరి. శ్రోత లొకసంశయంబు గలిగి పునస్సృష్టి యొనర్చు సమర్థులగు మత్స్యేంద్రగోరక్షులు సంజీవినీ మంత్రయోగంబుచే మృత్పుత్రికను సజీవంబొనర్చి గహినీనాథనామంబుచే బ్రకాశింపఁజేసిన ఘనులై కృష్ణాగరుని కరపాదంబు లేల గల్పించలేరైరని విచారింప నప్పౌరాణికుండు శ్రోతలారా! ఏతత్సంశయంబు జెప్పఁబోవు కథావిశేషంబులచే స్పష్టంబగు పురోసూచకకారణంబుచే నిమ్మహామహులు గల్పింపలేరైరి. తపంబుకై నియమించునెడ కరపాదంబు లుద్భవిల్లునని బలుకుచు గోరక్షుండు స్వభుజాగ్రంబులపై చౌరంగుని నెక్కించుకొని మత్స్యేంద్రనాథసహితుండై బదరికాశ్రమంబునకు జేరంజని శివాలయంబున చౌరంగుని డించి యుభయనాథులు బదరికేశ్వరునికి వందనంబు లాచరించి కాననంబు గ్రుమ్మరుచు మందరాచలప్రదేశంబున నొకగహ్వరంబుఁ గని యీస్థలంబున చౌరంగునితపంబుకై నియమించవలయునని నిశ్చయించి యేతత్ప్రదేశం బతిగోప్యంబై బ్రకాశించును చౌరంగు నిందుంచి యేగితిమేని పునస్సందర్శనంబగుట కష్టంబగునని యోచించి యచ్చోనొకచిహ్నం బేర్పఱచదలంచి గోరక్షుం డొకవిస్తీర్ణపాషాణంబు గొనితెచ్చి గుహోపరిభాగంబున నస్త్రవిద్యానైపుణ్యంబుచే నిరాధారంబుగ నిలిపి యుమానాథుని నిలయంబున కేతెంచి చౌరంగుని దోడ్కొని యచ్చోటి కరు

దెంచి గుహానికటవిశాలతరుచ్ఛాయాశ్రితులై నివసించియుండ మత్స్యేంద్రయోగివర్యుండు "గోరక్షా! నీవీ చౌరంగుని కనుగ్రహం బొసంగు" మని పలికెను. గోరక్షుండు "గురుసమర్థా! చౌరంగుండు తపఃపూర్ణత్వంబుచే బ్రకాశించు నెడ సకలమంత్రార్థంబు లుపదేశించెద" నన మత్స్యేంద్రయోగివర్యుం డవశ్యంబనియె. గోరక్షుండు చౌరంగునితో "వత్సా! నీ వేతత్ప్రదేశంబున తపం బాచరించెదవా" యన చౌరంగుండు "సమర్థా! తనువాక్యానుసారుండనై తామేస్థలంబు నిర్దేశించెదరో తత్స్థలంబున తపం బాచరించెద. నన్నిచ్చో బరిత్యజించి తా మనేక దేశంబులు సంచరించెదరు. ఐనను భవత్కృపాకటాక్షవీక్షణం బీదాసునిపై యనిశం బెసబాయక నుంచితిరేని మత్తపంబు సఫలంబగు. మత్ప్రాణంబులు రక్షింపఁబడు" నని సవినయంబుగ బలుక నుభయనాథులు సంతసించి చౌరంగుని గుహాంతరంబున నివసింప నియమించి "వత్సా! నీశిరోపరిభాగంబున నిరాధారపాషాణంబుగనుంగొనుము. తపాంతంబువర కీపాషాణంబుపై దృష్టి నిలిపి సుస్థిరుండవై జపంబొనర్పుము. ప్రమాదంబుచే నేతద్దృష్టి దొలంగించితివేని యీపాషాణంబు భవచ్ఛిరంబుపై పతనంబగు. నందుచే నీశరీరంబు చూర్ణీకృతంబై గతప్రాణుండవయ్యెద" వనుచు గోరక్షుండు చౌరంగుని కర్ణేంద్రియంబున మహామంత్రం బుపదేశించి యొక ఫలంబు గొనితెచ్చి "చౌరంగా! నీవీ ఫలంబు భక్షింపు మిందుచే నీక్షుద్బాధకై ప్రతిదినం బొకఫలంబు లభియించు గావున నిశ్చలమానసుండవై తపం బాచరించెదవు. మే మొకకొన్నితీర్థంబులు సేవించి నీకై యరుదెంచెద" మని వాక్రుచ్చి గుహాద్వారంబు వెలువడి యొక పాషాణంబుచే ద్వారముఖం బాచ్ఛాదించి గోరక్షుండు దన మంత్రయోగంబుచే తక్షణంబ చాముండామహాశక్తిని నాహ్వానింప నద్దేవి ప్రత్యక్షంబై "సమర్థా! భవదీప్సితంబులు దెలుపు" మని వేఁడ నమ్మహామహుండు "హేశుభాననీ! మత్ప్రాణసముండగుచౌరంగు డేతద్గుహాంతరంబున తపం బాచరింపుచుండు ప్రతిదినం బిత్తాపసుని క్షున్నివారణంబుకై గుప్తవేషంబుచే ముఖపాషాణంబు దొలగించి నొకఫలంబుసమక్షంబున నుంచి యెప్పటియట్ల పాషాణంబుచే ద్వారాచ్ఛాదనంబొనర్పు" మని సెలవొసంగి మత్స్యేంద్రగోరక్షులు నానారణ్యంబు

లధిగమించి గిరినారపర్వతశ్రేష్ఠంబు బ్రవేశించిరి. ఇట చాముండాదేవి గోరక్షోక్తప్రకారంబున మధురసపూరితఫలం బొకటి గుప్తవేషం బుచే ప్రతిదినం బర్పించుచుండ చౌరంగుండు శిరోపరిభాగంబున విల సిల్లెడు పాషాణభయంబుచే *నుత్ప్రశ్యుండై దృష్టితప్పింపక తత్ఫలభ క్షణకాంక్ష లుడిగి యేకాగ్రమానసంబున గురువచనానుసారుండై తపం బాచరించుచు నిశ్చలత్వంబుచే ధ్యానయోగంబున దేజరిల్లు చుండె నంతకంతకు తపఃప్రభవానలోష్ణంబుచే శరీరంబు క్షీణించి శుష్కపటంబుపగిది మాంసరహిత సిరాస్థియుతంబై చలన వలన ప్రస రణాది శక్తులు దొలంగి కాష్ఠంబుకైవడి నిశ్చేష్టితంబై యుండెను.

ఇతి భక్తిసార నవనాథచరిత్రంబున శశాంగ కృష్ణాగరకథావిశే షం బేకత్రింశత్యధ్యాయము సంపూర్ణము.

---

## ద్వాత్రింశత్యధ్యాయము.

---

మత్స్యేంద్రగోరక్షనాథులు దత్తానుమతిచే నానాతీర్థంబులు సంచరించుచుండ మత్స్యేంద్రనాథుండు త్రివిక్రమనృపకళేబరంబున పరకాయయోగం బున ప్రవేశించి రాజ్యం బేలుచుండ నమ్మత్స్యేంద్రకళేబరంబు రేవ తీదేవిచే శిథిలంబొనర్పఁబడుట.

మత్స్యేంద్ర గోరక్షనాథులు గిరినార మహీధరంబు జేరి ప్రత్యక్ష త్రిమూర్తిస్వరూపుండగు దత్తాత్రేయుని పాదాంభోరుహం బులకు వందనంబు లిడుచుండ దత్తుం డమితానందంబుచే నుభయనా థులకు దృఢాలింగనం బొసంగి "మత్స్యేంద్రా! నాయుల్లంబు భవదా గమనంబుచే చంద్రోదయంబున జలధి యుప్పొంగెడుచందంబున రంజిల్లె. వత్సా! నామనంబు నిను బొడగాంచుటకై నిరీక్షింపుచుండ నేడే తెంచితివి. నాయభీష్టంబు జేకూరె. నీక నిచ్చో నివసించి సుఖగో ష్ఠిచే కాలంబు గడుపు" మని యన్యోన్యస్నేహంబుతో భోజనాసనా దివిషయంబుల నెడబాయక నానాదేశ నానాతీర్థ మాహాత్మ్యంబులు సుఖదుఃఖాది కథనంబులు సంభాషింపుచు దివసంబులు గడుపుచుండ

---

*ఉత్ప్రశ్యుండై=మీఁదు చూచువాఁడై

షణ్మాసానంతరంబున గోరక్షుండు తీర్థయాత్రాగమనోన్ముఖుండై యత్రి సూనునితో "దయాఘనా! జగదుద్ధారనిమిత్తంబున నవతరించి యొక్కచో నివసించుట యవతారకారణంబునకు భంగంబు వాటి ల్లదే? తీర్థసేవాపరత్వంబున ననేక దేశంబులు గ్రుమ్మరుచు సాధుసజ్జనులచే సుఖగోష్ఠులు జరుపుచు ముముక్షులకు మోక్షమార్గంబులు ప్రదర్శింపుట ముఖ్యంబుగావున కరుణించి సెలవొసంగెద రేని పయనం బొనర్తు" మని విన్నవింప ననసూయానందనుండు భవిష్యార్థంబెఱింగి యవశ్యంబని సెలవొసంగెను. మత్స్యేంద్రగోరక్షనాథులు ప్రేమపూరిత భక్తిభావంబులచే దత్తాత్రేయుని పదకంజంబులకు ప్రణమిల్లి కాశీపురమార్గంబున ననేకగ్రామంబు లధిగమించి ప్రయాగస్థానంబు ప్రవేశించిరి. తత్పురాధినాయకుండగు త్రివిక్రమనామ నృపోత్తముండు ధనధాన్యసంపత్సమృద్ధిచే పెంపెక్కి రథగజతురగభటముఖనిఖిల పృతనంబులు మహార్ణవంబుబోలి ఘూర్ణిల్లుచుండ శౌర్యధైర్యస్థైర్యంబులు గలిగి యతులిత శాంతశమదమాదిగుణంబులచే కామాదిషట్కంబును జయించి యీషణత్రయంబులకు బద్ధుండుగాక తాపత్రయంబుల జాలిం జెందక క్లేశయుత ప్రపంచమోహపాశంబుల దెగటార్చి భూతపంచకమయంబగు శరీరం బస్థిరం బనియు స్థూలశరీరాశ్రయ వైభవంబులు క్షణభంగురంబను మనోనిశ్చయంబుచే సంతానంబు లేకున్నను నిరస్తఖేదుండై యమోఘపరతత్వ జ్ఞానపరిపూర్ణత్వంబుచే సర్వభూతహితంబు గోరుచు భక్తివైరాగ్యంబుల నుదారశీలుండై సర్వవిద్యావిశారదత్వంబున ప్రజాపాలనం బొనర్చుచు జరామయశరీరుండై విరాజిల్లుచుండ నయ్యకలంకగుణగరిష్ఠుండగు త్రివిక్రముని ముఖ్యమహిషియగు రేవతీదేవి శచీప్రముఖ పతివ్రతారత్నంబుల శిరోమణియై శీలగుణ విశేషంబులచే పొగడొంది నిజకాంతుని శరీరాంతజరామయత్వంబు గని యిమ్మహీశుని యవసానసమయంబు ఘటియించె నని మనంబున చింతింపుచు దనబుద్ధినైపుణ్యంబుచే గృహకృత్యంబులు నిర్వహించుచుండ నరపుంగవుండు జీవబ్రహ్మైక్య యోగంబుచే పాంచభౌతిక స్థూలశరీరంబు బరిత్యజించెను. పుణ్యాంగనామణియగు భూవల్లభి బుడమీశుని మరణంబుకై హాహాకారంబు

జేయుచు వల్లభుని గుణవితానంబు లుగ్గడించి యాక్రందించుచుండ తద్వత్పురజనసముదయం బేకముఖంబున క్షితీశుని వితరణాది సద్గుణంబులు దలంచి దుఃఖప్రవాహంబున మునింగి బహునాదంబుచే ప్రతి గృహంబున బాలవృద్ధాదులు రోదనంబులు జేయుచుండు సమయంబున మత్స్యేంద్రగోరక్షనాథులు భిక్షార్థంబై తత్పురంబున సంచరింపుచు శోకాకులిత నరలోక సల్లాపంబులచే నృపాలుని సుగుణజాలంబు లాలకించి మత్స్యేంద్రుండు కరుణాంతరంగహృదయుండై దనమనంబున రాజోత్తముం డాత్మానాత్మవిచారసమర్థుం డనియు లోకోపకార పురుషశ్రేష్ఠుండై దివి కేగె ననియు నిట్టికీర్తనీయ గుణధుర్యుని పంచ ప్రాణంబులు విముక్తస్థూలశరీరంబున స్థాపించిన మేలౌననితలంచి యంతర్దృష్టిచే త్రివిక్రముండు ప్రకృతికి పరుండై బ్రహ్మైక్యానుభవ జ్ఞానంబుచే కాయంబు బరిత్యజించుట యెఱింగి యగ్నితప్తబీజం బంకురించునె యని తనంతట దా స్తబ్ధించెను. దయాఘనుండగు గోరక్షుండు పురజన బహువిధ విలాపంబులచే నృపకులాగ్రగణ్యుండగు త్రివిక్రముని సాహసవిక్రమాది గుణంబులు యోచించి యశ్రుపూరితలోచనుండై గురుసమేతంబుగ నగరంబు వెలువడి యొకశివాలయంబున నివసించి యుండుతఱి దహనసంస్కారంబుకై పౌరులు నృపశరీరంబు గొని రోదనధ్వానంబులచే శ్మశానంబున కేతెంచుచుండ తదితరగ్రామనివాసులకీ వృత్తాంతంబు శ్రుతంబై బహురవంబుచే భూపోత్తముని సుగుణంబులు బొగడుచు తండోపతండంబులు జనుదెంచుటం గని గోరక్షనాథుండు భ్రాంతచిత్తుండై మత్స్యేంద్రసిద్ధునితో "యోగిముఖ్యా! నిఖిలజన జేగీయమాన గుణకదంబుండగు త్రివిక్రముని ప్రాణంబులు స్థాపింపవలయు" నన మత్స్యేంద్రుండు ప్రత్యుత్తరం బొసంగకున్నంత గోరక్షుండు "గురుసమర్థా! మచ్చిత్తం బీ నృపోత్తముని జీవిత్వంబుకై మత్తిల్లె. భవదనుగ్రహంబుచే నీక్షణంబున బ్రతికింతు" నన వసుపుత్రుండు "వత్సా! నీసామర్థ్యంబుగా" దని నిరోధించిన గోరక్షుండు తత్కారణంబు దలంపక మత్ప్రాణంబులైన బరిత్యజించి త్రివిక్రముని జీవింపఁజేయుట నిక్కంబుగా దే! లేకున్న మచ్ఛరీరంబు దాహకునిపాలొనర్చుట సత్యంబనదగ దే? వాచాభ్రష్టుండు రౌరవాది మహానరకంబులనుభవింపఁడే" యని శపథంబులు జేయుచుండ మత్స్యేంద్రుం

డాశ్చర్యంబుతో "గోరక్షా! విచక్షణహీనుండవై వాక్ క్షోభం బొన ర్చుటవ్యర్థంబుగాదే? వాసనారహితుండగు పురుషుండు ము క్తిత్రయం బుదలంపక తత్త్వమస్యాది మహావాక్యానుసంధానుండై సాయుజ్యయో గంబున జలార్ణవగత ప్రవాహంబుకరణి రూపభేదవర్జితుండై నిర్గుణ నిష్కళంక పరబ్రహ్మ స్వరూపంబున దేజరిల్లెడు ఘనుండు పునః ప్రకృతిశరీరం బాశ్రయించునే" యని నిగదించెను. గోరక్షుండు దన యంతరదృష్టిచే లక్షించి గురువాక్యంబులు నిజంబని యెంచి మ్లాన వదనుండై దనప్రాణంబులుహుతాశనుని కర్పింపందలంచి శుష్క కాష్ఠం బులు జతజేయుచుండ మత్స్యేంద్రుండు విలోకించి భీతచిత్తుండై దన డెందంబున మున్ను వడలకై విప్రకాంతకు నేత్రంబు లొసంగిన సాహ సుండగు గోరక్షుండు వచనభ్రష్టత్వంబుకై పంచత్వంబు నొందుట నిక్కంబనియూహించి "గోరక్షా! జగదుపకారబుద్ధిచే యుక్తాయు క్తం బులెఱుంగక వాక్పథంబులుజేసి శరీరంబు బాయనేల? నొకసదుపా యంబుచే నీమనోతాపంబు బాపెద. నేనీ రాజో త్తముని శరీరంబున పరకాయప్రవేశయోగంబుచే లోకోపకారనిమి త్తంబై జేరియు ద్వాద శాబ్దంబులు రాజ్యంబేలి పునరాగతుండ నయ్యెద నంతవఱకీ ప్రదేశం బునమచ్ఛరీరంబు భద్రపఱచు" మన నతం డవశ్యంబనునంత మత్స్యేం ద్రుండు పక్షికులం బొకవృక్షంబు విడచి మరియొకవృక్షంబుపై కెగ సినచందంబున స్వశరీరంబు బరిత్యజించి విక్రమనృపుని నిర్జీవకళేబరం బున బ్రవేశించి శ్మశానస్థలంబున సుప్తోత్థితునిచందంబున లేచి నలుది శలు నిరీక్షింపుచుండ బంధుమిత్రకళత్రాదులు పరమానందభరితులై "మనదుర్భర దుఃఖతాపంబులు విలోకించి హరిహరాదులు పునఃప్రా ణంబు లొసంగిరో కాలుం డాయుష్యం బెఱుంగక నపహరించిన ప్రాణంబులు పునఃస్థాపనం బొనర్చెనో" యని బహువిధ సల్లాపంబులు జేయుచు కాష్ఠనిర్మితచితిని విధ్యుక్తప్రకారంబున శాంతిపఱచి క్షితీ శుని సహితులై దమతమ స్థానంబులు బ్రవేశించిరి. ఇట గోరక్షనా థుం డుమాపతీసుందిరంబున గురుకళేబరం బొకగోప్యప్రదేశంబున నుంచుటకై యోచించుసమయంబున నొకయర్చకస్త్రీ పూజాద్రవ్యం బులు గొని యమ్మందిరంబున కేతెంచెను. మిత్రమంత్రోద్భవుం డమ్మ గువంజూచి "తల్లీ! సకలజనదుఃఖప్రశాంతికై మద్గురుండు స్వశరీరంబు

త్యజించి బుడమిఁ జేనికాయంబున బ్రవేశించె. నాకీ యపూర్వచరిత్రుని దేహంబు గాపాడుట ముఖ్యధర్మంబు. ద్వాదశాబ్దంబుల కస్మహామహుం డీ శరీరంబున కేతెంచు గాన నెందైన రహస్యస్థలంబు గలదేని శ్రుతపఱచి యీగోప్యంబు వెల్లడి యొనర్పవల" దని విన్నవింపనమ్మానినీమణి యత్యాశ్చర్యంబని దలంచి యమ్మహాశాలయ మధ్యప్రదేశంబున విలసిల్లెడు మహాబిలం బొకటి గనుపఱచె నంత గోరక్షుండు శ్రీగురుమత్స్యేంద్రయోగిపుంగవుని కాయం బా బిలంబున గోప్యంబుచేసిడి బిలముఖం బాచ్ఛాదించి స్వస్థచిత్తుండై నివసించి యుండ నయ్యర్చకాంగనామణి గోరక్షునితో "సమర్థా! నిర్జీవశరీరంబు ద్వాదశవర్షంబులు భద్రంబై యుండుట దురూహవాక్యంబుగాదే! దివసత్రయంబు గడచెనేని యస్థిచర్మాదులు శిథిలంబులు గావే" యని విచారింప "తల్లీ! సామాన్యమానవశరీరంబునకిట్టి దురవస్థఘటియించు గాక! ఘనయోగమహిమాతిశయంబు చే చిరంజీవుండగు మత్స్యేంద్రనాథ దేహంబుక్షీణించునే" యని ప్రత్యుత్తరంబులొసంగెనట. మత్స్యేంద్రనాథుండు సర్వవిద్యానైపుణ్యంబుచే భూతభవిష్యద్వర్తమానజ్ఞానఘనుండై త్రివిక్రమునియట్ల యంతఃపురంబు ప్రవేశించి స్నానభోజనాది కృత్యంబులచే దనివిదీరి దివ్యతరపర్యంకంబుపై నుపవేశించి మృదుమధుర సంభాషణంబులచే రేవతీకాంతను లాలింపుచు కుశలమతిచే నమ్మదిరాక్షి వాక్యంబులకు ప్రత్యుత్తరంబు లొసంగి యాదినంబు గడపి ద్వితీయదినోదయసమయంబున స్నానసంధ్యాది నిత్యకర్మంబులు దీర్చుకొని సభామంటపంబున సింహాసనాసీనుండై రాజకీయకార్యంబులు విచారింపుచు సచివాది శిష్టజనులతో నిర్భేదంబున బ్రసంగంబులొనర్చి త్రివిక్రమునికైవడి న్యాయాన్యాయంబులు పరిశీలింపుచుండి తచ్చతుర్థదివససాయంకాలసమయంబున దర్శనార్థంబై ఫాలాక్షుని నిలయంబున కేతెంచి గోరక్షునితో "మీ దేశం బెయ్యది? భవన్నామధేయం బేమి? మీ రేకతంబున నిం దేతెంచితి" రని హెచ్చరింపుచు వెంటఁగొని గర్భాలయంబుఁ జేరి యేకాంతంబున హస్తసంకేతంబుచే "మచ్ఛరీరం బెచ్చో భద్రపఱచితి" వని విచారింప బుద్ధిదక్షుండగు గోరక్షుండు బర్బరభాషావాక్యంబులచే కాయనిక్షిప్తబిలంబతిరహస్యంబుచే గనుబఱచెను. నృపశరీరధారకుండగు మత్స్యేం

ద్రుండు కొంతవడి యచ్చో నివసించి రాజభవనంబున కేతెంచె. నిప్ప
గిది ప్రతిదినంబున దర్శనార్థంబై నీలకంఠుని యాలయంబున కరుదెంచి
బిలప్రదేశంబు నిరీక్షించి భక్తిభావంబులచే గోరక్షునితో సంభా
షించి జనుచు మాసత్రయంబు గడుపుతఱి యొకనాఁడా రవితన
యుండు మత్స్యేంద్రునితో "సమర్థా! నేనొక కొన్నితీర్థంబులు సేవించి
యేతెంచెదను. తాము విముక్తశరీరంబును గాపాడుకొను" మని
బలుక భూపుం డవశ్యం బని సెలవొసంగి నిజస్థానంబున కేతెంచె.
యీనృపకాయధరమత్స్యేంద్రుండు రేవతీదేవితో నత్యంతానంద
మయుండై కాలంబు బుచ్చుచుండ నయ్యకలంకముఖి గర్భంబు ధరి
యించి యనుదినప్రవర్ధమానంబై నవమాసంబులకు ప్రసవించి ద్వా
దశదివసంబున నయ్యపారతేజోఘనుండగు డింభకునికి ధర్మనాథుం
డనినామకరణంబొనర్చెను. శాబకుండుపంచాబ్దంబుల బాలుండై గ్రీడిం
చుసమయంబున రేవతీత్రివిక్రములు బాలుంగొని పంచశతపరిచారి
కాసమేతులై గరళగళనిలయంబున కరుదెంచి భక్తివైరాగ్యంబులచే
నమ్మహేశుని బూజలొనర్చి రేవతీదేవి ముకుళితకరకమలయై "గి
రిజాధవా! గిరిభిత్ప్రముఖాఖిల పరిసేవిత పదయుగళా! గిరినిలయా!
గిరికార్ముకధరకరకుశేశయా! శంభో! మద్భర్తయగు త్రివిక్రముని
సమక్షంబున సౌభాగ్యమరణంబు నాకొసంగవే" యని బ్రస్తుతించు
చుండ నయ్యర్చకయువతి నృపగోప్యం బెఱింగినకతంబున పక్కుమని
నవ్వెను. రేవతీదేవి యమ్మానినీమణితో "నీవేకతంబున హసియించి
తివో దెలుపు" మన నక్కాంత రాజకాంతతో "తల్లీ! నే హసించి
నమూలం బెఱింగించెదనేని విపరీతంబు ఘటియించు. ప్రళయాన
లంబును మార్కొను పతంగంబులకైవడి వ్యాఘ్రంబును నెదురించు
జంబుకంబుకరణిమత్ప్రాణంబులుక్షణమాత్రంబునఁ బాయవే" యని
భయవిహ్వలాంగియైపలుకుచుండ నృపరాణియాదరంబుతో రహస్యం
బెయ్యదియో నిర్భయంబుచే నెఱిఁగింపుము. నాభయం బించుకైన
దలంపకు" మని దనకరతలం బమ్మగువ కరతలంబున నిడి యభయం
బొసంగ నిస్సంశయంబుచే నప్పడఁతి యొక యేకాంతప్రదేశంబునకు
భూకాంతామణిం గొనిపోయి "యవ్వా! యుష్మత్ప్రాణనాథుండు
పంచత్వం బొందిన దెఱింగి నిఖలజనదుఃఖోపశమనార్థంబై యోగిము

ఖ్యుండగు మత్స్యేంద్రనాథుండు నిజశరీరం బీమందిరంబున నుంచి నృపముక్తకాయంబున బ్రవేశించె. తచ్ఛిష్యుండగు గోరక్షుండు గురుశరీరం బీ గర్భాలయ మధ్యప్రదేశబిలంబున రహస్యపఱచి తీర్థ సేవాపరతంత్రుండై పయనం బొఱ్చెను. తదాది ద్వాదశాబ్దంబులకు క్షితీశుని శరీరంబు బరిత్యజించి నిజశరీరంబు ధరియించి నీసౌభాగ్యప దచ్యుతి యొనర్చు నని యెఱింగి యాశ్చర్యంబుచే హసించితి నిదుగో బిలప్రదేశం బాచ్ఛాదింపఁబడిన" దని స్పష్టపఱచెను. తక్షణంబ రేవ తీదేవి పతిసహితంబుగ నిజనివాసంబున కేగి దనమనంబున పాతివ్రత్య భంగంబు గలిగెను. విధినిర్మితకార్యం బలంఘనీయంబు. గతకార్యం బునకు విలపింపనేల? వ్యాసవీర్యంబుచే భరతాన్వయం బభివృద్ధి జెందినక్రియతపోఘనుండగు మత్స్యేంద్రయోగిపుంగవునిచే వంశంబు వర్ధిల్లె. ద్వాదశాబ్దపూర్ణంబున నిమ్మహాఘనుం డీ శరీరంబు త్య జించి నిజదేహంబు ధరించెనేని నామాంగల్యంబు నశించుటయె గాక సుతుండగు ధర్మనాథుం డయుక్తవయస్కుండై రాజ్యభా రంబు వహించుట దుస్తరంబుఁగాదే! మత్స్యేంద్రశరీరంబు ప్రచ్ఛన్నం బున విచ్ఛిన్నం బొనర్చి రూపడంచితినేని చైతన్యోపాధియగు శరీరంబు లేకుండినచో నిమ్మహాఘనుండు త్రివిక్రమకాయం బెడబాయలేడని చింతించి యతిగోప్యంబుచే నిశాసమయంబున కుద్దాలాది పరికరంబు లతో నుభయపరిచారికుల వెంటగొని దేవళంబు జేరి బిలముఖ ఖననం బొనర్చి యం దసదృశప్రకాశమయ నిర్జీవకళేబరంబు గాంచి తీక్ష్ణతరశ స్త్రంబులచే నస్థిచర్మమాంసంబులు తిలతుల్యంబులుగ ఖండించి తత్స మీపకాననాంతరప్రదేశంబున బాఱవైచి యథావిధి బిలముఖం బా చ్ఛాదించి దననివాసభవనంబున కేతెంచెను. ఈవిపరీతకృత్యంబు నగ రాట్తనయవిలోకించి నాగభూషణునితో "భవత్ప్రియుండగు మత్స్యేం ద్రుని దేహంబు విధ్వంసం బయ్యె" నని దెలుప కృపాళుండగు ఫాలా క్షుండు మనోయోగంబున బరిశీలించి "ప్రియే! యక్షిణీశక్తిచే చూర్ణీ కృత త్వఙ్మాంసాస్థిసంచయం బొనగూర్చి యథాప్రకారంబున కాయం బు సిద్ధపఱచి కైలాసంబున నుంచు" మని యాజ్ఞాపించెను. తక్ష ణంబ దాక్షాయణీదేవి యక్షిణీదేవతాసంఘంబును బిలచి కళాదక్షుం డగు మత్స్యేంద్రుని శిథిలీకృతదేహంబు జతగూర్చి కైలాసంబున కేగి

మ త్తనూజుండగు వీరభద్రున కొసంగి భద్రపఱచు మని దెలుపు" మన నయ్యక్షిణీ సముదయం బేకముఖంబున విపినంబు గ్రుమ్మరి తచ్చూర్ణం బుచే శరీరం బేర్పఱచి రయంబున కైలాసంబుజేరి రుద్రపుత్రుండగు భద్రునకు భద్రపఱచుమని యొసంగి "హేవీరముఖ్యా! ప్రతాపము ఖ్యుండగు మత్స్యేంద్రుండు దైవయోగంబున పంచత్వంబు నొందె. తొల్లి మా కత్యంత శత్రుస్వరూపుండై మహాకాళిచే మోహరించి భైరవాదుల గీటడంచి యాలంబున మమ్మెంచక మంత్రనైపుణ్యంబుచే మావస్త్రంబు లపహరించి నగ్నత్వంబున నటింపఁజేసిన చెనటుండు గాఁడే? నిర్లక్ష్యంబుచే మిమ్మెదిరించి స్వప్రతాపంబున భంగంబొనర్చిన విమతుండై కపిపుంగవునితో మార్కొని కడుకష్టంబుల పాలొనర్చిన యోగిపుంగవుని దేహంబు గనుఁగొంటివే? యిత్తాపసోత్తమునకు ప్రియశిష్యుండు ప్రతాపదర్ప సముగ్రుండగు గోరక్షుండు గలఁడు. వాఁడీ శరీరంబు గొనిపోవ నోపు" నని బలుకుచుండ శివాజ్ఞాధారకు లగు బహులక్ష రుద్రగణసహితుండగు భద్రుండు తపోధూర్జటి శరీ రంబు రక్షింపుచుండెను. త్రివిక్రమ శరీరస్థ మత్స్యేంద్రుండు నిత్యనియ మప్రకారంబున శివాలయంబున కేతెంచి యంబరకేశుని దర్శనంబు గొని నిర్భిన్న బిలముఖంబు గని యాంతర్యం బుపలక్షింపక స్వస్థానం బున కేగుచుండెను.

ఇతి భక్తిసార నవనాథచరిత్రంబున మత్స్యేంద్రసిద్ధుండు పరకాయప్రవేశయోగంబుచే త్రివిక్రమకళేబరంబున బ్రవేశించి రాజ్యంబేలుట మొదలుగాగల చరిత్రంబు ద్వాత్రింశాధ్యాయము సంపూర్ణము

---

## త్రయస్త్రింశాధ్యాయము.

---

గోరక్షుండు సేద్యకారునకు వైరాగ్యంబు గల్పించి చని చౌరంగనాథునివెంట గొని వీరభద్రునితో మహాయుద్ధం బొనర్చి ప్రాణంబు లపహరించుట.

అట గోరక్షనాథుండు నృపశరీరధర మత్స్యేంద్రునితో ననుజ్ఞ గొని యనేకతీర్థంబులు సేవించుచు గోదావరీతటం బాశ్రయించి

ఘోరాటవీమార్గంబున గమనంబు జేయుచు క్షుధాతురుండై సమీపంబున జనపదంబులు గానక నలుదిశలు నిరీక్షింపుచు నొక్కచో కృషికర్మసమర్థుండగు మాణీకనాముండు దినయాపనసమయంబున భోజనోద్యుక్తుండై పాత్రంబున పదార్థంబు లుంచుకొనుసంత సిద్ధుండు బోడగాంచి యాదేశశబ్దంబులచే నమస్కారం బొనర్చినికటంబు జేరుచుండ మాణికుండు వందనంబు లాచరించి "సమర్థా! తామెవరు? ఇమ్మహాకాననంబున నొంటి జరించుట కతంబెయ్యది" యని విచారింప గోరక్షుండు "నే నొక తాపసుండను. విహారార్థంబున విపినంబు గ్రుమ్మరుచు క్షుధాపీడితుండనై యేతెంచితి. ప్రసాదం బిడుదువే" యన నమ్మాణికుండు పదార్థపూరితపాత్రంబు గొనుమని యొసంగెను. గోరక్షుండు లబ్ధధనదరిద్రునిచందంబున హర్షించి కరపాదప్రక్షాళనం బొనర్చుకొని సిద్ధాన్నంబుచే దృప్తుండై కృషికారునితో "కరుణామయా! భవన్నామధేయం బెఱుంగింపు" మన మాణికుండు "తాపసోత్తమా, నానామంబుచే కార్యసాధనంబు గలదే? భవదీప్సిత పదార్థంబు లభియించె" నన గోరక్షుండు "పురుషశ్రేష్ఠా! నీవాక్యంబు సత్యంబుగాకన్యంబుగాదు. నీచే దృప్తుండనై నీమనోభీష్టకామ్యంబు దీర్పందలంచితి" నన నతండు "తాపసోత్తమా! భిక్షోపజీవివై నానాగ్రామంబులు ద్రిమ్మరుచు నాయభీష్టంబులు దీర్చెదనుట చిత్రంబుగాదే?నీయం దేభాగ్యంబు గలదు!ని న్నేమిగోరుదు. భైరవాకారవిరాగులు పరులకోర్కులీడేర్చెదరెట్లు? నిను విచారింపుట వేడబంబుగాదే" యన నాథుండు "పురుషఘనా! మచ్చిత్తంబు యుష్మద్దత్తపదార్థంబుచే ప్రసన్నత్వంబు నొందె. నిస్సంశయుండవై వేఁడు" మన మాణికుండు"చాలు నీదాతృత్వంబు నే నివ్విచారింపలేను. నీవు నాకొసంగలేవు. నీ కెద్దానిపై భ్రాంతి గలదో నేనే యొసంగెద వేఁడు" మనెను. గోరక్షుండు దనడెందంబున కృషికారులు కఠినతరవిపినంబుల నివసించి యుక్తాయుక్తంబు లెఱుంగకనైస్వభావ్యంబున ప్రసంగించెదరు. స్వహితం బెఱుంగనిజషమతుల కుపకారం బొనర్పవలయు నని దలంచి "పురుషముఖ్యా! నీమనోనిశ్చయంబుచే నే నింకెద్ది వేఁడిన నొసంగెదవే" యన కృషికారుండు గోరక్షునితో "నీయట్టి మూర్ఖుండు గలఁడే? శీతకరుం డన్యులకు శీతలం బొసంగుట దొడయగునే? ప్రభాకరుండు తమంబు బాపు

టొక వింతయగునే? బలిమహీశుండు రసాతలంబున కేగి వితరణంబు మానెనే? నామనోనిశ్చయంబు బరికించెదేని విచారింపు" మన గోరక్షుండు "నీచిత్తంబున దలంచినకార్యం బొనర్పవలదు. ఇంతియ నా యభీష్టం"బని విచారించెను. మాణిక్యం డవశ్యంబని సెలవొసంగ గోరక్షుండు నిజేచ్ఛం జనెను. పిదప నక్కృషికారుండు కృషిపరికరం బుల నొకమూటగట్టి శిరంబున ధరియించి వృషభంబులగొని పురం బున కేగుచు గృహంబున కేగి భుజింపవలయునని దలంచియు గోరక్షు నివాక్యంబులు స్మరించి జనదగదని వితర్కింపుచు చింతాక్రాంతుండై నేత్రంబులు ముకుళించి హరినామంబు ధ్యానింపుచు దృఢనిశ్చయుండై మనోసంకల్పిత కార్యంబు లొనర్పవలదని చలనవలనాదులు మాని వాతాశనుండై మాంసరహిత క్షీణశరీరంబుచే శుష్కకాష్ఠంబుభంగి నిశ్చేష్టిత యోగధారణ పరత్వంబున బ్రకాశించుచుండెను. గోరక్షుండు నానారణ్యంబు లతిక్రమించి బదరికాశ్రమంబు జేరంజని నిరామిషశ రీరుండై గురుమంత్రధ్యానయోగంబున విరాజమానుండగు చౌరంగ నాథుని జూడదలంచి గుహాముఖాచ్ఛాదిత పాషాణంబు దొలంగించి దూరీకృత భవబంధుండగు చౌరంగుని క్షీణశరీరంబు బొడగాంచి దయారసభరితహృదయుండై దేహాయాసంబు బాపి నిజప్రతాపం బుచే కరపాదంబు లొసంగి తత్క్షణంబ బహిఃప్రదేశంబునకు గొనితె చ్చినంత చౌరంగుండు గురుకృపాకటాక్ష వీక్షణంబుచే సబలుండై గోరక్షనాథుని పాదకమలంబులకు బ్రణమిల్లెను. కరుణాంతరంగుండగు గోరక్షుండు "వత్సా! కాలం బెవ్విధిగడచెనో దెలుపు" మన కృష్ణాగ రుండు "నేనెఱుంగను! చాముండాదేవిని విచారింపు" మనెను. రవిపు త్రుండు చాముండాదేవితో "శశాంగసుతుం డెప్పగిది తపం బొన ర్చెనో శ్రుతపఱచు" మన నద్దేవి "సమర్థా! చౌరంగుండు భవదాజ్ఞా నుసారమతిచే శిరోపరిభాగస్థిత శిలావిన్యస్త దృగ్యుగళుండై మదర్పిత ఫలాశనుండుగాక ఘనయోగంబున మెలంగె. ఫలంబులు పర్వతాకా రంబై విలసిల్లె గనుంగొను" మన గోరక్షుండు చౌరంగనాథు నిగ్రహ తపంబు బ్రహ్మాదుల కతర్క్యం బని విస్మితుండై దనవరదకరం బా నిర్మలాత్ముని శిరంబున మోపి యనేకమంత్రార్థరహస్యంబు లుపదేశించి కేదారేశ్వరమందిరంబునకు దోడితెచ్చి దత్తాధ్వరధ్వంసి ప్రత్యక్షదర్శ

నంబు గావించి యచ్చో షణ్మాసంబులు నివసించి నిఖిలమంత్రాదిదేవత లచే మంత్రసిద్ధికై వరంబు లిప్పించి కేదారీశ్వరునిచే ననుజ్ఞాతుండై పరతత్వజ్ఞాన పరిపూర్ణుండగు చౌరంగనాథసహితుండై కౌండిన్యనగ రంబు జేరంజని "చౌరంగా! భవజ్జననీజనకుల దర్శనంబు గొనియెదవే! శశాంగుండు నిన్ను సుతుండని దలంపక కఠినచిత్తుండై నీకరపాదంబులు ఖండించె. న్యాయాన్యాయం బెఱుంగక దుష్టమతిచే శిక్షించిన నృపా ధముండని నాకాగ్రహంబు గలదు. నీతపః ప్రభావంబు గనుబఱచు" మన చౌరంగుండు వాతాస్త్రంబు జపియించి భస్మంబు గొని పుర బాహ్యవనరక్షకులపై బ్రయోగించినంత తన్మంత్రవిద్యానైపుణ్యం బుచే నవ్వనరక్షకు లంతరిక్షంబున భ్రమ్మరుచుండ నుపసంహారం బొన ర్చెను. వా రత్యంతమూర్ఛాగతులై బుడమింబడి స్మృతి దొలంగి యుండ నొకకొందఱు శీఘ్రంబున మూర్ఛందేరి రాజమందిరంబున కేతెంచి గతవిపరీతంబు శ్రుతపఱచుచుండ భూపుం డొకచారునితో "గ్రామబాహ్యంబున నెవ్వరేని సమర్థు లరుదెంచిరిగాబోలు కనుం గొని ర" మ్మన వాఁడతివేగంబున నరిగి యొకకూపనికటంబున నివసిం చియున్న సిద్ధముఖ్యుల బొడగాంచి రాజసదనంబుజేరి బుడమిఱేనితో "నొక్కచో తాపసోత్తములు గల" రని విన్నవింప నతడు దనమనం బున మత్స్యేంద్ర గోరక్షనాథు లేతెంచిరని భయభ్రాంతుండై రథగ జతురగపదాతులతో నెదుర్కొనదలంచి పురబాహ్యంబున కేతెంచు చుండ గోరక్షుండు "చౌరంగా! నీతపః ప్రతాపం బీ సమయంబున గన పఱచు" మన చౌరంగుండు పునర్వాతాస్త్రప్రయోగ మహిమాతిశ యంబుచే శశాంగసహిత చమూసమూహం బంతరిక్షంబున కులాల చక్రంబుపగిది భ్రమణం బొనర్చుచు కొంతవడి తచ్చిత్రంబు నిరీక్షిం చుచుండ భూపాలాదులు "దయాఘనా! దీనశరణ్యా!. రక్షింపు రక్షింపు" మని కలకలధ్వానంబు లొనర్చుచుండ చౌరంగుండు నగా స్త్రంబుచే నొకమహామహీధరంబు గల్పించి యందుపై నృపసమేత పృతనంబుల నివసింప నొనర్చి రమ్ము ర మ్మని యాహ్వానం బొసంగెను. నరపుంగవుండు దళసమేతుండై నాథముఖ్యుల సమీపంబున కేతెంచు చుండ గోరక్షుని యనుజ్ఞ చే చౌరంగనాథుండు నిజజనకుండగుశశాంగ మహీపాలుని పదంబులకు నమస్కరించుచు కృష్ణాగరుండ ననిదెలియం

బలికెను. శశాంగుండు పరమానందకందళిత హృదయారవిందుండై దృఢాలింగనం బొసంగి పిదప గోరక్షనాథుని చరణకమలంబులకు బ్రణమిల్లి బొగడుచుండ గోరక్షుండు "రాజో త్తమా! భవత్తనూభవుని పరాక్రమం బెఱింగితివే" యననతండు "దయామయా! త్రిలోకవందితుండగు నీయట్టి తపోమూర్తి గురుండై విలసిల్ల నూనంబు గలదే" యనుచుండ చౌరంగుండు వజ్రాస్త్రప్రయోగంబుచే స్వనిర్మిత నగరూపం బడంచి స్వస్థచిత్తుండై గురుసనుక్షంబున నిల్చుండెను. శశాంగుండు గోరక్షనాథునితో "సమర్థా! మద్భవనంబు పవిత్రంబొనర్పుటకై శిబికారోహణులు గ" మ్మన చౌరంగుండు శశాంగునితో "జనకా! గృహంబున కేతెంచితి నేని యనర్థంబు వాటిల్ల దే! మత్సాపత్నీజననిదుర్బోధంబులు విమర్శింపక నాకరచరణంబులు ఖండించిన దే నెఱుంగనే? నిజానిజం బూహింప లేరైతి" రని భుజావంతిదుర్గుణంబులు విశదీకరింప నృపుం డాగ్రహచిత్తుండై "నీచాత్మురాలగు భుజావంతిని తాడనం బొనర్చుచు గొనితె" మ్మని యొకభటునకాజ్ఞాపింప చౌరంగుండు "జనకా! భవత్కీర్తిధ్వజంబునకు భంగంబు జేకూరు. సదనంబున శిక్షించుట మే" లని కోపోపశమనం బొనర్చి గురుసహితంబుగ శిబికారోహణుండై రాజభవనంబున కేతెంచెను. నరాధిపుండు రోషతామ్రాక్షుండై యంతఃపురంబు బ్రవేశించి భుజావంతిని తాడనం బొనర్చుచు వెడలిపొమ్మని శాసించుచు "దుష్టే! ద్వాదశాబ్దంబు లుమాకాంతుని ధ్యానంబు సల్పి పుత్రలాభంబు వడసితి. నీచమతిచే నయ్యమలాత్ముని వియోగం బొనర్చితి" వని దుర్భాషలాడుచున్న శశాంగుని గోరక్షుం డనేక యుక్తియుక్తవాక్యంబులచే శాంతపఱచి యొకమాసం బచ్చో నివసించి ప్రయాణోన్ముఖుండై నృపోత్తముని భక్తిభావంబులకు సంతసిల్లి "వేఱొండు పడఁతిమిన్నను వివాహంబాడి పుత్రలాభంబు బొందు" మని ప్రసాదం బొసంగి చౌరంగసహితుండై గమనం బొనర్చి ప్రయాగక్షేత్రంబు జేరంబోయి గురుశిష్యులు తత్తోయంబుల స్నానంబులాడి నీలకంఠుని మందిరంబు బ్రవేశించి యర్చకనారిని విలోకించి "మద్గురుకళేబరంబునకు భద్రంబే" యని విచారింప నమ్మగువ భయభ్రాంతచిత్తంబుచే కంపాయమాన శరీరయై గోరక్షుని పదంబుల వ్రాలి "సమర్థా! ప్రమాదంబుచే రాజమహి

షియగు రేవతీకాంత కీ రహస్యంబు వెల్లడి యొనర్చితి? కళేబ
రంబు యథాస్థానంబున నుండునో లేదో యను సంశయంబు భవన్ముఖావ
లోకనమాత్రంబుచే గలిగెను. నారీహృదయం బతిగహనంబుగాన నిజ
దృష్టిచే విలోకింపు" మన గోరక్షుండు డెందం బదరి మందిరాంత
ర్బిలముఖపాషాణంబు దొలంగించి గురుశరీరంబు గానక వారిపూరిత
లోచనుండై "గురునాథా! దయారహిత హృదయంబుచే నన్నెడబాసి
తివే" యని బుడమింబడి గురువర్యా! గురువర్యా! యని యాక్రందించు
చుండ నర్చకాంగనామణి గనుంగొని దనమనంబున జింతింపుచు
"తపోధనా! నృపకాంతను విచారించి యేతెంచెద" నని త్వరితంబున
రాజభవనంబు బ్రవేశించి రేవతీకాంతకు నమస్కరించి యంతరార్థం
బుతో "తల్లీ! నాఁడు నీకెఱింగించిన విషయంబుకై సదుపాయం బేమి
దలంచితివో దెలుపు" మన నత్తలోదరి యర్చకాంగన నేకాంతంబు
నకు దోడ్కొని జని "మత్స్యేంద్రునికాయంబు మాయంబొనర్చుటకై
శస్త్రఘాతంబులచే చూర్ణంబొనర్చి యరణ్యంబున బాఱవైచితి. తచ్ఛరీర
నిష్కాలంబుచే మన్మనోగతసంశయం బెడబాసె. బీజంబులేని యంకురం
బుదయించునే యని నిశ్చయమనంబుచే నుంటి" నన నప్పడఁతి దన
మనంబున ననర్థంబు వాటిల్లె. దీనిచే నాకెట్టివిపత్తు సంభవించునో?
దైవానుగ్రహం బెప్పుగిది గలదో యని జింతింపుచు గోరక్షుని జేరం
జని రాజకాంతోదితవాక్యంబులు వెల్లడి యొనర్చెను. గోరక్షుండు
ప్రళయకాల కృతాంతునిభంగి క్రుద్ధుండై నృపురాణిని శిక్షించెద
నని దలంచియు మత్స్యేంద్ర కారణంబున నద్దేవి యస్మజ్జననిగాదే యని
యూహించి శాంతుండై చూర్ణీకృతశరీరంబు వనమృగంబులచే
భక్షింపఁబడెనో ఇలాజలాది మహాభూతంబు లపహరించెనో శోధింప
వలెనని దలంచి చౌరంగనాథునితో "వత్సా! మత్కాయం బిచ్చో బరి
త్యజించి సచ్చరిత్రుండగు మత్స్యేంద్రనాథుశరీరంబు శోధించుటకై
సూక్ష్మరూపంబున నానాభూత నానాదేశంబులు సంచరించి యేతెం
చెద. ధీరమతివై మచ్ఛరీరంబు గాపాడుము. లేకున్న గురుదేహంబు
కై పడి యనర్థంబు ఘటియించు" నని బోధించి త్వరితంబున స్థూల
శరీంబు విసర్జించి వాయుస్వరూపంబున ననేకారణ్యభూధరంబులు
జంబూద్వీప ప్రముఖాఖిలద్వీపంబు లతల వితల రసాతలాద్యధోలోకం

బులు పశుపక్షి మృగకీటకాఖిలభూత సంచయంబులు సువర్లోక భువర్లోక తపోలోక ప్రభృతి యూర్ధ్వలోకంబులు యక్ష రాక్షస గరుడ గంధర్వాది సురలోకనివాసంబులు స్వర్గ వైకుంఠ సత్యలోకంబులు శోధించి యా ప్రదేశంబుల గానక కైలాసంబు జేరి యొక్కచో హరకుమారుండగు వీరుం డపారశివగణకదంబ పరివృతుండై చాముండాది మహాశక్తిసముదయంబుతో "ద్వాదశాబ్దంబులకు మత్స్యేంద్రునికళేబరంబుకై గోరక్షుం డేతెంచు ననుట మును మీ రెఱింగిన విషయంబే గదా! తత్సమయంబు సమీపించెను గాన కుశలమతులై శరీరంబు రక్షింపుఁ" డని యాజ్ఞాపించుతఱి గోరక్షుండు సూక్ష్మరూపంబున బ్రవేశించి గురుశరీరంబు బొడగాంచి రయంబున స్వస్థానంబున కరుదెంచి చౌరంగనాథ పరికల్పిత మహదస్త్ర మధ్యప్రదేశ పరిశోభిత స్వశరీరంబు బ్రవేశించి సుషుమ్నాంతర్గతుండు స్థూలశరీరవివేకంబు బూనినక్రియ మేల్కాంచి చౌరంగనాథసమేతుండై నిజపరికరంబులు ధరించి పదడుగొని పర్వతాస్త్రంబు జపియించి ప్రభాకరునిపైఁ బ్రయోగింప నయ్యస్త్రమాహాత్మ్యంబుచే నొకమహానగంబు కల్పితంబై ఖగమండలం బాక్రమించి యహస్కరుస్యందనంబు నిరోధించె. దినేశుండు మార్గంబు గానక కోపోద్దీపితుండై వజ్రాస్త్రంబుచే భూధరంబు బగిల్చి దనహృదయంబున నిమ్మహాపర్వతాస్త్రం బే మహామహునిచే బ్రయోగింపఁబడెనని యోచించి స్వమంత్రప్రతాపసంజనితుండగు గోరక్షసిద్ధుం డని దలంచి శీఘ్రంబున రథసహితుండై వసుంధరకేతెంచినంత గోరక్షుండు చంద్రాస్త్ర వరుణాస్త్రంబులచే నుష్ణాంశుకిరణజ్వాల లడంచి నికటంబున కరిగి చౌరంగయుతుండై వందనంబు లాచరించెను. సహస్రకరుండు స్వసుతునితో "వత్సా! నన్నేకతంబున నిరోధించితివో చయ్యన నెఱింగింపు" మన గోరక్షుండు "నిఖిలలోకవంద్యా! మద్గురుండగు మత్స్యేంద్రయోగిపుంగవుండు లోకోపకారనిమిత్తంబై నిజశరీరంబు బరిత్యజింప తద్దేహంబు శివగణంబుచే నపహరింపఁబడి కైలాసంబున వీరభద్రుని స్వాధీనంబయ్యె గావున తామారుద్రాత్మజునకు మద్గురుకళేబరంబు మాకొసంగు మని హితోపదేశం బొనర్చి నాయభీష్టంబు దీర్చెదరని కోరెదను. యుష్మద్వాక్యంబులు సరకుగొనఁడేని యుద్ధంబుకై జనుదెమ్మని తెలియఁజేయు" మని

విన్నవింప నభోమణి యవశ్యంబని కైలాసంబున కేగి రుద్రగణసంఘంబు జేరంజన వార లమ్మహామహునకు వందనంబు లాచరించి "భవదాగమనకారణం బెయ్యదియో దయజేయు" మన కనులాపుండు రుద్రగణముఖ్యుండగు వీరభద్రునితో "శివాత్మజా' గోరక్షుండు మత్స్యేంద్రనాథశరీరంబుకై సక్రోధుండయ్యె గావున మద్వచనంబు లాకర్ణించి యీనిర్జీవకళేబరం బయ్యమలాత్మున కొసంగెదవేని నాథపంథం బభివృద్ధిజెందు" నన మృత్యుంజయనందనుండు "ఛాయారమణా! తొల్లి మత్స్యేంద్రునిచే కడుకష్టంబు లనుభవించితి నేఁ డీకాయంబు గోరక్షున కొసంగుదునే? నతం డెదిరించెనేని మత్పరాక్రమదర్పంబుచే గోరక్షునిప్రాణంబులు కృతాంతుని పాలొనర్చి గురుకళేబరంబుమాడ్కి శిష్యశరీరంబు నిర్జీవంబు జేయనే" యన భానుండు "వీరముఖ్యా! నాఁడు నీప్రతాపంబు లేదయ్యెనే? సమయంబెఱింగి వాక్పౌరుషంబు గనఁబఱచెదవే? గోరక్షుండు మత్స్యేంద్రసముండుగాక నసమర్థుండని దలంచితివే? నేఁడు చౌరంగనాథసహితుండై శత్రుకులమర్దనుండగు గోరక్షుండు మార్కొనెనేని కృతాంతుల ప్రళయం బొనర్పఁడే? సమరంబె దలంతువేని సత్వరంబున భూలోకంబున కేగి యొనర్పుము. లేకున్న వారిందే తెంచిరేని స్వబలపరాక్రమంబుచే నేతద్రజితగిరి పిష్టంబొనర్పరే? శివలోకం బల్లకల్లోలం బయ్యెనేని శంకరుండు నిన్ను శాసింపఁడే? మత్స్యేంద్ర గోరక్షులు భవభవానీప్రియులని యెఱుంగవే? గానిచో చూర్ణీకృత శరీరంబు మహాశక్తికోటిచే నొనగూర్చి కైలాసంబున కంపునే? కదనంబె ముఖ్యంబని దలంచెదేని గిరిరాడ్జామాతున కెఱింగింపక నొనర్పు" మన వల్లేయని వీరభద్రుం డనేకరుద్రగణకోటిని రవిపుత్రునితో సమరం బొనర్చు మనియు మీరోటుబడుసమయంబు నిరీక్షించి నే నేతెంచెద నని సెలవొసంగెను. తత్క్షణం బా మహావీరులేకముఖంబున బాణబాణాసనాద్యాయుధంబులు బూని భయంకర శస్త్రాస్త్రధరులగు భైరవాదులతో జనుదెంచి శరత్కాలమేఘంబు పగిది శరవర్షంబు గురిపించుచుండ విపక్షదర్పదమనదక్షుండగు గోరక్షుండు బొడగాంచి చౌరంగునితో యుద్ధసన్నద్ధుండవు గమ్మని స్వరక్షణార్థంబై దశదిశల వజ్రకవచంబు నిర్మించెను. తత్కాలంబున హరగణకరవిముక్త శరజాలంబు భంగంబై సిద్ధముఖ్యాంగంబుల స్పర్శింపకుండ ఫాలాక్షు

గణసమూహంబు రోషతామ్రాక్షులై గోరక్షునిపై యనలాస్త్ర
ధూమ్రాస్త్ర వాతాస్త్ర నాగాస్త్ర కాలాస్త్ర వజ్రాస్త్ర స్పర్శాస్త్రంబులు
బ్రయోగించి తత్సహాయుంబై లోకభీకరంబగు దానవాస్త్రం బడరించిన
రవితనయుండు జలదాస్త్ర పర్వతాస్త్ర ఖగేంద్రాస్త్ర సంజీవిన్యస్త్రైంద్రాస్త్ర
విభక్తాస్త్ర దేవాస్త్రంబులచే ప్రతిహతం బొనర్చుచుండ చౌరంగనా
థుండు మోహనాస్త్రంబు గల్పించి బ్రయోగింప నయ్యస్త్రరాజంబు
రుద్రగణహృదయంబులం బ్రవేశించి చిత్తవిభ్రాంతి గల్పింప నమ్మహా
బలులు మతిభ్రష్టులై స్వకార్యం బెఱుంగక పిశాచంబులభంగి నిశ్చే
ష్టితులై యుండ చౌరంగనాథుం డమ్మోహనాస్త్రంబుపై మహావాతా
స్త్రంబు బ్రయోగించె నయ్యస్త్రద్వయసంపీడితులై హరగణం బంతరి
క్షంబున గ్రుమ్మరుచుండ రౌద్రరసోద్రేకముద్రితుండగు వీరభద్రుండు
చాముండాద్యనేకశక్తికోటిసమేతుండై సమరంబున కేతెంచి మతి
భ్రాంతరుద్రగణంబుల వీక్షించి క్రుద్ధుండై జ్యానాదంబు సల్పి మిత్ర
మంత్రోద్భవునిపై కామాస్త్ర బ్రహ్మాస్త్ర కార్తికాస్త్రంబు లడరించి ప్రళ
యకాలరుద్రునిచందంబున బ్రహ్మాండస్ఫోటకంబగు సింహనాదంబు
సల్పుచుండ చౌరంగనాథుండు రత్యస్త్రంబుచే కామాస్త్రరూపం బడంచి
కామిన్యాస్త్రంబుచే కార్తికాస్త్ర ప్రతాపంబు హరించి దశాసురీమహా
స్త్రంబుచే శంఖాసురాది నిశాచరుల గల్పింప తొల్లి వేదంబు లపహరిం
చిన పిశితాశులను భయంబుచే బ్రహ్మాస్త్రం బదృశ్యంబయ్యె. తదుపరి
శశాంకసుతుండు స్వతపఃప్రభావంబుచే సంజీవినీమంత్రయోగంబున
త్రిపురాసుగ క్షమల ముదమాన్య మహిషాసుర జాలంధర కాలయ
వన హిరణ్యాక్ష హిరణ్యకశ్యప ముచికుంద వక్రదంత దశముఖ ఇం
ద్రజిత్కుంభకర్ణ ప్రముఖ నక్తంచరులం గల్పింప నయ్యసురముఖ్యు
లేకీభవించి పిండీకృత బ్రహ్మాండులై నింగిముట్టి రోషభ్రూయుగ్మ
విజృంభణంబుచే యట్టహాసం బొనర్చుచుండ దేవతానివహంబు
వియన్మార్గంబున విమానారూఢులై త్రిలోకభయంకరంబగు రణరం
గంబు నిరీక్షింపుచుండి సిద్ధపరికల్పిత దోర్బలయుత దైత్యసముదయం
బునకు విభ్రాంతులై "ఓహో! మహాప్రళయంబు ఘటియించెను.
స్వర్గాదిలోకంబులు క్షణమాత్రంబున భస్మంబొనర్తురో తొల్లి
యీనక్తంచరులకై కష్టంబు లనుభవించిన దెఱుంగమో" యని

విలపించుచు వైకుంఠంబు జేరంజని నిఖిలేశ్వరుండగు రమాకాంతున కీ వైచిత్ర్యంబు విన్నవింప భక్తరక్షణపరాయణుండగు నారాయణుండు విస్మితుండై నాడు వశించిన సురారు లెవ్వగిది యుద్భవించిరో వీరికై పునరవతారంబులు బూననౌనో యని వితర్కించి యమ్మురాంతకుండు త్రిపురాంతకుని యాహ్వానం బొనర్చి రత్నమయసింహాసనంబుపై యలంకరించి "యోగీంద్రుండగు గోరక్షుండు దనతపఃప్రభావంబుచే త్రిలోకకంటకులగు దైతేయులం గల్పించె. వా రత్యంతసాహసాత్ములై భువనబ్రహ్మాండంబుల కనర్థంబులు ఘటియించెదరు. మన ముపేక్షించెదమేని విపత్కాలంబు సంభవించు. మూఢమతిచే వీరభద్రుండు కలహంబు బూన" నని సంభాషింపుచు రయంబున నుమారమాకాంతులు రవిపుత్రుని నికటంబు జేరి "గోరక్షా! జగత్ప్రళయం బగు విపరీతకార్యం బొనర్చుట తగునే? తొల్లి యీ దనుజేంద్రులకై మే మనేక ప్రయాసంబులచే సమరం బొనర్చిన దెఱుంగవే? శీఘ్రంబున నదృశ్యం బొనర్పు" మన గోరక్షుండు "దయాఘనులారా! మద్గురు కళేబరం బొసంగి రక్షియింపు" డన హరుండు ఘనకరుణాన్వితుండై మత్స్యేంద్రశరీరంబు దెప్పించి గోరక్షున కొసంగి "వత్సా! రాక్షసాధిపుల నంతర్ధానం బొనర్పు" మన ప్రతాపవతుండగు గోరక్షుండు ఫాలాక్షునితో "సమర్థా! సంజీవినీమంత్ర వ్యక్తదానవుల బరిమార్చుటకై శ్రమదలంచెద రేని వీరభద్రుని ప్రాణంబుల కాశింపనల" దన మృడుండు "గోరక్షా! మున్ను మధుదైత్యపుంగవునిచే బహుకష్టంబుల ననుభవించి తుద కత్యంతప్రయత్నంబున వినాశం బొనర్చిన దెఱుంగవే? త్రిపురాసురరావణాదుల దౌర్జన్యంబు వర్ణింప వశంబగునే? హిరణ్యాక్షాది బలవతులకై యచ్యుతుం డనేకావతారంబులు ధరియింపడే? వత్సా! జగద్రక్షణార్థంబై వేగంబున నిశాచరుల మాయం బొనర్పుము. వీరభద్రునికై మోహంబు ధరియింప" ననుచుండు సమయంబున సద్దానవేంద్రులు భద్రుని ముట్టడించి శస్త్రాస్త్రంబులచే బెనంగుచుండ శౌర్యధైర్యధుర్యుండగు రుద్రాత్మజుండు రాత్రించరుల నెదురింపుచుండెను హరిహరులు గోరక్షనాథ శూరత్వ కుశలత్వంబులు బొగడుచు రాక్షసుల రూపంబులు మాపుమనుచుండ తాపసోత్తముండు వీరభద్రుని బలదర్పంబు లుగ్గడించి కక్షపాలాంతర భస్మంబు

గొని వాతాకర్షణ మహాస్త్రంబు బ్రయోగింప భద్రుండు సిద్ధనిర్మిత దైత్యజనసహితుండై బుకమినిన్వాలి శ్వాసోచ్ఛ్వాసరహితుండై పంచత్వంబునొందె. తదనంతరం బగ్గోరక్షుం డనలాస్త్రప్రయోగంబుచే కాయంబులు శిథిలం బొనర్చె. హరుండు వీరభద్రునికై విలపించుచుండెను.

ఇతి భక్తిసార నవనాథచరిత్రంబున చౌరంగ గోరక్షనాథ శశాంగసందర్శనాది వీరభద్రసమరసంఘటిత కథావిశేషంబు త్రయస్త్రింశాధ్యాయము సంపూర్ణము.

---

## చతుస్త్రింశాధ్యాయము.

---

గోరక్షనాథుఁడు వీరభద్రుని పునరుత్థితుంజేసి గురుకశీబరంబు గొని ధర్మనాథునకు పట్టాభిషేకం బొనర్చి యేగుచు మాణిభద్రున కనుగ్రహం బొసఁగి వెంటఁగొని పునః ప్రయాగానగరంబున కేతెంచి ధర్మనాథున కనుగ్రహం బొసంగుట.

హరుండు బవరరంగంబున వీరముఖ్యుని పతనంబు బొడగాంచి విషాదవదనుండై నేత్రాంబువులు రాల్చుచు "పుత్రా! ధీరగుణలావణ్యగాత్రా! నిఖిల శస్త్రాస్త్రవేత్తా! సురాసురప్రముఖాఖిల మహావీరగర్వనిర్వాపణం బొనర్చు ఘనుండవై గోరక్షసిద్ధునిచే గూలితివే? శశిహీన నక్షత్రంబులక్రియ దృగ్గ్రహిత మయూరపింఛనేత్రంబులమాడ్కి గ్రహణేంద్రియహీన సర్వాంగ సౌందర్యంబు కైవడి నీయునికి లేని మద్గణంబులు కళారహితంబులు గాక శోభిల్లునే" యని మనంబున జింతింపుచుండ గోరక్షుండు విలోకించి తనడెందంబున "మందాకినీధరుండు బదరికాశ్రమంబున తన్నుశింబు రక్షించిన దయాంతరంగుండు గాఁడే? ప్రత్యుపకారంబు దలంపక మందమతిచే లోకేశుని చిత్తంబునకు తాపం బొసంగుట ధర్మవిరుద్ధం బనదగదే" యని వితర్కించి దయాసముద్రుండగు శంకరుని చరణకమలంబులకు బ్రణమిల్లి "శంభో! మద్గురుప్రతాపంబుచే వీరభద్రుని జీవింపఁజేయుదు. మత్కల్పిత హుతాశనాస్త్రంబుచే భద్రునికాయంబు దైత్యజనశరీరంబుల భంగి శిథిలంబయ్యె. తత్సమూహాంబుపై సంజీవినియోగంబున ప్రాణం

 

బులు గల్పించెదనేని లోకత్రయనాశకులగు పిశితాశనులు పునరుత్థి తులై బాధింతురని సంశయించెద” నన నీలగ్రీవుండు “గోరక్షా! తచ్ఛిథిలీకృతశరీరంబు శోధించుట కొక సదుపాయంబు గలదు. వీరభద్రుండు జాగ్రత్స్వప్నసుషుప్తుల న న్ననిశంబు ధ్యానింపుచుండు. తద్దేహమాంసాస్థిచర్మంబులు మన్నామంబు జపియించు గావున తత్కాయంబు గనుంగొనవలయు ర” ట్లని గోరక్షసమేతుండై చూర్ణీకృత దనుజశరీరసముదయ మధ్యప్రదేశంబున భిన్నరూప వీరభద్రకళేబరంబు పూర్వోక్తప్రకారంబుగ బరీక్షించి గోరక్షునకు దెలియఁబఱచినంత సత్తాపసోత్తముండు సంజీవినీమంత్రంబు జపియించి వీరముఖ్యునిపై భస్మంబు బడనైవ శివనందనుండు ప్రాణంబులు ధరించి నిద్ర మేల్కాంచినక్రియ జాగ్రత వహించి బహుదర్పంబుచే శస్త్రాస్త్రకోదండాది సాధనంబులు గొని “దానవుల బరిమార్చెదను. గోరక్షుని శిక్షించెద” నని మహద్ధ్వానంబు జేయుచుండ ధవళాంగుండు సప్రేముండై పుత్త్రుని దన హృదయంబున కదుముకొని “వత్సా! నీకీ పౌరుషంబులేల? గురుకరుణాకటాక్షపాత్రులగు సిద్ధముఖ్యులతో వైరంబు గూడునే” యని గత వృత్తాంతంబు శ్రుతపఱచి “పుత్రా! నాథోత్తములతో స్నేహంబు ధరియింపు” మని గోరక్ష వీరభద్రులకు సఖ్యం బొనగూర్చెను. తదుపరి మత్స్యేంద్రశిష్యుండు భవాజ్ఞాధారకుండై వియన్మార్గంబున మతిభ్రాంతులై వాతగతి పరుగులిడుచున్న హరగణంబును వీక్షించి యస్త్రోపసంహారంబుచే సుస్థిరత్వంబు గల్పింప నారుద్రగణసంఘంబు విముక్తమోహంబై హరిహరవీరభద్రసహిత గోరక్షునకు వందనంబు లాచరించి తనుతమ నిజనికేతనంబుల జేరంజనెను. పిదప నారాయణ వీరభద్రులంతర్ధానంబు నొందిరి. గోరక్షుండు గురుకళేబరంబు గొని తచ్ఛివాలయంబున చౌరంగసమేతుండై నివసించి యుండునెడ త్రివిక్రముండు త్రిపురారి దర్శనంబునకై యేతెంచి గోరక్షుని గనుంగొని యత్యంత ప్రియంబుచే హృదయాలింగనం బొసంగి నికటంబున నుపవేశించి క్షేమలాభంబులు విచారింప నయ్యమలాత్ముండు కళేబరవిషయచరిత్రంబు స్పష్టీకరించెను. నృపకాయధర మత్స్యేంద్రుం డచ్చెరువొంది “సచ్చరిత్రా! శీఘ్రకాలంబున ధర్మనాథునకు పట్టాభిషేకంబొనర్చి యరుదెంచెద” నని రయంబున గృహంబు జేరంబోయి సుమంత్రులతో

నాలోచించి యొక యుత్తమదివసంబున సుతుండగు ధర్మనాథునకు పట్టాభిషేకం బొనర్చి విప్రోత్తములకు గోభూహిరణ్యదానంబులొసంగి యేకమాసానంతరంబున త్రివిక్రమశరీరంబు త్యజించి హరిమందిరస్థిత నిజశరీరంబు బ్రవేశించెను. రేవతీదేవి రమణుండు నిద్ర దేఱఁడని దలంచి "నాథా! నాథా" యని కేకలిడుచు గతజీవకళేబరంబు బొడగాంచి మహాద్రవంబుచే రోదనంబు జేయుచుండ ధర్మనాథుండు భీతచిత్తుండై మంత్రిపురోహిత సమేతంబుగ బరుగెత్తుచు నంతఃపురంబు జేరంజని యాక్రందించుచుండెను. తదుపరి మత్స్యేంద్ర గోరక్ష చౌరంగనాథులు వీక్షించుచుండ తత్ప్రేతంబును గొని శ్మశానంబున కరుదెంచి దహన సంస్కారం బొనర్చుచుండ ధర్మనాథుండు శోకపరవశుండై నిజభవనంబున కేతెంచి చింతాక్రాంతుండై భోజనాదులు వర్జించి స్వప్రాణరక్షణంబు దలంపక విలపించుచుండ రేవతీదేవి చారులచే శివమందిరంబున మత్స్యేంద్రుండు నివసించి యుండుట యెఱింగి పుత్రమోహంబుచే ధర్మనాథు నేకాంతంబునకు గొనిపోయి "వత్సా! జనకుండు నశించెనని శోకింపనేల? యుష్మజ్జనకునకు మరణంబు గలదే? త్రిలోకవందితుండగు మత్స్యేంద్రయోగివర్యుండు భవజ్జనకుండుగాక నీత్రివిక్రముం డగునే? యమ్మహామహుండు పురబాహ్యత్రిపురారిమందిరంబున నివసించియుండు" నని గతచరిత్రంబంతయు శ్రుతపఱచి దుఃఖోపశమనం బొనర్చెను. ధర్మనాథుండు సంతుష్టాంతరంగుండై సపరివారసహితంబుగ నీలకంఠుని నిలయంబు జేరి భక్తిభావంబులచే మత్స్యేంద్రయోగివర్యుని పదపంకేరుహంబులకు బ్రణమిల్లి యత్యంతవైభవంబుచే నాథత్రయంబును శిబికారోహణం బొనర్చి రాజమందిరంబునకు గొనితెచ్చి బహువిధోపచారంబులచే సేవలొనర్చుచు నొకసంవత్సరంబు గడపినంత యోగిముఖ్యుండు ప్రయాణోన్ముఖుండై శిష్యసహితంబుగ బయలుదేఱుచుండ ధర్మనాథుండు "జనకా! తీర్థసేవానిమిత్తంబై నేనేతెంచెద" నని దుఃఖింపుచుండ తాపసోత్తముండు "వత్సా! చింతింపవలదు. ద్వాదశాబ్దంబులు భవజ్జననీసేవాపరతంత్రుండవై రాజ్యభోగంబు లనుభవింపుము. తదనంతరం బే నేతెంచి గోరక్షనాథునిచే ననుగ్రహం బొసంగించి గొనిపోయెద" నని శాంతపఱచి గమనంబొనర్చి గోదావరీతటనికటధామనగరకాంతారంబు జేరంజనిరి.

గోరక్షుండు తద్గ్రామవాసుండగు మాణికనామసేద్యకారుని స్మృతి దలంచి మత్స్యేంద్రయోగిపుంగవునితో "సమర్థా! ధామనగరసమీపారణ్యప్రదేశంబున మాణికనామపురుషముఖ్యునిచేతు తృప్తుండనై ప్రసన్నహృదయంబున నీయభీష్టంబు వేఁడుమన నక్కారినుండు విచారింపఁడయ్యె" నని తచ్చరిత్రంబు వెల్లడి యొనర్చెను. మత్స్యేంద్రనాథుండు "గోరక్షా! తత్పురుషశ్రేష్ఠుని విలోకింప జనవలయు" నని ప్రత్యుత్తరం బొసంగుచు విపినంబు గడచి యేగుచుండ నొక్కచో శుష్కకాష్ఠంబుభంగి భాసమానుండై సేద్యపరికరభారంబు శిరంబున వహించి నిశ్చేష్టితుండై హరినామంబు ధ్యానింపుచు మహాయోగి చందంబున విరాజమానుండగు మాణికునిగనుంగొని వీఁడేయని విన్నవింప మత్స్యేంద్రనాథుండు సమీపించి "యారా! సంపూర్ణతపం బొనరించెదవా" యని విచారింప నమ్మూర్ఖుండు "మత్తపంబుచే నీకేటిసంకటంబు జనుజను" మని వికటప్రసంగంబులు సల్పుచుండ గోరక్షుండు "గురుసమర్థా! యుక్తాయుక్తం బెఱుంగని మూఢాత్మునిచే తామేల సంభాషించెదరు? తామీ తరుచ్ఛాయాశ్రితులై నివసించుడి. మాయోపాయంబులచే నిప్పురుషునకు హితం బొనర్పవలయు నని మాణికుని పురోభాగంబున నిల్చి "యాహాహా! చతుస్సముద్ర ముద్రితంబగు భూవలయంబు గ్రుమ్మరి తాపసోత్తముల బృందం బనేక ప్రదేశంబులబొడగాంచితి. నీయట్టిధైర్యధుర్యుండగు యోగమూర్తిని గనుంగొనలేనైతిని. పురుషశ్రేష్ఠా! భవత్కరుణాకటాక్షంబున నాకనుగ్రహం బొసంగెదవే" యని హెచ్చరింప మాణికుండు గోరక్షునితో "వయోవృద్ధుండవై శూన్యజ్ఞానంబుచే నన్ననుగ్రహం బొసంగుమని వేఁడుట చిత్రంబుగాదే? నాకనుగ్రహం బొసంగఁదలంచెదవేని నీవే యొసంగు" మని స్వముఖంబు జాచినంత గోరక్షుండు దయామతిచే మాణికుని కర్ణేంద్రియంబున బ్రహ్మజ్ఞాన మంత్రోపదేశం బొసంగి స్వస్వరూపానుసంధానంబు దెలుప నమ్మాణికుండు తత్క్షణంబ నిరస్త మోహజాలభ్రాంతుండై చరాచరాత్మక ప్రపంచంబు పరమేశ్వరమయంబనియు దృశ్యమానవస్తుసంచయం బీశ్వరస్వరూపంబనియు బహిరంతర్భావంబులచే నిశ్చయమానసుండై సర్వభూతసాక్షిస్వరూపుండనని వితర్కించి జ్ఞానపూర్ణుండై తపంబు త్యజించి గోరక్షనాథుని పద

కంజంబుల వ్రాలెను. సిద్ధముఖ్యుండగు గోరక్షుండు భస్మం బభిమం
త్రించి యప్పురుషముఖ్యుని ఫాలంబున దిద్ది కాయబలంబు గల్పించి
హస్తంబుగొని మత్స్యోదరసంభవుని సమీపంబునకు దోడ్కొని జని
వికటుండు వీఁడేనని నిగదించెను. మత్స్యేంద్రుండు "మాణికుం డత్యం
త శఠుండుగాన వీనినామంబు హఠభంగనాథుండని నిశ్చయించి నాథ
పథంబున జేర్పు" మన గోరక్షుం డవశ్యంబని నాథపంథీచిహ్నంబు
లొసంగి హఠభంగనాథ మత్స్యేంద్ర చౌరంగ సమేతుండై తీర్థసేవా
పరతంత్రులై యేగుచు మార్గమధ్యంబున ననేక మంత్రరహస్యంబు
లా హఠభంగనాథునకు దెల్పుచు నస్త్రశస్త్రాది ప్రయోగోపసం
హారంబుల కీ లెఱింగించి ద్వాదశవర్షంబు లనేక మహాస్థలంబులు
సేవించి ప్రయాగనగరంబున కేతెంచిరి. తత్పురంబున మత్స్యేంద్రనం
దనుండగు ధర్మనాథుండు బహువిధవైభవంబులచే రాజ్యంబేలుచు
పుత్రసంతానంబు వడసి త్రివిక్రముండని నామకరణం బొనర్చి ప్రజా
పాలనం బొనర్చునెడ యోగిశ్రేష్ఠులగు మత్స్యేంద్రాదినాథ చతుష్కా
గతం బెఱింగి ముదితాత్ముండై మంత్రిపురోహిత ప్రముఖపరివారంబుచే
నెదుర్కొని యాందోళికంబుల నాథశ్రేష్ఠుల నలంకరించి నిజభవనం
బునకు దోడ్కొని యేతెంచి నయభయభక్తిభావంబులచే సంతుష్ట
పఱచి నిజసుతుండగు త్రివిక్రమునకు రాజ్యపట్టాభిషేకం బొనర్చి
వైరాగ్యఘనుండై దేజరిల్లుచున్న ధర్మనాథుని మస్తకంబున గోరక్ష
నాథుండు మాఘమాస శుక్లపక్ష ద్వితీయాదివస శుభముహూర్తం
బునఁ దనవరదహస్తంబు మోపి యజ్ఞానావృతమోహపాశంబు దెగ
టార్చి నిష్కళంకపరంజ్యోతిస్వరూపుండవని పరిపూర్ణతతో పదేశం
బొసంగి గురుమంత్రరహస్యంబు బ్రకటించెను. పిదప బృందారకాది
బృందంబుల నాహ్వానించి మహోత్సాహంబుచే పఙ్క్తిభోజనం బొన
ర్చునెడ గోరక్షుండు కనికరంబుచే చౌరంగహఠభంగధర్మనాథులకు
దనయుచ్ఛిష్టప్రసాదం బొసంగుచుండ సురలోకోత్తములు వైరాగ్య
ఘనుండగు గోరక్షుని ప్రసాదంబు వేడుకొని గ్రహించి యతులిత
బ్రహ్మానందమయులై "దయామయా! సర్వజనధ్యేయా! భవత్ప్రసా
దంబు ప్రతివత్సరంబున నిప్పగిది లభియింప ననుగ్రహం బొసంగు"
మన గోరక్షుండు సుపర్వాణసంఘంబుతో "ప్రతివర్షంబున నేతన్మాస

తిథి దివసంబునందు ధర్మనాథానుగ్రహమూలదివసంబని యుత్సవం బొనర్చి మన్నామంబు ధ్యానించి భోజనంబు సల్పెదరేని మత్ప్రసాద ఫలంబు ఘటియించు” నన నయ్యమరవరులు గోరక్షోక్తప్రకారం బున ప్రతివత్సరంబున నుత్సవంబు ధర్మనాథునికై గడుపుచుండిరి. గోరక్షుం డేతద్ధర్మనాథమహోత్సవఫలవిషయంబై “కిమ్యాగరగ్రంథ రాజంబున నెవ్వండేని ధర్మనాథనామంబుచే ప్రతివర్షంబున మహోత్స వంబు జరుపునో దూరీకృతదరిద్రదుఃఖతాపుండై భోగభాగ్యసంపత్సు ఖంబుల నోలలాడుటయేగాక తత్పురుషశ్రేష్ఠుని సదనంబున నిర్జరోత్త ములు నివసింతు” రని విశదీకరించెను. అస్తు. గోరక్షుండు ధర్మనాథు నకు నాథదీక్షాచిహ్నంబు లొసంగి మత్స్యేంద్రనాథ చౌరంగ హాఠ భంగ ధర్మనాథసహితుండై గమనం బొనర్చి యనేకతీర్థంబుల గ్రుంకు లిడుచు నచ్చటచ్చట పుణ్యస్థలవిశేషంబులు గొనియాడుచు ధర్మనా థున కఖిలమంత్రార్థరహస్యంబు లుపదేశించి సర్వకళాపరిపూర్ణత్వం బొసంగి బదరికాశ్రమంబు జేరంజని కాత్యాయనీప్రియున కెఱింగించి తత్పుణ్యప్రదేశంబున ద్వాదశాబ్దంబులు తపంబుసల్ప నియమించి నాథచతుష్కం బపారతీర్థంబులు సేవించి పునర్బదరికాశ్రమంబు ప్రవే శించి నిఖిలమంత్రాధిదేవతానివహప్రత్యక్షంబు గావించి సకలమంత్రా ర్థసిద్ధికై ధర్మనాథునకు వరంబు లిప్పించి యమ్మహాసిద్ధపంచకంబు నానాదేశపర్యటనం బొనర్చుచుండెను.

రేవణసిద్ధనాథకథాప్రారంభము.

తొల్లి కటివేల్పు తొలిచూలివీర్యంబుచే నెనుబదెనిమిదివేలజ డదారు లుదయింప తద్వీర్యభాగశేషంబు రేవానదీతటంబునం బడి ప్రకాశించుచుండ చమసనారాయణుండు ప్రవేశించి బాలార్కకరనిక రతేజోమయ సర్వావయవసంపూర్ణుండగు డింభకుండై రోదనంబుజే యుచుండ నొకసహనాసాగుండను సేద్యకారుండు తోయంబులకై ఘటంబుగొని తీరంబు జేరంజని శోకింపుచున్నశాబకుని సుందరతర సుకుమార రూపలావణ్య విశేషంబులు విలోకించి యత్యంతాశ్చర్యం బుచే సద్భకుని గొని ముఖకమలంబు చుంబించి ఘటంబున బాలుని గోప్యపఱిచి సత్వరంబుగ సదనంబుజేరి నిజకాంతామణి కొసంగి

"సర్వేశ్వరుండు ప్రసన్నుండై రేవాతీరంబున సుసంతానం బొసంగె" నని దెలియబలుక నయ్యుత్తమపరమసాధ్వీమణి లబ్ధనిక్షేపధనదరిద్రుని చందంబున నుప్పొంగి శశిముఖావలోకనానందోత్తుంగతరంగయుత క్షీరార్ణవంబుపగిది డోలాయమానమానసయై శిశువునుం గొని యుష్ణోదకంబులచే స్నానంబు లాడించి డోలికారోహణంబు గావించి రేవాతీరలబ్ధుండని రేవణుండని నామకరణం బొనర్చి స్తన్యపానం బొసంగుచు బోషింపుచుండె నబ్బాలుం డనుదినం బభివృద్ధిజెంది ద్వాదశాబ్దంబులవయస్కుండై కృషికర్మచాతుర్యంబున స్వకార్యం బులు నెరవేర్చుచు నొకానొక ప్రభాతసమయంబున వృషభంబుల గొని కాననంబున కేగుచుండె. నట్టియెడ లోకత్రయ పవిత్రకర పద కంజంబుల పాదుకలు ధరించి యుజ్వలతామ్రవర్ణజటాజూటభూషిత శిరోభాగుండై శుభ్రకౌపీనవిరాజమానస్వర్ణవర్ణశరీరకాంతిచే హరి హరబ్రహ్మస్వరూపుండగు దత్తాత్రేయుండు వినోదార్థంబు విపినంబున సంచరించి గిరినాగపర్వతశ్రేష్ఠంబున కేగుచు తన్మార్గమధ్యంబున వృష భంబుల గని రేవణుని నిరీక్షింపక శీఘ్రగమనంబున హఠాత్తుగ రేవ ణుని శరీరంబు స్పర్శించెను. తక్షణంబ రేవణుం డజ్ఞానతమోవిము క్తుండై పూర్వజన్మజ్ఞానంబు గలిగి దనహృదయంబున "నహో! చమసనారాయణావతారుండనై యహర్నిశంబులు కృషికర్మ నిర తుండ నగుచు దుస్సహప్రపంచపాశంబులంబడి మూఢునిక్రియ విలసిల్లితి" నని యోచింపుచుండ నత్రినందనుండు "నీవెవ్వండ" వని విచారించెను. రేవణుండు జ్ఞానపూర్ణుండై దత్తుండని దలంచి "సమర్థా! యుష్మత్సత్వగుణాంశసంభూతుండనై మనుజదేహంబుచే కడుకష్టంబు లనుభవించితి" నని ప్రత్యుత్తరం బొసంగుచు నమ్మహాఘనుని పాదక మలంబుల వ్రాలి "దీనశరణ్యా! భవత్కృపాకటాక్ష సూర్యోదయంబు చే మాయాతిమిరంబు బాపి నిష్కళంకపరిపూర్ణపరబ్రహ్మస్వరూపుం జేయవేని నిన్విడుతునే" యని దృఢంబుగ చరణంబులు ధరించెను. కరుణాంతరంగహృదయుండగు దత్తుండు యత్యాదరంబుచే ముఖకమ లంబు నివురుచు మస్తకంబున నభయహస్తంబుంచి దనమనంబున నిబ్బాలుండు చమసనారాయణుండనియు మర్త్యశరీరధరుండై యర ణ్యంబుల నివసించి భక్తివైరాగ్యమార్గంబుల తెలియం గెఱుంగఁడనియు

కాయప్రాయశ్చిత్తంబుకై యొకకొన్నిదివసంబులు తపం బాచరించెనేని ప్రపంచనిస్పృహత్వంబు గలిగి నిర్మలజ్ఞానయోగమార్గధరుండై రాహుముక్త ప్రభాకరునిభంగి దేజరిల్లెడు సమయంబున బ్రహ్మజ్ఞానానుసంధానమహావాక్యరహస్యోపదేశానుకూలుం డగునని యోచించి సంపూర్ణానుగ్రహం బొసంగక ధనికుండు నిజతనయుని గుణకుశలత్వంబు బరీక్షించుటకై వాణిజ్యం బొనర్పుమని కించిద్విత్తం బొసంగినకైవడి యొకసిద్ధిమంత్రం బుపదేశింప రేవణుం డమితానందంబుచే దయామయుండగు దత్తాత్రేయుని బుత్తెంచి సురంగొని సుధారసంబు త్యజించినక్రియ పాషాణంబుకై పరుసంబు బోనాడినపగిది మహిమాసిద్ధిమంత్రయోగంబుచే తుష్టుండై సర్వభూతమయుండు గాకుండినను ప్రపంచమోహంబు త్యజించెను.

ఇతి భక్తిసార నవనాథచరిత్రంబున హఠభంగనాథచరిత్రంబున రేవణనాథ జన్మకథావిశేషంబు చతుస్త్రింశత్యధ్యాయము సంపూర్ణము.

---

## పంచత్రింశాధ్యాయము.

---

రేవణసిద్ధుఁడు దత్తానుగ్రహంబుచే మహిమాసిద్ధికౌతుకంబులు జూపి పిదప సిద్ధుండై తీర్థంబులు గ్రుమ్మరుచు సారస్వతనామవిప్రునికై కైలాసంబున కేగుట.

శ్రీగురుదత్తాత్రేయుండు రేవణునకు మహిమాసిద్ధిమంత్రం బనుగ్రహించి తత్ఫలంబు దెల్పి తత్క్షణంబ స్వస్థానంబు జేరంజనె ననంతరంబ రేవణసిద్ధనాథుండు తన్మహిమాసిద్ధిమంత్రంబు ధ్యానింపుచు హలంబునకు వృషభంబులం బంధించి క్షేత్రంబు దున్నుచుండ శ్రీగురుమహిమాతిశయంబుచే మహిమాసిద్ధి బ్రత్యక్షంబై నికటంబున నిల్చి "యుష్మత్కామ్యం బెయ్యదియో గోరు" మని రేవణసిద్ధనాథుని విచారింప నబ్బాలుండు "భవదాహ్వయంబు దెలుపు" మన నమ్మహాశక్తి "మన్నామంబు మహిమాసిద్ధి" యని బ్రత్యుత్తరం బొసంగెను. రేవణుం డనుగ్రహంబు బడయునెడ నేతన్మంత్రప్రతాపంబుచే మహిమాసిద్ధి బ్రత్యక్షం బగునని యు తత్సమయంబున నీయభీప్సితంబు లద్దేవితో విచారింపు మనియు మహిమాసిద్ధిప్రతాపం బతర్క్యంబు

గాన క్షణమాత్రంబున త్రిలోకభోగంబు లొసంగుననియు కాననాంత
రతరుపాషాణంబు లద్దేవి కరుణాకటాక్షంబుచే కల్పవృక్షచింతామ
ణులై విలసిల్లుననియు ధనధాన్యవస్త్రభూషణాలంకారంబు లపారంబుగ
గల్పింపుననియు శ్రీగురుమూర్తిచే నెఱింగినకతంబున మహిమాసిద్ధి
ప్రసన్నత్వంబుచే కడుసంతసించి హాలంబు విసర్జించి యొకభూరుహచ్ఛా
యాశ్రితుండై యద్దేవితో "నేత త్తరునికటపాషాణసముదయంబును
చామీకరం బొనర్తువేని మన్మనోభీష్టంబులు వేఁడెద" నని క్షీరనీరం
బులచే మరాళంబును గుర్తెఱింగినక్రియ లోహస్పర్శనంబుచే పాషాణ
సమూహస్థపరుసంబు బరీక్షించినభంగి విచారింప నద్దేవి దరహసిత
వదనారవిందయై "రేవణసిద్ధా! మహిమాశక్తిప్రతాపం బీవెఱుం
గవో" యని రయంబున నిజదృక్ప్రసారంబుచే తత్క్షేత్రస్థితపాషాణం
బులు జాతరూపం బొనర్చెను. రేవణుండు విస్మయుండై జగద్వంద్యుం
డగు యత్రినందనునివాక్యంబులు నిక్కంబని దలంచి "యోదేవీ!
భవత్ప్రతాపశక్తి బరిశీలించితి. మత్సన్నిధానంబున నివసించి మత్కో
రిక లీడేర్చెదవే" యన నమ్మహాశక్తి హర్షించి "యనఘాత్మా! భవన్ని
కటంబున గోప్యరూపంబుచే నివసించి యుష్మత్సంకల్పితకార్యంబులు
నెరవేర్చెద. ప్రత్యక్షస్వరూపంబుచే బ్రకటంబగుట సరిగా" దన రేవ
ణుం డవశ్యం బని సెలవొసంగి కృషికార్యంబులు దీర్చి సూర్యా
స్తమయసమయంబున వృషభంబుల గొని నిజధామంబున కేతెంచి
యాత్రియామంబు గడపి ద్వితీయదినోదయంబున క్షేత్రంబున కేగం
దలంచి దనడెందంబున ధనపూర్ణుండు నుందమతిచే దైన్యం బనుభ
వించుట నింద్యంబుగాదే! లబ్ధస్పర్శవేదియగు మర్త్యుండు విత్తంబుకై
ప్రయత్నించుట చిత్రంబుగాదే యని వితర్కించి క్షేత్రంబున కేగ
కున్న సహనాసారుండు బొడగాంచి పుత్రునితో "వత్సా! సేద్యకార్యం
బులు బరిత్యజించి నిస్పృహత్వంబుచే గృహంబున నినసించుట
గూడునే? క్షేత్రంబు ఫలించెనేని ధాన్యసమృద్ధిగలిగి భక్ష్యభోజ్యంబు
లచే దృప్తులమై బహువిధవస్త్రభూషణాద్యనేక సంపద్విభవసుఖంబు
లనుభవింతు" మన నయ్యలఘుచరిత్రుండు "జనకా! ధనకనకవస్తు
జాలంబులకై యనిశంబు శ్రమింపనేల?. సదనంబున సకలసుఖావహ
కనకేష్టికలు గలుగ కష్టతరకృషికార్యంబు లొనర్చుట దుశ్చేష్టితం

 

బులుగావే? యస్మత్సదనంబు ధనపరిపూర్ణంబని యెఱుంగవే? వలయు నేని గనుంగొను" మన సహానాసారుండు పుత్రునివచనంబులకు ప్రహ సించుచు నంతర్మందిరంబున కేగ నచ్చో స్వర్ణేష్టికలరాసిం గని యాశ్చర్యంబుచే నిబ్బాలుని వాక్స్థానంబున నవనిధులు గలవో లేక నిర్మాణవకుండు సిద్ధపురుషావతారుండో యని నిశ్చయించి యయ్య మలాత్మునిచరిత్రంబు వెల్లడి యొనర్పక నంతరంగంబున భక్తిభావం బులు గలిగి మెలంగుచుండెను. రేవణుం డనుదినంబున తత్బంధల గ్రామరాజమార్గంబున సంచరింపుచు బాటసారులం గని మాయింట విందారగింపుదురు రమ్మని రయంబున గృహంబునకు దోడితెచ్చి షడ్ర సోపేత భోజనంబులిడుచుండ క్రమక్రమంబున విధివీర్యోద్భవుండగు రేవణసిద్ధుని యుదారసాహసంబు లభివృద్ధిజెంది కీర్తిధ్వజంబు నింగి ముట్టి యనేక దేశంబులకు బ్రకటంబయ్యె. తత్కారణంబుచే యాచ కానీకంబు దమయిష్టార్థభోగంబు లనుభవించుటకై యరుదెంచి వస్త్ర భూషణాద్యపారవస్తుజాలంబులచే దనివిదీఱి నిజేచ్ఛం జనుచుండెను. తద్వదోర్భగులు దమతను శరీరసంపీడిత భూతప్రేతపిశాచప్రముఖాఖిల బాధలకై నేతెంచి రేవణసిద్ధవాక్ప్రసాదంబుచే విముక్తతాపులై శాంతింబొంది నిజనికేతనంబుల కేగుచుండిరి. ఇట్లొక కొన్నిదివసం బులు గడువ నొకానొకసమయంబున మత్స్యేంద్రయోగిపుంగవుండు దేశాటనం బొనర్చుచు బంధలనగరంబు బ్రవేశించి యొకసత్రంబున గురుమంత్రధ్యానయోగధారణ పరాయణుండై నివసింప పురజనులు నిత్యనియమప్రకారంబున తత్సత్రంబున కేతెంచి తాపసోత్తముండగు మత్స్యేంద్రుని బొడగాంచి "సమర్థా! రేవణుని దర్శనం బొనర్చితిరే" యన నవ్విమలాత్ముండు పురజనులతో "రేవణునిచరిత్రవిశేషం బెయ్యది" యని విచారింప వారా బ్రహ్మపుత్రుని యపూర్వచరి త్రంబు విన్నవించిరి. మత్స్యేంద్రుండు రహస్యంబున రేవణసిద్ధుని గాంచి యిప్పురుషశ్రేష్ఠుండు చమసనారాయణావతారుండని నిశ్చ యించి యీ రేవణుం డేమహాత్ముని యనుగ్రహంబునకు పాత్రుం డయ్యెనో యని శోధింపుచు తన్నగరవాసుల విచారింప వారీమూలం బే మెఱుంగ మని ప్రత్యుత్తరం బొసంగిరి. మత్స్యోదరసంభవుం డొకకౌతుకంబు జేయందలంచి తత్సత్రంబున వసించి నానావిధ ఖగ

సమూహంబునకు ప్రసాదంబు లొసంగి బుత్తెంచుచు ఘోరతరవ్యాఘ్రభల్లూకాద్యనేకవనమృగంబుల నిజశక్తిప్రతాపంబుచే నాహ్వానం బొనరించి స్వహస్తంబుల యథోచితగ్రాసంబు లిడుచుండ పురజను లత్యంతాశ్చర్యంబుచే నిమ్మహాసిద్ధుండు ప్రత్యక్షరుద్రుండు గానోపు నని వితర్కించి యొకనాఁడీ సర్వభూతమయుండగు మత్స్యేంద్రయోగి ముఖ్యుని ఘనచరిత్రంబు రేవణసిద్ధునితో నెఱింగింపుచు "పురుష శ్రేష్ఠా! మననగరంబున నొక మహాపురుషుం డేతెంచె నయ్యకలంకుని యద్భుతకృత్యంబులు బ్రహ్మాదుల కతర్క్యంబులై విలసిల్లు. దన తపః ప్రభావంబుచే ప్రతిదినంబున పశుపక్షిమృగజాలంబుల నాహ్వానం బొనరించి యాహారంబు లొసంగుచు సంతుష్టపఱచును. నిర్భయుండై తత్సముదయంబున స్వేచ్ఛావిహారంబుచే సంచరించును. వాక్ప్రసంగంబులేల నిజదృష్టిచే విలోకించెదవేని తత్ప్రదేశంబున ననేక క్రూరమృగకోటి దృగ్గోచరం బగు" నన రేవణసిద్ధుండు తక్షణంబ బయలుదేరి ఖగమృగనికరపరివృతుండగు మత్స్యేంద్రనాథుని నిరీక్షించి దన హృదయంబున నెప్పగిది ఖేచరవనచరంబులు నిర్భయంబుచే నిమ్మహాఘనుని సేవించును. శోధింపవలయు నని నిజసదనంబున కేతెంచి యేకాంతస్థలంబున నివసించి మహిమాసిద్ధి ప్రత్యక్షంబుకై ధ్యానింప నద్దేవి బ్రసన్నంబై రేవణునికామ్యం బెయ్యది యని విచారించెను. రేవణుండు "తల్లీ! భూచర ఖేచర వనచరాది సర్వభూత సంతుష్టి యొనర్పవలయు నని కుతూహలంబు గలదు. ధ్యానమాత్రంబున భయరహితహృదయులై మృగకులసంఘంబు విహంగకులసముదయం బరుదెంచి నుదర్పితపదార్థంబులచే దృప్తులౌనటుల వరం బొసంగు" మన నమ్మహిమాసిద్ధి "రేవణసిద్ధా! సర్వభూతమయత్వంబున నిర్ద్వంద్వ నిర్గుణ నిశ్చల సచ్చిదానంద పరబ్రహ్మస్వరూపుండై జలచర భూచర వనచరాద్యఖిల స్థావరజంగమాంతర్బహిర్వ్యాపకుండగు యోగిపుంగవునకు లభియించు ఘనకార్యంబులు నీకెట్లు సిద్ధించు" నన రేవణసిద్ధుం డమ్మహాసిద్ధితో "నోజననీ! భవత్కృపాకటాక్షంబుచే బ్రత్యక్షపరబ్రహ్మస్వరూపుని జేయవే" యని వేఁడుచుండ నద్దేవి "రేవణసిద్ధా! నీవిందుకై చింతింపనేల? జగత్త్రయవందితుండగు మూర్ధత్రయుండు యుష్మద్గురుండు గాఁడే? యవ్విమలజ్ఞానానంద స్వరూపుం డనుగ్రహిం

చెనేనియః కశ్చిత్పశుపక్షిమృగంబు లననేల నతలవితలాది యధోలోకం బులు భూర్భువర్లోకాది యూర్ధ్వలోకంబులు కరతలంబులు గావే? గరుడగంధర్వాదృమరగణంబులు భవచ్చరణకమలాశ్రితులు గారే" యన నప్పరమేష్ఠిసుతుండు సిద్ధివాక్యంబులు నిక్కంబని యెదదలంచి గ్రక్కున తొల్లి దన కనసూయానందనుండు బ్రసన్నుండైన కాననం బున కేగి "దయామయా! దీనశరణ్యా" యని పెక్కుభంగుల శ్రీగురు దత్తాత్రేయుని. ధ్యానింపుచు నిద్రాహారంబులు వర్జించి వాతాంబుపర్ణా శనుండై శుష్కీభూతశరీరుం డగుచు దత్తా! గురుసమర్థా!యని యేకా గ్రమానసంబుచే నత్యుగ్రతపం బొనర్చుచుండెను. మత్స్యేంద్రుండు రేవణునికృత్యంబులు పురజనులచే నెఱింగి దనచిత్తంబున నిప్పురుషుని యాచార్యుం డెట్టిసమర్థుండు గానోపునో కామ్యసిద్ధి మంత్రం బుపదే శించి దృగ్గ్గోచరమాన మాయామయప్రపంచాతీత పరతత్వం బనుగ్ర హింపక మోసపుచ్చెనో యని వితర్కించి యణిమా గరిమా లఘిమా ద్యష్టసిద్ధుల నాహ్వానింప నమ్మహాశక్తులేతెంచి మత్స్యేంద్రయోగిశేఖ రుని చరణంబులకు వందనంబులాచరించి పురోభాగంబున నిల్చుండనవ్వ సునందనుండు "భవదష్టకంబున నే మహాసిద్ధి రేవణసిద్ధుని సాధ్యం బయ్యెనో యెఱింగింపు" మన మహిమాసిద్ధి "యోగద్రుమా! శ్రీగు రుదత్తాత్రేయ వరప్రసాదంబుచే రేవణుని స్వాధీనంబై సర్వసంప త్సమృద్ధి యొనర్చితి" నని యుత్తరంబొసంగ మత్స్యేంద్రుండు దనడెం దంబున రేవణుండు గురుబంధుండని దలంచి రామసఖులగు వాస రోత్తములు గోపాలురై బూర్వస్నేహంబుచే యదుకులాధిపునికి సహా యం బొసంగినకైవడి మత్పూర్వజన్మస్నేహచమసనారాయణుండే రేవణుం డయ్యెగాన మేలొనర్పవలయు నని యూహించి జెచ్చెరం గిరినారపర్వతంబున కేగి యత్రిసూనుని పదకంజంబులకు బ్రణతుండై "దయాంతరంగా! శ్రితజనభవభయభంగా! దాసజనహృదయ సర సీరుహమత్తభృంగా" యని స్తోత్రంబొనర్చి "గురునాథా! లోకో ద్ధారనిమిత్తంబై చమసనారాయణుండు విధివీర్యంబుచే నుద్భవించి భవదనుగ్రహంబుచే మహిమాసిద్ధి ప్రతాపవైభవంబులు గలిగి రేవణ సిద్ధనామంబున ప్రసిద్ధిగాంచి వైరాగ్యశక్తిస్ఫుటజ్ఞానంబుచే కార్య కారణంబులకు సాక్షిస్వరూపుండు గాక ఘుత్పీడితుం డశనంబు గోరు

చందంబున బ్రహ్మానుభవజ్ఞానంబుకై యహర్నిశంబులు భవదాగమన మార్గంబు నిరీక్షించుచు శయ్యాసనపానభోజనంబులు వర్జించి యొకమహారణ్యంబున మాంసరహిత శరీరంబుచే కంఠగతప్రాణుండై ద్రవహీననయనంబులు కార్పాసంబుభంగి గాన్పింప యుష్మత్పాదపంకేరుహార్పితచిత్తుండై పరితపించు యుత్తమశ్లోకునిపై గరుణించ గూడదే? లోహంబు పరుసంబుచే సువర్ణంబై భూషణంబులుగాక బూర్వవన్నీచకార్యంబుల వినియోగింపఁబడుట ధర్మవిరుద్ధంబుగాదే? తద్వత్త్వత్కరస్పర్శితమూర్ధుండగు రేవణసిద్ధుండు మోక్షజ్ఞానగామిగాక మాయాబద్ధుండగుట న్యాయంబగునే? పీయూషంబుచే యమరత్వం బొసంగి పునర్మర్త్యుండవు గమ్మనుట చిత్రంబనదగదే? దయామయా! నీకీ కఠినంబేల గలిగె" నని బలుకుచుండ దత్తుండు ప్రసన్నహృదయుండై "వత్సా! రార" మ్మని రయంబున మత్స్యేంద్రసహితుండై రమారమణ యుమారమణులచందంబున ద్రోణమందరాచలంబుల మాడ్కి రేవణుని జేరంజని కృశీభూతశరీరుండై సకలేంద్రియవ్యాపారంబు లుడిగి దత్తద్దర్శనోత్సుకంబుచే పరితపింపుచున్న రేవణసిద్ధుని బొడగాంచి యనసూయాతనూభవుండు వత్సంబుకై ధేనువు పరుగెత్తుచందంబున డగ్గరం జేరి సప్రేముండై వక్షస్థలంబున కదుముకొన రేవణుండు దుర్వాసానుజుని పదపంకేరుహంబుల నిజఫాలంబు మోపి "ఘనలీలా! నతజనపరిపాలా! భవభయహరకృపాళో" యని దీనవదనుండై బాష్పంబులు రాల్చుచు గద్గదకంఠంబుచే నన్నేల మఱచితి వని విలపించుచుండ దత్తుండు సుపుత్రుని హితంబుగోరు తండ్రికైవడి రేవణుని లాలింపుచు శ్రోత్రంబున తాపత్రయలతాలవిత్రంబగు మంత్రరాజం బుపదేశించి తత్వమస్యాది మహావాక్యంబులచే సంశయక్లేశంబు బాప పరిశుద్ధాంతరంగంబుచే చరాచరాత్మక సర్వభూతంబులు దనయంద గలవనియు తా సర్వభూతంబుల వెలింగెదననియు నిశ్చల నిర్మల జ్ఞానపరిపూర్ణత్వంబున నద్వితీయపరబ్రహ్మాస్వరూపుండై బ్రకాశించుచున్న పితామహవీర్యజాతుండగు రేవణుని శరీరంబు దత్తుండు కృపామతిచే దృఢపఱచి గిరినారమహీధరంబునకు దోడ్కొని చని నిఖిలమంత్రార్థరహస్యంబు లుపదేశించి స్వరశాస్త్ర జ్యోతిశ్శాస్త్రాది చతుర్దశవిద్యాభ్యాసం బొనరించి మత్స్యేంద్రున కెఱిం

గించినచందంబున వాతాకర్షణాది దివ్యాస్త్రప్రయోగోపసంహారంబు లనుగ్రహించి యున్మనీముద్రచే కర్ణంబు ఛేదించి సింగీసారంగికంథాది నాథపంథీచిహ్నంబు లొసంగ విపినాంతరపశుపక్షిక్రూరమృగజాలంబు లు దమంతటదా వశంబై యే తెంచుచుండెను. పిదప మత్స్యేంద్రయోగివరుఁ డందు రేవణసిద్ధనాథుని దోడ్కొని మార్తాండాచలంబున కేగి నాగాశ్వత్థవృక్షరాజస్థ సకలదేవతానీకంబును బ్రత్యక్షంబొనర్చి శాబరీవిద్యాకవిత్వ రచనాసిద్ధికై వరంబు లిప్పించి పునర్గిరినారపర్వతశ్రేష్ఠంబున కే తెంచి హరిహరబ్రహ్మేంద్రాగ్నియమవరుణకుబేరాది గరుడగంధర్వకిన్నరకింపురుషసురసంఘంబు నతల వితల రసాతలాద్యధోలోక నివాస భోగీంద్రాద్యఖిల మహాపురుషసంఘంబును బ్రసన్నంబు గావించి యచ్చో చతురహర్నిశంబులు మహోత్సవంబుసల్ప సచ్చరిత్రుండగు రేవణున కమ్యనఘాత్ములు వరంబు లొసంగి దనుతమనిజనికేతనంబులు జేరంజనిరి. తదుపరి రేవణసిద్ధుండు శ్రీగురుపదకమలంబులకు వందనంబు లాచరించి మత్స్యేంద్రయోగద్రుమునిచే ననుజ్ఞగొని తీర్థసేవాపరతంత్రుండై బయలుదేరి యనేకమహాక్షేత్రంబుల దర్శించుచు విటాగ్రామంబున నివసించి యుండెను తత్పురంబున సారస్వతుండను విప్రుండు వేదవేదాంగపారాయణుండై ముఖనఖదరహాసాపహృతసీతకర సర్వస్వమై విద్యుత్పుంజంబో యన ప్రకాశించు తనుకాంతిచే విలసిల్లెడు గుణములమేటి యగు జాహ్నవీనామ్నీకులకాంతచే సంసారసుఖంబుల గడ తేలుచుండ నప్పుడతిమిన్న సుతషట్కంబును గన తత్సుతులు జన్మాది నవమదశమదివసంబులకు కాలగతి నొందుచుండిరి. జాహ్నవీదేవి దుర్భరపుత్రవియోగదుఃఖపరిపీడితయై విలపించుచుండ నమ్మగువకు సప్తమపుత్రుం డుదయించి ద్వాదశత్రయోదశదివసంబులు సజీవుండై విరాజిల్లుచుండ సారస్వతుండు దనమనంబున సప్తమపుత్రుని మృత్యుకాలదివసంబులు దొలంగె నని జింతించి యిప్పగిది యీతన యుండు దశవర్షంబులు జీవించెనేని సంపూర్ణాయుష్మంతుం డగునని సంతసంబుచే నిజకాంతామణికి దెలుపుచు నామకరణోత్సవంబుకై యాదినంబున షడ్రసోపేత భోజనంబులచే విప్రులం దృప్తిపఱచుచుండు సమయంబున రేవణసిద్ధనాథుం డలక్ష్యనిరంజన భిక్షా యని యవ్విప్రోత్తమునిసదనంబున కే తెంచినంత సారస్వతుండు పదార్థంబులు

గొని గృహద్వారసమీపంబు జేరి తపఃప్రతాపతేజోమయశరీరుండగు రేవణుని నిస్పృహవైరాగ్యంబు విలోకించి యిమ్మహాపురుషుండు ప్రత్యక్షపరాత్పరస్వరూపుం డని దలంచి తత్క్షణంబ సిద్ధునిచరణంబుల వ్రాలి "యోగద్రుమా! మద్గృహంబునపుత్రోత్సవకార్యంబుగలదు. హీనుండు దరిద్రుండని దలంపక మత్కృత సదుపచారంబులచే దృప్తుండవై మజ్జన్మంబు పవిత్రం బొనర్చి విషయసుఖావహసంసారతాపత్రయదుఃఖంబుల నివారింపవే" యని మ్లానవదనుండై వేడుచున్న విప్రముఖ్యునితో నాథుండు "పురుషశ్రేష్ఠా! నేను శూద్రజాతీయుండను తాము విప్రోత్తములై నమస్కరింపఁగూడునే" యన సారస్వతుండు "దయాఘనా! బ్రహ్మజ్ఞానరహితుండగు విప్రుండు బ్రాహ్మణుం డగునే? పరిపూర్ణసచ్చిదానందస్వరూపుండగు శూద్రున కననేల? మాతంగునకైన వందనంబు లాచరింపఁగూడదే" యని వినయోక్తులచే భక్తిభావంబులు వెల్లడి యొనర్ప రేవణుండు సంతుష్టాంతరంగుండై విప్రునిమనంబు దృప్తిపఱచం దలంచి తన్నివసనంబు బ్రవేశింప నయ్యమలాత్ముండగు విప్రుండు రసభరితపక్వాన్నభాజనంబు సిద్ధముఖ్యుని సమక్షంబున నిడి శ్రద్ధాసమేతుండై తత్సమీపంబున నుపవేశించి లోపపదార్థంబులు విచారింపుచుండ బ్రాహ్మణసమూహంబు భోజనంబులచే దృప్తిం బొంది సారస్వతునిచే ననుజ్ఞగొని నిజనివాసంబుల కేగుచుండినను దా నా రేవణసిద్ధుని నికటంబు బాసి శర్కరం ద్యజింపని పిపీలికాచందంబున దొలంగలేక భయభక్తియుక్తుండై తల్లోలుండయ్యెను. రేవణుండు కృతభోజనుండై గమనంబు జేయందలంప విప్రముఖ్యుండు "సమర్థా. నేటిరేయి మద్గృహంబున నివసించి యుదయంబున జనవలయు" నని ప్రార్థింప సిద్ధుండు హర్షించి యాబ్రాహ్మణసదనంబున శయనించెను. తదుపరి సారస్వతుండు భోజనం బొనర్చి సిద్ధుని సమీపంబున కేతెంచిన రేవణుండు మేల్కాంచి యాసనంబున నధిష్టించియుండ విప్రోత్తముండు నాథునితో "తాపసోత్తమా! ఉపహారం బొనర్చెదరే" యన సిద్ధుం డనవసరం బని ప్రత్యుత్తరం బొసంగె. నాపిదప నిశాసమయంబున రేవణుండు నిత్యనియమంబు దీర్చుకొని శయనించుచుండ సారస్వతుం డవ్విధిపీఠోద్భవుని చరణసేవాపరతంత్రుండై సుస్థిరమతిచే నివసించె. తన్నిశామధ్యంబున విప్రపుత్రుండు కాలప్రేరితుండై పరిత

పింపుచుండ జాతాపత్యురాలగు జాహ్నవీదేవి కేకలిడుచు "ప్రాణప్రియా! డింభకుండు తన్మయావస్థచే శోషింపుచున్నాఁ" డని రోదనంబు జేయుచుండ విప్రోత్తముండు కులకాంతతో "శోకింపనేల? దైవోపహతప్రాప్తుల మని మున్నెఱుంగమే? రోదనంబుచే లాభంబుగలదే? తొలిజన్మపాపఫలంబు లనుభవింపక దీరునే? ధ్యానం బొనర్చెద వేని సిద్ధుండు మేల్కాంచు. సాధుజననిద్రాభంగదోషంబునకు పారంబు గలదే? స్తబ్ధించుము. శాంతిం బొందు" మని బలుకుచు నిర్ధాద్యుండై నాథుని పదకంజంబుల సేవించుచుండ కృతాంతభటులు శిశుప్రాణంబు లపహరించిరి. జాహ్నవీదేవి దుస్సహదుఃఖంబుచే మందనినదంబున శోకింపుచుండ సూర్యోదయసమయంబయ్యె రేవణసిద్ధుండు నిద్ర దేరి శోకరవం బాలకించి "యెవ్వ రీ రోదనంబు జేయువా" రన విప్రుండు మత్తనయుండు తన్మయావస్థచే తపింపుచుండ మూఢమతిచే మజ్జాయ రోదనంబు జేయుచున్న" దన రేవణుండు "సుతుం గొని తె" మ్మనెను. వేగంబున విప్రుండు లోగృహంబుజేరి డింభకుని బరీక్షించి కాలగతి జెందియుండుట యెఱింగి "యోగిపూర్ణా! శాబకుండు పంచత్వం బొందె" నని నుడువ రేవణసిద్ధుండు క్రుద్ధుండై "నే నిచ్చో నివసించి యుండ బుద్ధిశూన్యుండగు కృతాంతుండు నిర్భయంబుచే ప్రాణంబులు హరించెనే? మత్పరాక్రమదర్పంబు గనబఱచెద" ననుచు "విప్రోత్తమా! శిశువుం గొని తె" మ్మన బ్రాహ్మణుండు నిర్జీవకళేబరంబు గొని సిద్ధునిసముఖంబున కరుదెంచెను. రేవణుండు "సారస్వతా! యుష్మత్ప్రథమతనయుం డీ యర్భకుండా నే" యన విప్రముఖ్యుండు "సిద్ధముఖ్యా! మద్భాగ్యఫలితం బెంతని యభివర్ణింతు పుత్రషట్కంబు జన్మించి నామకరణాత్పూర్వంబే రవిపుత్రునిచే నపహరింపఁబడె" ననియు నేతచ్ఛాబకుండు సప్తమపుత్రుండని దెలుపుచు "తపోధనా! మత్పురాకృత పాపఫలం బనుభవింపక దీఱునే" యనుచుండ రేవణుండు "విప్రశ్రేష్ఠా! నే నీక్షణంబ శమనునిపురంబు జెచ్చెరం జని యుష్మత్పుత్రులం దోడ్కొని యేతెంచెద. నిర్భయంబుచే శాబకుని కాయంబు దివసత్రయంబు రక్షింపు" మని యమరమంత్రంబు జపియించి ఫాలంబున భస్మంబు దిద్ది యీయర్భకుండు నశించఁడని వాగ్దత్తం బొసంగి శీఘ్రుంబున వ్యానాస్త్రంబు జపియించి తద్బలంబుచే జనుచుండి

హిమాచలంబు జేరి సీతలంబుకై యాగ్నేయాస్త్రంబు జపియించి యుష్ణంబు గాంచి జగచ్ఛత్రుపుత్రునగరంబున సభామంటపంబు బ్రవేశింప నయ్యముఁనాభ్రాత బ్రహ్మవీర్యోద్భవుండగు రేవణసిద్ధుని బొడగాంచి చయ్యన సింహాసనంబు డిగ్గి యెదుర్కొని రత్నమయసుఖాసనంబుపై యలంకరించి యర్ఘ్యపాద్యాదివిధుల బూజలుసలిపి మధురోక్తులచే మోదపఱచుచు "సిద్ధపురుషా! భవదాగమనకారణం బెయ్యదియో దయజేయు" మన రేవణుం డప్పరేతరాట్సుభాషితంబు లాకర్ణించి "కృతాంతా! మర్త్యలోకంబున సారస్వతనామవిప్రోత్తముని గృహంబున నే నివసించి యుండుతఱి భవద్దూత లేతెంచి నిర్భయంబుచే తద్విప్ర పుత్రుని ప్రాణంబు లపహరింపఁదగునే? తత్పూర్వం బప్పారుని పుత్రషట్కంబును హరించితివి గావున వా రెందుగలరో రయంబున గొని తెమ్ము. లేకున్న మత్కోపానలంబుచే శ్రమజెందెద" వన యముండు దనమనంబున వితర్కించి మధురోక్తులచే సిద్ధుని శాంతపఱచి యుమాకాంతుని సముఖంబున కంపి ప్రతాపంబు గనవలయు నని దలంచి "సిద్ధశ్రేష్ఠా! హరిహరబ్రహ్మ లీ ప్రపంచసృష్టిస్థితిలయంబులకు గర్తలౌట మీరెఱుంగరే? పద్మజునిచే ప్రభవింపంబడి గమలాక్షు కటాక్షంబున రక్షింపఁబడి హరునిచే సంహరింపంబడుట సర్వలోకవిదితంబుగాదే? నే నమ్మహేశ్వరాజ్ఞానువర్తినై మెలంగెదగాక నన్యంబుగలదే! తాపసోత్తమా! విప్రసుతస్తోకంబు విరూపాక్షునిసజ్జ న్నివసించు. తా మక్కపాలభృత్సముఖంబున కేగి బాలురం బరిగ్రహింపుఁడు. చరాచరప్రపంచక్షయకారుండు రుద్రుండని సర్వశాస్త్రంబులు బలుకుచుండ నాయందాగ్రహింపఁదగునే? మత్కృతాపరాధలేశంబు భవచ్చిత్తగోచరంబు గాదే" యన రేవణసిద్ధుండు నిక్కంబని దలంచి గ్రక్కున నక్కైలాసంబు జేరంజనెను.

ఇతి భక్తిసార నవనాథచరిత్రంబున రేవణసిద్ధచరిత్రంబు పంచత్రింశాధ్యాయము సంపూర్ణము.

---

 

## షట్త్రింశాధ్యాయము.

రేవణసిద్ధుఁడు శివునిచేఁ బోరి సారస్వతవిప్రుని పుత్రషట్కంబును గొనితెచ్చుట.

సర్వకళాప్రసిద్ధుండగు రేవణసిద్ధుండు రయంబున రజతాద్రిఁజేరి హరనగర మహాద్వారంబు జొరుచుండ దౌవారికరుద్రగణంబులు సిద్ధుని నిరోధించి "భవన్నామం బెయ్యది యేకతంబున నేతెంచితి" వని విచారింప సిద్ధుండు "మన్నామంబు రేవణుండు. సచ్చరిత్రుండగు సారస్వతవిప్రోత్తముని సుతుల హరుండు హరించెనని దెలసి విచారించుటకే తెంచితి. విజయంబు బడసి బాలురం గొనిపోయెద" నన రుద్రభటులత్యుగ్రమానసులై "పురుషఘనా! నీ వొక గంధర్వుని శిష్యుండవై సిద్ధవేషంబున మెలంగ దలంచితివి గాబోలు నుచ్చనీచంబు లెఱుంగక సంభాషించెదవే? జనుజను" మన రేవణుండు దండతాడితమృగరాజంబుకరణి క్రుద్ధుండై "మద్గురుండు గంధర్వుండని నిందించినఫలంబు గొను" మని స్పర్శాస్త్రంబు జపియించి భస్మంబుచే బ్రయోగింప తన్మంత్రప్రతాపంబుచే త్రయోదశశతరుద్రభటపాదంబులు బుడమిం గఱచుకొన వారలతిబలసాహసంబులచే లంఘింపందలంచియు జలింపలేక ధరపై కరంబులు మోపి విముక్తికై వివిధోపాయంబులుచేయ కరచరణయుగళంబులు మహీతలం బంటుకొని నిశ్చేష్టితులై చతుష్పాదంబులకైవడి గోచరంబగుచున్న శివగణసమూహంబుతో సిద్ధుండు "మద్గురుశక్తిప్రతాపంబు గనుఁగొంటిరే" యనుచుండ నేతద్విపరీతచరిత్రావిర్భూతకోలాహలనినదంబు భర్గుం డాలకించి యాగ్రహంబుచే కల్పాంతకాది భైరవాష్టకంబును బవరంబున కనుప నయ్యసమాన బాహుబల దర్పోద్ధతులగు భైరవులు గదాత్రిశూల ఖడ్గముసల ముద్గరాది సాధనవరిష్ఠంబుల బూని యనేకలక్షరుద్రగణంబులతో సమరంబున కేతెంచి దౌవారిక దురూహ చతుష్పదాకార విపరీతం బుపలక్షించి యాగ్రహంబున భయంకరాట్టహాసం బొనర్చి మహోద్దండకోదండంబుచే తీక్ష్ణతర శిలీముఖవ్రాతంబులు సిద్ధునిపైఁ బ్రయోగింపుచుండ యోగిపుంగవుండు రోషతామ్రాక్షుండై వజ్రాస్త్రంబుచేతచ్ఛరసంఘంబును భంగపఱచి పునః స్పర్శాస్త్రప్రయోగంబున శివగణానీకంబుల చలనవలనాదులు బంధింప నయ్యంతకాంతకాకారులగు భైరవులు స్పర్శాస్త్రంబునకు బద్ధులుగాక

కోపోద్దీపితులై దిగ్గజంబుల నుగ్గడంచు జ్యాఘోషంబు సల్పి యేకము హూర్తంబున వాతాస్త్ర ప్రళయానలాస్త్ర నాగాస్త్ర ధూమ్రాస్త్ర వాసవాస్త్ర బ్రహ్మాస్త్ర వజ్రాస్త్ర విముక్తాస్త్రంబులు బ్రయోగింప నయ్యస్త్రరాజంబులు దిగంతవ్యాపకమై యంబరంబు చుంబించుచు జాజ్వల్యమానంబుచే నజాండంబు గబళించునో యనున ట్లగపడెంచు చుండ ధారాధరజలధారలకు జలింపని మహానగంబుభంగి ధైర్యధు ర్యుండగు సిద్ధుండు భస్మంబు గొని గురుప్రతాపంబుచే పర్వతాస్త్ర జలదాస్త్ర ఖగేంద్రాస్త్ర దిత్యాస్త్ర కాళికాస్త్ర స్తవనాస్త్ర శక్రాస్త్ర సం మోహనాస్త్రంబులు గల్పించి బ్రయోగింప నేతన్మహాస్త్రంబులు భైర వాస్త్రంబుల రూపడంచి భైరవుల ముట్టడించి మర్మంబులు దూఱు చుండ బెంకువడి విషణ్ణవదనులై విలపించుచున్న భైరవాష్టకసంకటం బులు విలోకించి యొకకొందఱు మేరుచాపుని చేరంజని "శంభో! భైర వులు కంఠగతప్రాణులైరి. సర్వగణసంఘంబులు నిశ్చేష్టితంబులై" రన గోపధ్వజుం డనిల ప్రేరిత దవానలంబుచందంబున కోపపూరితుండై పరశు త్రిశూలాది దివ్యసాధనంబులం గొని రయంబున వృషభవాహ నారూఢుండై రణరంగంబునకరుదెంచినంత రేవణుండు కామారిని బొడ గాంచి యిమ్మహామహుండు సాధారణకదనంబున కసాధ్యుండని తలంచి వాతాకర్షణ మహాస్త్రంబు జపియించి ప్రయోగించెను. తత్క్షణంబ గిరిజాధవుం డయ్యస్త్రంబుచే శ్వాసోచ్ఛ్వాసంబులు స్తంభింపఁబడి వివశా త్ముండై వృషభపృష్ఠంబు దొలంగి కీలూడినబొమ్మచందంబున బుడమిని వ్రాలి శ్రమజెందుచుండ నీయద్భుతకృత్యంబులు గంధర్వాదులు గనుం గొని త్వరితంబున వైకుంఠంబు జేరంజని శ్రీమన్నారాయణునితో భైర వాధులగర్వనిర్వాపణంబు శివగణ దేహశోషణంబు త్రిపురారిశరీరతాపం బువిన్నవింప శీఘ్రంబున రమారమణుం డుమారమణుని నికటంబున కరు దెంచి భయంకరకార్యంబు గనుంగొని రేవణుని డగ్గరం జేరి సప్రేముండై హృదయాలింగనం బొసంగి "సిద్ధముఖ్యా! నీ వేకతంబున క్షోభించి యి వ్విపరీతకార్యం బొనర్చితి"వని విచారింప రేవణసిద్ధుండు "భోగిశయనా! సారస్వతనామవిప్రోత్తముని మందిరంబున నే నివసించియుండ హరుండు తద్బ్రాహ్మణకుమారుని ప్రాణంబు హరించె. తత్పూర్వం బయ్యనఘా త్ముని పుత్రషట్కం బపహరింపఁబడె గావున మద్గురుశక్తిప్రతాపంబుచే

నీలగ్రీవుని ప్రాణంబులు గొని సంజీవినీమంత్రయోగమహిమాతిశయం బుచే బాలుర న్నిర్మించి తోడ్కొని చనియెద. లేక విప్రపుత్రుల నొసంగెద రేని యుపేక్షింతు” నన లక్ష్మీధవుండు “తపోధనా! బాలసప్తకజీవంబులు మత్సాన్నిధ్యంబున బ్రకాశించుచున్నవి. యుష్మత్తపోబలంబున శరీరంబులు గల్పించి గొనిపోయెద వేని యొసంగెద. వేగంబున భోగిరాడ్భూషణుని శ్రమ దొలంగింపు” మన నాథుం డవశ్యం బని మంత్రోపసంహారంబుచే వాతాకర్షణ మహాదస్త్రంబును శాంతపఱచి విభక్తాస్త్రంబుచే భైరవాది ప్రమథగణంబుల విముక్తంబుల గావించి గరుడధ్వజునిచే జీవకళాసప్తకంబు గ్రహించి జెచ్చెర విటాగ్రామంబు జేరి విప్రోత్తమునితో “పుణ్యాత్మా! భవన్నందనుని నిర్జీవకాయంబు పిష్టంబుకై వక్షి పిండం బొనర్చి పుత్రికాసప్తకంబును గావింపు” మన నతం డట్లగాక యని కడుసంతసంబుచే శిశుశరీరంబు కులాలునిభంగి పిండం బొనర్చి పుత్రికాసప్తకంబును నిర్మింప రేవణసిద్ధుండు సంజీవినీమంత్రయోగంబున తదంగంబుల జీవకళల న్నిలుప కళాపూర్ణులగు డింభకులు రోదనంబులు జేయుచుండిరి. సారస్వతుండు జాహ్నవీదేవిని బిలచి శాబకుల నొసంగ నక్కాంతామణి మితిలేని సంతసంబుచే పుత్రులం బడసి ద్వాదశదివసంబున తోడిచేడియలతో సారంగనాథ జోగీబానాథ నిజానందనాథ నయననాథ యదునాథ నిరంజననాథ గహినీనాథులని నామకరణం బొనర్ప నబ్బాలురు క్రమక్రమంబున వృద్ధి జెంది ద్వాదశాబ్దంబుల వయస్కులై సకలవిద్యాన్వైపుణ్యంబుచే దేజరిల్లుచుండ రేవణసిద్ధనాథుం డనేక తీర్థంబులు సంచరించి యచ్చోటు కరుదెంచి యయ్యుత్తమోత్తమగుణంబగు బాలసప్తకంబున కనుగ్రహం బొసంగి పరిపూర్ణసనాతనమూర్తులం జేయ వార లత్యంతవైరాగ్యమార్గంబుల మెలంగుచుండ రేవణసిద్ధుండు తద్గ్రామంబున వసించి చతురశీతిశిష్యసముదాయంబును యేర్పఱచి నాథపంథీయోగంబున విరాజిల్లం జేయుచు నానందమయుండై కాలంబు గడుపుచుండెను. “శ్రోతలారా! సారస్వత విప్రోత్తముని చరిత్రం బెవ్వండేని భక్తియుక్తుండై నిత్యనియమంబుగ శ్రవణపఠనాదులు సల్పునో యప్పురుషశ్రేష్ఠునకు సుసంతానంబుగలుగుటనిక్కంబు. గతశిశుసుందరీమణి యిక్కథావిశేషంబు ప్రతిదినంబున సుస్నాతయై శ్రద్ధాసహితచిత్తంబుచే నాలకించె

నేనియప్పుడ(తిమిన్న దోషవిము క్తనై యాయుఃపూర్ణసంతానంబుబడ
యుట నిశ్చయం బని గోరక్షసిద్ధుండు నిజహ స్తంబుచే లిఖియించెను."

## వటసిద్ధనాగనాథజన్మకథాప్రారంభము.

తొల్లి లోకోత్ప త్తికారణభూతుండగు నాళీకభవుం డొకనాఁడు
నిజకళత్రముఖ ప్రముఖాద్యవయవలావణ్యయుతశుభగాత్రంబు డెందం
బున ధ్యానింపుచు నౌరా! చెలివదనంబు విలోకించి విధుండు సిగ్గుజెడి
స్తంచరుండయ్యెనో? పద(తీపదంబుల పసదలంచి కూర్మంబు భువిని
దూఱెనో? సుదతీగ్రీవంబున కోటుబడి వనజం బరిభయంకరరవం
బు సలిపెనో? తన్వీమధ్యంబున కెనలేక మృగరాజు గిరిగహ్వరంబుల
జేరెనో? మగువకుచయుగళసౌరభంబు గని చక్రంబులు దివి బ్రాకెనో?
రాసునూగారు బొడగాంచి యహికులంబు వల్మీకంబుల డాగెనో యన
నవ్వాగ్దేవి జగన్మోహనాకారకాంతారభ్రాంతచిత్తంబున పుష్పశరశిలీ
ముఖనిర్భిన్నహృదయుండై జలింప నింద్రియంబు గళితంబై యొకమ
హాపన్నగసమక్షంబున బడ నయ్యురగంబు తద్వీర్యశ్రేష్ఠంబును గ్రసిం
చెను. తక్షణం బవ్వీర్యంబు పన్నగోదరంబున నండంబై యభివృద్ధిజెం
దుచుండ యా స్తికమునిపుంగవుండు భవిష్యచ్చరిత్రం బెఱింగి రయం
బున న త్తక్షకదుహితయగుపద్మినీనామునాగవధూసమక్షంబున కేతెంచి
"నాగకన్యాశ్రేష్ఠమా! నీయుదరంబున వనజోద్భవుని వీర్యంబు
గల దందు యవిర్హోత్రనారాయణుండు బ్రవేశించి యవతరించు.
ముందొక ఘనవిఘ్నంబు గలదు. జనమేజయుం డహికులనాశ
నార్థంబై సర్పయాగం బొనర్పుచు తాపసో త్తములచే నాహుతు
లర్పించుచు నానానాగంబుల భస్మం బొనర్చును. గర్భరక్షణార్థంబై
తరుకోటరంబున భద్రంబుగ నుండు" మని సమీపస్థవటవృక్షంబొకటి
గనఁబఱచినంత న త్తక్షకనందిని వృక్షనిష్కూహంబున నివసించెను. ఆ
స్తికుండు నిజతపఃప్రతాపంబుచే భూజంబుపై వజ్రకవచంబు నిర్మించి
యథేచ్ఛంజనెను. తదుపరి జనమేజయకృతసర్పయాగంబున నయ్యా
స్తికుండు ఋతిక్సమూహంబుతో నేత్రద్రహస్యంబు దెలుపుచు "ముని
ముఖ్యులారా! తక్షకదుహితృగర్భంబున కమలగర్భుని వీర్యంబు గలదు.
జగదుద్ధారనిమి త్తంబై యవిర్హోత్రనారాయణుం డం దుద్భవించి వట

సిద్ధనాగనాథనామంబున విరాజిల్లును గావున మనమా నాగకాంతా మణిని రక్షింపవలయు" నన నవ్వినులాత్ములు తత్కాత్మజం ద్యజించి యఖిలపన్నగానీకం బవ్విలిహోత్రునిపా లొనర్చుచుండిరి. అట న ప్పద్మినీనాగంబు వృక్షకోటరంబున నండంబుంచ నయ్యండంబు బహు కాలంబు బ్రకాశించుచుండె నం దవిర్హోత్రనారాయణుండు బ్రవేశిం చి యనుదినం బభివృద్ధి జెందుచుండ నయ్యండంబు భిన్నంబై బాలా ర్క తేజుండగు బాలుండుదయించి బహునాదంబుచే రోదనంబు జేయు చుండు సమయంబున నొకకోశధర్ముండను గౌడబ్రాహ్మణుండు వేద వేదాంగవిద్యాభ్యాసనిపుణుండై లేము లనుభవించుచు దీనదశచే నొకనాఁడు వటపత్రంబులకై తన్మహీరుహంబు జేరంజని శిశురోదన రవం బాలకించి బాలుం గానక నలుదిశలు నిరీక్షింపుచుండ సురోత్త ములు "కోశధర్మా! వటభూజకోటరంబున నర్భకుండు గలఁడు. భవత్స దనంబునకు గొనిపోయి శాబకుని బోషించితివేని రవిరశ్మిచే దొలంగు తిమిరంబుభంగి యవిర్హోత్రనారాయణస్వరూపుండగు బాలునిచే మారీ కృత దరిద్రదుఃఖతాపుండవై యష్టైశ్వర్యంబు లనుభవించెద" వని బలుకుచు నొకశరప్రయోగంబుచే తరుకోటరముఖచ్ఛేదనం బొనర్ప తక్షణంబ మూఢజనహృదయాచ్ఛాదక మాయాతమోభంజన నిర్మల జ్ఞాన సూర్యోదయంబుభంగి బ్రకాశించెడు డింభకుండు గోచ రుండగుచుండ నంతరిక్షస్థిత దేవతానీకం బయ్యపార తేజోమయుండగు బాలునిపై పుష్పవర్షంబు గురిపించుచు కోశధర్మా! బాలుండు లోకో ద్ధారనిమిత్తంబై యుదయించెను. వటవృక్షకోటరంబున తక్షకాత్మజా గర్భసంభూతుండై విలసిల్లెంగాన వటసిద్ధనాగనాథుం డని నామకరణం బొనర్పు" మని యంతర్ధానంబు నొందెను. పిదప కోశధర్ముం డతిసం తోషంబుచే బాలుని గొని సదనంబు జేరి నిజకాంతామణియగు సురా దేవిని బిలచినంత సర్వలక్షణసాక్షిస్వరూపవిగ్రహం బనజాలు నత్తో యజాక్షి బాలుని వీక్షించి యాశ్చర్యంబుచే ప్రచ్ఛన్నంబున విచ్చేసిన జగచ్చతుండో లేక నాగ్రహంబుచే రుద్రుండు గల్పించిన వేరొండు చంద్రుండో యన నొప్పారు శిశువును ముదంబుచే గైకొని ముద్దులిడు చుండ కోశధర్ముండు శిశులాభాద్భుతచరిత్రంబు సవిస్తరంబుగ దెలియఁ

బఱచెను. సురాదేవి యత్యానందంబుచే బాలుని డోలికనుంచి వటసి
ద్ధనాగనాథనామకరణం బొనర్చి లాలింపుచుండ దైవికంబుగ స్తనం
బుల క్షీరంబు లుదయింప తత్పయః పానంబుచే డింభకుని దృప్తిపఱ
చుచు నభ్యంగనాద్యశేషోపచారంబులచే దొలంగని మోహంబున
బోషింపుచుండ బాలుండు క్రమక్రమంబున సప్తహాయనంబుల వయ
స్కుండై దేజరిల్లుచుండ నుపనయనాదిసంస్కారంబు లొనర్పంబడి
యొకానొకదివసంబున శైశవక్రీడాతురుండై తత్కాశీక్షేత్ర భాగీరథీ
తీరంబున గ్రుమ్మరుచు మధ్యాహ్నసమయంబున మారారిమందిరసమీ
పంబున కేతెంచి స్వసమవయస్కులగు బాలురతో బాడుచు నాడుచు
వినోదార్థంబుగ భోజనంబు లిడుచు కొందఱను భుజియింపుడనుచు
నొకకొందఱిని బ్రేమచే లాలింపుచు మఱికొందఱిని స్నానంబు లాడు
మనుచు ననేకవిధ సంభాషణంబులచే జరించుచుండుతఱి దీనశరణ్యుం
డగు దత్తాత్రేయుం డకల్పితంబుగ నరుదెంచి బాలకులమిథ్యాభోజన
వాక్యంబు లాకర్ణించి హాస్యవదనుండై తనమనంబున నిజభోజనంబు
లచే బడుచువారల దృప్తిబఱచవలయునని దలంచి శీఘ్రంబున తా
నొకబాలుండై తత్సమూహంబున బ్రవేశించి "నేనొక యతిథుం
డనై యేతెంచితి" ననుచుండ జ్ఞానహీనబాలురు "మాశైశవంబుల
కొక నూతనబాలుం డరుదెంచె" నని యల్లరి జేయుచు జనుజను మని
కోపంబున కఠినోక్తులు బలుకుచుండ నాగనాథుండు బాలుర న్విచా
రించి "యాతిథ్యం బొసంగెద రార" మ్మని నవీనబాలుని డగ్గరం జేరి
యొక్కచో గూర్చుండనియమించి రిక్తహస్తంబులచే శాస్త్రోక్తపూజలు
సలుపుచు ధూపదీపంబులు భక్తియుక్తుండై యొసంగి నిజభావంబుచే
నీరాజనంబు లిడుచు సముత్తుంబున నైవేద్యంబు మనంబుచే గల్పించి
నమస్కారంబులిడుచు బాలచేష్టలచే "స్వామీ! యింకను పదార్థంబు
లిడుదునా" యని మృదువాక్యంబు లాడుచుండ దత్తుండు దనచిత్తం
బున బాలుని శాంతశమదమాదిగుణంబులు దలంచి యియ్యది పురా
కృతఫలవిశేషంబుచే లభియించు ననియు శౌర్యస్థైర్యధైర్యసాహసం
బులు విశేషజ్ఞులకు సహజగుణంబులనియు దాతృత్వభోక్తృత్వ వక్తృ
త్వాది విశేషంబులు ధీరమతుల ముఖ్యలక్షణంబు లనియు వితర్కించి

యిప్పురుషుని పూర్వజన్మం బెట్టిదనుచు నవిర్హోత్రనాశాయణుండని యూహించి కరుణాంతరంగుండై యియ్యుత్తమశ్లోకుని ముఖోదితవాక్యంబులు సుప్రసిద్ధంబులై విలసిల్ల నొనర్పవలయు నని రయంబున వటసిద్ధనాగనాథుని నేకాంతంబునకు దోడ్కొనిచని "వత్సా! నీవాక్యంబులచే నేపదార్థంబులు గోరెదవో నయ్యవి తత్క్షణంబ సిద్ధించు నాసిద్ధాన్నపదార్థంబు లెందరేని భుజియించినను లోపంబులు గానేరవు. నీ వా పదార్థంబులు భుజియింపకు" మని వరం బొసంగి "నేను దత్తాత్రేయుండ" నని దనస్వరూపంబు దెలిపి యంతర్ధానంబు నొందెను. తదుపరి నాగనాథుండు సర్వబాలురకు షడ్రసాన్నంబులు గల్పించి పఙ్క్తిభోజనంబులిడ దృప్తింజెంది దమతమనిజధామంబులు జేరంజని యిప్పగిది ప్రతిదినంబున శైశవక్రీడావినోదంబులచే బాలుర దృప్తిపఱచుచుండ వారా యపూర్వమధురసాన్నంబుల దనివితీరి పిదప నిజసదనంబులకేతెంచి భోజనాపేక్ష లుడిగి బ్రహ్మానుభవ జ్ఞానపూర్ణుండు మాయాజాలప్రపంచభోగంబుల నాశింపనిచందంబున మణిఖచితస్వర్ణభూషణాలంకృతుండు కాచంబుల లక్షింపనివిధంబున నింద్రనీలమణిచిత్రిత కుడ్యయుత సౌధాంతర్నివాసులు తృణనిర్మితగృహంబుల నరకుగొననికై వడి గృహభోజనంబులు దుచ్ఛంబులని దలంపుచుండ దత్తద్బాలుర జననీజనకులు "భోజనాపేక్షలేల యుడిగితి" రని విచారింపుచుండిరి. వారీ చరిత్రంబు వెల్లడి యొనర్పుచు "మాకత్యంతమధురతర భోజనంబులు గంగాతటంబున నాగనాథునిచే ప్రతిదినంబు లభియించు" నని బ్రత్యుత్తరంబు లొసంగ నియ్యవి మృషావాక్యంబులని తలంచుచు గుప్తరూపంబున భాగీరథీతీరంబు జేరి నిజలోచనంబులచే పన్నగోద్భవుని యద్భుతచరిత్రంబు విలోకించి యొకరిలో నొకరు నాగనాథుగుణంబు లుగ్గడించుచు నొకకొందఱు కోశధర్ముని తో "పురుషముఖ్యా! యుష్మత్తనయుండు లోకత్రయపావనియగు గంగాతటంబున షడ్రసోపేతభోజనంబులచే మాబాలురం బ్రతిదినంబున దృప్తిపఱచుట నీ వెఱింగితివే? సంకల్పమాత్రంబున నఖిలపదార్థంబులు సిద్ధపఱచి పఙ్క్తిభోజనంబు లిడుచుండు" నన కోశధర్ముండు దనహృదయంబున నిర్జరానీకవాక్యంబులు దలపోసియు "మీబాలు రనృతంబు లాడెద" రని ప్రత్యుత్తరంబు లొసంగుచు

నొకనాఁడయ్యపారచరిత్రుండగు వటసిద్ధనాగనాథుని తనయంకంబుపై నుంచుకొని మూర్ధంబు నివురుచు "కుమారా! తోడిబాలుర కెప్ప గిది ప్రతిదినంబున భోజనంబు లిడుచుండెద" వన నాగనాథుండు త్వరి తంబున నంకంబు డిగ్గి గనుంగొను మని రిక్తహస్తంబులు బుడమిపై మోపి సంకల్పమాత్రంబున ననేకభోజనపదార్థంబులు సిద్ధపఱచెను. కోశధర్ముం డాశ్చర్యంబున "వత్సా! నీకీ కౌతుకం బే మహాపు రుషునిచే లభియించెనో యెఱుంగింపు" మన వటసిద్ధుండు "జనకా! నే నొకనాఁడు గరళకంఠుని మందిరసమీపంబున బాలురతో నాడు చుండ నొకనూతనబాలుం డాతిథ్యం బొసంగు మని యేతెంచినంత భవదాచరిత యతిథిసత్కారంబులు మదిదలంచియబ్బాలునకు మృషా వాక్యంబులచే నర్ఘ్యపాద్యాది బూజలసల్పి తద్వదోభ్జనంబిడ నవ్విమ లాత్ముండు న న్నేకాంతంబున కీడ్చుకొనిజని యెద్దియో మత్కర్ణపుటం. బున నూది నిజభోజనంబులు సిద్ధించు ననియు తా దత్తాత్రేయుండ నని బలికి యంతర్ధానంబు నొందె.తదాది మద్వాగుదితప్రకారంబుగ భోజ నంబులు లభియించుచుండె" నని సవిస్తరంబుగ దేటపఱచెను. కోశ ధర్ముం డతిసంతసంబుచే స్వగృహాగతుల కాతిథ్యం బొసంగందలంచి ప్రతిదినంబున నానా దేశబ్రాహ్మణోత్తములకు బాలునిచే భోజనాది సత్కారంబు లొనర్పించుచుండ క్రమక్రమంబున నేతత్కీర్తి దిక్కులు పిక్కటిల్ల వ్యాపించిన నొక్కొక్కదినసంబున లెక్కకందని బ్రాహ్మణాదు లొక్కుమ్మడి నేతెంచి దమతమ యక్కఱలు దీర్చుకొని చొక్కమగు నాగనాథసిద్ధునిగుణంబు కొనియాడుచు నేగుచుండ నొకకొన్నివత్సరం బులు గడచినంత పద్మభవవీర్యోద్భవుండగు నాగనాథుండు యుక్తవ యస్కుండై యొకనాఁడు కోశధర్మునితో "నాయనా!మద్బాల్యంబున దత్తాత్రేయనాముండు దర్శసంబొసంగి యమితోపకారం బొనర్చె. తత్ప్రభృతి పునర్దర్శనంబు ఘటియింపదయ్యె. మచ్చిత్తం బమ్మహామ హుని దర్శనార్థంబై యపేక్షించుచున్న" దన కోశధర్ముండు "పుత్రా! ప్రత్యక్ష త్రిమూర్తిస్వరూపుండగు దత్తాత్రేయదర్శనంబుపరమయోగీం ద్రులకైన నలభ్యంబగునే? నిఖిలలోక జేగీయమాన గుణకదంబుండగు దత్తుం డొక్కచో నివసించునే? యయ్యఖిలేశ్వరుండు ప్రచ్ఛన్నంబున నానాపుణ్యక్షేత్రంబులు ద్రిమ్మరుచుండు.బహుజన్మసంస్కారపుణ్యవిశే

షఫలలబ్ధసురభూజ సురధేనువులచందంబున లభియించుంగాక నప్పరా
త్పరస్వరూపునిదర్శనంబు ఘటియించుట దుర్లభంబుగాదే? ప్రయత్నం
బులు వ్యర్థంబు" లని బలుకుచు సంసారకార్యార్థియై సదనంబు వెడలి

నాగనాథుఁడు శ్రీగురుదత్తదర్శనార్థంబై కొల్హాపురంబున
కౌతుకంబులు జేయుట.

జనుచుండెను. వటసిద్ధుండు దనహృదయంబున దత్తదర్శనాపేక్షాబద్ధుం
డై కోశధర్మున కెఱుంగింపక బయలుదేరిమాతాపురపాంచాలేశ్వరాది
మహాక్షేత్రంబులు శోధింపుచు కొల్హాపురనగరంబుజేరి తత్క్షేత్రవాసుల
తో "నత్రిసూనుండెందు గలం" డని విచారింపుచుండవార లత్యంతాశ్చ
ర్యరసపూరితవదనులై "యారా! దత్తుండు ప్రకటుండై పరిభ్రమించు
ననుట వేదుఱుగాదే? త్రిజగద్వంద్యుండగు దత్తావధూతుండు భిక్షా
ర్థంబై యేవేషంబున నేతెంచునో గనుంగొన శక్యంబగునే" యన
నాగనాథుండు "దయాఘనులారా! దత్తుండు భిక్షాన్నంబుకై యన్య
క్షేత్రంబుల కేగడో" యన నయ్యనఘాత్ములు "పురుషముఖ్యా! త్రిమూ
ర్తనుం డేతత్ క్షేత్రాన్నంబుబరిత్యజించి యితరక్షేత్రపదార్థంబులు స్వీక
రించునే? యేకపత్నివ్రతుం డితరభామినీమణి జగన్మోహనాకారంబున
కాశింపనికరణి విప్రుండు బ్రాహ్మణాన్నంబు వర్జించి రసభరితశూద్రా
న్నంబు గోరనిచందంబున నగణితపుణ్యమయక్షేత్రంబు లనేకంబు
లుండినను దత్తుండు తత్ప్రదేశషడ్రసోపేత పక్వాన్నంబులు దలంపక
నేతత్తీర్థవృక్షశాఖాపర్ణంబులైనం భుజియించి దృప్తింజెందు" నని
బ్రత్యుత్తరంబు లొసంగ నాగనాథుండు దనచిత్తంబున నిచ్చో నివ
సించి నిఖిలజనాళికి బహువిధరసపూరిత భోజనంబు లిడుచుండెదనేని
యిప్పురజనులు దమసదనంబులపాకక్రియలు మాని యిందే తెంతురు.
దత్తాత్రేయుం డన్యగృహంబుల నాహారంబు లభింపమింజేసిభిక్షాన్నం
బుకై మత్సన్నిధానంబున కరుదెంచును. తొల్లి వాక్సిద్ధినిర్మితపదార్థం
బులునను భుజియింపవలదని యాజ్ఞాపించిన ఘనుండై తానేలమత్కల్పి
తాహారంబులు భుజియించు నక్షణంబున యోగిజనవందితాంఘ్రియు
గళుండగు దత్తును బరిశీలించి గనుంగొనియెద నని సదుపాయంబు
దలంచి శ్రీమహాలక్ష్మి దేవళంబున నివసించి యొకకొన్నిదినంబు లయ్యా
ర్చకోత్తమునకు భోజనంబు లిడుచుండి యొకానొకదివసంబున నయ్య

నఘాత్మునితో "దయామయా! ఏతద్గ్రామస్థిత బాల వృద్ధ స్త్రీ పురుష నిఖిల జనానీకంబునకు విందొనర్పవలయు నని కుతూహలంబు గలదు. భవత్సహాయంబుచే నిక్కార్యంబు సఫలంబగు" నని వేఁడుచుండ నయ్యర్భకశ్రేష్ఠుండు దరహాసితవదనుండై "సకలజన దృప్తికరపదార్థంబు లెందుగల" వని యుత్తరంబు లొసంగియు "పురుషఘనా! యుష్మత్సంకల్పిత పుణ్యకార్యసహాయం బొనర్చుట ముఖ్యధర్మంబు గాదే" యని నుడువుచు నిజభవనంబు జేరంజనిన పిదప వటసిద్ధనాగ నాథుం డొక యుగ్రాణంబులో భక్ష్యభోజ్యలేహ్యచోష్యానుకూల నానావిధపదార్థంబులు సిద్ధపఱచి యయ్యర్భకుని సదనంబున కరిగి రయంబున దోడ్కొని దేవళంబున కేతెంచి స్వనిర్మిత పాకానుకూల పదార్థంబులు గనబఱచెను.

ఇతి భక్తిసార నవనాథచరిత్రంబున రేవణసిద్ధనాథచరిత్రంబును వటసిద్ధ నాగనాథ జన్మాది కథనంబు షట్త్రింశత్యధ్యాయము సంపూర్ణము.

---

## సప్తత్రింశాధ్యాయము.

---

నాగనాథుఁడు మత్స్యేంద్రనాథునితో యుద్ధంబొనర్చుట.

వటసిద్ధనాగనాథుండు సిద్ధికల్పిత బహువిధపదార్థంబు లర్భకోత్తమునకు జూపి యేతత్కొల్లాపురనివాసి బ్రహ్మక్షత్రియ వైశ్యశూద్రాంత్యజాది సర్వవర్ణ బాలవృద్ధస్త్రీపురుషులకు నీచోచ్చభేదంబులు దలంపక వలయువేళల వాంఛిత భోజనంబులను దినం బిడవలయు నన నతం డత్యంతహర్షమానసుండై శీఘ్రంబున నొకకొందఱ పరిచారికులం బిలచి తద్దేవాలయసమీపవిశాలప్రదేశంబున నొకకొన్నిమంటపంబులు నిర్మింప నియమించి కుశలమతులగు విప్రోత్తములచే పాకంబు లొనర్పించుచు రయంబున బ్రాహ్మణోత్తముల సదనంబుల కేగి యామంత్రణంబు లొసంగి సకలవర్ణసర్వజనభోజనంబులకై వీథివీథులం జాటుచు వెల్లడియొనర్చి మతాంతర్భేదంబులకై ప్రత్యేకప్రత్యేకస్థలంబున పాకంబు లొనర్పింప పంచద్రావిడ పంచగౌడ కరాడ చిత్పావన ఘూర్జరాది నానావిధభేదబ్రాహ్మణోత్తములు శైవ వైష్ణవ శాక్తేయ

సౌర గాణాపత్య కాపాలికాది బహువిధమతజాతుల బాలవృద్ధస్త్రీపు రుషసముదయంబు లేతెంచి దమతమ యభీష్టమధురతరపాయసాది పదార్థంబులు భుజియించుచు నేకద్విత్రివారంబులనక క్షుత్సమయం బుల యాహారంబులు గైకొని దృప్తులై నిజధామంబుల కరుదెంచు చుండ నిట్లొకమాసంబు గడచెను. త్రిలోకవంద్యుండగు దత్తాత్రే యుండు తత్ప్రథమదివసంబున కురూపుండై ప్రతిగృహంబున కేతెంచి భిక్షాన్నంబు విచారింప నాగృహస్థు "లయ్యా! నీవెట్టిదౌర్భాగ్యుండవు సురభూజాశ్రితుండు పరాన్నంబుకై యాచించినక్రియ లబ్ధస్పర్శవేది పురుషుండు సువర్ణంబుకై విలపించినవిధంబు దేవళంబున రసభరిత మధురాన్నంబులు బరిత్యజించి యిం దేతెంచుట చిత్రంబుగాదే? మే మా సమారంభభోజనంబులచే దృప్తులమై స్వగృహంబుల పాకంబు లేల నొనర్చెదమో నీవెఱుంగవే? తక్షణంబ దేవాలయంబు జేరం జని నీయభీష్టంబుగ దృప్తిం బొందు" మని బలుక దత్తుండు ప్రతిగృ హంబున నిప్పగిది ప్రత్యుత్తరంబులు బొంది యన్నంబు గానక దన మనంబున సకలజనసంఘంబునకు భోజనంబులిడు ఘనుం డెట్టివాఁడో నిరీక్షింపవలయు నని దలంచి దేవళంబున కరుదెంచి పాకకౌతుకంబు ల్విలోకింపుచు పాకసమయంబున గోచరంబగు పదార్థలేశంబు తదుపరి పర్వతాకారంబులై విలసిల్లుట బొడగాంచి యియ్యది క్రియాసిద్ధిప్ర తాపంబని యూహించి తత్సమీపస్థితమనుజులతో నిమ్మహాకార్యాధి పతి యెవ్వండని విచారింప వారలు వటసిద్ధనాగనాథుండని దెలియఁబ ల్కిరి. దత్తాత్రేయుండు దనడెందంబున వింశతివత్సరంబులకు మున్ను వటసిద్ధనాగనాథుండు కాశీక్షేత్రంబున బాలుండై యాడుచుండ నయ్యమలాత్ముని సుగుణంబులు గాంచి వాక్సిద్ధికై వరం బొసంగితి నని యు వటసిద్ధుండు పూర్ణవయస్కుండై మద్దర్శనార్థం బిందేతెంచి యి క్కార్యంబు దలపెట్టి భిక్షాన్నదుర్లభం బొనర్చె ననియు నిశ్చయించి యచ్చోటుబాసి జనుచుండ నొకకొందఱు "ఆకొల్లల భోజనం బొనర్పక జనియెద" వని నిరోధించిన లక్షింపక యథేచ్ఛం బురంబున సంచ రించి యాయవారంబు గొని కాశీక్షేత్రంబున కరిగి తద్ధాన్యాహారం బొనర్చి యిట్లొకమాసంబు గడపినంత నిట నాగనాథుండు మత్సంక ల్పితకార్యంబు ఘటియింపదయ్యెనని వితర్కించి పురజనులతో "గ్రా

ముంబున నెవ్వండేని భిక్షాన్నంబుకై సంచరించునే” యని విచారింప నా రయ్యకలంకవటసిద్ధునితో “పురుషముఖ్యా! యొకభిక్షుకుం డేతన్న గరంబున కనుదినం బేతెంచి భవత్సమారంభ పరిపక్వాన్నం బపే క్షింపక తా నొకవ్రతస్థుండనని గ్రామంబున ధాన్యభిక్షుం బరిగ్ర హించి యేగుచుండు” నన నాగనాథుండు వారితో “శిష్టులారా! తమ తమసదనంబులకే తదన్నంబు గొనిజని యబ్భిక్షుకుం డేతెంచినంత నీయన్నంబు నాగనాథ సమారబ్ధ ప్రయోజన పక్వాన్నం బనుచు నొ సంగుఁ డయ్యమలాత్ముండు పరిగ్రహింపఁడేని తత్క్షణంబున మత్సన్నిధా నంబున కేతెంచి దెలుపు” మని యాజ్ఞాపించి యన్నం బొసంగెను. తద్వ త్పౌరు లా యన్నంబు గొని నిజధామంబులు జేరి మధ్యాహ్నస మయంబున ప్రచ్ఛన్నస్వరూపుండగు భిక్షుకుం బొడగాంచి “సమర్థా! వటసిద్ధనాగనాథునిచే నన్నంబు బరిగ్రహింపరేని యస్మత్కరంబులచే నేతదన్నంబు గ్రహింపుఁ” డని విన్నవించిన స్వీకరింపకుండిన వేగం బున నప్పౌరులు సిద్ధుని జేరంజని విశదం బొనర్చిరి. వటసిద్ధుండు జెచ్చెర వియచ్చరవందితుని సన్నుఖంబున కేతెంచి యడుగులపై నొసలు మోపి “యోగిజనధ్యేయా! మద్బాల్యంబున దర్శనం బొసంగితివి. తదాది వింశద్వత్సరంబులు గడచినను పునర్దర్శనం బనుగ్రహింపకుం డుట దగునే? జనకుండు మహదరణ్యంబున నిజతనూభవుని త్యజించిన చందంబున నిర్దయుండవై న న్నుపేక్షించుట కెట్లు దలంచితివో దయామయా! నీకీ కఠినంబేల గలిగెనో నన్నేల మఱచితివో భవద్దర్శ నార్థంబై చంద్రచకోరంబుకైవడి నిరీక్షించెడునుతుం బరీక్షింపఁదలం చుట పాడియగునే? నిఖిలేశా!” పాపభయనాశా! నిగమనుతపదములచి త్ప్రకాశా! సురేశా! యని నేత్రాంబువులచే పాదాంబుజంబులయ భిషేకం బొనర్పుచు రోదనంబు జేయుచుండ దయాంతరంగహృద యుండగు దత్తుండు నాగనాథుని చిత్తంబు దిలకించి నసహస్తంబు లచే సిద్ధుని మస్తకంబు లేవనెత్తి రారమ్మని రయంబున నేకాంతప్రదే శంబునకు దోడ్కొని జని మూర్ధంబు బునుకుచు నశ్రులు దుడిచి “వత్సా! జింతింపవల” దనుచు ఘనకరుణాకటాక్షంబుచే బ్రహ్మసాక్షా త్కారం బొనర్ప నిష్కళంక పరతత్వజ్ఞానపరిపూర్ణుండై రాహుముక్త ప్రభాకరునిభంగి సర్వమయత్వంబున బ్రకాశించుచుండ నయ్యపారచ

రిత్రుండగు దత్తాత్రేయుండు "నాగనాథా! నీవు యవిర్హోత్రనారాయణుండవై జగదుద్ధారనిమిత్తంబున విధివీర్యంబుచే సర్పగర్భంబున నుద్భవించిన దెఱింగి నిన్ను బాల్యంబున సిద్ధకళాపూర్ణుండవగునట్లనుగ్రహించితిని. తదుపరి భవత్స్వరూప ప్రకటంబునకై పునర్దర్శనం బొసంగవలయునని మచ్చిత్తంబున దలంచి యుచితసమయంబు నిరీక్షింపుచుంటి నయ్యది నేడు సంఘటించె" ననుచు హృదయాలింగనం బొసంగి శీఘ్రంబున వ్యాసమంత్రంబు జపియించి వటసిద్ధుని నిటలభాగంబున భస్మంబు దిద్ది కాశీక్షేత్రంబునకు గొనిపోయి కొంతవడి నచ్చో విశ్రమించి రయంబున బదరికాశ్రమంబు జేరంజని నిటలాక్షుని నిలయంబున కేగ నుమారమణుం డనసూయాతనయుని కుశలప్రశ్నంబులు విచారించి "ద్వితీయపుణ్యపురుషుం డేల నరుదెంచె" నని విచారించెను. దత్తుండు చంద్రచూడునితో "నియ్యకలంకుం డవిర్హోత్రనారాయణావతారుండగు నాగనాథుం" డని సవిస్తరంబుగ విన్నవింప నవ్విషగళుండు సంతుష్టుండై "నాగనాథుని నాథపంథంబున విరాజిల్ల నొనర్పవేల" నన నత్రిసూనుం డవశ్యం బని యచ్చో షణ్మాసంబులు నివసించి వటసిద్ధనాగనాథున కనేకమంత్రార్థరహస్యంబు లుపదేశించి సకలవిధవిద్యాభ్యాసంబు లొనర్పించి యాపిదప నాగాశ్వత్థవృక్షరాజనికటంబునకు దోడ్కొని జని సర్వదేవతాప్రత్యక్షంబులు గావించి పునర్బదరికాశ్రమంబున కేతెంచి శైలీసింగీత్యాది నాథపంథీదీక్షాచిహ్నంబు లొసంగి తపంబుకై నియమించెను. వటసిద్ధనాగనాథుండు ద్వాదశాబ్దంబులు ఘోరతరతపం బాచరించినంత నత్రినందనుండు తపస్సిద్ధికై ముల్లోకవేల్పుల నావాహనం బొనర్చి నాగనాథునకు వరంబు లిప్పించి నిఖలపుణ్యతీర్థంబులు సేవింపు మని యాజ్ఞాపించి తా గిరినారపర్వతంబు బ్రవేశించెను. నాగనాథుం డాచార్యోక్తప్రకారంబున ననేకతీర్థంబులు సంచరించుచు వడవాళగ్రామంబున కేగి నివసించియుండ తత్ప్రదేశంబున సిద్ధుని మాహాత్మ్యంబులు బ్రకటంబొచుండ నానాజనపద జనసమూహంబులు నాథుని దర్శనార్థం బరుదెంచి సవినయభక్తిభావంబులచే బ్రస్తుతుల్ జేయుచు "యోగద్రుమా! దయాఘనుండవై యిచ్చో నివసింపు" మని గొనియాడుచు కాలంబు గడుపుచుండి రిట్లొక కొన్నిదివసంబులు గడచి

నంత నొకానొకసమయంబున తాపసో త్తముండగుమత్స్యేంద్రనాథుం డచ్చోటి కరుదెంచి వటసిద్ధనాగనాథుని కీర్తనీయగుణజాలంబు లాలకించి దర్శనార్థంబై మఠద్వారసమీపంబున కేతెంచియుండ దౌవారికుం డంతర్గమనంబు నివారించి "పురుషముఖ్యా! నాగనాథున కెఱింగించి దోడ్కొని జనియెద" నన మత్స్యోదరసంభవుం డాగ్రహచిత్తుండై దనడెందంబున నౌరా! దేవద్వార సాధుద్వారంబులు సర్వకాలంబుల నఖిలజన నిరాటంకంబులుగాక నిరోధింపఁబడుట విపరీతంబుగాదే? కపటవేషంబులచే సత్పురుషవ్యవహారంబులు గనబఱచు డాంబికుండు గానోపును? లేకున్న నిట్టి దుశ్చరితంబు లేలసగుపడు? మత్ప్రతాపంబుచే శిక్షించి యజ్ఞానంబు బాపెద" నని నిశ్చయించి దౌవారికుని కపోలంబుపై తాడనం బొనర్ప తత్క్షణంబ సప్తశతశిష్యసంఘంబు కోపోద్దీపితమానసులై బరుగెత్తుచు నేతెంచి మత్స్యేంద్రయోగివర్యుని జుట్టుముట్టిన వసుపుత్రుండు స్పర్శాస్త్రయోగంబుచే తచ్ఛిష్యజనపాదంబులు బంధించి సర్వజనముఖతాడనం బొనర్ప వారత్యంతఖేదమానసులై మహాధ్వానంబుచే రోదనంబులు జేయుచుండిరి. నాగనాథుండు ధ్యానయోగసమాధినిష్ఠాగరిష్ఠుండై దేజరిల్లుచు నేతత్కోలాహలనినదం బాలకించి తపోభంగం బొనర్చిరని కోపావేశుండగుచు త్వరితంబున బహిర్ద్వారంబున కేతెంచి స్తంభమానశిష్యజనసముదయముఖతాడనం బొనర్చుచున్న సిద్ధుని బొడగాంచి నాథపంథీమహాపురుషుండని దలంచియు దనహృదయంబున నేతత్తాపసుండు శాంతశమదమాది గుణవర్జితుండై దుస్సహకఠినత్వంబుచే తాడనం బొనర్చుట నాథపంథంబునకు నింద్యంబు వాటిల్లదే? నీచాత్ముని దుష్ప్రవర్తనంబులు శిక్షించినగాని దొలంగనని దలంచి భస్మంబుగొని విభక్తాస్త్రంబుచే శిష్యులను విముక్తిబఱప వారతివేగంబున బరుగు లిడుచు నాగనాథుని పృష్ఠభాగంబు జేరుచుండ మత్స్యేంద్రుం డత్యుగ్రుండై పిష్టం బొనర్తునని పర్వతాస్త్రప్రయోగం బొనర్చిన నొకమహానగంబు భయంకరాకారంబుచే నేతెంచుచుండ నహిగర్భోద్భవుండు వజ్రాస్త్రంబుచే భూధరంబు బొడిసేసిన నమ్మత్స్యోదరజనితుండు వజ్రాస్త్రంబుపై గోపించి తద్వజ్రాస్త్రాధిపుండగు బిడౌజుని గీటడంపం దలంచి వాతాకర్షణ మహాదస్త్రంబుచే

నయ్యమరేశుని బుడమిం బడనైచి వజ్రకాళీవిద్యానైపుణ్యంబుచే నాగనాథప్రయోగకృత దివ్యాస్త్రస్వరూపంబు మాపిన కమలజవీర్య జాతుండు వాతప్రేరకాస్త్రంబుచే వాసవునిశ్రమ దూలంగించి తత్సహాయంబై జలదాస్త్రంబు బ్రయోగింప నమ్మఘవంతుం డిడుములం బాసి తత్క్షణంబ మేఘవాహనారూఢుండై యుభయనాథుల యద్భుత విక్రమంబునకు కడుభయంబొంది నిజస్థానంబు జేరంజనెను. కళాకుశలుండగు మత్స్యేంద్రుండు వాసవశక్తిన్నిర్మించి నాగనాథునిపై బ్రయోగింప నమ్మహాశక్తి నింగిముట్టి యశనిపాతంబులభంగి పెడబొబ్బలిడుచు పక్వపర్ణంబులక్రియ భూజంబులు వ్రాల కందుకంబులకై వడి భూధరంబులు డుల్ల గిరిగహ్వరంబుల ప్రతిధ్వనులు చెలరేగి దిశలునిండ దిగ్గజంబులు వడంక శేషుండు చలింప బృథ్వి గంపింప క్షణమాత్రంబున నజాండంబు గబళించునోయన నరుదెంచుచుండ వటసిద్ధనాగనాథుండతిసాహసుండై గురుప్రతాపమంత్రశక్తిచే సకలాస్త్రసర్వదేవతాస్తంభనంబొనర్చి యత్యంతదారుణంబగు కనకాద్రిని గల్పించి వాసవశక్తిపై బడవేసిననమ్మత్స్యేంద్రుం డమ్మహీధరభంగంబుకై వజ్రాస్త్రనిర్మాణంబు జేయందలంచి తన్మంత్రరాజంబును ధ్యానింప నయ్యస్త్రాధిదైవతనాగనాథునిచే బంధింపఁబడినకతంబున ప్రసన్నంబు గాకుండిన నాశ్చర్యంబుచే ననేకదివ్యాస్త్రమంత్రాధిదేవతలం బ్రార్థించిన నయ్యవి సిద్ధింపకున్న ఖేదమానసుండై నలుదిశలు నిరీక్షింపుచుండు సమయంబున వటసిద్ధనాగనాథుండు సర్పాస్త్రంబు బ్రయోగింప మత్స్యేంద్రుండు గారుడాస్త్రంబు జపియించి విఫలమనోరథుండై యత్నంబు గానకున్నంత నప్పన్నగాస్త్రప్రయోగమహిమాతిశయంబుచే యోగద్రుముండగుమత్స్యేంద్రుండనేకనాగకులదంశుండై తద్విషజన్యతాపంబుచే మహింబడి విలపించుచు నూర్ధ్వముఖుండై దయాసముద్రుండగు దత్తాత్రేయుని పదకంజంబులు దనమనంబున గుదురుపఱచి "దాసజనపోషా! దోషహరగుణవిశేషా! సర్వసాక్షిస్వరూపుండవై నన్నేల నిరీక్షింపవో! దత్తా! దిగంబరా! ప్రత్యక్షహరిహరా! మత్ప్రాణంబులు హరియింపుచుండ నీకేల లక్ష్యంబు లేదయ్యెనో? నాపాలిదైవమా! నాపైనకోపమా?. ననుగడతేర్చ ననుమానమా" యని స్తోత్రంబులు జేయుచుండ వటసిద్ధుండు శ్రీగురుదత్తాత్రేయుని సామధ్యానధ్వానం బాలకించి మద్గురునామసం

కీర్తనం బేలనొనర్చునో విచారించి గనుంగొనవలయునని యూహించి నికటంబు జేరి "పురుషఘనా! యుష్మద్గురుసమర్థుని నామధేయం బెయ్యదియో దెలుపు" మని స్నేహభావంబుచే విచారింప మత్స్యేంద్రుండు నే శ్రీగురుదత్తాత్రేయప్రథమశిష్యుండ ననియు నాయనంతరం బయ్యకలంకునకు జాలంధర భర్తరీనాథాదులు శిష్యులై చిరంజీవిత్వంబుచే విరాజిల్లుచుండి" రన నాగనాథుండు ఖేదమానసుండై తక్షణంబున తార్క్ష్యుని బంధవిముక్తి గొనర్చి యాహ్వానం బొనర్ప నవ్వైనతేయుండు రయంబున నేతెంచె నంత నయ్యురగంబులు బహుభయంబుచే నదృశ్యంబులై దమతమనిజనివాసంబులు జేరంజనెను. పిదప యానాగాంతకుం డుభయనాథులకు వందనంబు లాచరించి స్వస్థానంబు బ్రవేశించెను. వటసిద్ధుండు దనచిత్తంబున జ్యేష్ఠభ్రాతృండు పితృసముండని నిశ్చయించి మత్స్యేంద్రయోగివర్యుని పదంబులకు వందనంబు లాచరించి యత్యంతభక్తియుక్తుండై మఠాంతర్గృహంబునకు దోడ్కొని జని క్షమాపణంబు గోరుచు బహుగౌరవంబుచే నొక మాసంబు గడుప నొకానొకదివసంబున మత్స్యేంద్రుండు నాగనాథునితో "తాపసశ్రేష్ఠా! మఠద్వారంబున దౌవారికుల నేల నేర్పఱచితివి? దర్శనోత్సుకుల నిర్బంధింపఁనగునే! యస్మదన్యోన్య కలహకారణం బెయ్యదిగాక నితరంబు గలదే" యన నాగనాథసిద్ధుండు "వసుపుత్రా! నే నహర్నిశంబులు ధ్యానయోగసంధానంబుచే నేకాంతంబున నివసించి యుండుదు నన్యజనాగతంబుచే మత్తపోభంగంబునకు మూలంబగునని ద్వారరక్షకులు నియమింపఁబడి" రన మత్స్యగర్భోద్భవుండు "పన్నగోద్భవా! జగదుద్ధారనిమిత్తం బవతరించి భవలతాబద్ధంబగు పురుషాళిం గడ తేర్చకుండుట విరుద్ధంబుగాదే? భక్తిభావంబులచే నేతెంచు ముముక్షుల యభీష్టంబు లొనగూర్చుట ముఖ్యధర్మంబుగాన నీకమీఁద దౌవారికుల దొలంగింపు" మని వాక్రుచ్చి తీర్థయాత్రోద్దేశంబుచే మత్స్యేంద్రుండు పనివినియెను. తదుపరి నాగనాథుండు ద్వారపాలకుల దొలంగించి దర్శనోత్సుకులు నిరాటంకంబుగ బ్రవేశింపవచ్చునని యాజ్ఞాపింప ప్రతిదినం బనేకజనసంఘంబు లేతెంచి సవినయభక్తివిశేషంబులచే సిద్ధుని సేవింపుచు మహోత్సాహంబున కాలంబు గడుపుచుండ నొకానొకదివసంబున ప్రియశి

ష్యుండగు చాంగుణుని కాంతామణి తన్మఠప్రదేశంబున పంచత్వంబు నొందెను. వటసిద్ధనాగనాథుండు నిజశిష్యుని పరితాపంబు మాన్పం దలంచి యమ్ముద్దియం బ్రతికింప నీయద్భుతకృత్యంబు సర్వలోకవిదితంబై తదాది వడవాళగ్రామంబున మృతిజెందిన స్త్రీపురుషకళేబరంబులు మఠంబున బాఱవైచుచుండిన నన్నాథుండు దయాంతరంగహృదయుండై నిర్జీవకాయంబుల సజీవంబు లొనర్పుచు జగద్విఖ్యాతి గాంచుచుండ కృతాంతుండు భీతిల్లి సత్యలోకంబునకేగి పద్మగర్భోద్భవునితో సహిగర్భోద్భవుని యద్భుతచరిత్రంబు విన్నవించిన చతురాననుండు తత్క్షణంబున వడవాళగ్రామంబు బ్రవేశించి యనేకవిధంబుల నాగనాథునకు బోధించి తత్కార్యంబు నిరోధించి స్వస్థానంబు జేరంజనెను. తదనంతరంబ వటసిద్ధనాగనాథుండు చాంగులసిద్ధ ధర్మసిద్ధ దేవసిద్ధ భానుసిద్ధ భోజనసిద్ధ సుందరసిద్ధ సచ్ఛిష్యషట్కంబునకు సకలమంత్రార్థరహస్యంబు లుపదేశించి నాగాశ్వత్థ మహీరుహాశ్రిత నిఖిలదేవతాప్రసన్నంబు గావించి శాబరీవిద్యాకవిత్వరచనావివేకం బనుగ్రహింప నయ్యుచులాత్ములగు నూతనసిద్ధులు నిఖిలజనదుఃఖకారకులగు భూత ప్రేత పిశాచ సర్పవిష వృశ్చికవిష ప్రముఖాఖిల బాధ నివారకంబులగు యసంఖ్యాకమంత్రరాజంబులు గల్పించి ప్రకాశించుచుండిరి.

ఇతి భక్తిసార నవనాథగ్రంథరాజంబున వటసిద్ధ నాగనాథచరిత్రంబు సప్తత్రింశాధ్యాయము సంపూర్ణము.

---

## అష్టత్రింశాధ్యాయము.

---

### చర్పటనాథుని జన్మచరిత్రము.

తొల్లి నిటలాక్ష దాక్షాయణీ వివాహమహోత్సవంబునకై బ్రహ్మేంద్రాగ్నియమవరుణకుబేరాది త్రయస్త్రింశత్కోటి సురలోకంబు దక్షమందిరంబు జేరంజని బహువిధరత్నఖచిత స్తంభపరిశోభిత కల్యాణమంటపంబున స్వర్ణమయ దివ్యసింహాసనంబులపై యలంకరించి

తన్మధ్యమండపిక ప్రదేశంబున మనోజ్ఞతరవేదికాసీనయగు భవసహిత
భవానిం బొడగాంచి కమలజుండు దనమనంబున భళిర యిక్కాంతా
లోకచూడామణి త్రిభువనమోహనాకారవిగ్రహం బనందగి రమణీ
యోజ్వలరూపలావణ్య కళావిభవంబులచే నతనుని సామ్రాజ్య
లక్ష్మియై నిజలీలావినోదంబున హరుం జయించజాలునని చింతింపుచు
భావభవభల్లభగ్నహృదయుండై జలించినంత నింద్రియంబు గళితంబై
మహిం బడియుండ నత్తామరచూలి సిగ్గుగొని దనపాదాంగుష్ఠంబుచే
నలుపుచుండ తత్పాదసంపుటీయోగంబున నవ్వీర్యభాగం బఱువది
వేల రేణువులై మహాతేజంబున బ్రకాశింప తత్క్షణంబ వాలఖిల్యాది
యఱువదివేల మహాఋషు లుదయించిరి. తదుపరి యవ్వీర్యభాగశేషం
బచ్చోటి కసువునం గలసియుండ నొకపరిచారిక లాజాహోమభస్మ
సహితంబుగ నక్కసువుం గొని సురనదీప్రవాహంబున బడవైవ
నయ్యమరవనితా వక్షోజమిళిత ఘనసార సుగంధ పరిమళ పూరిత
మహోత్తుంగ తరంగయుత ఘనప్రవాహంబుచే నవ్వీర్యం బొకప్రదే
శంబున కుశమూలం బాశ్రయించి బహుకాలంబు విరాజిల్లుచుండె
నం దొకానొక సమయంబున శశిజాయాఋతురక్తంబు పతనంబైన
కతంబున నయ్యది యండజాదులకై వడి యభివృద్ధి జెందుచుండుతఱి
పిప్పలాయననారాయణుండు బ్రవేశించి యర్భకుండై రోదనంబు
జేయునెడ పవిత్రచరిత్రుండగు సత్యశ్రవనామవిప్రోత్తముండు దర్భలకై
యచ్చోటి కరుదెంచి ముజ్జగంబుల వెలుంగఁజేయు మనోహర శరీర
కాంతిచే బాలార్కుం డనజాలిన డింభకుని వీక్షించి దనహృదయం
బున నిబ్బాలుండు మూర్తిమంతుండగు వసంతుండో రోహిణీధవుం
డగు కళాధరుండో లేక నీయసదృశ తేజఃపుంజపిండం బే యప్సరాంగ
నామణి యిందువైచెనో జలదేవతయో స్థలదేవతయో గాక వనదేవ
తయో యని వితర్కింపుచు నియ్యర్భకుం గొనిపోయెద నేని నన్నే దేవ
తయో బాధించునని దలంచియు నత్యంతమోహావేశుండై సమీపంబు
జేరి హస్తంబులచే స్పృశించుసమయంబున వేల్పుమూకలొక్కుమ్మడి
యుప్పగవీథి నిల్చి యప్పిప్పలాయన నారాయణునకు కరంబులెత్తి నమ
స్కారంబు లొనర్చి విరులు గుఱిపించినంత నవ్విప్రోత్తముండు పుష్పా
చ్ఛాదిత శాబకుని త్యజించి చకితుండై యిది యొకపిశాచంబని యూ

హించి కడువేగంబున బరుగులిడుచుండ నత్తెఱగంట్లు విచ్చలవిడి బరు గెత్తుచున్న పారుంగని పరిహసించుచు "భూసురోత్తమా! భూసురోత్తమా! నిలునిలు" మని శబ్దంబు వినవచ్చినంత నవ్విప్రుం డా నినదం బాలకించి యపరిమితభయగ్రస్తుండై బుడమింబడి పిశాచంబుచే గ్రసింపఁబడియెదనని యాశలుడిగియు పునరుక్తితుండై దృగ్గోచరంబు గాని సురాళివాక్యంబుల దలంచి నేనేల నిందే తెంచితి నే తెంచితినేని మందమతిచే బాలునికడ కేల నరిగితి నిక నాకేటిబ్రతుకు గలదని కృత నిశ్చయుండై యనుచుండ నిర్జరానీకంబు నారదు న్వీలోకించి "తపోఘనా! రయంబున భూదేవుం జేరంజని మనోభయం బెడబాపి బాలుం బోషింప నొడంబఱచు" మని వీడ్కొలుప నయ్యమరమునిముఖ్యుం డొకమహీసురుని వేషంబుచే వేణుగానలోలుని గుణగాయనం బొన రృచు మార్గమధ్యంబున నిల్చి కడువడి నటమరించుచు నిట్టూర్పు లిడు చున్న బ్రాహ్మణుం బొడగాంచి "విప్రశ్రేష్ఠా! కంపాయమాన శరీరుం డవై పలాయనం బొనర్చుట కేమిహేతు" వని విచారింప నతండు "అయ్యా! దుర్భాగ్యుండనై దర్భలకై నేనీ తీరంబున కరుదెంచి యొక్కచో రోదనంబు జేయుచున్న శిశువుంగాంచి పిశాచంబని శంకిం పక నికటంబున కేగ నా నిర్మానుష ప్రదేశంబున కుసుమంబులు దనంతట తా పైబడుటచే నయ్యవి భూతకృత్యంబులని యోచించి బహుభయం బున పలాయనంబు జేయుచుండ నయ్యగోచరపిశాచంబులు మత్ప్రా ణంబులు హరించుటకై నిలునిలు మని యుచ్చరించుచు నావెనువెంట నంటి యే తెంచుచున్నవి. నే నేమిజేయుదు" నన నమ్మునిపుంగవుం డప్పుడమివేల్పు కేలుగొని యొకతరుచ్ఛాయంజని భయంబు బాపు టకై "పురుషవర్యా! దర్భలకై నీ వరుదెంచి బాలుని వీక్షింపుచుండు తఱి యుష్మత్పృష్ఠభాగంబున నే నిను విలోకించుచుండి పిదప నూర్ధ్వ ముఖుండనై నభంబు గనుంగొనునంత నవ్విబుధసంఘంబు నీనామంబు విచారించుటకై నీపై పుష్పవర్షంబు గుఱిపించిరి నీవింతటికై బరు గెత్తనేల? నీనామం బెద్ది" యని విచారింప నయ్యనఘాత్ముండు "మ న్నామంబు సత్యశ్రవుం డనియెద" రని ప్రత్యుత్తరం బొసంగెను. నలువపట్టి "సత్యశ్రవా! భూతంబని భ్రమజెందనేల? నయ్యర్భకుండు పిప్పలాయన నారాయణావతారుండు. జగదుద్ధారనిమిత్తంబై కమలో

ద్భవుని వీర్యంబుచే నుదయించెను. తత్కాలంబున సురలు సంతోషించి కుసుమంబులు వైచుచు డింభకుం బోషింపు మని యఱచుచుండ నే నా దేవసంభాషణంబులు వింటిని గాన నీమనోగతభయం బుడుగుము. ప్రతాపముఖ్యుండగు శాబకుని భవత్సదనంబునకు గొనిపోయి నిస్సంశయుండవై సంరక్షింపుము నీ కనంతసుఖంబులు వాటిల్లును. మద్వచనంబులు సత్యంబని దలంపు" మన సత్యశ్రవుండు దనచిత్తంబున నే నెక్కడ సురలోకం బెక్కడ నపారచరిత్రుండగు డింభకుం డెక్కడ నని యోచింపుచు నభంబు నిరీక్షింపుచుండ నవ్విధిపుత్రుని కృపాకటాక్షంబుచే నయ్యమరబృందంబు దృగ్గోచరం బౌచున్నంత విప్రుండు సంతసించి ప్రచ్ఛన్నబ్రాహ్మణునితో "నయ్యా! భవత్కరకమలంబులచే శిశువు న్నాకొసంగెద వేని పరిగ్రహించెద" నన నారదుం డవశ్యంబని భాగీరథీతీరంబునకు సత్యశ్రవసమేతంబుగ నరుదెంచి విచిత్రతరపుష్పాచ్ఛాదిత నవమోహనాకారబాలుని దనకరంబులచే సత్యశ్రవున కొసంగి "యియ్యపారతేజోమయ విగ్రహుండగు శాబకునకు చర్పటుండని నామకరణం బొనర్పుమని విబుధాళి యనుజ్ఞ గలదు గావున నప్పగిది యాచరింపు" మని వాక్రుచ్చి నిజస్థానంబున కేగెను. శీలగుణసంపన్నుండగు సత్యశ్రవుండు పరమానందభరితుండై నిజనివాసం బగు పునీతగ్రామంబున కబ్బాలుం గొనిపోయి శీఘ్రంబున గృహంబు బ్రవేశించి పవిత్రచరిత్రయగు చంద్రానామవల్లభిం బొడగాంచి "ప్రియే! నేఁడు దర్భలకై హరిపాదోద్భవనదీతటంబున కేగ నచ్చో దివౌకససమూహం బాకసంబున బ్రసన్నులై బాలార్కభాసమానుం డగు యిబ్బాలుం బోషింపుమని యొసంగిరి గావున నేతచ్ఛాబకునికై యమరోత్తములదర్శనంబు ఘటియించె" ననుచు గతవృత్తాంతంబు దేటపఱిచి యీశరవణోద్భవునకు చర్పటుండని నామం బిడుమని ముదంబుచే సుదతీమణి కొసంగ నయ్యువిద యపత్యంబులేని కతంబున నిత్యంబు గుందుచుండి సత్యశ్రవానీతపుత్రుని పరమాహ్లాదంబుచే పరిగ్రహించి మర్కటంబుకై శోధింపుచుండ మరుత్కుమారుండు లభించినవిధంబు దరిద్రుండు ద్రవ్యంబుకై బ్రయత్నించ ధనదుండు ఘటియించినచందంబున దర్భలకై జనుచుండ నర్భకుండు బ్రాప్తించెనని యబ్బురంబున పెల్లుబ్బి యబ్బాలున కుష్ణోదకంబులచే

స్నానంబు లాడించి డోలికారోహణం బొనర్చి తోడిచేడియలతో
చర్పటుండని యబ్బుడుతని నామకరణంబు గావించి మితిలేని సంతసం
బుచే బోషింపుచు కాలంబు గడుపుచుండ క్రమాక్రమంబున చర్పటుం
డభివృద్ధిజెంది సప్తవర్షంబుల బాలుండై శోభిల్లుచుండె. సత్యశ్రవుండు
చర్పటున కుపనయనాది సంస్కారంబులు గావించి వేదశాస్త్రాభ్యా
సంబు లొనర్పుచుండ నొకానొకదివసంబున బ్రహ్మమానసపుత్త్రుం
డగు నారదుం డనేకలోకంబులు గ్రుమ్మరుచు పునీతగ్రామసమీపం
బున కేతెంచి చర్పటుని స్మృతిదలంచి యొకభూసురునివేషంబుచే
సత్యశ్రవుని సదనంబుజేరి ద్వాదశాబ్దంబుల బాలుండై దేజరిల్లుచున్న
విధివీర్యోద్భవుండగు చర్పటుని బుద్ధినై పుణ్యంబు భ్రాతృమోహంబుచే
బొడగాంచి తక్షణంబ బదరికాశ్రమంబు బ్రవేశించియాత్రేయ మత్స్యేం
ద్రులం గనుంగొని బహుమోదంబుచే నన్యోన్య హృదయాలింగనంబు
లొనర్చుకొని హారమందిరంబున మృడసహితంబుగ చింతామణీ సుర
భూజ సురధేను స్పర్శవేదు లేకప్రదేశంబున నివసించినకై వడి యుప
వేశించి సుఖగోష్ఠులు గడుపుచుండి ప్రసంగానుసారంబున నారదుండు
చర్పటునివృత్తాంతంబు వెల్లడియొనర్ప పంచవదనుండు త్రిముఖునితో
"సర్వతంత్రస్వతంత్రులగు నవనారాయణావతారఘనులను కీర్తనీయ
నాథపంథంబున విరాజిల్ల నొనర్పం దలంచి పిప్పలాయన నారాయణావ
తారుండగు చర్పటుని యుపేక్షించుట కారణంబేమి" యన నత్రిసూ
నుండు సర్వేశ్వరునితో "పశ్చాత్తాపంబులేనినై రాగ్యంబు నిల్చునే?
వైరాగ్యంబులేమి నిశ్చలనిర్గుణపరబ్రహ్మస్వరూపుండై బ్రకాశించునే?
ముముక్షునకనుగ్రహంబొసంగుట ముఖ్యధర్మం" బన నయ్యమరముని
శేఖరుం "డనసూయానందనునివాక్యంబులు నిక్కంబు నిక్కం"బనుచు
దత్తునితో "దయాఘనా! యుష్మత్కృపాకటాక్షంబు గలదేని చర్పటు
నిహృదయంబున వైరాగ్యంబు గల్పింతు"నని యనుజ్ఞగొని రయంబున
పునీతగ్రామంబు బ్రవేశించి యొకవిద్యార్థిస్వరూపంబుచే సత్యశ్రవుని
మందిరంబున కేగి యయ్యుత్తమశ్లోకునితో "పుణ్యపురుషా! నేనొక
కులుంబనామ విద్యార్థుండను. నాయం దనుగ్రహించి వేదాభ్యాసం
బొనర్పు" మని విచారింప నవ్విప్రోత్తముం డంగీకరించి నిజతనూభ
వుని సహితంబుగ వేదశాస్త్రంబు లుపదేశించుచుండె నిట్లొక కొన్ని

దివసంబులు గడుపుచుండ నొకానొకసమయంబున నొకగృహస్థుండు దనభవనంబున గర్భాధానకార్యంబు గలదని పౌరోహితుండగు సత్యశ్రవుని గృహంబున కరుదెంచి "మద్గృహంబునకు దయజేయు" మన నవ్విప్రోత్తముండు చర్పట కులుంబులను జనుమని వీడ్కొలుప నయ్యిర్వురు తత్క్షణంబ గృహస్థుని సదనంబుజేరి విధ్యుక్తయాజ్ఞికంబులు దీర్ప యజమానుండు "దక్షిణలం బరిగ్రహింపు" మను సమయంబున నారదుండు దనమనంబున నే నెన్నియుక్తులు బన్నినను చర్పటుండు శాంతశమదమాది గుణంబులచే ప్రపంచకలహంబు లెఱుంగక మాయామయసంసారనిస్పృహత్వంబు చిత్తంబున దలంపడయ్యె నిది యొకసమయంబు ఘటియించె నని యూహించి "చర్పటా! యజమానుం డొసంగు దక్షిణలు మనమేల బరిగ్రహింపవలయు. విద్యాస్థులమై న్యూనాధిక్యంబు లెఱుంగక గ్రహించుట యోగ్యంబగునే సత్యశ్రవుం డేతెంచి దనయిష్టానుసారంబున గొనిపోవు" నన చర్పటుండు "మనమేల రిక్తహస్తంబుల వెడలవలయును. బహువిధోపాయంబులచే విశేషద్రవ్యంబు సాధించి జనకున కర్పించెదనేని సంతుష్టుండు గాఁడె" యని యుత్తరం బొసంగ నారదుండు "లాభనష్టంబుల కీలెఱుంగని విద్యార్థులమై పెక్కుప్రసంగంబులు మనకేల" నని వాదించుతేటి యజమానుండు "కించిద్ద్రవ్యంబు హస్తకమలంబున గొని బరిగ్రహింపు" మని చర్పటున కొసంగినంత నవ్విధివీర్యజాతుండు నారదుని సంవాదతాపపూరితహృదయుండై ద్రవ్యలేశంబు బొడగాంచి యజమానునితో "పురుషముఖ్యా! కార్యాకార్య విచక్షణుండవై యాచకుల యోగ్యత్వంబు బరిశీలించి యొసంగవలెంగాక నిప్పగిది దగునే" యన యజమానుండు "చర్పటా! యాచకులు సమర్థులైనం దాతల యధికారానుసారంబుగ వృత్తింబొందుట సుప్రసిద్ధంబనదగదె" యని ప్రత్యుత్తరం బొసంగ సత్యశ్రవసుతుండు కోపించి "యధికారంబులేని కార్యంబులేల నొసర్పవలయు" నని కఠినోక్తులచే నన్యోన్యకలహసంభాషణంబులు జరుపుచుండుట విలోకించి కలుంబనాముండు కడువేగంబున సత్యశ్రవుని సన్నిధి కేతెంచి "గురువర్యా! చర్పటుండు వృథాకలహంబుచే యజమానుని మనస్తాపంబు గలిగించె 'నసంతుష్టా ద్విజానష్టా' యను ప్రమాణంబుండ మన మత్యంతదురాశాపీడితులమై

దుర్భాషలాడుట విపరీతంబుగాదే? దాతలమనస్సంతోషపఱచి ద్రవ్యం బార్జించుట యుచితం బౌగాక. నిష్ప్రయోజకకఠినోక్తులచే నష్టంబు వాటిల్లదే? క్రమక్రమంబున చర్పటుని కలహం బతిశయించుట బొడగాంచి యిందేతెంచితి" నన సత్యశ్రవుం డాగ్రహమానసుండై తత్క్షణంబ యజమానుని సదనంబు జేరి దౌర్జన్యప్రసంగయుత వాక్కలహంబు నిజచక్షువులచే బరీక్షించి తీక్ష్ణతరకోపావేశుండై కరపుటంబున చర్పటుని కపోలతాడనం బొనర్చెను. హిరణ్యగర్భ వీర్యోద్భవుండగు చర్పటునకు కలహక్రోధానలంబున కనిలంబు దోడ్పడినచందంబున ముఖతాడనంబు ఘటియింప పాదాహతభుజంగంబుకై వడి రౌద్రుండై యచ్చోటుబాసి పురబాహ్యదుర్గాలయంబుజేరి ఖేదమానసంబున నుపవిష్టుం డయ్యెను. కలహాశనుండు విద్యార్థివేషంబు త్యజించి యొక వేదవిద్యాబ్రాహ్మణవేషంబుచే దుర్గాలయంబు బ్రవేశించి యద్దేవిదర్శనం బాచరించి చర్పటునిచెంగట నుపవేశించి "యయ్యా! మీ రేకతంబున విషాదంబుచే నిందుంటి" రని విచారింప చర్పటుండుతత్కారణంబు సవిస్తరంబుగ వెల్లడియొనర్చెను. వేషధరనారదుండు "విప్రసుతా! భవజ్జనకుం డెట్టి విచారహీనుండో? ధర్మసూక్ష్మంబు లెఱుంగలేడో? పుత్రాభిమానిగాని పితృండు ప్రత్యక్షశత్రుం డనగూడదే? పితృచరణపాదుకలు పుత్త్రుపాదంబులకు సమంబయ్యెనేని మిత్రభావంబున మెలంగవలయు ననుట లోకప్రసిద్ధంబు గలదు. తద్విరుద్ధులు ధర్మభ్రష్టు లనబడరో సద్ధర్మవిరుద్ధుండగు జనకుండు వర్జనీయుండుగాక వందనీయుం డెట్లగును? దుఃఖదాయక సంసారసుఖంబులు స్థిరంబులగునే? విచక్షణుండవై కాననంబునకేగి ముల్లోకపూజ్యంబగు వైరాగ్యంబు బూను" మన చర్పటుండు పితృకృత్యంబు లత్యంతనింద్యంబులని యుగ్రుండై "బ్రాహ్మణోత్తమా! నాయం దనుగ్రహించి మధ్యవనంబునకేగి మత్సఖుండగుకులుంబనామవిద్యార్థిని గోప్యంబున దోడితెచ్చెదవేని మే మిరువుర మితరదేశంబులజేరి సంపూర్ణవిద్యాభ్యాసం బొనర్చెద" మన నారదుం డవశ్యం బని తత్ప్రదేశంబు బాసి కులుంబవేషధారకుండై త్వరితంబుగ దేవాలయంబు బ్రవేశించి విషణ్ణుండగు చర్పటు నవ్వలోకించి "సఖా! సత్యశ్రవుం డున్మత్తుండు జ్ఞానశూన్యుండు ధర్మదూరుండు నే నా విచారహీనుండగు భూసురునిసేవింపలేను. వేరొండు ప్రదే

శంబున నుత్తమోత్తముండగు యుపాధ్యాయునిచెంత నివసించి శాస్త్రాభ్యాసం బొనర్చెదగాక నిందుండ లే” నని యప్పరమేష్ఠిసుత సంకల్ప సహాయ సంభాషణంబు లాడుచుండ చర్పటుండు సంతసంబుచే యథార్థంబనుచు కులంబసహితుండై ప్రయాణంబొనర్చి యొకకొన్నిక్రోశంబు లధిగమింప కులంబుండు “చర్పటా! కాశీక్షేత్రంబున నఖండపాండిత్య విశేషజ్ఞుల సమూహంబుగలదు. తన్మార్గమధ్యంబున బదరికేశ్వరుని దర్శనంబు గొని జనియెదమేని శుభంబు వాటిల్లు” నని నుడువుచు నచ్చటచ్చట భిక్షాన్నంబుచే దృప్తులగుచు బదరికాశ్రమంబు జేరంజని కేదారీశ్వరుని దర్శనంబు గొని రంత నయ్యాత్రేయమత్స్యేంద్రు లొకముని వేషంబులచే దృగ్గోచరం బగుచుండ కులంబుండు శీఘ్రంబున నమ్మహామహుల చరణకంజంబులకు నమస్కరింప తద్వచ్చర్పటుండు నందనంబు లాచరించి ‘కులంబా! వందనీయ యతిపుంగవు లెవ్వ’ రనివిచారించెను. కులంబుండు “చర్పటా! నిఖిలలోక జేగీయమాన గుణకదంబులగు దత్తాత్రేయమత్స్యేంద్రు లీ యోగిముఖ్యులనియు నేను నారదుండను భవత్కారణంబున కులంబవేషధారకుండనైతి” నని శ్రుతపఱచుచుండ చర్పటుండు భయభక్తియుక్తుండై కులంబుని పాదంబుల వ్రాలి “నీ నిజస్వరూపంబు బ్రకటింపు”మని వేఁడుచుండ నారదుండు “పురుషవర్యా! గురుమంత్రోపదేశలబ్ధుండుగాని మనుజునకు దివ్యస్వరూపంబు లెట్లు గోచరంబులగు? సర్వసాక్షిస్వరూపుండ వయ్యెదవేని యస్మత్స్వరూపసందర్శనంబు లభియించు” నన చర్పటుండు పశ్చాత్తాపహృదయుండై “కరుణామయా! నే నీ ప్రదేశంబున నే మహాపురుషుని వెదకుదును. నాకెట్లు గురుప్రసాదంబు లభియించును. న న్నుద్ధరించుఘనులు నీకంటె ముఖ్యులెవరుగలరు? యుష్మదనుగ్రహంబుచే నను గడతేర్చు” మని వేఁడుచుండ నారదుండు “చర్పటా! త్రిదశాద్యాశ్రితచరణసరసీరుహుండగు దత్తాత్రేయునాశ్రయింపు” మను నంత నత్రిసూనుండు ఘనకరుణాన్వితుండై చర్పటుని మస్తకంబున నభయహస్తంబు మోపి దుర్భరప్రపంచమాయాభ్రాంతచిత్తమోహంబుబాపి “వత్సా! త్వక్చక్షుశ్శ్రోత్రజిహ్వాఘ్రాణవాక్పాదాదిదశేంద్రియంబులు పృథివ్యప్తేజోవాయ్వాకాశగుణజన్యంబులై స్థూలరూపంబున విలసిల్లి శబ్దస్పర్శరూపరసగంధచలనవలనాది గుణంబులుగలిగి

నిరుపాధిక పరబ్రహ్మస్వరూపంబగు నాత్మకు నుపాధియై మనోబుద్ధి చిత్తాహంకార వికారంబులచే తుచ్ఛతరసంసారసుఖంబుల నుపేక్షించునుగాక నెంచిచూడ నిర్మలపరతత్త్వజ్ఞానంబునకుసంబంధంబులగు నే" యనుచు తత్త్వోపదేశంబుచే మంత్రార్థరహస్యంబులు దేటదెల్లంబుగ బోధించిన పితామహతనూభవుండగు చర్పటుండు నిరస్తమోహుండై సర్వభూతసాక్షిస్వరూపంబుచే నభోమణిచందంబున బ్రకాశించుచు నత్రిసుత మత్స్యేంద్ర నారద నిజస్వరూపులం బొడగాంచి పాదంబుల వ్రాలి బొగడుచుండ మృడుండు బ్రత్యక్షంబై విలోకింపుచుండెను. తత్క్షణంబ చర్పటుం డా శంకరుని చరణాంభోరుహంబులకు బ్రణమిల్లిన హరుండు కరుణాంతరంగహృదయుండై దనకరంబులచే హిరణ్యగర్భాత్మజుని. గౌగిటంజేర్చి యాత్రేయునితో "నిఖిలమంత్ర తంత్రప్రముఖాఖిల ప్రయోగోపసంహారాది విద్యలీ చర్పటునకొసంగి వినులంబగు నాథపంథీయోగంబున విరాజిల్లం జేయు" మన దత్తుండవశ్యం బని యనేకశస్త్రాస్త్రమంత్రప్రయోగోపసంహారరహస్యార్థంబులు బోధించి నాగాశ్వత్థవృక్షాశ్రిత సర్వదేవతాప్రసన్నంబు లొనర్పించి తదుపరి ద్వాదశాబ్దంబులు ఘోరతరతపంబు జేయించి తపాంతంబున సకలమంత్రాధిదేవతలచే తపస్సిద్ధికై వరంబు లిప్పించి ప్రపంచోపకారనిమిత్తంబై శాబరీవిద్యాకవిత్వరచనాసమర్థత్వం బనుగ్రహింప నయ్యనఘాత్ముండు నవకోటిసప్తలక్షమంత్రరాజంబులు నిర్మించి శ్రీగురుదత్తాత్రేయానుమతిచే తీర్థయాత్రాపరతంత్రుండై నిజేచ్ఛం జనుచు రామేశ్వర గోకర్ణ మహాబళేశ్వర జగన్నాథ హరిహరేశ్వర కాశి క్షేత్రంబులు సేవించుచు నచ్చట ననేకజనసముదయంబులకు మోక్షప్రదర్శకమార్గంబులు దెలుపుచునందు వైరాగ్యపూర్ణులగు రాఘవసిద్ధ బాలసిద్ధ గోకాటసిద్ధ జాంబుసిద్ధ నైమిత్యకసిద్ధ సారేంద్రకసిద్ధ హంసప్రసిద్ధ ద్వారభైరవసిద్ధ రణసిద్ధులకు శాబరీవిద్యానైపుణ్యంబులు దేటబఱచె నిప్పగిదినాథోత్తములు దమతమ తపఃప్రతాపంబులచే బుద్ధిదక్షులగుశిష్యుల కనేక మంత్రార్థంబులు బోధించి జగద్విఖ్యాతి నొనర్చిరి. ధైర్యధుర్యుండగు రేవణనాథుండు జోగిసిద్ధ సారంగసిద్ధ నిజానందసిద్ధ నైనసిద్ధ నిరంజనసిద్ధ యదుప్రసిద్ధ గైబసిద్ధ క్షుద్రసిద్ధ కాన్తసిద్ధులకు మంత్రార్థంబు లుపదేశించెను. రవిపుత్రుండగు భర్తరీనాథుండు ఉరేశ

సిద్ధ సరేశసిద్ధ ధురేశసిద్ధ కుహరసిద్ధ కేశమర్దనసిద్ధ శుద్ధకపూరసిద్ధ భేటేంద్రసిద్ధ కటభ్రావసిద్ధ సాబరసిద్ధులకు సకలవిద్యాభ్యాసంబు లొనర్చెను. సచ్చరిత్రుండగు మత్స్యేంద్రనాథుండు దక్షేంద్రసిద్ధ అనిర్వారణసిద్ధ అపరోక్షసిద్ధ కాముకార్ణవసిద్ధ సహనసిద్ధ దక్షులాయనసిద్ధ దేవసిద్ధ పాక్షేంద్రసిద్ధ సాక్షసిద్ధులం బ్రకాశింప నొనర్చెను. సకలకళాదక్షుండగు గోరక్షనాథుండు నిర్ణయసిద్ధ ఆర్ణవసిద్ధ హరదంతసిద్ధ భోమాసిద్ధ నహుషసిద్ధ కృష్ణాసిద్ధ పలాయనసిద్ధ హేమాసిద్ధ క్షేత్రాంతసిద్ధ రత్నాగరసిద్ధుల కపారరహస్యార్థంబు లనుగ్రహించెను. వినుతగుణజాలుండగు జాలంధరనాథుండు వినయసిద్ధ భాస్కరసిద్ధ దత్తసిద్ధ ధాతసిద్ధ పావనసిద్ధ భార్గవసిద్ధ సుతూర్ణవసిద్ధ యథార్థసిద్ధ కవిటసిద్ధ శర్వాసిద్ధ వదమసిద్ధ ప్రోక్షితసిద్ధుల నత్యంతజ్ఞానపూర్ణుల నొనర్చెను. మానిజనశేఖరుండగు కానీఫనాథుండు శాలుకసిద్ధ వాలుకసిద్ధ శరభసిద్ధ సహనసిద్ధ ప్రోక్షితసిద్ధ శైర్బసిద్ధ కోకిలసిద్ధ కాస్మితసిద్ధ వాచసిద్ధ పతిసిద్ధులను పరమోత్కృష్టరాజయోగంబున ప్రభాసిల్లజేసెను. తద్వద్ధరవీరోద్భవుండగు చౌరంగనాథుండు లోమసిద్ధ భ్రాతరసిద్ధ కచిరసిద్ధ కాలవృందనసిద్ధ నారాయణసిద్ధ కాళికాసిద్ధ సావ్రజీసిద్ధుల ప్రసిద్ధియొనర్చెను. మీననాథ హరభంగనాథులు సులక్షసిద్ధ క్షమాసిద్ధ తూర్ణవసిద్ధ ద్వారభద్రసిద్ధ అక్షసిద్ధ ఆహవసిద్ధులను బ్రకటం బొనర్చిరి.

ఇతి భక్తిసార నవనాథగ్రంథరాజంబున చర్పటనాథ జన్మకథాదివర్ణనము అష్టత్రింశాధ్యాయము సంపూర్ణము.

---

## ఏకోనచత్వారింశత్యధ్యాయము.

---

### చర్పటనాథుని యుద్ధము.

యోగపూర్ణుండగు చర్పటనాథుండు కాశీమహాతీర్థంబు సేవించి గయా ప్రయాగ ఫణిపర్వత మల్లికార్జున కుమారీదైవత ద్వాదశమల్హార హింగళాదేవి ద్వాదశమహాలింగాది మోక్షదాయక క్షేత్రంబులం గ్రుమ్మరుచు గుప్తప్రకట పుణ్యప్రదేశంబుల మాహాత్మ్యంబు

ల్విలోకించి దనహృదయంబున స్వర్గవాసినియగు మణికర్ణికాస్నానంబు లాడి యయ్యమరలోకవైభవవినోదంబులు నిరీక్షించి తదుపరి పాతాళ భోగవతీపుణ్యనదీతీర్థంబుల గ్రుంకులిడవలయునని నిశ్చయించి బదరి కాశ్రమంబు జేరి చంద్రచూడుని చరణంబులకు వందనంబు లిడి గమ నోన్ముఖుండై వ్యానాస్త్రంబు జపియించి తన్మంత్రప్రతాపంబుచే వాత గతి జనుచుండి మహేంద్రపర్వతంబు లంఘించి హిమాచలనికటంబున కేగి దుస్తరమిహికావృత మహానగమార్గంబు బొడగాంచి నిజవిద్యా నైపుణ్యంబుచే నమస్కారు నావాహనం బొనర్చి ప్రభాకరకరనిక రోష్ణంబుచే మార్గాచ్ఛాదిత హిమంబు దొలంగించి తత్క్షణంబున సత్య లోకంబు బ్రవేశించి నానా దేవఋషిగణపరిసేవిత పాదపద్ముండగుచతు రాస్యుని చరణకంజంబులకు బ్రణమిల్లి ముకుళితకరకమలుండై పురో భాగంబున బ్రకాశించుచుండ నత్తామరసగర్భుం డిత్తాపసోత్తముం డే మహామహుండని యోచింపుచుండు సమయంబున తత్సభాస్థిత యమర మునిశేఖరుండగు నారదుండు పరమేష్ఠితో చర్పటుని జన్మచరిత్రంబు విశదీకరించెను. పితామహుం డత్యంతప్రీతమానసుండై స్వహస్తంబు లచే పుత్రు న్నిజాంకంబుపై నిడుకొని మూర్ధంబు బునుకుచు "వత్సా! నీ వెప్పగిది యూర్ధ్వలోకంబుల కేతెంచితి" వని విచారింపుచుండ చర్పటనాథుండు "జనకా! త్రిలోకపూజ్యుండగు నారదుని కటాక్షం బుచే విబుధజనశిరోమకుట పరిశోభిత దివ్యతరమణి విభూషితాంఘ్రి యుగళుండగు దత్తాత్రేయుని వరదహస్తంబు మచ్ఛిరంబున విరాజిల్లిన కతంబున సకలమంత్రార్థరహస్యంబు లెఱింగి గురుప్రతాపంబుచే యనేకపుణ్యతీర్థంబులు సేవించి మణికర్ణికాభోగవతీ స్నానాపేక్షచే భవద్దర్శనంబున కరుదెంచితి" నన నక్కమలాసనుండు కడుసంతసం బుచే "పుత్రా! ఒకవత్సరం బిచ్చో కాలంబు గడుపుచుండెదవేని యొక మహాపర్వసమయంబున సకలసురసముదయ సమేతులమై జని యెద" మన నాథుండు హర్షించి నివసించెను. నారదుండు తద్బ్రహ్మ లోకంబున దనయనుజన్ముండగు చర్పటనాథునిసహితుండై యత్యంత స్నేహంబుచే దినంబులుగడుపుచుండి యొకానొకసమయంబున పాకశా సనుని సభామంటపంబున కేగ నయ్యమరేశుండు వినోదంబుచే "కల హప్రియా! రా ర" మ్మని యాహ్వానింప .మునిపుంగవుండు దనమనం

బున క్షోభించి మత్కులహప్రియత్వప్రతాపంబు బొడసూపెద నని నిశ్చయించి కుటిలోక్తులచే ప్రసంగించి శీఘ్రంబున నిజస్థానంబున కేగి యొకకొన్నిదివసంబులు గడపి చర్పటనాథుని ధైర్యస్థైర్యప్రతాప దర్పంబులు బరీక్షించి యిమ్మహాపురుషుని క్రోధానలంబున కయ్యమ రేశుని సాహూతి యొనర్పవలయు నని యుక్తిదలంచి శరజన్ముండగు చర్పటునితో "తపోఘనా! అమరావతీనగరంబున కేగి దేవేంద్రోద్యా నవనవిహారం బొనర్చి యరుదెంచెదము ర" మ్మన నయ్యమలాత్ముండు రయంబున బ్రయాణంబు సల్పి యగ్రజుండగు నారదునిసహితంబుగ జనుచుండ మునిముఖ్యుండగు నారదుండు "చర్పటా! మందగమనం బుచే తత్ప్రదేశంబున కేగనగునే? పునస్సత్యలోకంబున కెట్లరుదెం చెద" మన నాథోత్తముండగు చర్పటుండు నారదునితో "నే మనుజ శరీరుండనై నీయట్టి దేవమునిసరి గమనం బొనర్పగలనే" యన నార దుండు కార్యార్థుండుగాన తొల్లి వినిచి యనుగ్రహంబుచే సంకల్ప మాత్రంబున ముజ్జగంబులు భ్రమియించి తత్తల్లోకభూతభవిష్యద్వర్త మానచరిత్రంబులు గుర్తెఱుంగు మహావిద్య కీలెఱుంగింప చర్పటుండు పరమాహ్లాదంబుచే మనోవేగంబున నమరావతీ నగరసమీపంబున కేగి బక శుక శారికా మయూరాది పక్షిజాల సమాకీర్ణ తాల సాల రసాల హింతాల తమాల తక్కోల మందార కోవిదార పారిజాతా ద్యనేక వృక్షరాజంబు లంబరంబు చుంబించుచుండ మనోజ్ఞతర లతా ప్రసవ సౌరభంబులు వెదజల్లు చల్లని కొలంకులు గలిగి విచిత్రతరపుష్పపరి పూరిత నికుంజపుంజంబులచే ననేకయోజనవిస్తీర్ణంబగు యుద్యాన వనంబు బొడగాంచి బహుమోదంబుచే తద్వనవిహారంబు సల్పుచు నొక్కచో ఫలభరిత మాకంద మహీరుహరాజిని గని చర్పటుండు "మునివర్యా! మచ్చిత్తంబు ఫలాసక్తిజెందె" నన నారదుండు "చర్ప టా! నిన్నీప్రదేశంబున నెవరు నిర్బంధించిరి. నీయిచ్ఛానుసారుండవై ఫలంబులు బరిగ్రహింపు" మన చర్పటనాథుండు రయంబున తత్తరు శాఖాగ్రంబులపై నారోహించి మధురతరరసభరితఫలంబులు గైకొని యద్దేవమునిసమక్షంబున కరుదెంచి యుభయఘనులు ఫలహారంబు లొనర్చి తద్బీజంబు లచ్చే బడవైచి యథేచ్ఛం ద్రిమ్మరుచు నచ్చ

టచ్చట నమోఘలతాంతంబులు బరిగ్రహించి నిజాంగంబుల ధరించు
కొనుచు నొకకొన్నిసుగంధయుత పుష్పంబులు గొని శీఘ్రగమనం
బునం జని పితామహున కర్పించి సంతుష్టిబఱచి రిట్లొక కొన్నిదివ
సంబు లయ్యమరేశుని యుద్యానవనంబున కరుదెంచి స్వేచ్ఛావిహా
రంబు లొనర్చి మనోభీప్సితఫలంబులు భక్షింపుచు మనోహరదివ్యపు
ష్పంబులుగొని జనుచుండ తదుద్యానవనరక్షకులు ఫలబీజంబులు బరీ
క్షించి యిం దెట్టి తెక్కలికాం డ్రరుదెంచిరో గనుంగొనవలయు నని
మనంబున యోచించి యొకగోప్యస్థలంబున నివసించి చర్పటుండు
నారదునిసహితంబుగ వనిం గ్రుమ్మరి యొక్కచో వృక్షాగ్రంబుపై
నెక్కుచుండుట బొడగాంచి తత్క్షణంబ తచ్చర్పటనాథు నొడిసిపట్టి
ముఖంబుపై తాడనం బొనర్చుతఱి కలహాశనుండు కడుసంభ్రమం
బుచే మత్కార్యంబు చేకూఱు ననుచు పలాయితుం డయ్యెను. తపో
దర్పుండగు చర్పటుండు రౌద్రరసభరితుండై క్రోధాగ్నియుత నేత్రం
బులచే నిరీక్షించి వాతాకర్షణ మహామంత్రంబు జపియించి ప్రయో
గించిన తద్వనరక్షకభటసమూహంబు లద్దివ్యాస్త్రప్రయోగంబుచే పంచ
ప్రాణవాయువుల తావులు దప్ప కుంభీభూతశరీరులై నిర్గతరుధిర ముఖ
నాసికు లగుచు మహింబడి మొఱలిడుచుండ తచ్ఛబ్దంబు లన్యభటు
లాలకించి త్వరితంబుగ నేతెంచి కంఠగతప్రాణంబగు భటసముదయం
బును రోషతామ్రాక్షుండగు సిద్ధముఖ్యుని గనుంగొని భయభ్రాంత
చిత్తులై శీఘ్రంబున నబ్బిడౌజుని సమక్షంబున కరిగి "లోకనాయకా!
బాలార్క తేజుండగు నొకయతీంద్రుండు నిర్భయంబున వనంబు
గ్రుమ్మరుచు సక్రోధుండై కాపరులం బరిమార్చె. మే మవ్విపరీతంబు
గనుంగొని కడుభయంబుచే జనుదెంచితి" మన నప్పాకశాసనుం
డుగ్రుండై సిఖలసురానీకంబునకు "రయంబున జని యప్పురుషాధముని
కరపాదంబులు బంధించి గొనితె" మ్మనియు "సాధ్యుండు గాడయ్యె
నేని యుష్మద్ఘనవిశిఖానలంబున కాహుతి యొనర్పు" మని యాజ్ఞా
పింప తత్క్షణంబ నిర్జరసంఘంబు బహువిధశస్త్రాస్త్రపరికర వరిష్ఠంబులు
ధరించి మహాజలధిచందంబున ఘూర్ణిల్లుచు వనసమీపంబున కరుదెం
చుచుండ మేరునగధీరుండగు హిరణ్యగర్భపౌత్రోద్భవుండు భస్మంబు
గొని యన్యాస్త్రప్రయోగంబు లేల నని మనంబున యోచించి సర్వాస్త్ర

శిరోభూషణంబగు వాతాకర్షణదివ్యాస్త్రంబు జపియించి తద్దేవతాద
శంబుపై బ్రయోగింప నన్నిలింపసముదయంబు విగతచేతనంబై కీలూ
డినజంత్రంబులకై వడి ధరంబడి పరితప్తమానసులగుచు మారీపీడితుల
చందంబున స్మృతిదొలంగి నిర్జీవకళేబరంబులభంగి బడియుండు నవస
రంబున సహస్రాక్షుండు కదనరంగసమాచారంబు బఱికించి రమ్మని
యొకదూతం బంప వాఁడతివేగంబున రణభూమి కరుదెంచి కంఠగత
ప్రాణులగు సుపర్వుల వీక్షించి యాశ్చర్యంబుచే ప్రాక్దిశాధిపుని నిక
టంబున కాగతుండై "సురాధిపా! తాపసోత్తముని యుదగ్రపరాక్ర
మాతిశయంబులు బొగడ బ్రహ్మాదులకు తరంబగునే? ప్రళయకాల
రుద్రుండైన నయ్యద్భుతచరిత్రుని సమక్షంబున నిల్చునే? కృతాం
తుం డయ్యపూర్వప్రతాపున కెదురించునే? అట్లుగాకున్న వేల్పు
మూక లొక్కుమ్మడి యిలంబడుదురే" యని బలుకుచుండ నవ్వే
గన్నులసామిడెందం బదరి కొంతవడి యోచించి యుగ్రుండై సాహ
సంబుచే "శీఘ్రంబుగ నైరావతంబును సిద్ధపఱచు" మని యుద్ధసన్న
ద్ధుండై యాజ్ఞాపింప తత్సమయంబున నచ్చారుండు "అమరేంద్రా!
ప్రతాపపూర్ణుండగు సిద్ధునిచరితం బపారంబు గలదు. విలుబూని ములి
కిసంధించునంతలో నన్మహాఘనుని ప్రయోగనైపుణ్యంబుచే ప్రతి
వీరుండు వాతాకర్షితశరీరుండై తత్క్షణంబ ధరం గూలును. భవ
ద్వజాస్త్రం బప్పురుషశ్రేష్ఠునకు తృణసమానంబై గాన్పించును.
తా మేకతంబ రణరంగంబున కరిగెదరేని యుష్మత్ప్రాణంబు
లపహరింపఁబడుట నిక్కంబై దోఁచు. మహాప్రళయకారణుండగు
త్రిలోచనుని సహాయంబుగొని కదనంబున కేగెదరేని జయంబు
వాటిల్లుటయె గాక భూపతిత విబుధజనసంఘంబులు పునరుత్థి
తంబులౌట నిక్కంబు గావున శర్వునిసహాయంబు ముఖ్యకారణం"
బని వచింప నప్పాకశాసనుండు నిజంబని దలంచి యైరావతారూఢుం
డై కైలాసంబుజేరి యనేకమహాగణపరివృతుండగుహరున్గాంచిగజంబు
డిగ్గి చరణంబులకుఁ బ్రణమిల్లి ముకుళితకరకమలుండై "నిఖిలేశా!
త్రిపురాసురాద్యఖిలదనుజనాశా! భవదనుగ్రహంబుచే నాకలోకాధి
పత్యం బొసంగి నాకై దుర్జయులగు నిర్జరారాతుల గీటడంచి మద్భో
గంబులు శాశ్వతం బొనర్చి రక్షించితిరి. ఇత్తఱి దేవతానీకంబు బవ

రంబున బంచత్వంబునొందె. తత్కారణంబున నిరాధారుండనై భవత్స మక్షంబున కరుదెంచితి" నన శంభుండు విస్మితుండై "పరాక్రమ ధుర్యుండగు వీరముఖ్యుం డెవ్వం" డని విచారించెను. సురాధిపుండు నీలగ్రీవునితో "ప్రభో! నే నా పురుషపుంగవుని స్వరూపంబు విలోకింపలేదు. వనంబు హతంబౌనట్లు నని చారులతో నెఱింగి సత్వరంబు నకై సకలసురలోకంబును బంప నయ్యపారతేజుండు దివ్యాస్త్రనైపుణ్యంబున దివౌకసుల నుగ్గడంచె" నని విన్నవింప నవ్విషగళుండు రయంబున యుద్ధంబున కేగవలయునని మహాయోధగణంబుల కాజ్ఞాపించి "జగద్రక్షకుండగు కమలాక్షున కీ వృత్తాంతం బెఱింగింపు" మని యొకదూతం బంపి భైరవాది శతకోటి గణసముదయసమేతుండై వేగంబున నమరావతీనగరనికటస్థవనంబు జేరం జనుచుండ నవ్విశ్వసృట్పుత్రుండగు చర్పటుండు మహార్ణవంబుపగిది భాసమానంబగు రుద్రగణంబు బొడగాంచి భస్మంబుగొని దనచిత్తంబున నీయపారదళ సమూహంబుచే శ్రమజెందనేల నని దలంచి వాతాకర్షణ మహామంత్రరాజంబు జపియించి ప్రయోగింప తత్ప్రయోగ మహిమాతిశయంబుచే భూతేశుండు గోత్రభిత్సహిత నిఖిలగణసమేతంబుగ కుంఠీభూత శరీరుండై శ్వాసోచ్ఛ్వాసరహితుండగుచు మూర్ఛాగతుండై గతజీవ కళేబరంబుభంగి మూలచ్ఛేదితమహీరుహంబుకైవడి బృథ్విం బడి యుండెను. సురగణంబులచందంబున శివగణంబులు స్మృతిదొలంగి కంఠగతప్రాణంబులై సర్వేంద్రియవ్యాపారంబు లుడింగి నిశ్చేష్టితులై బడియుండ దూరస్థుండగు నారదుం డాఖండలు న్నిరీక్షించి పరమానందంబుచే దనడెందంబున బలారాతిగర్వనిర్వాపణం బయ్యెనని దలంచి గంతులిడుచు సంతప్తమానసులగు గీర్వాణాదుల దురవస్థలు విలోకింపుచు బుద్ధిదక్షుండగు సిద్ధుని యద్భుతచరిత్రంబు లుగ్గడించుచుండె నంత శివాజ్ఞాధారకుండగు చారుండు జెచ్చెర వైకుంఠంబు జేరంజని సర్వసాక్షిస్వరూపుండగు సారసాక్షుని సమక్షంబున నిల్చి "జగద్రక్షకా! అసదృశవిక్రమోపేతుండగు నొకపురుషుం డేతెంచి యమరవనంబు జెరచి గీర్వాణాదుల గీటడంచె నని శతమన్యుండు శూలింజేరి విన్నవింప శంకరుండు వీరభద్రాది శతకోటిగణసమేతుండై శక్రుంగొని సమరంబున కేగుచు భవత్సన్నిధానంబునకు నన్నంపె.

తడవేల త్వరితంబుగ తత్సహాయుండవై జయంబు గొను" మని దెలుప నమ్మధుసూదనుండు తత్కారణంబు యోచింపక శీఘ్రంబున ననేక కోటి విష్ణుగణసమేతుండై భేరీభాంకారాది నినదంబులచే గరుడవాహ నారూఢుండై యమరపురిసమీపంబున కేతెంచి సర్వామరకోటి సన్ని హితకాళ్ళంబును హైమవతీధవ శచీధవుల విపరీతసంకటంబు ల్విలో కించి యుగ్రక్రోధదీప్తాస్యుండై యట్టహాసం బొనర్ప నవ్విష్ణువాహినీ సముదయం బేకముఖంబుగ రోషపూరితహృదయంబై సింహనాదం బులు జేయుచు ధనురాదిసాధనంబులు ధరించి యుద్ధసన్నద్ధులై సిద్ధుని బరీక్షింపుచుండ హిరణ్యగర్భవీర్యోద్భవుండగు చర్పటుండు నిఖిలభువ నభయదంబగు హరిచేతిచక్రంబు గాంచి దనమనంబున నియ్యది యప్రతిహతసాధనం బనియు ముమ్మం దీ సుదర్శనాస్త్రస్మృతి దొలంగింపవలెనని యూహించి యత్యమోఘాస్త్రంబుపై భస్మ యోగంబున సంమోహనాస్త్రంబు బ్రయోగించి తద్దివ్యాస్త్రచిత్తవి భ్రమంబు గావించి యుక్కుమిగిలి యవ్విష్ణుగణంబుపై వాతాకర్షణ మహాస్త్రంబు బ్రయోగింప వార లయ్యస్త్రరాజమహోజ్వల మహిమా తిశయంబుచే వాతగతిదప్పి వివశాత్ములగుచు పక్వపర్ణంబులక్రియ నేలంబడి రుధిరవక్త్రులై బహుప్రయాసంబులచే విలపించుచుండ దామోదరుండు కలుషించి నిర్వక్రవిక్రమోపేతచక్రంబుం బ్రయో గింప నద్దివ్యసాధనవరిష్ఠంబు సిద్ధుని సమీపించి సమ్మోహనాస్త్రయో గంబుచే స్వాగతకార్యం బెఱుంగక చర్పటుం గాంచి పిప్పలాయన నారాయణుండు దనస్వామియనియు తా వినోదార్థంబుగ బ్రయోగిం పంబడితి ననియు దలంచి తాపసోత్తమునిచరణంబుల కెఱఁగి దక్షిణ హస్తంబున ప్రకాశించుచుండెను. మురాంతకుండు నిరీక్షించి నిఖిలలో కాంతకుండై మహోగ్ర గదాదండంబు బూని హుంకారప్రఘోషం బుచే బెబ్బులిచందంబున బరుగెత్తుచు నేతెంచుచున్న హరిని వీక్షించి తపోదర్పుండగు చర్పటుండు ధైర్యంబుచే భస్మంబుగొని దుర్ఘటం బగు వాతాకర్షణ దివ్యాస్త్రచూడామణిని బ్రయోగింప గోవిందుం డయ్యస్త్రంబుచే స్మృతిదొలంగి విగతగదాహస్తుండై క్షితింబడి మూ ర్ఛిల్లినంత మహాద్భుతపరాక్రమదక్షుండగు చర్పటుండు హరిసన్నిధి కేతెంచి జగన్మోహనాకారంబగు కౌస్తుభమణిసహిత వైజయంతీ

మాలం బరిగ్రహించి యతులితదివ్యమణిఖచిత స్వర్ణమయకిరీటంబు గొని దనమస్తకంబున ధరించుకొని యుదధిజాతంబగు శంఖంబు బూని తదుపరి ఫాలాక్షుని సమీపంబు జేరి యప్పురహార కరకమల విరాజిత కపాలపాత్రంబును గ్రహించి కక్షపాలం బడనైచుకొని నిజ తపోబలయోగంబుచే త్వరితంబుగ సత్యలోకంబున కరిగి పితామహుని పురోభాగంబున శంఖచక్రాద్యాయుధంబులచే బహువిధరత్నస్థగిత దివ్యతరకిరీటయుత మస్తకంబుచే సహస్రార్క తేజంబగు కౌస్తుభమణి విరాజిత నక్షస్థలంబుచే బ్రకాశించుచున్న పుత్రుంగని యయ్యబ్జజుండు విస్మితుండై దనయంకంబుపై నిడుకొని "పుత్రా! నీకీ చిహ్నంబు లెట్లు గలిగె" నని విచారింప నయ్యమలాత్ముండు వాగ్వధూవల్లభునితో "జనకా! నే వినోదార్థంబుగ శచీపతి యుద్యానవనంబున జరించు చుండ నవ్వనరక్షకులు దుర్మతిచే నన్ను శిక్షించినకతంబున మచ్చిత్తం బున కినుకంబూని యద్దురాత్ముల ప్రాణంబు లపహరించితి. తదుపరి నను శాసించుటకై హరిహరేంద్రులు దమతమచమూసముదయంబు లచే నేతెంచినంత క్రుద్ధుండనై మద్గురుశక్తిప్రతాపంబుచే నయ్యమ రేంద్రాదుల నుక్కడంచి ముక్కంటిని స్రుక్కించి పెక్కుభంగుల రక్కసులగొంగం భంగపఱచి యయ్యనఘాత్ముల భూషణంబులు గొని యరుదెంచితి" నని పలుక నవ్వేల్పుబెద్ద దనడెందంబున తత్త అంబుజెందియు బుత్రుని యఘటితపరాక్రమంబునకు సంతసించి "వత్సా! మజ్జనకుండగు వెన్నుండు వెతలంజెందెనేని క్షణమాత్రం బున ముజ్జగంబులు మడియవే? మజ్జీవనంబు వ్యర్థంబుగాదే? రయం బున జని యుపసంహారం బొనర్పవలయు ర" ట్మన నయ్యుత్తమశ్లోకుం డగు చర్పటుండు గతకోపుండై "సకలజనసంకటంబులు నివారించెద" నని పితృసహితంబుగ నమరపురిం జేరి వివశాత్ములై పడియున్న కతి వేల్పు తోలుదాల్పులం బొడజూప నజుండు వారిపూరిత లోచనుండై "చర్పటా! తడవేల నొనర్చెదవు? భవద్దివ్యాస్త్రోపసంహారం బొనర్పు" మన సిద్ధముఖ్యుండు మహాదస్త్రోపసంహారంబు గావించి హరిహరుల దురవస్థలందొలంగించి యమరేంద్రాది సురాధిపతుల శ్రమలుబాపి మ్రియమాన బృందారకబృందంబును సంజీవినీమంత్రంబుచే బ్రాణం బులునిలుప నమ్మహౌఘునులు సచేతనులై దశదిశలు నిరీక్షించుచుండుతఱి

పితామహుండు చర్పటునిచే భవాచ్యుతుల పదపంకజంబులకు నమస్కారంబు లొనర్పించి సుతసహితంబుగ నంజలీబద్ధుండై పురోభాగంబున విలసిల్లుచుండ కేశవుండు శంఖచక్రాదిచిహ్నంబులచే ప్రభాకరునిభంగి భాసమానుండగు యోగిపుంగవుని గాంచి "యిప్పురుషశ్రేష్ఠుం డెవ్వం" డని విచారింప నత్తమ్మిచూలి సవినయంబుగ చర్పటుని జన్మకథావృత్తాంతంబు దేటపఱచెను. లక్ష్మీశుండు పరమానందభరితుండై "మదంశజాతుండుగాన నిట్టియద్భుతంబొనర్చె. లేకున్న మచ్ఛరీరభూషణంబు లన్యులకు లభ్యంబు లగునే" యని సిద్ధుని దనహృదయంబున కదుముకొని లాలింపుచుండ చతురాస్యుండు చర్పటనాథశరీరపరిశోభిత దివ్యతరభూషణంబులు నిజహస్తంబులచే బరిగ్రహించి రమానాథున కర్పించి పునశ్చర్పటుని హరిపాదంబుల కెఱఁగించి పిదప గరళకంఠునకు కపాలపాత్ర నొసంగి యదుగులపై నొసలుమోపింప నయ్యఖిలేశులు ముదాన్వితహృదయులై దమతమదళసమేతంబుగ నిజస్థానంబులు బ్రవేశించిరి. అమరేంద్రాది సర్వదేవతానీకంబు సిద్ధుండు పిప్పలాయననారాయణావతారుండని ముదంబుచే వందనంబు లిడి దమతమనిజనికేతనంబుల కరిగెను. కమలోద్భవుండు కడుసంభ్రమంబుచే నిజసుతుని దోడ్కొని సత్యలోకంబు జేరె నాపిదప మునిశేఖరుండగు నారదుండు పరమాహ్లాదంబుచే సురరాట్సముఖంబున కరుదెంచి "శచీనాథా! మున్ను కలహప్రియా! రారమ్మని నన్నాహూయబఱచిన ఘనుండవై తుచ్ఛంబగు కలహంబునం దెట్లు మునింగితివో" యని యెగతాళిజేయుచుండ సహస్రాక్షుండు దీనవదనుండై దనమనంబున నిమ్మహామహుని నిందించినఫలం బనుభవించితినని గుందుచు నేతత్కాలహామూలపురుషముఖ్యుం డీ ఋషివర్యుం డని దలంచి భయభక్తియుక్తుండై గౌరవించెను. తదనంతరంబ నారదుండు సత్యలోకంబుజేరి చర్పటనాథునితో సుఖగోష్ఠులు జరుపుచు కాలంబు గడుపుచుండ నొకానొకమహాపర్వసమయంబున నేకవింశత్స్వర్గవాసులు మణికర్ణికాస్నానంబున కేతెంచి యుండుతఱి నాళీకభవుండు చర్పటనాథసహితంబుగ తత్తీర్థంబున స్నానంబులాడి పునస్స్వస్థానంబున కేతెంచెను. వత్సరాంతంబున చర్పటుండు బ్రహ్మచే ననుజ్ఞాతుండై నిజతపోబలంబుచే సప్తపాతాళంబులు గ్రుమ్మరి భోగవతీనదిని గ్రుంకులిడి కీర్తిధ్వజుండగు

బలిగృహంబున కేగి వామనుని దర్శించి బలిచే నాతిథ్యంబు గొని బయలుదేరి స్వేచ్ఛావిహారంబున నానాతీర్థంబులు సంచరించుచుండెను.

ఇతి భక్తిసార నవనాథగ్రంథరాజంబున చర్పటనాథుండు హరిహరేంద్రాద్యఖిలసురసంఘంబుచే కదనం బొనర్చుట, ఏకోన చత్వారింశత్యధ్యాయము సంపూర్ణము.

---

## చత్వారింశత్యధ్యాయము.

---

దేవేంద్రుండు సవనంబొనర్చి నాథులచే శాపంబు నొందుట.

అట నప్పాకశాసనుండు ప్రతాపదర్పుండగు చర్పటనాథునిచే పరాభవం బొంది ఖేదపూరితమానసంబున వేల్పులం గొని కొలువుకూటంబున సభదీర్చి సురపూజ్యుండగు బృహస్పతితో నిర్వక్రవిక్రముండగు చర్పటునివృత్తాంతంబు దేటపఱచి "గురువర్యా! ఉత్పత్తిస్థితిలయాది కారణులగు హరిహరాదుల సరకుగొనక సర్వాస్త్రవేత్తలగు గరుడగంధర్వాది నిర్జరానీకంబును భంజించి మదావళసమూహంబుపై మార్కొను మృగేంద్రంబుకై వడి యుగ్రుండై సమరరంగంబున ప్రత్యక్షభానుంబోలి విభ్రాజమానుండగు సిద్ధుని యపారచరిత్రంబు గొనియాడ వశంబగునే? మే మనేకమహాస్త్రప్రయోగోపసంహారంబుల కీలెఱింగియు సర్వాస్త్రశిరోభూషణంబగు నాతాకర్షణ దివ్యాస్త్రమహిమాతిశయం బెఱుంగకుండుట సురాధిపత్యంబు నింద్యంబుగాదే? త్రిలోకపూజ్యంబగు నాథపంథీసిద్ధజనమాహాత్మ్యంబున కెనలేని యమరత్వంబు నిరర్థకం బనదగదే? భక్తివైరాగ్యంబులచే నయ్యుత్తమశ్లోకుల నాశ్రయించి యద్దివ్యాస్త్రప్రయోగోపసంహారరహస్యార్థంబులు పరిగ్రహించి యప్రతిహతపరాక్రమంబుచే త్రిదశాలయం బేలవలయునని యూహించియు నాథోత్తములు ప్రపంచనిస్పృహత్వంబున నొక్కచో నిల్వక తైర్థికులై పరిక్రమించెద రయ్యద్భుతచరిత్రుల యనుగ్రహంబున కేనెట్లు స్థానభ్రష్టుండనై వెనువెంటం జనవలయునో యను సంశయంబుచే విన్నవించితి" నన నయ్యమరగురుం డొక్కసదుపాయంబు దలంచి "సురాధిపా! సర్వతంత్రస్వతంత్రులగు నాథముఖ్యుల సందర్శనార్థంబై యొక

మహాయజ్ఞంబు ప్రారంభించి తన్నిమిత్తంబున నాథులకై యుపరిచరవసు
పుంగవు ననుపవలయు నతండు దివ్యవిమానారూఢుండై బుడమికిం
జని దనసుతుండగు మత్స్యేంద్రుం దోడ్కొని యయ్యనలాత్మసి పుర
స్సరంబున నిఖిలనాథుల నాహ్వానం బొనర్చి గొని తెచ్చు నట్టియెడ
నయభయభక్తివిశేషంబులచే సిద్ధులయుల్లంబు పల్లవింపంజేయవలయు
దాన నాథోత్తములు ప్రీతమానసులై జన్నంబు నెరవేర్చి యమోఘ
దివ్యాస్త్రంబుల కీలెఱుంగించి నీకోర్కు లీడేర్చెదరు. నీవు సఫలమనో
రథుండ వయ్యెద" నన సహస్రాక్షుండు సంతసిల్లి రయంబున వసునాయ
కుం దోడితెమ్మని మాతలి కాజ్ఞాపింప నతండు వెసంజని యుపరిచరవ
సువుం దోడ్తెచ్చె నంత నమ్మఘవంతుండు సంతుష్టుండై వసుశ్రేష్ఠునితో
"ఆర్యవరా! నేనొక మహాహవనం బొనర్పవలయు నని దలంచితి
నందుకై కీర్తిధ్వజులగు సిద్ధుల నాహ్వానింపవలయు గావున తా మతివే
గంబున మనోహరంబగు విమానంబున జని భవత్పుత్రుండగు మత్స్యేం
ద్రనాథుని దోడ్కొని తత్పురస్సరంబుగ సిద్ధజనసముదయంబు న్వెంట
గొనిర" మ్మన వసునాయకుం డవశ్యంబని విమానారూఢుండై శీఘ్రంబు
న బదరికాశ్రమంబున కేగి తత్పుణ్యప్రదేశంబున గోరక్ష ధర్మనాథ
చౌరంగ కానీప గోపీచంద జాలంధర హడభంగనాథసమేతుండై తీర్థ
స్నానంబు లాచరించెడి మత్స్యేంద్రు నాలోకింప నమ్మత్స్యేశ్వరసంభ
వుండు వసుపుంగవుం గనుంగొని తక్షణంబ పాదంబులవ్రాలి "భవదా
గమనకారణం బెయ్యదియో దయజేయు" మని వినయోక్తుల విచా
రింప వసుశ్రేష్ఠుండు నాథజనమధ్యభాగంబున నుపవిష్టుండై వేల్పుదొ
రయొనర్చు జన్నంబు తెఱంగెఱుంగించి "యయ్యది మీచే పరిపూర్తి
జెందవలయునని కుతూహలంబు గలదు. కృపామతులై పయనం
బొనర్తురుగాక" యని పలువిధంబుల బోధించి యందఱ నొడంబఱచి
నిజవిమానంబుపై గైకొని యచ్చోటుబాసి హేలాపట్టణంబున కరిగి
గోపీచందు జననియగు మైనావతీరాణిని దోడ్కొని వడనాళగ్రామంబు
ప్రవేశించి యచ్చట నటసిద్ధనాగనాథు న్వెంటగొని గౌతమీతీరం
బు జేరి భర్తరీనాథు నాహ్వానం బొనర్చికొని తామ్రపర్ణికిం జని మహా
సిద్ధుండగు చర్పటనాథు న్విమానంబున జేర్చుకొని విటాగ్రామంబున
కేగి రేవణసిద్ధనాథు న్వెంబడిగొని తదుపరి చతురశీతి యుపసిద్ధుల

దోడ్కొని ముదంబున నమరపురి జేరంజన నబ్బిడౌజుండు సపరివారం
బుగ నెదురేగి సిద్ధజనసంఘంబునకు వందనంబు లాచరించి మృదువా
క్యంబులచే కైవాడం బొనర్చుచు ననేకవైభవంబులచే నిజభవనంబు
నకు గొనిపోయి మనోజ్ఞతరసింహాసనంబుల నలంకరించి వేల్పుమూక
లచ్చెరువొందిన నిగ్రహానుగ్రహసమర్థులగు సిద్ధజనసముదయంబుల
గనుంగొనుచుండ షోడశోపచారంబుల బూజలు సల్పి ముకుళితకరకమ
లుండై "తపోధనులారా! హవనానుకూలస్థలం బెద్దియో సెలవొసం
గరే" యన మత్స్యేంద్రవాచస్పతులు "మనోహరతరులతాపుష్పా
చ్ఛాదితంబై స్వచ్ఛతరపానీయంబులచే నొప్పారు కేళాకూళులు గలిగి
యనూనవైభవంబులచే దృగ్గోచరంబగు సింహళద్వీపంబున జన్నం
బొనర్పవలయు" నని వాక్రుచ్చిన శచీకాంతుండు హర్షించి "తత్ప్రదే
శంబున సర్వసాహిత్యం బొనగూర్పు" మని యుపరిచరవసుముఖ్యున
కాజ్ఞాపింప నతండు గంధర్వసహితుండై సింహళద్వీపంబున కేగి యాట
వనంబున యజ్ఞవేదిక నిర్మించి హవనోపయోగపదార్థంబులు సిద్ధపఱ
చినంత పురుహూతుండు శచీసమేతుండై తపోమూర్తులగు సిద్ధులను
వెంటగొని సపరివారంబుగ నాటవనంబు బ్రవేశించి దంపతీయుక్తుండై
క్రతుప్రారంభంబు గావించి సిద్ధముఖ్యులగు నవనాథులచే హుతవహున
కాహుతుల నొసంగింపుచుండ మత్స్యేంద్రనాథుండు దనమనంబున
తిలోత్తమ మీననాథులం దలంచి యుపరిచరవసుశ్రేష్ఠునితో "జనకా!
మీననాథుం డేతత్సింహళద్వీపంబున నెచ్చోఁ గలం" డని విచారింప
నతం డేతత్ప్రదేశంబు తిలోత్తమగ్రామసీమాంతర్గతస్థలంబె ననియు
తిలోత్తమ మీననాథుల దోడి తెచ్చెద నని కడువడిం జని నిజవిమానం
బుపై తత్సతిసుతులం గైకొని పునరాగమతుండై మత్స్యేంద్రనాథ
సమీపంబున డించిన నయ్యిరువు రన్యోన్యముఖావలోకనానందపర
వశులై కొంతవడి సంభాషింప నూహించి దనబుద్ధిక్కారణంబు చౌరం
గనాథ హడభంగనాథుల కొసంగి యొకప్రదేశంబున సతిసుతులతో
కుశలప్రశ్నలు విచారింపుచు మీననాథునకు నిఖిలవిద్యాభ్యాసం బొన
ర్పవలయుననిదనహృదయంబున పుత్రమోహంబుచే జింతించి బోధింపు
చుండ సురగురుండు గనుంగొని యమరాధిపునితో "నీవు దీక్షాబద్ధుం
డవై యుండ నేల నిక్కార్యంబున కుపరిచరవసువు న్నియమింపు" మని

నిగదించిన నతం డయ్యర్థంబు గ్రహించి తత్క్షణంబ నిజహస్తబద్ధదీక్షా కంకణంబా వసునాయకు హస్తంబున బంధించి తానా హోమద్రవ్యంబుల గొఱనల్ విచారింపుచు స్వహస్తంబులచే నాథోత్తములకు షడ్రసోపేతభోజనంబు లిడుచు నతులితభయభక్తియుక్తుండై సేవలొనరించుచుండ, నయ్యనులాత్ములు పరమానందభరితులై విలసిల్లుచుండిరి. ఇట మత్స్యేంద్రనాథుం డొక వృక్షసమీపంబున నిజతనూభవునకు నిఖిలమంత్రార్థరహస్యంబులు బోధించుచుండ తత్సమయం బెఱింగి యప్పురందరుం డొకమయూరవేషంబుచే వృక్షాగ్రంబున బ్రవేశించి యయ్యమోఘరహస్యంబులం గ్రహించుచు క్రమక్రమంబున వాతాకర్షణ వాతప్రేరక దివ్యాస్త్ర ప్రయోగోపసంహారంబుల కీలెఱింగి యభ్యసించుచు నొకవత్సరం బమ్మఖంబుచే గడపి యొకసుదివసంబున వైశ్వానరునకు పూర్ణాహుతులొసంగి యాగసమాప్తి గావించి యమితానందంబున నాథముఖ్యుండగు మత్స్యేంద్రున కగ్రపూజ సల్పి తదుపరి దశమసాధుండగు మీననాథున కనేక మణిమయ దివ్యభూషణాంబరంబులు కానుక లొసంగి నవరత్నఖచిత సింహాసనాసీనులగు సిద్ధపురుషుల మధ్యప్రదేశంబున బద్ధాంజలియై వినయోక్తులచే "దయాఘనులారా! నాచే నొకన్యాయవిరుద్ధకార్యం బాచరింపఁబడియె. మత్స్యేంద్రనాథునిచే మీననాథునకు బోధింపఁబడు మంత్రార్థరహస్యంబులు మయూరరూపధరుండనై గ్రహించితి నయ్యపరాధంబు క్షమించి తన్మంత్రంబులు మూర్తిమంతంబులై సిద్ధించునట్లు వరంబొసంగి కాపాడరే" యన నాథోత్తము లయ్యమరేశుని తస్కరకృత్యంబునకు క్షోభించి "యింద్రా! కృత్రిమవేషంబుచే నపహరించిన మంత్రంబులు నిష్ఫలంబులై విలసిల్లు" నని శాపం బొసంగిన నుపరిచరవసుపుంగవుండు సమయోక్తులచే సిద్ధజనమనస్తాపంబు శాంతపఱచి "శాపమోచనవిధం బెఱుంగించరే" యని వేఁడ "నీయమరేంద్రుండు ద్వాదశాబ్దంబులు తపం బాచరించెనేని యయ్యవి సిద్ధించుం గాని నాథపంథీసిద్ధులపై తత్ప్రయోగంబులు సిద్ధించ" వని శ్రుతపఱచి విమానారూఢులై బుఃఖికింజని నానాతీర్థంబులు సేవింపుచు విహరించుచుండిరి మత్స్యేంద్రయోగిపుంగవుండును తిలోత్తమాదేవిచే ననుజ్ఞగొని మీననాథు మైనావతీరాణి న్వెంటగొని విమానారూఢుం

డై హేలాపట్టణంబున కేతెంచి మైనావతీదేవి నచ్చో విడచి యనేక తీర్థంబులు మీననాథసహితుండై సేవించుచుండె నట నవ్వేగన్నుల సామి సహ్యాపర్వతస్థానంబున ద్వాదశవర్షంబు లఖండతపం బొనర్చుచు తత్తన్మంత్రాధిదేవతాప్రీత్యర్థంబై కమండలస్థిత మణికర్ణికాజీవనంబు ల్విడుచుచుండ నయ్యవి యింద్రాయణి నదీనామంబున ప్రవహించుచు భీమరథీ తీర్థంబున సంగమంబయ్యె నిప్పుగిది శచీధవుండు తపం బాచరించి పిదప స్వస్థానంబు ప్రవేశించె నాథోత్తములు ౧౭౧౦ విక్రమశకపర్యంతం బనేకతీర్థంబులు ప్రకటరూపంబున గ్రుమ్మరుచు తదనంతరంబ గుప్తరూపంబులచే నివసించిరి. కానీఫనాథుండు నిజమఠంబున నివసించెను. గర్భాద్రిపై మత్స్యేంద్రజాలంధరులు గుప్తరూపంబున సమాధియోగంబుచే నివసింప జాలంధరుండు జాన్‌పీర్ నామంబున మత్స్యేంద్రుండు మాయబాపను యభిధానంబుచే విఖ్యాతిజెందుచుండ నప్పర్వతపార్శ్వంబున గహినీనాథుండు గైబీపీరను నామంబుచే ప్రసిద్ధినొందె. నాగనాథుండు వడవాళగ్రామంబున రేవణనాథుండు విటాగ్రామంబున గుప్తరూపంబులచే నివసించియుండ భర్తరీనాథుండు పాతాళంబున కరిగె. మీననాథుండు స్వర్గంబున కేగె. గోరక్షనాథుండు గిరనారపర్వతంబుపై దత్తాశ్రమంబున వసించె. గోపీచంద్రధర్మనాథులు స్వసామర్థ్యంబుచే వైకుంఠంబు ప్రవేశించిన శ్రీమన్నారాయణుండు మైనావతీరాణిని విమానంబుపై దోడ్కొని జనియె. చర్పటనాథ చౌరంగనాథ హడభంగనాథులు ప్రచ్ఛన్నరూపంబులచే నింతవర కనేకమహాతీర్థంబులు సేవించుచు గ్రిమ్మరుచుండెదరు. తచ్ఛిష్యులగు చతురశీతి యుపసిద్ధులచే నాథపంథీసాంప్రదాయం బభివృద్ధి జెందుచుండెంగావున నవనాథాద్భుతచరిత్రంబు ముగియింపనయ్యె.

—చత్వారింశత్యధ్యాయంబుల ఫలశ్రుతి.—

ప్రథమాధ్యాయంబున మత్స్యేంద్రనాథుండు జన్మించి బదరికాశ్రమంబున తపం బొనరించుట వర్ణింపంబడియె. తత్కథాపఠనంబు సర్వరోగనివారకంబు. ద్వితీయాధ్యాయంబున శ్రీగురుదత్తాత్రేయుండు మత్స్యేంద్రనాథున కనుగ్రహం బొసఁగి సకలవిద్యాభ్యాసంబు గావింపనయ్యుత్తమశ్లోకుండు నిఖిలమంత్రసిధ్యర్థంబై నాగాశ్వత్థవృక్షస్థసర్వదేవతాప్రత్యక్షంబు వడసె గాన తదధ్యాయపారాయణంబుచే దారి

ద్రవ్యంబు దొలంగి సర్వసంపత్సమృద్ధి గలుగు తృతీయాధ్యాయంబున మత్స్యేంద్రమారుతుల యుద్ధవిశారదత్వంబు పునస్స్నహాభావకథా విశేషంబు లిఖయింపనయ్యె. తత్పఠనఫలంబుచే మారుతాత్మజుండు గృహంబున నివసించి శత్రుక్షయం బొనర్చి రక్షించు. చతుర్థాధ్యాయంబున నవ్వాసుసుతుండు భైరవవర్గంబునుజయించి జ్వాలాముఖీదర్శనంబు గొనియె తత్కథాపారాయణంబుచే కపటజనకృత్యంబులకు బద్ధుండు గాక విమతుల పరిభవించి కీర్తింజెందు పంచమాధ్యాయంబున మత్స్యేంద్రుండు భేతాళాష్టక దర్పంబడంచి భూతకోటిని భంజించిన చరిత్రం బభివర్ణింపంబడియె నయ్యది దనుదినంబు పఠియించు గృహంబున భూతబాధలు దొలంగు. షష్ఠాధ్యాయంబున నమ్మత్స్యేంద్రదంభవుండు మహాకాళిచే యుద్ధంబొనర్చి యద్దేవిని స్వాధీనపఱచుకొన్న విశేషంబు లిఖయింపంబడియె. తత్పఠనఫలంబుచే శత్రువులు స్వవశులై మిత్రులయ్యెదరు. సప్తమాధ్యాయంబున మత్స్యేంద్రుండు ప్రతాపధుర్యుండగు వీరభద్రునిచే బవరం బొనర్చి విజయంబుగొన్న విశేషంబు దెలుపనయ్యె నయ్యది దనుదినంబు పఠియించు ధన్యాత్ములు భవబంధవిముక్తు లయ్యెదరు. అష్టమాధ్యాయంబున మత్స్యేంద్రుం డహస్కరునోటుబఱచి పాశుపతనామపృథ్వీశునకు దాశరథిదర్శనం బొసంగించిన దివ్యాఖ్యానంబు దేటపఱచనయ్యె. తత్పఠనఫలంబుచే దూరస్థమిత్రుండరుదెంచి మనోవ్యథబాపి కోరికల నెరవేర్చు. నవమాధ్యాయంబున గోరక్షనాథుండు జన్మించి మత్స్యేంద్రునిచే ననుగ్రహంబు బడసి గురుభక్తిపరాయణత్వంబున చతురింద్రియంబులు విడదీసి వడల్గొని తెచ్చిన కథావిశేషంబు బ్రకటించనయ్యె. తత్పారాయణంబుచే నఖిల విద్యాభ్యాసంబు ఘటియించి బ్రహ్మజ్ఞానంబు గలుగు. దశమాధ్యాయంబున గోరక్షుండు సంజీవినీమంత్ర జపధ్యానయోగంబుచే మృత్పుత్రిమ నొనర్చుటయు, తన్మంత్రమహత్వంబుచే గహినీనాథుండు జన్మించుటయు, పిదప నగ్గోరక్షుండు గురుసమేతుండై బదరికాశ్రమంబునకేగి యచ్చట తపం బొనరించుటయు, మత్స్యేంద్రనాథుండు స్త్రీరాజ్యంబు ప్రవేశించుటయు వర్ణింపఁబడియె. తదధ్యాయపఠనంబుచే స్త్రీలు సుసంతానవంతులై దేహారోగ్యమును బొందియుండెదరు. ఏకాదశాధ్యాయంబున బృహద్రవకృతహోమకుండంబున జాలంధరనాథుండు జన్మించి

వర్ధిల్లుచుండు చరిత్రంబు వ్రాయనయ్యె. తత్పారాయణం బగ్నిభయ నివారకంబు. ద్వాదశాధ్యాయంబున జాలంధరనాథుం డనసూయాతనూభవునిచే ననుగ్రహంబు బడసి తపం బొనర్చుటయు, దిగ్గజకర్ణరంధ్రంబున కానీపుండు జన్మించుటయు, స్పష్టపఱచనయ్యె తత్పఠనంబున సర్వదేవతాసంతుష్టియగు. త్రయోదశాధ్యాయంబున జాలంధరనాథుండు మైనావతీరాణిపై ననుగ్రహించి యమరత్వం బొసంగుట యభివర్ణింపఁబడియె. తత్పఠనంబుచే పరిపూర్ణజ్ఞానోదయ మగుట యెగాక దమపూర్వజు లుద్ధరింపఁబడియెదరు. చతుర్దశాధ్యాయంబున కపటమయ స్త్రీసమూహాకృత్యంబుచే జాలంధరనాథుం డొకకూపంబునం బడి హయవిష్ఠంబుచే గప్పంబడుట విశదీకరించనయ్యె. తత్కథాపఠనంబుచే సంప్రాప్తకారాగృహులు విముక్తులయ్యెదరు. పంచదశాధ్యాయంబున కానీపుం డనిలాత్మజు నోటుబఱచి శృంగమురుడీనగరంబున కేగి మత్స్యేంద్రనాథునిచే నాతిథ్యంబు గొనుట స్పష్టపఱచనయ్యె. తదధ్యాయ పఠనంబున గృహంబు కలహరహితంబై యభివృద్ధినొందు. షోడశాధ్యాయంబున కానీప గోపీచంద సందర్శన కథావిశేషంబు గల దయ్యది పఠియించిన దుస్స్వప్నదోషంబు హరించు. సప్తదశాధ్యాయంబున జాలంధరనాథుండు తురంగ మలపూరితకూపబహిర్గతుండై గోపీచందున కనుగ్రహించి నాథపంథీదీక్ష యొసంగి రక్షించిన చరిత్రంబు గలదు. తత్పఠనంబుచే యోగాభ్యాసానుకూల నిర్మలచిత్తుండై ప్రఖ్యాతిగాంచు. అష్టదశాధ్యాయంబున గోపీచంద నృపాలుండు స్వనిమిత్తమృతచంపావతి దేవి శరీరంబున గురుసమర్థుం డగు జాలంధరునిచే ప్రాణంబులు నిలిపి తదుపరి బదరికాశ్రమంబున కరిగి తపం బాచరించుట దెలుపనయ్యె. తత్పఠనంబుచే బ్రహ్మహత్యాద్యనేకపాతకంబులు దొలంగుటయెగాక పూర్వజులు నరకోద్ధారులయ్యెదరు. ఏకోనవింశత్యధ్యాయంబున శ్రీరాముండు గోరక్షనిర్మిత దారుణాస్త్ర బద్ధుండగు మరుత్సూనుసంకటంబు లెడబాపి యయ్యనిలాత్మసహితుండై గోరక్షునకు దర్శనం బొసంగిన పవిత్రచరిత్రంబు గల దయ్యధ్యాయపఠనంబుచే మోక్షంబు సిద్ధించు. వింశత్యధ్యాయంబున గోరక్షుండు కళింగనామ్నా వేశ్యకాంతాసహితుండై మత్స్యేంద్రనాథునికై స్త్రీరాజ్యంబు ప్రవేశించిన కథాభాగంబు గల దయ్యది

పఠియించిన యున్మత్తుండు ప్రపంచజ్ఞానపరిపూర్ణుండై దేజరిల్లు. ఏక
వింశత్యధ్యాయంబున గోరక్షుం డనేక యుక్తిప్రయుక్తులచే మత్స్యేం
ద్రనాథు నచ్చోటుబాపి గొని జనియె. తదధ్యాయపఠనంబుచే బహు
జన్మార్జిత పాతకంబుల దొలంగి దివ్యలోకంబుల నివసించు. ద్వావింశత్య
ధ్యాయంబున గోరక్షుండు మీననాథుని ప్రాణంబు లపహరించి శరీ
రాంతస్స్థిత సిరాస్థిమాంసంబు లెడబాపి చర్మశోధనం బొనర్చి పున
రుత్థితుం జేసి మత్స్యేంద్రనాథుని సంతుష్టపఱిచిన యద్భుతంబు లిఖింప
నయ్యె. తత్పఠనంబుచే నపుత్రుండు జగన్మిత్రుండగు సుపుత్రుం
బడయు త్రయోవింశత్యధ్యాయంబున గోరక్షుండు మత్స్యేంద్రమీ
ననాథసమేతుండై గర్భాద్రి కేగి యక్కొండను సువర్ణంబొనర్చి మహో
యుత్సవంబు సలిపిన చరిత్రంబు బ్రకటింపనయ్యె. తత్పారాయణం
బుచే ననేకస్వర్ణంబు లభియింతు. చతుర్వింశత్యధ్యాయంబున భర్తరీ
నాథుండు జన్మించి యవంతికానగరంబు ప్రవేశించుట యభివర్ణింపఁ
బడియె. తత్కథాపఠనంబుచే బాలహత్యాది దోషంబులు దొలంగి
పుత్రవంతుండై విలసిల్లును. పంచవింశత్యధ్యాయంబున సురోచనగం
ధర్వుండు శక్రుశాపంబుచే రాసభంబై రాసుత వివాహంబాడిన
విశేషంబు దేటపఱచనయ్యె. తత్పఠనంబుచే మానవేతరజన్మంబు
లభింపదు. శాపవాక్యంబుల బాధలు దొలంగు. షడ్వింశత్యధ్యాయం
బున విక్రమభర్తరీనాథు లన్యోన్యస్నేహంబుచే మెలంగుట దెలుపన
య్యె. తత్పఠనంబుచే గోత్రహత్యాద్యనేకపాతకంబులు దొలంగు.
సప్తవింశత్యధ్యాయంబున విక్రముండు రాజ్యపట్టాభిషిక్తుండౌట భర్త
రీనాథుండు పింగళాదేవిని వివాహంబాడి దత్తానుగ్రహపాత్రుం డౌట
వర్ణింపఁబడియె తత్పఠనంబుచే పదచ్యుతుండు పునస్స్వస్థానంబు జేరు
నష్టవస్తులాభంబు గలుగు. అష్టవింశత్యధ్యాయంబున భర్తరీనాథుండు
పింగళావియోగాకులితచిత్తుండై తపంబొనర్చుట యెఱుంగింపనయ్యె.
తచ్చరిత్రపఠనంబుచే నవివాహితుండు సుదారాలాభంబు నొందు.
ఏకోనత్రింశత్యధ్యాయంబున భర్తరీనాథుండు గోరక్షుకారుణ్యంబున
వైరాగ్యపూర్ణుండై ప్రభాసిల్లుట విశదం బొనర్పనయ్యె. తత్పఠనం
బుచే తాపత్రయాది రోగంబులు నశించి భక్తివైరాగ్యంబులు
సిద్ధించు. త్రింశత్యధ్యాయంబున చౌరంగనాథు జన్మకథావిశేషంబు.

వెల్లడియొనర్చనయ్యె. తత్పఠనంబుచే తస్కరులదృష్టి దొలఁగు. ఏకత్రింశత్యధ్యాయంబున చౌరంగనాథుండు తపంబు సల్పుట లిఖయించనయ్యె. తత్పఠనంబుచే మాంత్రికదుష్ప్రయోగంబులు నిష్ఫలంబులగును. ద్వాత్రింశత్యధ్యాయంబున మత్స్యేంద్రుండు త్రివిక్రమశరీరంబున పరకాయప్రవేశయోగంబున ప్రవేశించి రేవతీదేవికిఁ పుత్రసంతానం బొసంగినచరిత్రం బభివర్ణింపంబడియె. తత్పఠనఫలంబుచే నపమృత్యుదోషంబులు దొలంగు. త్రయస్త్రింశత్యధ్యాయంబున గోరక్షుండు వీరభద్రుని ప్రాణంబు లపహరించి మత్స్యేంద్రుకళేబరంబు గొని తెచ్చుట విస్పష్టంబయ్యె. తత్కథాపారాయణంబుచే ధనుర్వాతాది మహారోగంబులు నశించు. చతుస్త్రింశత్యధ్యాయంబున రేవణసిద్ధుం డుదయించి దత్తానుగ్రహపాత్రుండై యొకమహాసిద్ధిం బడసిన విశేషంబు దెలుపనయ్యె. తత్కథాపఠనంబుచే నఘటితకార్యంబు సఫలంబై కీర్తినొసంగు. పంచత్రింశత్యధ్యాయంబున రేవణసిద్ధుండు దత్తానుగ్రహపరిపూర్ణుండై కైలాసంబున కేగివిప్రపుత్రులంగొని తెచ్చుట విశదీకరించనయ్యె తత్పఠనఫలంబుచే మహాపురుషసంతానంబు గలిగి పూర్వజుల నుద్ధరించు షట్త్రింశత్యధ్యాయంబున వటసిద్ధ నాగనాథజన్మకథావిశేషంబు వర్ణింపంబడియె. తత్పఠనఫలంబుచే సర్పవృశ్చికాదివిషబాధలు నశించు. సప్తత్రింశత్యధ్యాయంబున నాగనాథుండు దత్తానుగ్రహపూర్ణుండై నిఖిలవిద్యావిశారదత్వంబున మత్స్యేంద్ర యోగిపుంగవుని జయించిన చరిత్రంబు గల దయ్యది పఠియింతురేని కులచ్యుతిదోషం బణంగు. అష్టత్రింశత్యధ్యాయంబున చర్పటనాథుం డుదయించి దత్తానుగ్రహంబుచే సర్వకళాసమర్థుండై నానాతీర్థంబులు సేవించుట యెఱింగింపనయ్యె. తత్పఠనంబుచే నవజ్వరాది సర్వరోగంబులు హరించు. ఏకోనచత్వారింశత్యధ్యాయంబున చర్పటనాథుండు హరిహరేంద్రాది దేవలోకంబును నిర్జించిన యద్భుతాఖ్యానంబు వ్రాయనయ్యె. తదధ్యాయపఠనంబుచే నాలంబున జయంబు నొందెదరు. చత్వారింశత్యధ్యాయంబున సహస్రాక్షుండు మహావిద్యార్థియై నాథసంఘంబుచే పావనం బొనర్చుట జగద్విఖ్యాతి యొనర్చనయ్యె. తత్పఠనశ్రవణంబులచే పుత్రపౌత్రధనధాన్యసంపత్సమృద్ధి గలిగి సర్వాభీష్టపరిపూర్ణు లయ్యెదరు. ఏకోనచత్వారింశత్యధ్యాయంబు చత్వారింశత్య

ధ్యాయంబును కల్పతరు కామధేనువులచందంబున సకలార్థంబు లొసం గును. గోరక్షుండు స్వవిరచిత కీమ్యాగర గ్రంథరాజంబున నెవ్వం డేని యిమ్మహాసిద్ధపురుషచరిత్రంబును నిందించునో యుభయలోక భ్రష్టుం డగునట్లు నొక్కి వక్కాణించె నని నరహరివంశభూషణుండగు మాలూపండితుండు మహారాష్ట్రంబున లిఖియించె. సుధీమణులారా! ఈనవనాథచరిత్రంబున గల చత్వారింశత్యధ్యాయంబులు మహామం త్రంబులబోలి ఫలంబుల నొసంగు నేయధ్యాయంబు పఠ్నాసంబులు పఠియింతురో పూర్వోక్తప్రకారంబుగ తదధ్యాయపారాయణఫల ప్రాప్తినొందుట నిక్కంబు. ఎవ్వరేని పఠియింపకుండినను భక్తిభావంబు చే నేతద్గ్రంథరాజంబును బూజించి నవనాథాభిధానంబులు ధ్యానిం పుచు నేకార్యంబు దలంచెదరో అయ్యది సిద్ధించుట నిశ్చయంబని గోరక్షసిద్ధుని వరంబు గలదు గావున నాంధ్రభాషాభిజ్ఞులకై శ్రీసీతా రామచంద్రచరణకమలార్పితంబుగ వైశ్యకుల బచ్చువంశసంజాత క్రిష్టయాహ్వయపుత్రుండగు రామనాఖ్యునిచే రచియింపంబడి శాలి వాహనశక (౧౮౪౦) కాళయుక్తినామసంవత్సర ఆశ్వయుజమాస శుక్లపక్ష దశమీదివసంబున ముగియింపనయ్యె.

ఇది భక్తిసార నవనాథగ్రంథరాజంబున సహస్రాక్షుండు నవ సిద్ధులచే హవనం బొనర్పించి నిఖిలమంత్రార్థంబులు పరిగ్రహించిన కథావిశేషంబు చత్వారింశత్యధ్యాయము సంపూర్ణము.

శ్రీసీతారామచంద్ర చరణారవిందార్పణమస్తు.

---

'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము. చెన్నపురి:—1923

## ఆంధ్రవచనగ్రంథములు.

| | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|
| ద్వాదశోపనిషత్తులు, సంస్కృతమునకు సరియైన తెలుగు వచనము | 3 | 0 |
| ఆంధ్రవచనభాగవతము, ద్వాదశస్కంధములు, శ్రీశతఘంటము, వేంకటరంగశాస్త్రికృతము | 6 | 8 |
| డిటో 3 వాల్యములు | 7 | 0 |
| తిలకుగారి సెక్యూరిటీ కేసు, ఉపన్యాసములు | 0 | 14 |
| మదనమోహన మాళవ్యగారి జీవితము, పంజాబుఅల్లరి | 0 | 8 |
| పంజాబుఅల్లరి, సహాయనిరాకరణోద్యమము, దేశీయమహాసభ వారిచే నిర్మింపబడిన కమిటీవారి రిపోర్టుననుసరించి ఆంధ్రప్రజా సంఘమువారిచే చిత్రపటములతో ప్రకటింపబడినది. | 0 | 8 |
| యజుర్వేదకథాసంగ్రహము | 0 | 8 |
| కామధేనువుకథ | 0 | 2 |
| శ్రీవివేకానందవిజయము | 1 | 12 |
| ప్రాచీనదేశ చరిత్రలు | 1 | 12 |
| భారతరమణీమణులు, ప్రథమభాగము | 0 | 12 |
| భారతరమణీమణులు, రెండవభాగము | 0 | 8 |
| శ్రీమహాభక్తవిజయము | 4 | 0 |
| నీతిచంద్రిక, చిన్నయసూరిగారిది | 0 | 8 |
| పంచతంత్రము, వచనము, సులభశైలి | 0 | 8 |
| హితోపదేశము, సులభశైలి | 0 | 12 |
| సంగ్రహరామాయణము, శ్రీశేషాద్రిశర్మకృతము | 0 | 10 |
| సంగ్రహభారతము ,, | 1 | 8 |
| సంగ్రహభాగవతము ,, | (అచ్చగుచున్నది) | |
| తెనాలిరామలింగనికథలు, జీవితము | 0 | 4 |
| సంస్కృతనాటకకథలు, శ్రీసీతారామశాస్త్రికృతము | 1 | 4 |
| దశకుమారచరిత్రము, ఎనమచింతల సంజీవరాయశాస్త్రిది | 1 | 8 |
| మదనకామరాజుకథలు, చక్కనికూర్పు | 0 | 14 |
| భోజకాళిదాసకథలు, 1-వ భాగము | 0 | 12 |
| దక్కనుపూర్వకథలు, శ్రీసీతారామశాస్త్రికృతము | 1 | 8 |
| భోజునికథలు | 0 | 8 |

| | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|
| విక్రమార్కునికథలు | 0 | 8 |
| బేతాళునికథలు | 0 | 8 |
| పరమానంద శిష్యులకథలు | 0 | 3 |
| వైద్యులకథలు | 0 | 4 |
| తాతాచార్యులకథలు | 0 | 6 |
| నలుగురుమంత్రులకథలు | 0 | 4 |
| అయిదుగురుదొంగలకథలు | 0 | 6 |
| శ్రీగైక్వారుగారి ఉపన్యాసము | 0 | 2 |
| సూరతు కాంగ్రెస్సు ఉపన్యాసములు | 0 | 2 |
| శ్రీరామానుజాచార్యచరిత్ర | 0 | 2 |
| స్వామిరామతీర్థజీవితము | 0 | 2 |
| శాలివాహనచరిత్ర | 0 | 3 |
| శ్రీలాలాలాజ్ పతిరాయిజీవితము | 0 | 2 |
| రామకృష్ణపరమహంసచరిత్రము, ప్రతిమతో | 0 | 3 |
| బాలగంగాధరతిలకుమహారాజుగారిచరిత్రము, ప్రతిమతో | 0 | 4 |
| శ్రీగోపాలకృష్ణగోక్లేజీవితము, ప్రతమతో | 0 | 2 |
| శ్రీమహాదేవగోవింద రానడేజీవితము ,, | 0 | 2 |
| శివాజీచరిత్ర, ప్రతిమతో | 0 | 8 |
| శ్రీశంకరాచార్యచరిత్ర ,, | 0 | 3 |
| శ్రీవేమనయోగిజీవితము ,, | 0 | 2 |
| దాదాభాయినౌరోజీచరిత్ర ,, | 0 | 2 |
| శ్రీకరంచంద్ గంధిజీవితము ,, | 0 | 4 |
| శ్రీబుద్ధచరిత్రము ,, | 0 | 4 |
| నెపోలియన్ చరిత్రము ,, | 0 | 4 |
| సోదరినివేదితజీవితము ,, | 0 | 2 |
| శ్రీగైక్వారుగారిజీవితము ,, | 0 | 2 |
| వివేకానందస్వామిజీవితము ,, | 0 | 2 |
| శ్రీకృష్ణదేవరాయచరిత్ర ,, | 0 | 3 |
| ఆనిబిసెంటుచరిత్ర ,, | 0 | 4 |
| లార్డ్ క్లైవు జీవితము ,, | 0 | 8 |

| | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|
| మైరావణచరిత్ర, చక్కనికూర్పు | 0 | 2 |
| రామదాసుచరిత్ర, చక్కనికూర్పు, మంచికాగితములు, ఇందు శ్రీ రామదాసుగారి ప్రతిమకూడ కలదు. | 0 | 12 |
| ఈసబునీతికథలు, క్రొత్తకూర్పు 1-వ భాగము | 0 | 6 |
| డిటో 2-వ భాగము | 0 | 8 |
| అరేబియన్‌నైట్సుకథలు | 1 | 4 |
| రేచుక్కపగటిచుక్కకథలు | 0 | 3 |
| మర్యాదరామన్నకథలు | 0 | 2 |
| షేక్స్పియర్ నాటకకథలు | 1 | 8 |
| పరిహాస్యవినోదకథలు | 0 | 12 |
| సీతారామము, తల్లాప్రగడ, సూర్యనారాయణరావు | 1 | 4 |
| సత్యసేనవిజయము, శ్రీ కొ. అనంతాచార్యకృతము | 0 | 4 |
| దుర్గేశనందని, నవల | 0 | 8 |
| ఐవన్హో, నవల క్రొత్తకూర్పు | 0 | 8 |
| మదాలస ,, | 0 | 10 |
| సుజనరంజని ,, | 0 | 8 |
| రోషినార, చరిత్రవిషయకమగు నవల | 0 | 12 |
| ఉన్మాదిని ,, | 0 | 4 |
| రాధారాణి ,, | 0 | 4 |
| లీల ,, | 0 | 4 |
| టిప్పుసుల్తాన్ ,, | 1 | 4 |
| అస్తమయము, నవల | 1 | 8 |
| రాజర్షి, రవీంద్రనాథఠాకూరుబంగాలీ నవలకు తెనుగు | 0 | 14 |
| తారాభాయి, చక్కనినవల | 0 | 12 |
| దిలారామ ,, | 1 | 4 |
| సాంఘికదార్ఢ్యము | 0 | 12 |
| ఆనందమఠ, నవల | 0 | 12 |
| మనోహరి, నవల, టి. యస్. రామశాస్త్రిగారిది | 0 | 14 |

# శ్రీ మహాభక్తవిజయము.

ఇదివఱకు మన ఆంధ్రభాషలో సర్వాంగసుందరమైన భక్తవిజయము ప్రకటింపఁబడియుండలేదు. శ్రీపాద. సుబ్రహ్మణ్యశాస్త్రిగారిచే వ్రాయించి ఈమహాభక్తవిజయమును ప్రకటించినారము. శ్రీ శాస్త్రిగారి సుద్దులు మూటగట్టుపదరచన, మనోహరమగు వర్ణనాక్రమము ఆంధ్రదేశీయులకు తెలియనివిగావు. రెండవమాఱ్పున భక్తుల చిత్రపటములు క్రొత్తగ చేర్చినారము. ప్రతి 1-కి రూ. 4-0-0

# వేమనపద్యములు, 3060, తాత్పర్యసహితము

ఆబాలగోపాలము తెలియునట్లు తేటతెల్లపు భాషలో తాత్పర్యముతో మంచికాగితములమీఁద ముద్రించి ప్రకటించినారము. చక్కనిమాఱ్పు. ప్రతి 1-కి రూ. 3-0-0

# బ్రహ్మసూత్రములు.

## శారీరకమీమాంస, తెనుఁగువచనము.

పురుషార్థములలో పరమపురుషార్థము మోక్షము దానిని ప్రతిపాదించునవి ఉపనిషత్తులు. ఇవి గూఢార్థములైనందున వాని తాత్పర్యములను నిర్ణయించుటకు శ్రీవేదవ్యాసులు బ్రహ్మసూత్రములను రచించిరి. దానికి శ్రీశంకరాచార్యులు సంస్కృతమున భాష్యమును జేసిరి; కాని ఇదిఅందఱికిఁ దెలియుట దుర్లభమని మృదుమధురశైలిలో "బ్రహ్మసూత్రార్థచంద్రిక" అను పేర నొక తెనుఁగువ్యాఖ్యానమును రచింపించి ప్రకటించినాము. ఇందు మొదట సర్వార్థబోధకమగు ఉపోద్ఘాతమును, అధ్యాయములతుద అధ్యాయతాత్పర్యసంగ్రహమును, గ్రంథాంతమునందు "వ్యాసునిమతము అద్వైతమే" అను ఒక గొప్పవ్యాసమును గలవు. వేయేల! ఇంతవఱకు ఇట్టిగ్రంథము ప్రకటింపఁబడలేదని చూచినపండితులకుఁ దెలియఁగలదు. దీనిని ప్రకృతః [illegible] [illegible]గితములకరవైనను ఈగ్రంథౌత్కృష్ట్యమునుబట్టి రెండుసంపుటములుగా ప్రకటించినాము. వెల రూ. 12-0-0.

వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్,

192, ఎస్ప్లనేడ్, చెన్నపురి. ఈ.